విశ్వసాహిత్యమాల: ౬౩.

# దక్షిణాపవనం

స్టాలిన్ ప్రైజు నవల

రచన: ఎల్మార్ గ్రిన్

అనువాదం: మహీధర జగన్మోహన్‌రావు

1952 మార్చి

విశ్వసాహిత్యమాల - రాజమండ్రి.

**Wind from the South, By Elmar Green.**
**A Stalin Prize Novel. (1946)**

టాక్స ప్రెస్ :
రాజమండ్రి.

వెల 4-8-0

# పీ ఠి క.

తెలుగుభాషలో నవలారూపవాఙ్మయం [illegible]రవయ్యో శతాబ్దితోనే ఆరంభించిందని చెప్పాలి. [illegible]ంస్కరణ, జాతీయోద్యమాలకు ప్రోద్బలకమై[illegible] యూ అర్ధ శతాబ్దంలోనూ వెలువడినాయి. వా[illegible]కు వంగ, మరాఠీ, కన్నడ, హిందీభాషలనుంచి [illegible] వదించబడినవే. ఆంగ్లభాషనుంచి అనుసరణములుకొన్నికూడ వెలువడినాయి. కాని అవన్నీ కథా చమత్కృతికీ, చారిత్రక విషయానికీ, లేదా అపరాధపరిశోధనాది కుతూహలకర కథలకూ మాత్రమే ప్రాముఖ్యతనిచ్చేవి. రాజకీయ, జాతీయభావప్రోద్బలకము లైన నవలానువాదాలుకూడ కొన్ని మన వాఙ్మయంలోనికి వచ్చేయి. కాని వాటిసంఖ్య చాలతక్కువ. పోతే యిక తెలుగులో స్వతంత్ర నవలలుకూడ గత పాతికేండ్లలోనూ చాలానే వెలువడినాయి. మొత్తంమీద యింతవరకూ వెలువడిన తెలుగునవలలన్నీ యింకా అనేకవిషయాల్లో లోప భూయిష్టంగానే వున్నాయి.

కాని, మనజాతి సంస్కారంగలది, మనభాష మృదుమధుర మైనది. గతం యెంతోవుంది, మనకి. కేవలం గతాన్నిచూసి సంతృప్తిపడి యుండుట అలసుల లక్షణము. వర్తమానాన్ని నిర్మించుకోవాలి. అందుకై యెంతేనా కృషి అవసరం.

విదేశభాషల్లోని అత్యుత్తమ కళాఖండాల్ని తెలుగునుడి కారం, మార్దవం వెల్లివిరిసేటట్లు అనువదించుకోడం యిందు

కెంతో సహాయకారి. అనేకకొత్తపోకడలతో విస్తృతమవుతూన్న విశ్వసాహిత్యముతో మనకవులు, రచయితలు పరిచయంగలిగించుకోగలుగుతారు, యీ అనువాదాలద్వారా. తద్వారా మనభాషలోకూడ చక్కని స్వతంత్ర రచనలు రావడానికి దోహదం అవుతుంది.

తెలుగులో వెలువడుతూన్న అనువాదాలు చాలలోపభూయిష్టాలుగావుంటున్నాయి. వాక్యనిర్మాణంలోనూ, భావవ్యక్తీకరణంలోనూకూడా తెలుగుతనం లోపించుటయేగాక, మూలగ్రంథంలోని ప్రధానభావాన్నే గమనించకుండుటకూడ అనేక అనువాదాల్లో చూపట్టుతూంది. అసమగ్రములూ, అసమర్థములూ అయిన యిట్టి అనువాదాలవల్ల ప్రయోజనంలేకుండుటయేగాక అపకారంకూడావుంది. వాటినిచదివి, లోపములకు మూలగ్రంథకర్తనే బాధ్యుణ్ణిగా భావిస్తారు, పాఠకులు.

నవలల్లో యెన్నో శిల్పరీతుల నుపయోగించుతూన్నారు, నేటినవలాకారులు. నకాలికములైన యీ శిల్పరీతులెంతో హృదయంగమాలుగా వుంటున్నాయి. 'దక్షిణపవనం' అను యీ నవలలో వ్యంగ్యంప్రధాన లక్షణంగా వుంటూంది. తాననుకున్న అర్థంద్యోతకం చేయడానికై తద్వ్యతిరేకమైన మాటల పొందికనుపయోగించుట యీ పుస్తకంలోని విశిష్ట లక్షణంగావుంది. ఏదేమైనా యీ నవలకు వాఙ్మయంలో అత్యున్నతస్థానంలభించిందటేంనూ, మానవసమాజంలో అతి ప్రధానమైన భూమిసమస్యమీాద సందేశ మొసగు గ్రంథమే

యింత వుదాత్త శైలిలో రచించుటలో గ్రంథకర్త కృత కృత్యుడయేడంటేనూ, దీనికి కావ్యంగా వాఙ్మయంలో శాశ్వతత్వమే వుండగలదు.

విశ్వసాహిత్యమాలద్వారా గోర్కీ, టాల్‌స్టాయ్, చెకోవ్ మొదలైన ప్రథమశ్రేణి మహాకవుల రచనల నన్నిటినీ ఆంధ్ర మహాజనుల కందించదలచి, యత్నిస్తూన్నాము. ఆంధ్రమహా జనుల, భాషాభిమానుల తోడ్పాటువుంటే మా కృషి సఫలం కాగలదు. ఈ మహాకవుల రచనల ననువదించుట అతికష్ట సాధ్యమైన విషయం. ఒక్కొక్క గ్రంథములో అనుస్యూతంగా వుండే మూలభావానికి పోషకంగావుండే మాటలపొందికకూడ కావ్యానికి గౌరవాన్ని ఆపాదిస్తుందన్నప్పుడు, అనువాదాల్లో యిది మరింతగా యదార్థమవుతుంది. తెలుగులో భాషా సౌష్ఠవం, నుడికారం చెడకుండా, మూలంలోని భావనాపటిమ, చమత్కృతి యథాతథంగా తీసికొనిరావాలంటే అనుభవం, సమర్థతా, బహుళగ్రంథపరిచయం కావాలి. దీనినందుకొను టకే మేము యత్నిస్తూన్నామని సవినయంగా మనవిచేస్తూ, మిత్రులందరి సహకార సహాయాలతో మాత్రమే యీకృషిని జయప్రదంగా సాగించగలమని మరొకసారి విన్నవిస్తూన్నాము.

30—3—1952, రాజమండ్రి.

ఇట్లు
మహీధర జగన్మోహనరావు.

# కవి జీవితం.

ఎల్మర్ గ్రీన్, లెనిన్‌గ్రాడ్ మండలంలో 1909లో జన్మించేడు. తలిదండ్రులు పసితనంలోనే చనిపోవడంవల్ల అనాథశిశు శరణాలయాల్లో పెరిగేడు. చిరుతవయసులోనే వ్యవసాయ కూలీగా క్రిమియా, కకేషియాల్లో పనిచేసేడు. అతని కథలు 1937లో ప్రప్రథమంగా పత్రికల్లో పడ్డాయి. అప్పటి కీతడు సోవియట్ నౌకాదళంలో పనిచేసేవాడు. 1939లో యీతని కథలు సంపుటిగా మొదటిసారి వెలువడినాయి. 1941-45లో సోవియట్ - జర్మనీ యుద్ధంలో పటాలంలో చేరి పనిచేసేడు. మొదట ప్లాటూన్ కమాండరుగనూ, తరువాత పటాలపు పత్రికలో సంపాదకీయవర్గసభ్యుడుగానూ పనిచేసేడు.

'దక్షిణ పవనం' అనే యీతని యీ నవలకు 1946లో స్టాలిన్ బహుమతి లభించినది.

సోవియట్ యువసాహిత్యకారుల్లో వర్ధిష్ణువు ఎల్మర్ గ్రీన్.

# పాత్రలు

హెర్రా హ్యూగో కుర్కిమాకీ–భూస్వామి.

కుర్కిమాకీ అమ్మ –భూస్వామి భార్య.

విహ్టోరీ కుర్కిమాకీ – ,, కొడుకు, ఉద్యోగి.

హిల్డా కుర్కిమాకీ – ,, కుమార్తె, విద్యార్థిని.

ఐనారీ లహ్యామ్మ్యా పీత్కానియేమి–కుర్కిమాకీ కమతంలో పాలేరు, కధకుడు

ఎల్మా పీత్కానియేమి:—ఐనారీ భార్య; కుర్కిమాకీల గోశాలలో పనికత్తె.

లవురీ - మార్తా —ఐనారీ, ఎల్మా దంపతుల బిడ్డలు; కొడుకు, కూతురు.

విల్హో పీత్కానియేమి —ఐనారీ తమ్ముడు. కల్లీ క్రీమరీలో పనివాడు, మంచి బాక్సరు.

కర్తో లహ్తీనెన్ —కుర్కిమాకీ కమతంలో పాలకత్తె

పావో పికున్కానెన్ — ,, పాలేరు.

కల్లీ పోహ్జన్ పా —క్రీమరీ యజమాని.

ఎలియాస్ పోహ్జన్ పా—కల్లీ కుమారుడు; క్రీమరీలో మేస్త్రి; వట్టి వాకుడుగుల్ల, కపటి, బడాయి కోరు.

ముస్తోనెన్ —క్రీమరీ పనివాడు.

పిట్టూనెన్, ఆతే —యుద్ధానంతరం క్రీమరీ పనివాళ్ళు.

వైనో అహోనెన్ — ఱంపం మిల్లు యజమాని.

అంత్తీ కొసోలా — పెద్ద ఆలమందగల భూస్వామి.

ఆర్వో మేరికోస్కి
తావునో జార్వినెన్
వాప్పూ సాలో
ఆతీ వువోరేలా
మత్తీ రువోకాసాలో
తోయ్వో కోస్కినెన్
ఉర్హో జుకోలా
నిల్స్ హోపానెన్
} కార్మికులు, కివీమా కార్మిక క్లబ్ సభ్యులు; బాక్సర్లు.

కవ్రాకో మురాటో — కామిజర్వీ ప్రాంతలోని ఒక గొడారి.

తోయ్వో మాంతిలా — ,, ఒక సైనికుడు

ఆర్వో హినోలా — ,, ,,

ఆట్టో ఉకోర్కినెన్ — పారిపోయివచ్చిన ఫిన్నిష్ సిపాయి.

కల్లీ అహోలా-
జాల్మరీ కివిమాకీ-
జూహో పిట్టూనెన్
} విల్హో కంపెనీలోని సిపాయీలు.

జూస్సీ వాహోనెన్
రీకూ కీవి
కవ్రాకో సర్కోలా
వ్రజో లెహ్తొనెన్
} కివీమా కార్మిక క్లబ్‌లో సభ్యుల బాక్సర్లు.

స్టెపాన్ కోటిలైనెన్ — కుర్కిమాకీ కమతంలో కూలికివచ్చి యింగ్రియన్ కుటుంబి.

---

# దక్షిణపవనం

## కథాసంగ్రహం

ఫిన్లాండుదేశపు పల్లెట జీవితాన్నీ, అక్కడి సమస్యల్నీ ప్రతిబిం బించే చక్కని నవల, యిది. అతిశీతలమై, అరణ్యాలు, కొండలు, సరస్సులు, వీటిలో నిండివుండే ఫిన్లాండుకు దక్షిణంగా సోవియటు రష్యావుంది. రెండుదేశాల ప్రజలూ 1917 కు పూర్వం జారుచక్రవర్తుల పాలనలో వుండేవారు. విప్లవానంతరం రష్యాలో సోవియటు విధానం స్థాపించబడి, ప్రజలు సర్వతోముఖాభివృద్ధి పొందుతూంటే, ఫిన్లాం డులో పురాతన భూస్వామ్య, పెట్టుబడిదారీ విధానాలు నిలద్రొక్కుకుని ప్రజలు అనేక యిబ్బందులకు గురవుతూనే వున్నారు. దక్షిణాన్నుంచి వీచేగాలి వెచ్చగా, సుఖదాయకంగా వుంటుంది, ఫిన్నులకి. కాని ఆ గాలి సోకకుండా కొండలు అడ్డుతూంటాయి. అల్లే సోవియటుమీది నుంచి వచ్చే వినూత్నభావాల్ని అడ్డి, నవసమాజోదయం గాకుండా ఫిన్నిష్ పాలకవర్గాలు ఆటంకంగా వుంటున్నాయి. భూస్వామ్యవిధానం క్రింద సతమతమయ్యే ఫిన్నిష్ ప్రజలకు రష్యానుండివచ్చే 'దక్షిణ పవనం' వసంతోదయాన్నే గాక నవజీవిత వసంతోదయాన్నికూడా కలిగిస్తూందని యీ కథ ధ్వనిస్తూంది. నిశితమైన వ్యంగ్యధోరణి యిం దులో పొడుగునా కానవస్తుంది.

* * *

కథానాయకుడూ, కథకుడూ ఐన ఐనారీ చిన్నతనంనుంచీ వ్యవ సాయకూలీగా భూస్వామి కుర్కిమాకీ కమతంలో పాలేరుగా పని చేస్తూంటాడు. అతనిభార్య యెల్మాకూడా కుర్కిమాకీ గోశాలలో పని

కత్తెగా వుంటుంది. ఈ కూలీదంపతులకు లవురీ, మార్తా లిద్దరు బిడ్డలు. కుర్కిమాకీయే తనభూమిలోని చిన్నకొండలమీద యిల్లుకట్టుకోడానికి ఐనారికి తావుయిస్తాడు. కొండమీది ఆకుటీరంలోనివసిస్తూ, రాత్రింబగళ్లు కుర్కిమాకీలకు చాకిరీచేస్తూన్నా ఐనారీ కుటుంబానికి పొట్టగడవడమే గగనంగా వుంటూంది. ఐనారీ తమ్ముడు విల్హో, కల్లీ పోహ్జలా పాక్రీమరీలో పనివాడు. అతనికి అహోసెన్ అంపంమిల్లు కార్మికులద్వారా కమ్యూనిస్టు భావాలంటుతాయి.

ఐనారీ తన కామందు నాశ్రయించి యేదోకాస్త కొండసంపాదించుకొందామని యెంతో అడకువగా వుంటాడు. విల్హో తిరుగుబాటు స్వభావంతో అన్ననూ, అతని బానిసభావాల్ని యెత్తిపొడుస్తూంటాడు.

భూస్వామి కుమారుడు విహ్టోరీ హెల్సింకీ నగరంలో వ్యవసాయ శాఖోద్యోగి. కివీమా కార్మికక్లబ్బులో జరిగిన ఒక విందు సందర్భంలో విహ్టోరీ విల్హోను అవమానిస్తాడు. అప్పటినుంచీ విహ్టోరీతో బాక్సింగులో నెగ్గిన వారందర్నీ విల్హో పనిగట్టుకుని సవాలుచేసి, ఓడిస్తూంటాడు. విహ్టోరీ చెల్లెలు హిల్డాకన్య యూనివర్సిటీ విద్యార్థిని; మరొక విందులో విల్హోనుచూచి, ఆమె అతన్ని గాఢంగా ప్రేమిస్తుంది. విల్హో కూడా ఆమెను ప్రేమించినా, భూస్వామి కుమార్తెయని తెలిసి ముభావంగా వుంటాడు. తన తమ్ముడికీ హిల్డాకీ వివాహమైతే తన పరిస్థితి బాగు కావచ్చునని ఐనారీ తనయింట వీరిద్దరినీ సమావేశపరుస్తాడు. అదిగ్రహించిన విల్హో అన్నమీద అలుగుతాడు. ఇంతలోనే ఫిన్లాండుకీ సోవియటుకీ యుద్ధం వచ్చింది. విల్హోని పటాలంలోకి తీసుకుపోతారు.

యుద్ధంలో రష్యా నెగ్గి, సంధిజరుగుతుంది. విల్హో తిరిగి యింటికి వస్తాడు. కార్మికక్లబ్‌లో తరుచు జరిగే బాక్సింగు పోటీలకు విహ్టోరీ వస్తూంటాడు. అతన్ని ఓడించిన ప్రతీవాణ్ణీ సవాలుచేసి విల్హో ఓడిస్తూండడం అందరూ వింతగా చెప్పుకుంటూంటారు.

ఇంతలో జర్మనీ రష్యాపై దాడిచేస్తుంది. ఫిన్లాండు పాలకవర్గం నాజీ జర్మనీతో చేతులుకలిపి దేశాన్ని యుద్ధంలోకి యీడుస్తారు. దేశంలో పడుచువాళ్ళనందర్నీ యుద్ధానికి లాక్కుపోవడం, విల్హో రష్యాకు ఖైదీగా చిక్కడం జరుగుతుంది. విల్హోని బోల్షివిక్కులు చిత్రవధ చేసివుంటారని భూస్వామి ఐనారీతో చెపుతాడు. విల్హో కులాసాగా వున్నట్లు అతని స్వదస్తూరీతో వ్రాసిన లేఖ, ఫొటోతో సహా ముద్రించిన కరపత్రాలు సోవియటు విమానాలు వెదజల్లుతాయి. అవే కొన్ని కుర్క్కిమాకీ కమతంలో పాలేరుగావున్న పానోకి దొరికితే ఐనారీకి యిస్తాడు. రష్యానుగూర్చి తమదేశంలో జరిగే ప్రచారంలోని బండారం ఐనారీకి తెలుస్తుంది. యుద్ధంలో జర్మనీలు, ఫిన్నులు గట్టిదెబ్బలు తిని తిరోగమనం చేస్తూన్నారు. దేశంలో మిగిలివున్న ఐనారీలాంటి వాళ్ళనందర్నీ కూడా రిక్రూటుచేసి యుద్ధంలోకి పంపుతుంది, ప్రభుత్వం.

ధనికభూస్వామ్య వర్గాలు తెచ్చిపెట్టిన యీ యుద్ధంలో పేదలు, కష్టజీవులు సర్వనాశనం అవుతూంటే రెండోవైపు అధనికవర్గాలు లాభాల మీద లాభాలు సంపాదిస్తుంటారు. కుర్క్కిమాకీ యుద్ధఖైదీలచేత పనులు చేయించుకుని మిల్లునూ, క్రీమరీని కట్టించుకుంటాడు.

ఫిన్లాండు ఓడిపోయి రష్యాతో సంధిచేసుకుంటుంది. యుద్ధరంగంలో సోవియట్ సైన్యపుధాటికి నిలువలేక ప్రాణాలతో పారిపోయిన ఐనారీ లాంటివాళ్ళందర్నీ ఫిన్నిష్ ప్రభుత్వం ఖైదీలుగా పట్టుకుంటుంది. ఖైదులోవాళ్ళు నానాబాధలూపడి, చిట్టచివరకి రష్యన్ మిలిటరీకమిటీ పట్టుదలపై విముక్తులవుతారు. ఇంటికివచ్చి ఐనారీ తిరిగి వెనుకటి కష్టజీవితాన్నే గడుపుతుంటాడు. యుద్ధవాగ్దానాలు యేమైనాయి? అసలు యుద్ధందేనికి? దీనివల్ల ఎవరు లాభంపొందేరు? రక్తం ధారపోసినవాళ్ళెవరు? ఎవరుయుద్ధాన్ని కోరుతారు? ఈ ప్రశ్నలన్నీ స్వానుభవంలో గ్రహించి, ఐనారీ చైతన్యవంతుడవుతాడు.

భూస్వామి ఐనారీని ప్రలోభపెట్టడానికి కొంతభూమి యిస్తానని ఆశచూపుతాడు. ఐనారీ నిరాకరిస్తాడు. విల్హోను దనయింటి కొవ్వోనించి, క్రీమరీలో ఫోర్మన్‌గా వుండమని కోరుతాడు, భూస్వామి కుర్కిమాకీ. అక్కడే విందుకువచ్చినవాళ్ళ సమక్షంలో విహిటోరీచేత క్షమార్పణ చెప్పించుకుని, ఫోర్మన్ పదవిని నిరాకరించి విల్హో వెళ్ళిపోతూంటే హిల్డాకన్య అతన్ని అనుసరించి వెళ్ళిపోతుంది. ఇద్దరికీ వివాహం జరుగుతుంది.

ఫిన్నిష్ ప్రజాతంత్ర పోరాటం బలపడుతుంది. భూస్వామ్య పాలక వర్గాల కపటం వెల్లడై వాళ్ళఆటలు అరికట్టబడతాయి. ఐనారీ, విల్హోలు యీ ప్రజాతంత్ర పోరాటంలో అగ్రగాములుగా వుంటారు.

దక్షిణాన్నుంచివచ్చే. యెండవెలుతురుల్నీ, వెచ్చని గాలుల్నీ అడ్డు పెడుతూ, జీవితాన్ని అంధకారమయంగా చేస్తున్న అడ్డుతొలగిపోయీ సమయ మాసన్నమైంది.

దక్షిణ పవనం వీచింది. వసంతోదయం అయింది. దానితోపాటు నవజీవన విధానానికికూడా వసంతోదయం అయింది. ఆశ, ఆనందం ప్రజాహృదయాన్ని వుజ్జీవింపజేసినాయి.



# దక్షిణపవనం

## ఒకటో ప్రకరణము – స్వగృహం

కొలవాహిని యెవరికోరకూ ఆగదు; జరగాల్సిందేదో జరుకనూ మానదు. ఈ లోకంలో యింతవరకూ జరుగుతూ వచ్చిన సంఘటనలన్నీ అందరికీ ఆనందసంధాయకములని చెప్ప వీలులేదు. గాని, మొత్తంమీద చూస్తే ఈ లోకంలో సంసారయాత్ర కేవలం నిస్సారమని త్రోసిపుచ్చదగినది మాత్రం కాదు.

గతరాత్రికూడా మళ్ళీ దట్టమైన మంచుపడింది. ఐతేనేమి, తెల్లవారగట్లనుంచీ వెచ్చటి దక్షిణపుగాలి వీచడం, మంచు తెర మటుమాయంగావడం అంతలో జరిగిపోయింది. లోయ నుంచిచూస్తే అన్నివైపులా పెద్దపెద్ద కొండలు, బండరాళ్లు, తడిసిన నల్లటిపాషాణఫలకాలూ కానవస్తున్నాయి. పొలాల్లో మంచంతా కరిగిపోయినందున అసంఖ్యాకంగా చిందరవందరగా పెనురాతిబండలు బైటపడినాయి. ఎవరో మంత్రగాడు దండం విసరగానే మంచుతెర విడిపోయి, భూమిలోంచి యీ కొండలూ, బండలూ పుట్టుకొచ్చినట్లుగావుంది. లోయకి యిరుప్రక్కలా క్రమోన్నతంగా పర్వతపంక్తులూ మధ్య దిగువగా చాలులా ప్రవహించిపోతూన్న నిర్ఝరిణీ; నిన్నటి వరకూ శీతకాలపుమంచుకి యీ సెలయేరు శుష్కించివుండి,

నేడు మంచు కరుగగానే ఒడ్డులొరసుకుని ప్రవహిస్తూ, లోయని చీల్చుకుంటూ పోతూంది. ఎంతలో యెంతమార్పు!

తెల్లటి మంచుదిబ్బలమధ్య వుండడంవల్లనో యేమో యేరు నల్లగా కనిపిస్తూంది. సుదూరంలో పర్వతసానువుల మీంది దేవదారు అడవులు నల్లటి మేఘాల్లా వున్నాయి. కారడవుల్లో పుట్టి, తెల్లటి మంచుదిబ్బల్లోంచీ, నల్లటిరాళ్ళ ల్లోంచీ ఒరసుకొనిపోతూ, యెక్కడో మటుమాయమైపో తూన్న యీ సెలయేరు మానవజీవిత వాహినిని జ్ఞప్తికి దెస్తూంది.

నా కాపురంకూడా ఆకొండగుట్టల్లోనే ఒకదానిమీంద. అది కూడా మంచుకరిగిపోవడంవల్ల యిప్పుడు నల్లగాకనిపిస్తూంది. ఆకొండచరియ యెక్కడానికి వీలుగానే వుంటుంది. రాళ్ళు గఱుకుగా వుండడంవల్ల బూట్లతోయెక్కినా జారిపోతామనే భయంలేదు. ప్రొద్దుట పనిలోకి వెళ్ళేటప్పుడు దిగడం, సాయంత్రం పనిలోంచివచ్చి కొండయెక్కడం, యిది మాకు నిత్యకృత్యం.

మాయిల్లు ఆకొండనెత్తంమీంద నేవుంది. ఎర్రగా జేగురు లావుండే అదే మాయిల్లు. తెల్లటి కిటికీలు రెండూ రెండు కళ్ళల్లా వున్నాయి. ఆ కిటికీలురెండూ ఒకటి ఉత్తరముఖంగా కొండ ఆవలిప్రక్కకీ, రెండోది తూర్పుముఖంగా చరియలోకి యేటిని చూస్తూనూ వుంటాయి,

ఉత్తరపు తెరిపి వుండే చోటుగాక దక్షిణపు ముఖంగా వుండేచోట, యింతకంటెకాస్త మంచిచోటు చూసుకుని యిల్లుకట్టుకునివుంటే యెంతో బాగుంటుందని చాలమంది అభిప్రాయం. నాతో చాలమంది అన్నారు కూడాను. ఈ విషయం మరొకరు చెప్పకపూర్వమే నాకు తెలుసు! దక్షిణాన్నుంచి వచ్చేగాలి వెచ్చగా సుఖదాయకంగా వుంటుందనీ, ఉత్తరపుగాలిసోకితే శరీరం కొరకుబారిపోతుందనీ, యెవరికి తెలియదంటా? దక్షిణపు చరియమీద, దక్షిణముఖంగా గుమ్మం, కిటికీలు పెట్టి కొంపకట్టుకోడం నాకేం చేదా? అబ్బే! కాని వచ్చినచిక్కేమంటే మా కొండకి దక్షిణపు లోయ లేనేలేదు!

అంతమాత్రానపోతే చెప్పకోనే పనేలేదు. చరియమీది నెత్తంలోనే నాయిల్లూ, యింటినిచేరి నాలుగుచిన్న కూర పాదులమళ్ళూ, వాటిప్రక్కనే నిటారుగా ఓపెద్దరాతిగోడ! ఆరాతిగోడ దక్షిణాన్నుంచివచ్చే ఉష్ణవాయువుల్ని నిరోధించడమేగాక సూర్యచంద్రులకాంతినీ మాకుదొరక్కుండాచేస్తూంది. పైపెచ్చు యీకొండగోడ పైనుంచి క్రిందిదాకా బీటలువారి ఊటలుగ్రక్కుతూంటుంది. ఆబీటల్లోనూ, పైనుంచీ చెట్లవ్రేళ్ళూ, గడ్డిదుబ్బులూ జీభూతాల్లా వ్రేళ్ళాడుతూ, తేమ గ్రక్కుతూంటాయి కూడాను.

ఈ పరిస్థితుల్లో దక్షిణముఖంగా యిల్లుకట్టుకొనే మూర్ఖులుంటారని నే ననుకోను. దక్షిణపు కిటికీలోంచి చూసేందుకే

ముంది ? బీటలువారి, గడ్డిదుబ్బులతోవున్న నల్లరాతిగోడా, నాలుగుబారలుకూడా లేని కూరపాదులూ తప్పితే అటువైపు సుందరదృశ్యాలేమీ లేవులెండి.

పోతే, ఎదిగేపిల్లలకి సూర్యరశ్మి యెక్కువగా వుండాలని నేనూ ఒప్పుకుంటాను. కాని వీలుగాని పరిస్థితుల్లో సరిపెట్టు కోవడం యెవరికైనా తప్పదు, చూడండి.

హెర్రా * కుర్కిమాకీ నాకు మరోచోట నివేశనస్థలం యివ్వడానికి సిద్ధంగాలేనపుడు నేనేం చేయాలో చెప్పండి ? ఎండ బాగాతగిలే చరియమీద ప్రాదేశమాత్రంగానైనా నాకు చోటివ్వడానికి ఆయనగారికీ సంతోషమే. కానిఅటువంటి మంచిస్థలాలు ఆయనకూ అంతయెక్కువగాలేవు. నాకీయింటి స్థలం యిచ్చేటప్పుడు మాయిద్దరికీ జరిగిన సంభాషణ చెప్పమంటారా ?

యజమాని హెర్రా కుర్కిమాకీ అన్నారుగదా :

"తాత ముత్తాతలు యిచ్చిపోయిన భూమీ పుట్రా ఊరికే అటూ యిటూ దుబారాచేయడం మంచిదికాదుగదా ?"

సబబు తెలిసినవాణ్ణి గనక నేనూ అంగీకరించాను :

"నిజం బాబయ్యా ! మీరుచెప్పేది అక్షరాలా నిజం !"

అప్పటికి పాతికేళ్ళుగా నేనాయనదగ్గరే పనిచేస్తూన్నాను. మాయిద్దరి పరిచయసంబంధాలూ యీవేళా నిన్నటివీగావు మరి. ఈసంగతి ఆయనకూ తెలుసు. అందుచేతనే యీమాటలని కుర్కిమాకీ మళ్ళీకొంచెంసేపు ఆలోచిస్తూ ఊరుకున్నారు.

* ఇంగ్లీషువాళ్ళ మిస్టర్, జర్మనుల హేర్, పరాసుల మున్స్యూర్ లవంటి గౌరవవాచకం. మన 'శ్రీ' వంటిదన్నమాట.

ఆలోచనాపూర్ణమైన ఆయన ముఖంమీంది ముడుతలు చూస్తూ యేమి జరుగుతుందా? అని కనిపెట్టుకుని చూస్తున్నాను. ఏమనిషి మనోభావాల్నీ ముఖంమీంది ముడుతలు చూసి పోల్చుకోడం ఎవరితరం? నుదురు బీటలు వారినట్లు దట్టంగా చాళ్ళుగావున్న ఆ ముడుతల్లోనుంచి యేమీ లాగలేక, కండ్లలోంచి యేమైనా కూపీతీయగలనా? యని ప్రయత్నించి విఫలుణ్ణయేను. సజీవమైనచర్మపు ముసుగుల్లా దళసరి కనురెప్పలు మూసుకునివున్న ఆయన కళ్ళలోంచీ, బలిసి పొంగరించి, ముడుదలతో బీటలువారిన ఆయన బంగముఖం లోంచీ లోపలి భావాల్ని పైకితీయడం అసంభవం. అందుచేతనే హెరాౖ కుర్కిమాకీ యేమంటారా? అని నిరీక్షిస్తూ వూరుకున్నా. కొంచెంసేపట్లో ఆయన సాధికారస్వరంతో మళ్ళా అన్నారు.

"ఈ సమీపంలోనే నీకు కాస్త నివేశనస్థలందొరికితే బాగుంటుంది. వేళకి పనికిపోడానికీ వీలుగావుంటుంది."

"ఔనండి, అయ్యా!..." నేను వెంటనే జవాబిచ్చేను.

కామందు నాకోర్కెను పూర్తిగా త్రోసిపుచ్చటం లేదని తెలుసుకున్న నాగుండెలు సంతోషాతిరేకంతో తటతటకొట్టుకోనారంభించేయి. కొంచెంసేపు బడ్డాక యజమానితోఅన్నా.

"నేను కోరిన అడివిగాని, ఊబినేలగాని యేదోకాస్త చెక్క యిప్పించేరంటే కామందు దయ యెప్పుడూమర్చవను, పంటలో సగానికిసగం మీాకివ్వగల....."

3

మాటమధ్యలోనే అడ్డొచ్చి కామందు సాధికారస్వరంతో అన్నారు.

"అదంతా మాట్లాడ్డానికిదికాదు సమయం. ఆరోజు యింకా ముందుందిలే. తొందరబడకు."

ఈమాటలంటూనే పళ్ళికిలించి వెనక్కితిరిగి నడుస్తూ, జేబులోంచి సిగరెట్ కేసు పైకితీసేడు. ఆయన వెనకాలే నేనూ నడుస్తూన్నానేకాని ఆయనకి చిరాకు, కోపం రావచ్చునని భయంతో యింకేమీ మాట్లాడలేదు. వాలకాన్నిబట్టి మాత్రం కామందు నాకు యేస్థలాన్ని యిద్దమా? అనే ఆలోచిస్తూన్నాడని నాకు గట్టిగా అనిపించింది, చెప్పొద్దూ.

నేననుకొన్నది నిజమే అయింది. కామందు కాల్చేసిగరెట్లు మాంచిఖరీదైనవనుకుంటా. ఆయన సిగరెట్టు సువాసన వెనక్కాలే నడుస్తూన్న నానాసికారంధ్రాలికి విందుచేస్తూంది. ఏ ఐదునిముషాలో తదేకంగా నడుస్తూవున్నట్టుండి సిగరెట్టు తీసి చేతబట్టుకుని యీకొండ నెత్తంవైపుచూపుతూ అన్నారు.

"అదుగో! ఆ కొండ నెత్తంచూడు! ఇల్లు వేసుకోడానికీ, చిన్నకూరల మడికీ సరిపడా నెలవువుంది. చూడు! ఇదైతే నీకు పనికిపోవడానికి దగ్గరకూడాను."

అంతే. అప్పటినుంచీ ఈ రాతిదిబ్బమీద నా కుటుంబానికి తావులభించింది. మా చిన్నయింటిని చేరే దక్షిణంగా గోడకట్టినట్లులేచిన ఓ పెద్ద నల్లరాతిబండా, దానిమీద తుప్పలూ, గడ్డిదుబ్బులూ, పైన ఓచిన్న భూర్జవృక్షమూ వున్నాయి. ఈ కైలాసానికి అధిపతిని నేను.

ఎప్పుడో పూర్వకాలంలో యీ కొండనుంచి ఓ పెద్దబండ పగిలి, కాలక్రమాన ఉత్తరపుచరియలోనికి దొర్లిపోయి వుండవచ్చు. పగిలిన బండ దొర్లిపోగా యేర్పడిన నెఱపే నాయింటికి నివేశనం అయింది. మిగిలిన సగంబండా గోడ పెట్టినట్లు మాయింటికి దక్షిణ తెరిపి లేకుండా చేస్తూవుంది. దానిమీది భూర్జవృక్షమే మా యింటికి ఆనవాలుగావుంది.

ఆ కొండ నెత్తంమీది కాస్తనెఱపునూ నేను హెడ్రా కుర్కిమాకీదగ్గర్నుంచి కౌలుకి తీసుకున్నానన్నమాట. ఆయన దాన్ని మంచిభూమి ఖరీదుకే నాకు కట్టెయిచ్చేరు. అల్లాగని నేనాయన్ని దురాశాపాతకుడని అంటున్నాననుకోనేరు! అబ్బే. నేనటువంటివాణ్ణేంకాదు. ఆప్రాంతంలో కల్లా హెడ్రా కుర్కిమాకీ పెద్ద భూఖామందు. ఆయనకు కోపం తెప్పించడం నాబోటి పేదవానికి అంతగా శ్రేయస్కరం గాదుమరి.

ఒక్కొక్కపుడు యెల్లాంటి మానవుడికీ చిర్రపుట్టుకొస్తూం టుంది. ఆసమయాల్లో పెద్దవాళ్ళనికూడా లెక్కచేయకండా తిట్టడం; అదికావాలి! ఇదికావాలి! అని దబాయించి గద్దిం చడం జరుగుతూంటుంది. కానైతే అల్లాంటి వాళ్ళకి అందు వల్ల కలిగే లాభం యేమీలేకపోగా నష్టకష్టాలు తప్పవు. నేను పాతికేళ్ళుగా ఆయన దగ్గిరే పనిచేస్తూన్నానుగాన తొలగిస్తాడనే భయం లేదనుకోండి. అదీగాక భూస్వామి నాకోర్కెను తిరస్కరించినట్లేముంది? "దానికిప్పుడే తొందర రేమిటి?" అన్నాడంతే. దానికర్థం? అడవి పొలమా, ఊబి

పొలమో, కాస్తమడిచెక్క లభించేఅవకాశం నాకింకా ముందు ముందువుందన్నమాట కేగదూ? నాకెంతో అఖర్లేదు. ఏకాస్తంత పొలం లభించినా చాలు. దేవుడి దయవల్ల నారెక్కలు చల్లగావుండాలేగాని, యెటువంటిభూమి కానీండి,—ఒక్క యేడాది పురుషత్తు, యే పొలంలోఐనా గోధుమ, రైధాన్యం బంగాళాదుంపలు, బటానీలు, అదీ యిదీ యేమిటి? అన్నీ పండించగలను. నా సత్తువనాకు తెలియదూ? లోతుగావ్రేళ్లు పారిన చెట్లంటేనూ, రువ్వారుట్రాతో నిండిన ఊబినేల లంటేనూ నాకేం లక్ష్యంలేదు. నేను కోరుకునేదంతా 'ఇదిగో! ఇది నాపొలం! ఇది నాకమతం!' అని చెప్పుకోదగింది యేదో ఒకటి ప్రాదేశమాత్రంగానైనా కాస్తభూమి లభిస్తే చాలుననే.

యజమానికి కోపంవచ్చేలా చీటికీమాటికీ చాదస్తంగా సాధిస్తూండకుండా, మనమర్యాద మనం కాపాడుకుంటూ దూరంగావుండడమేమంచిది. పాతికేళ్ళుగా ఆయనదగ్గర పని చేస్తూన్నా నాయె. అటువంటిది యిప్పుడాయన ప్రాపకం పోగొట్టుకోనేలా ప్రివర్తించడం సిగ్గుచేటుగాదూ? సిగ్గు మాట అటుంచిలాభం మాత్రిం యేముంది? అందుచేతనే యింకేమీ మాటాడకండా నాకుటుంబాన్ని ఆ కొండనెత్తాన వేరూనేలా చేయడానికి పూనుకున్నాను.

---

# దక్షిణపవనం

## రెండో ప్రకరణం స్పర్థ - అనురాగం

ఏనాడో పగిలి, జారిన పెనుబండ క్రింది సెలయేటిలో బడి, ప్రవాహాన్ని నిరోధించి, దాన్ని మా కొండవైపు మళ్ళించింది. పెనుబండదగ్గర లోతైన మడుగుయేర్పడి, నీటిమట్టం లేచింది. బండనుచుట్టి సెలయేరు ముందుకుసాగిపోయి, లోవ చివరన అంతర్ధానమైపోతూంది. మడుగులో నీరు లోతుగా, సుడులుతిరుగుతూ స్ఫటికంలా స్వచ్ఛంగా వుంటుంది. మడుగు దాటేక రాతిబండమీంచి మర్మరధ్వనులతో నా సెలయేరు లోయలోకి దూకి ముందుకు ప్రవహిస్తుంది. ఆ మడుగే మాకు నీటిసదుపాయాన్ని ఒనగూర్చుతూంది.

ఆ మడుగున కభిముఖంగా వుండేలా ఒకస్నానగృహాన్ని కూడా చెక్కలతో నిర్మించేను. అదోక పెద్ద చెక్కలపెట్టెలాగేవుంటుంది. నాలుగుమూలలూ నాలుగు బండరాళ్ళమీద ఆన్చి తయారుచేసేను, దాన్ని. ఒకేసారి యిద్దరు మనుష్యులకంటె అందులోపట్టరు; స్నానానంతరం దుస్తులు ధరించే అర దానిలోలేదు. ఐతేనేమి ? పనితీరడానికదిచాలు. పైగా అది మా స్వంత స్నానగృహం. ఇక పరాపేక్ష అక్కర్లేదు, అదేచాలు !

ఆ స్నానగృహనిర్మాణాని కుపయోగించిన చెక్కలూ, కమ్ములూ, మేకులూకూడా నేను భూస్వామిదగ్గరేకొన్నాను; రాగిడేగిసా, పొయ్యి యిటుకలూకూడా ఆయనదగ్గరే తీసుకొనివచ్చేను. వీటికన్నిటికీ ఆయన రొఖ్ఖం తీసుకోనూ లేదు, నేనీయనూ లేదు. నా పద్దులో యివన్నీ ఖర్చు రాసేరు యజమాని. ముందు పనిచేసి, వాటిబాకీ తీర్మానంచేసుకోవాలి. నాకు వాటిఖరీదులుకూడా తెలియవు. నాకు అరువుసరువు యిచ్చిందే చాలు. కామందు కేం తక్కువని నాకు యెక్కువ కడతారు? ఆయన నాతో చెప్పగా తెలిసింది, డేగిసా చాలా ఖరీదైనదని. అంతే.

ఇంటి ఖరీదుక్రిందా, నివేశనస్థలానికీకూడా ఆయన నా దగ్గర ఒక్కదమ్మిడీకూడాతీసుకోలేదు. అదికూడాపనిచేసి తీరుమానంబెట్టుకోడానికే నిర్ణయం. ఏటా యిరవైరోజులపని యింటివాయిదాల తీర్మానంనిమిత్తం చేస్తూండాలి. మొదట్లో యింటిబాకీక్రింద యేటా ముప్ఫైరోజులు పనిచేయమన్నారు ఆయన. కాని మళ్ళీ ఆయనగారే యేమాలోచించేరోగాని యిరవైరోజులు చాలునన్నారు. ఇల్లు చాలాచిన్నది; ఒకటే గది. చూడ్డానికదొక యిల్లులాగే కనిపించదు. ఎల్లాకనిపిస్తే నేంగాని అది నాకుయిల్లే. ఏటా యిరవైరోజులుచొప్పున నా జీవితాంతంవరకూ చేస్తూనేవుండాలి, యింటిబాకీకోసం.

స్నానగృహం బాకీనంతనీ పద్ధెనిమిదిమాసాలలో తీర్చగలనని లెక్కవేసినా, ఆతర్వాత యింటికోసం యేటా

ఖరవై దినాలేగదా చేయాల్సింది. అదేమంత యెక్కువ గాదు; స్వంతయిల్లంటే మాటలామరి ? నా అనంతరం నా బిడ్డలా యింటికోసం దమ్మిడీకట్టనక్కర్లేకుండానే వాళ్ళకది సంక్రమిస్తుంది. వాళ్ళకోసం నేనుకష్టపడడానికి వెనుతీయను లేండి.

నా భార్యకూడా నాకుమల్లేనే ఆలోచించింది. యజమాని షరతులకంగీకరించి, స్వగృహామంటూ యేర్పాటుచేసి వచ్చేనని విన్నప్పుడామెముఖం సంతోషంతో వికసించింది. యజమాని పనివాళ్ళుండటానికని కట్టించిన బారకీచులలోనే ఒకగదిలో వుంటూండేవాళ్ళం, మేమంతవరకూ. దాంట్లో ఒక్కటేమంచం, ఒక టేబిలు, రెండుబెంచీలూ, యివే వుండేవి. మేము మంచంమీాదా, పిల్లలు బెంచీలమీాదా పడుకొనేవాళ్ళం. వేరే వంటయిల్లూలేదు, స్నానానికి గదీలేదు, ఆ బారకీచులలో. ఇప్పుడు మా కొత్తయింటికి ఆ సౌకర్యాలన్నీవున్నాయి, మరి. అల్లాంటపుడు నా ఎల్లాగుచంద్రముఖం సంతోషంతో, సంతృప్తితో దీపించి, గులాబులు పూచిందంటే ఆశ్చర్యమేముంది ?

మాతమ్ముడు విల్లో ఒక్కడే మా కొత్తయింటిని చూసి మెచ్చుకోనిది. వాడు వట్టితెలివితక్కువవాడు లెండి. వాడన్నాడుగదా,-

'బాగుందిరా, అన్నయ్యా! సువోమీ* లో యిప్పటికే వేలమంది కొండలమీద కాపురాలున్నారు. నువ్వుకూడా కొండమీద కొంపకట్టేవంటే వాళ్ళసంఖ్య హెచ్చువేసేవన్నమాట. అంతే. ఇందులో ఆశ్చర్యం యేముందిలే. కొండ మీద కొంపవేసుకుని, యిక్కడి నల్లరాళ్ళవల్ల గలిగే ఆనం దాన్ని అనుభవిస్తుంటూ........'

వాడి ధోరణి యెప్పుడూ యింతేలెండి. భూమిఅంటే యేమిటో, అదిలేనివాడి అవస్థలేమిటోకూడా తెలియని పాతికేళ్ళ కుర్రవాడికేం తెలుస్తాయి కష్టసుఖాలు? పాలఫాక్టరీ యజమాని కల్లీ షోహ్జన్‌పా దగ్గర మీగడా, జున్నూ చేయడం నేర్చుకోగానే లోకమంతా తనకి తెలిసిపోయిం దనుకుంటున్నాడు గాబోలు, పిచ్చివాడు! ఇంతకీ వాడిమాట లెక్కేమిటిలెండి! కుర్రాడూ, తెలివితక్కువవాడూను! రెండునిముషాలు నోరు తెరవకండావుండలేడుగదా? నోరు మూసుకుని ఊరుకోడమేనా నేర్చుకోలేదు, వాడు!

ప్రతీదానికీ పళ్ళికిలించి పరిహాసం చేసినంతమాత్రాన యెవడూ యితరులందరికంటెనూ తెలివైనవాడని అర్థం గాదు. గంభీరతా, మితభాషిత్వమూ గలవాళ్ళనందర్నీ పరిహాసంచేయడమే పనిగాపెట్టుకున్నవాడికి తద్విరుద్ధంగా తోచడంలో ఆశ్చర్యంలేదుగదా? ఇద్దరు ముసలి ఫిన్నుల్ని

* సువోమీ అంటే ఫిన్‌లాండుదేశం. ఫిన్నులు తమదేశాన్ని 'సువోమీ' అనే పిలుస్తారు. స్వర్గభూమిఅని దానిఅర్థం.

గూర్చిన పాతకథ వాడినాలుకచివరేవుంటుంది. ఆ కథ చెప్పి నన్ను యెద్దేవ చెయ్యడం వాడికి యెంత సంతోష మను కున్నారు ?

ఆకథలో నవ్వడానికేమీ లేనేలేదు. వాడుతప్ప మరెవ రనూ ఆకథ విని నవ్వనూలేదు. ఎల్సామాత్రం మర్యాదకి యేదో కాస్త చిరునవ్వు తెప్పించుకుంది. అంతే. ఆకథలో చమత్కారం ఏమీలేదని వింటేమీకే తెలుస్తుంది.

సరే, కథవినండి. ఇద్దరు ముసలి ఫిన్నులు చెట్లు నరక డానికి అడివికి పోతూన్నారు. దారిలో వాళ్ళకి మంచుమీద కుందేటిజాడలు కనిపించేయి. అందులో ఒకడన్నాడు :

“ఒరేయ్ ! ఇదిగో ! కుందేలు యిల్లాపోయిందిరోయ్ !”

రెండోవాడప్పటికేమీ అనలేదు. ఇద్దరూ అడివికిపోయి మధ్యాహ్నందాకా పనిచేసుకున్నారు. పొద్దుతిరిగేక ఓదుంగ మీద కూర్చుని, మూటవిప్పి భోజనంచేసి, మళ్లా పనిప్రారం భించేరు. సాయంకాలం తిరిగి యింటికిపోతూ, కుందేలుజాడలు గానవచ్చినచోటికి వచ్చేక రెండో ముసలివాడు జవాబిచ్చేడు :

“ఔనురోయ్ ! కుందేలు ... ... నిజమే !”

ఈ కథలో చమత్కారం యేముందో నాకర్థంగాదు. నన్నడిగితే యీకథ కల్పించినవాడు అత్యుక్తిదోషానికి పాలు పడ్డాడంటా. రెండో ముసలాడు [illegible] కండా యెందుకు పూరుకుంటాడు ? అం[illegible]కూడ

కుంటాడు? ఇంకాముందే యేమధ్యాహ్నం భోజనంచేసే టప్పుడో జవాబిచ్చేడంటే చాలదూ?

అంతేగాదు. ఇల్లాటి పొగరుబోతుమాటలు మాట్లాడ కండా, పెద్దవాళ్ళపట్ల కొంచెం గౌరవం చూపిస్తే బాగుండేది గాదూ? పెద్దవాడైన అన్నగారికి టాటాకులు కట్టడంకంటె అతనినుంచి విచక్షణాజ్ఞానాన్ని సంపాదించడం వివేకంగాదా?

నా సలహా చెవినిబెట్టేవుంటే వాడసలు చిక్కుల్లో పడే వాడేగాదు. ఆ డాన్సు పార్టీకి వెళ్ళొద్దురా అంటూంటే వెళ్ళనే వెళ్ళేడు, చిక్కుల్లో పడనూపడ్డాడు. ఆవిందు పెద్దమనుష్యుల కోసం యేర్పాటైనది, అసలు. దానికి వాళ్ళే తమస్వంతధనం చందాలిచ్చేరు కూడాను. తన్ను యెవరో మహాప్రత్యుత్థానం చేసి ఆహ్వానించినట్లుగా వాడక్కడికి తయారుగావడం, ఆపైన వాళ్ళు దయచెయ్యమన్నపుడు నోరుమూసుకొని పోకండా పెద్దగందరగోళం లేవదీయడం ఏమాత్రం వివేక మున్న వాడైనా చేస్తాడా? అనుభజ్ఞుడైన అన్నగారే అక్క డుంటే అల్లాంటి తెలివితక్కువపని చేయనిచ్చేవాడా? నలుగు రిలోనూ నగుబాటు పడనిచ్చేవాడా?

ఆ సమయానికక్కడ పోలీసువాడుండడమూ ఒకందుకు మేలే అయింది. వాడు మనవాణ్ణి కాస్త సముదాయించి వెనక్కి [illegible]గివుండకపోతే యేం జరగాలో అదే జరిగేది! అప్పటి కప్పుడే విహాటోరీ కుర్చీమాకీ కళ్ళజోడుతీసి, చొక్కాచేతులు వెనక్కి మడిచి తయారవుతూన్నాడట.

నా యజమాని కుమారుడే విస్టార్. అతడు కళ్ళజోడు తీయడమంటే యెంత ప్రమాదసూచనో మీకు తెలియదను కుంటా. అల్లాంటి సమయంలో మెల్లగా వెనక్కి తప్పుకుని చల్లగా జారడం వివేకం. ఉద్దండపిండాల్లాంటి కుర్రాళ్లు ఆర్వో మేరికోస్కీ, టావునో జార్వినెన్, వాఫ్వా సాలో, ఆతీ వుపోరేలా, యింకా యెందరో బాక్సింగు రింగు*లో విస్టార్ ముష్టిఘాతాలకింద చిత్తవడం మా ప్రాంతాల్లో అందరూ యెరుగుదురు.

విల్హోకి యీ సంగతేనా జ్ఞాపకంవుండి, పిలువని పేరంటానికి పోకుండా వుండాల్సింది. కాని, వాడు వెళ్ళనూ వెళ్ళేడు; తగువు తేనూ తెచ్చేడు. విస్టార్ చెప్పేది వీడు అసలు వినిపించుకోంటేనా? అతగాడు పాపం చెపుతూనే వున్నాడట.

“ఇక్కడినుంచి వెళ్ళిపో, దయచేసి. లేకపోతే చిక్కు వస్తుందిసుమా!”

ఎంతో అనునయంగా చెపుతూన్నాడే కాని విస్టార్ సన్నటిశరీరం యుద్ధసన్నద్ధమై ఉద్రేకంతో ఉక్కుతీగలా బిగుస్తూనేవుంది. అతడు రంగంలోకి దిగేడంటే యంత్రంలాగే పనిచేస్తాడనుకోండి. విస్టార్ పిడికిలిపోట్లు సమ్మెట పెట్టుల్లా అతడు యెక్కడకావాలనుకుంటే అక్కడే పడితీరుతాయని ఆప్రాంతాల్లో బాక్సర్లందరూ యెరుగుదురు.

* రెండుచేతులకీ మణికట్టుపైకి తోలు తొడుగులు ధరించి చేసేముష్టి యుద్ధాన్నే బాక్సింగ్ అంటారు. ఒక బిరిగీసి, యిద్దరు బాక్సర్లూ అందులోనే పోట్లాడాలి. ఆ బిరినే ‘బాక్సింగ్ రింగ్’ అంటారు.

కాని, మా వాడు వట్టి వెర్రిబాగులవాడు. ఈ విషయా లన్నీ వాడు మరిచిపోయే వుంటాడు. అందుచేతే వాడు ఊరిషే తోసుకుంటూ ముందుముందుకి యెగబడ నారంభించేడు. అదృష్టవశాత్తూ ఆసమయానికి పోలీసువాడు అక్కడ వుండ బట్టి, పరిస్థితంతా గ్రహించి విన్స్టోని బైటికి నడవమన్నాడు. దానిమీద విన్స్టో బైటికివచ్చేసేడే అనుకోండి. కాని వాడు విక్టోరి కుర్కీమాకీని కవ్వించిగాని అక్కణ్ణుంచి రాలేదు.

"నువ్వీవిషయాన్ని శాశ్వతంగా జ్ఞాపకం వుంచుకొనేలా చేస్తా! కందిరీగల పుట్టకదిపేవు! జాగ్రత!"

విక్టోరీ యీ బెదిరింపుమాటలకి నవ్వి వూరుకున్నాడు. మా వాడి తొందరబాటుకి అతడంతకంటె యేమంటాడో చెప్పండి? చిరునవ్వుతూ, భుజాలు కుంచించుకుని, తీసినకళ్ళ జోడు మళ్ళా పెట్టుకున్నాడుట. అంతే.

కానైతే మా వాడు వూరుకున్నాడనుకున్నారా? అబ్బే! వాడికున్న పెంకితనం మరెవరికీ వుండదు. ఇంకోసారి ధనికుల బిడ్డలు క్లబ్బులో విందు చేసుకుంటూంటే వీడు వెళ్ళనే వెళ్ళేడు. కాని అదృష్టవశాత్తూ యీదఫా విక్టోరీ వూర లేదు. అతడేదో పనిమీద హెల్సింకీ * వెళ్ళేడుట. ఆ విందుకి విక్టోరీ చెల్లెలు హిల్డా వచ్చిందట. నల్లటితలకట్టూ, శిలా కలాంటి శరీరంతో ఆమె యెంతో చక్కగా వుంటుంది. ఆమె యూనివర్సిటీలో యేదో పెద్దచదువే చదువుతూంది. సెలవు

---

* హెల్సింకీ నగరం ఫిన్లాండు ముఖ్యపట్టణం.

లకి యింటికివచ్చింది. మా తెలివితక్కువ దద్దమ్మ ఆమెతోటి పోట్లాడలేదులెండి. అదీనయమే. పోట్లాట కొని తెచ్చుకుందా మని వెళ్ళినవాడు ఆశాభంగం పొంది యింటికి వచ్చేసేడు. ఇంకా విశేషమేమంటే, తన అన్నతో యెప్పుడూ పోట్లాడ నని మావాడిచేత హిల్డా కుర్కిమాకీ వాగ్దానం చేయించు కుందని కొందరనుకుంటూంటే నాకు తెలిసింది! దీని నిజా నిజాలు నాకేం తెలియవు. కాని, పోనిద్దురూ, అది వాళ్ళ స్వవిషయం. మనకెందుకూ? ఇంతకీ నేను చెప్పొచ్చేది మావాడున్నాడే,- వీస్తో, వాడు మా చెడ్డ తలవిసురుమనిషని! వాడు వివేకంగా ప్రవర్తిస్తాడని యెవరనుకున్నారులెండి, నేదో నా ఘోషకాని!

---

## మూడో ప్రకరణం ఎలియాస్ పోహ్జన్పా

తల్లి పోహ్జన్పా క్రీమరీలో (పాలనుంచి వెన్నతీసే యంత్రా గారం) పనిచేసేవాళ్ళల్లో నిజంగా చెప్పుకోదగినవాడు అతని కుమారుడు ఎలియాస్ ఒక్కడే. ఎలియాస్ క్రీమరీలోనే మేస్త్రీగా పనిచేస్తూంటాడు. అతగాడికి బ్రతుకు తెరువుబాగా తెలుసు. దానికోసం అతడు సూటిగా పాటుబడతాడు కూడాను. మాంఛిచురుకైనవాడు; అక్కడి యువకులందరి లోకీ ఎలియాస్ శ్రేష్ఠమైనవాడు లెండి. సువోజలూస్ కుంటా* లో చేరమని పిలిచినప్పుడు వెనకముందాడక వెంటనే

* ఫిన్నిష్ ఫాసిస్టు యువకదళం. స్యూట్జ్ కోర్ - నాజీయువకదళం వంటి సంఘం.

సంతకంచేసి చేరేసేడు. ఆ దళంలో చేరినవాళ్ళంతా పడుచు వాళ్ళూ, అవసరమైతే పోరాటంలో ప్రాణాలు తృణ ప్రాయంగా అర్పించగలవాళ్ళూ కూడాను. ఎలియాస్ ధైర్య సాహసాలు గలవాడూ, నిర్భీకుడూ. ఆహాఁ! ఆ విషయాన్ని నిర్భయంగా అందరియెదుటా చెప్పడాని కాతడు యెప్పుడూ సందేహించేవాడుగాదు.

"మా తడాఖా వాళ్ళకి చూపిస్తాంలే, వాళ్ళన్నా...... తొందరపడకండి, పిర్కేలీ! * ఈ దెబ్బతో అన్నీ పరిష్కారం చేసేస్తాం. నే చెపుతూన్నానుగా, నమ్మండి! పరిష్కారంచేసి తీరుతాము. చరిత్రలో మన సువోమీ ప్రముఖపాత్ర వహించాల్సివుంది. అందులో ముందడుగు వేసేవాళ్ళం మేమే! మొట్టమొదట రష్యామీదికి వురకాల్సింది మనమే. మన వెనకనే యితర దేశాలు వస్తాయి. బోల్షివిక్కుల్ని తవ్వి పాతరెయ్యాలి, పిర్కేలీ! ఊరుకుంటే వాళ్లు ప్రపంచాన్నంతనీ చుట్టబెట్టేస్తున్నారు. ఈ పనిలో మనమే ముందుండాలి. ఎందుకంటారా? ప్రపంచంలో అందరిలోకీ మనలాంటి ధైర్య వంతులు, సాహసులు, బలశాలురూ మరెక్కడాలేరు. పిర్కేలీ! పీతారీ ♦ కి చాలదగ్గరగా వున్నవాళ్ళం మనమే

---

* నిర్లక్ష్యంతో గూడిన నిందావాచకపదం. శబ్దార్థం 'దయ్యం' అని మాత్రమే ఐనా 'దాన్ని తగలేసిరి, వెధవది!' అన్నట్లు అర్థం యిస్తుంది. మోటు సంభాషణలో వాడే పదం.

♦ పీటర్సుబర్గ్‌కు ఫిన్నిష్ పేరు. నేటి లెనిన్‌గ్రాడ్ పట్టణం అన్నమాట. పీతర్ నగరం 'పీతారీ' అయింది.

గాదూ? పీతారీని బోల్షివిక్కులనుంచి లాగేస్తాం. పిర్కులీ! అసలు అదీ మనపట్టణమే! ఉత్తరప్రాంతాల్నికూడా రష్యన్లనుంచి లాక్కుంటాం. అదంతా అసలు మనదే! మన ఫిన్నిష్ జాతులేగా ఆప్రాంతిమంతటా నివసించేది? ఉత్తర దేశాన్నిగూర్చి రష్యన్లకి అసలు ముక్కు మొహం తెలియదు! ఐతేనేమి? పిర్కులీ! వాళ్లు మనదారికడ్డంగా నిలుచున్నారు. మన తడాఖా చూపిస్తాం, తొందరపడకండి! సుహో మీకి మంచిదినాలు రానున్నాయి. నా మాట గుర్తుంచుకోండి! నే చెపుతూన్నానుగా! పిర్కులీ!......"

ఎలియాస్ తరుచు యిదే ధోరణిలో మాట్లాడుతూంటాడు. అల్లాంటప్పుడు పక్కో * ఒరలోంచి దూసి, ఝళిపించుతూండేవాడు. సీమచింతగింజల్లా మెరిసే చిరుకళ్ళతో భీకరంగాచూస్తూ, తెల్లటిపళ్లు యికిలిస్తూ, హిట్లరు మీసం కదిలేటట్లు పెదవులు కదిలిస్తూ యెంతో హడావుడి చేసేవాడు.

ఇతర సందర్భాల్లో యెల్లా ప్రవర్తించినా ఎలియాస్ నన్నెప్పుడూ చిరునవ్వుతోనే పలకరించేవాడు. నా పట్ల యెంతో ఆసక్తి చూపేవాడెందుకనోగాని. ప్రతీపుదయం కీ్రమరీ తాలూకు పాలట్రక్కు మా కామందుల గోశాలకి వచ్చేది, పాలుతీసుకుపోడానికని. అదియింకా దూరంగావుండగానే ఎలియాస్ లేచినిల్చుని, టోపీతీసి చిరునవ్వుతూ నన్ను

* ఫిన్నిష్ దేశీయులంతా ధరించే చిన్నబాకు.

సంభావించేవాడు. ట్రక్కు ఆగగానే గభాలున పురికి, మొట్ట మొదట నా దగ్గరకే వచ్చేవాడు.

ఎలియాస్‌కి నేనంటే అంతయిష్టం యెందుకనో నేను చెప్పలేను. ఆవులపాలు నేను అండాల్లో పోస్తూంటే అతను నాచుట్టూనే తిరుగుతూ తెగవాగేవాడు. నా వీపుతట్టుతూ, దండ నొక్కిచూస్తూ, నా కళ్ళలోకి తలెత్తిచూస్తూ అనే వాడు.

'మన సువోమీ యెల్లాంటి పుత్రుల్ని కన్నదో! తస్సాదియ్యా! మనకుర్రాళ్ళకి సాటి యెవళ్ళంటా? ఐనారీ! నువ్వు అదృష్టవంతుడివిరా! నీవి పిడికిళ్ళుగావురా, పిడుగులు కాని! పిర్కొలీ! నీలాంటివాళ్ళని కన్నదేశం బోల్షివిక్కులకి ఋడవ నక్కర్లేదురా. నువ్వు పొలం దున్నాల్సినవాడివిగాదోయ్! దాని సిగదరగా......నీలాటివాళ్ళు పట్టాల్సింది తుపాకిగాని మేడికోలగాదు! మా దళంలో యెందుకు చేరకూడదంటా? పిర్కొలీ! ఏమంటావు? నువ్వూ యిప్పుడు కాస్తవున్నవాడివే గదూ? ఏం, నీకూ స్వంతయిల్లూ, వాకిలీ వుంది! దాన్ని బోల్షివిక్కులనుంచి రక్షించుకోవద్దూ? నన్ను చూడు. రక్షించుకోవలసింది నాకేమీలేదుగదా! నా తండ్రి క్రీమరీలో యేదో పనిచేసుకుని పొట్టపోసుకోవాల్సినవాణ్ణేనామె, యిప్పటికీ. ఐనాసరే, యుద్ధం వచ్చిందీఅంటే ముందుగా పటాలంలోచేరేవాణ్ణి నేనే! ఎంచేత? అది మంచిపనిగనక. ఎవరి కర్తవ్యం వాళ్ళు నిర్వహించాల్సిందే. దేశమాతపిలుపు!

మరి ! నువ్వొరగనిదేముందిలే ! పైగా నీకు స్వంతఆస్తికూడా వుందామె. ఇల్లాక్కటే అనుకో, కాని, పిర్కీలీ......'

అతడు యిల్లాఅన్నప్పుడల్లా అది నా స్వంతయిల్లుకాదని జ్ఞాపకంచెయ్యా లనుకుంటూంటాను. కాని మళ్ళీ అదెవరిదైతేనేం, ఆ ఆరా అంతా అతని కెందుకు ? అని వూరుకుంటాను. ఎలియాస్ యేమాటాడినా హృదయంలోనుంచే అంటాడు. అల్లాంటపుడు యిల్లాటి చిల్లరవిషయాలతో అతడి మాటకి అడ్డురావడం అంతమంచిదికాదుగదా ?

ఆతడు ఊరికే తెగమాట్లాడేస్తూంటే నేనేమీ మాటాడకండానే వింటూ, నాపని నేను చేసుకుంటూండేవాణ్ణి. పాల అండాలు ట్రక్కులో పెట్టడానికి చెయ్యిసాయంచేస్తూంటే, ఎలియాస్ గుక్క తిరక్కండా వాగుతూనేవుండేవాడు. అండాలు యెక్కించేసేక డ్రైవరు యెన్నోసార్లు తొందర చేసింతర్వాత నన్ను వదల్లేక వదలి వెళ్ళి ట్రక్కులోకూర్చునే వాడు, ఎలియాస్.

ఏమైతేనేం,, నేను పాల అండాలు ట్రక్కులో పెట్టే లోగానే ఎలియాస్ బోలెడంత పురాణం విడగొట్టేసేవాడు. అతగాడు మాట్లాడేవాడనడంకంటె వాగేవాడనడమే సమంజసంగా వుంటుంది. అసలతని తరహాయేఅంత !

'ఆ వెధవలికి మన దెబ్బరుచి చూపిస్తాం, ఏం ఐనారీ ? నువ్వూ, నేనూను. మనసత్తా లోకానికి తెలిసొస్తుంది. పిర్కీలీ !......ప్రారంభం కానీయవోయ్, ఒక్కసారి.

5

కొంచెం ఓపికపట్టు. నాకు దాన్నిగురించే కలలుకూడా వస్తూన్నాయి. ఎంత త్వరగా ప్రారంభిస్తే అంత మంచిదనుకో! ఒకసారిమనం రంగంలో అడుగుపెట్టేమా యిక అప్పుడు తెలుస్తుంది, రిస్సా* పస! కోడిపిల్లల్లా వాళ్ళపీకలు యీ చేతులతో నులిపి పారెయ్యకపోతే మూరుపేరుప పిలు నన్ను! పిర్కాలీ!'

ఓప్రక్క వాగుతూనేవుండేవాడు, మరోప్రక్క జారలు జాచి వ్రేళ్ళతో పంజాపట్టి అభినయిస్తూండేవాడు. వాడి పంజాలు యేమంత భీతావహమైనవి గావనుకోండి. ఎంచేతంటే ఎలియాస్ అంత యేపైన మనిషి కాడు, ఆట్టేపొడగరీ కాడు, చెప్పుకోదగ్గ దార్ఢ్యంగలవాడూ కాడు. ఐతేనేం? కుస్తీపట్టేవాళ్ళతోనూ, బాక్సర్లతోనూ, స్పోర్ట్సు క్లబ్బుల్లో భుజాలుభుజాలూ రాసుకుంటూ తిరగడంలోమాత్రం వాడి తరువాతే యెవరైనా.

అతగాడీ ఉపన్యాసాన్ని గొంతుచించుకుని అరుస్తూ, కళ్ళు చికిలించి, పళ్ళుయికిలించి అట్టహాసంచేస్తూంటే చుట్టూవున్న వాళ్ళు దంగైపోవాల్సిందేననుకోండి. గోశాలబైట పాల డబ్బీలదగ్గర నిలుచున్న కెర్తూ, ఎల్సాలుకూడా రోజూ యీ నాటకమంతా చూస్తూన్నవాళ్లైనా నిశ్చేష్టులై నిల్చునిపోతారల్లాంటపుడు. తన వీరత్వప్రదర్శనం ఆడవాళ్ళల్లో కలుగజేసిన ప్రభావాన్ని వాడుగుర్తించేడో లేదో నాకు తెలియదు

* 'రష్యా' అనేదానికే నిందా నిరసనలతో గర్భితమైన వ్యంగ్యపదం.

గాని వాడుమాత్రం ఆలాటి ఘట్టాల్లో వాళ్ళదగ్గిరికి వికారంగా నడుస్తూవచ్చి, భయంకరంగా చేతులువిసురుతూ, గొంతుపాడిబారి బొంగురుపోయేలా అరిచేవాడు. బోదురు కప్ప గొంతులోంచి వచ్చే గాండ్రింపులాదిరిగా వుండేవాతని మాట లాసమయంలో:

'మనం సుఖంగా బ్రతకాలీఅంటే, పిర్కోలీ! రిస్సావాళ్ళ జాతాన్నంతనీ కుండలోబెట్టి మూతబెట్టాల్సిందే. వాళ్ళమంద మనల్ని చుట్టుముట్టి ఉత్తర దక్షిణాలనుంచీ, తూర్పునుంచీ ఆక్రమించుకువస్తూన్నారు. మనకెంతో ఉక్కిరిబిక్కిరై పోతూందంటే! నీకు తెలియదూ? ఏం?'

తెలుసునని జవాబియ్యాక యేం చెయ్యమన్నారంటా? లోకమంతా కోడై కూస్తూంటే యీసంగతి యెవరికి తెలియదు? ఈలోకంలోని చెడుగంతా రిస్సావాళ్ళ మూలాన్నే కలుగుతూందని ఆఖరికి బడిపిల్లలికికూడా తెలుసునుగదా!

శ్వాస్త గాలిపోసుకుని ఎలియాస్ తనవాగ్ధోరణ నింకా సాగించేవాడు:

'అద్దుగదీ సంగతి! తెలిసిందిగాదూ? చంటిపిల్లలకికూడా తెలుసునీవిషయం. నేననేది,- 'చాలు! చాలు!' ననే. పిర్కోలీ! ఈ అన్యాయాన్నింక సహించకూడదు. ఆఖరు చేయాల్సిందే. మన రెండుజాతులూ యిరుగుపొరుగున జీవించడం పొసగదు! ఈలోకంలో మన రెండుజాతులకీ స్థానంలేదు. సువోమీగానీ, సోవియట్ రిస్సాగానీ; యేదో ఒకదానికే యీప్రపంచంలో తావుంది! పిర్కోలీ

ఇద్దరం పాలఅండీల దగ్గిరికిపోయేదాకా వాడు యిదేవరసని వాగుతూండేవాడు. వాడి అరుపులకేంవచ్చెగాని, ఆడవాళ్ళు వాడివైపు సగౌరవంగా చూడ్డమే నాకు మరింత చిర్రెత్తిం చేది. అల్లాంటప్పుడు వాడు వాళ్ళవైపు కన్నుగిలుకుతూ, పళ్ళికి లించేవాడు. శత్రువులకి తానెంత భీకరుడో, మిత్రులకంతగా విహితుడనని చెప్పడానికే వాడల్లా చేసేవాడనుకుంటా. మిత్రు లంటే ప్రాణంయిస్తాడనుకోండి! ఎలియాస్ అంతదయ గలవాడూ, ఉపకారీకూడాను.

పాలఅండీలు ట్రక్కులో పెట్టడంలో నేనాతనికి సాయం చేసేవాణ్ణి. అన్నీ యెక్కించేక వాడూ, ట్రక్కులోనికెక్కి, నాచేయిపట్టుకుని నలుపుతూ కళ్ళల్లోకి సూటిగాచూసేవాడు. 'ఫర్వాలేదులేరా, ఐనారీ! నువ్వేం బెదరబోకు. రిస్నా వాళ్ళకి మనచేవ చూపేసమయం యింకా ముందుందిలే!' అన్నట్లుండేవి ఆసమయంలో వాడిచూపులు.

క్రీమరీలోపాలు వప్పగింతపెట్టాలిగనుక కెర్స్తాగాని, ఎల్సా గాని ఒకర్తె ట్రక్కుతోబోవాల్సివుండేది. పాలలోంచిమీగడ తీసేక ఆ పాలఅండీలని మళ్లావెనక్కి తేవాలికదూమరి?

వాడితోకూడా ట్రక్కులో మా ఎల్సా వెళ్ళకూడదని పించేది నాకెప్పుడూ. ఎలియాస్ నల్లటి మీసకట్టూ, తెల్లటి పలువరుసా వైపు ఎల్సా క్రేగంట చూపులు విసురుతూండే దని నాకేం దుగ్ధలేదుగాని, యేమిటో, ఏకారణమైతేనేమి లెండి, నాకుమాత్రం కెర్స్తాయే పాలట్రక్కులో యెప్పుడూ

పోతూండాలనిపించేది. కెర్త్రా యింకా కన్నెపిల్ల; యెప్పుడూ కన్నూబుస్సూ మంటూంటుంది. అది ఎలియాస్‌తో పాల ట్రిక్కులో పోవడం, ఎల్నా పశులకొట్టంలోకి పోవడం బాగుంటుం దనిపించేది, నాకు, చెప్పొద్దూ.

నాకు పెళ్ళాంమీద అనుమానం అనుకోనేరు గనక! మీా పుణ్యమాయని అదేం లేదు నాకు. వెనకటిరోజుల్లో ఎల్నా ఎలియాస్‌ని పెళ్ళాడాలనుకునేదనీ, చివరకి యెంతో ఆలోచించిన మీాదటే ఆమె నన్ను వరించి, వివాహంచేసుకుందనీ అందరికీ తెలుసు. నన్ను వివాహం చేసుకొన్నందుకు ఎల్నా ఆ తర్వాతి కాలంలో యెప్పుడేనా విచారించీ వుండచ్చు; అదీనేను ఘట్టిగా చెప్పలేను. ఆమె తరచుగా నాదగ్గరే ఎలియాస్‌ని పొగిడేదికూడాను. అందుకని నా కామెమీాద కోపమూ లేదు; అనుమానం అంతకంటే లేదు. ఒక్కసారి ఎల్నా మనసు నావైపు మొగ్గుచూపి, నిశ్చయించుకుందీ అంటే యిక దానికి తిరుగు లేనేలేదు. ఇక ఎలియాస్ ఆమెను పెండ్లాడ దలచేడా? అనే విషయమూ,- అది వేరేప్రశ్న. ఈ ప్రశ్న ఆమెనే అడిగినా యిదమిత్థమని యేమీా చెప్పనే లేదు! ఐనా అటువంటి ప్రశ్నలామెను అడగా లనేనా యెప్పుడూ అనుకోలేదు, నేను!

ట్రక్కు బైలుదేరేటప్పుడు ఎలియాస్ నావైపు చూస్తూ, పళ్ళికిలించి చేతి నూపేవాడు. నేనూ చేతనైనంతవరకూ ప్రియత్నించి, సద్భావ సూచకంగా తల వూపేవాణ్ణి. వాడి

సరసనే కూర్చున్నది ఎల్సా గాక కెర్స్టాయే ఐతే నా వైఖ
రిలో అభిమానం స్పష్టంగానే కనిపించేది.

ఏదెల్లావున్నా ఎలియాస్ స్వభావం అంత చెడ్డదని చెప్ప
లేము లెండి. అతడి మనసులో దాపరికం అనేదే లేదు. రష్యాక్ర
లంటే అతడంత ద్వేషించే వాడం టేనూ, వాళ్ళమీద దూక
డానికి ఉబలాటపడేవాడం టేనూ ఆశ్చర్యమేముంది? అందులో
తప్పు ఏమిటో నాకు తెలియదు. మా దేశమాత యిటు
వంటి పుత్రుల్నే వాంఛిస్తూందని నా విశ్వాసం. అవసరమైతే
తలనైనా కోసి అక్కడ పెట్టగల సాహసులు గాకపోతే
దేశాన్ని మరెవరు రక్షిస్తారంటూ? ఇంక ఆ రష్యన్లా?
వాళ్ళెంతకైనా తగినవాళ్లు! పేపర్లలోనూ, పుస్తకాల్లోనూ
వాళ్ళనిగూర్చి చదవడమేగాదు, వాళ్ళని గురించి యెంతో
విన్నాంకూడాను, తెలిసినవాళ్ళు చెపుతూంటే. ఇంకా తెలి
యకపోవాలీ, వాళ్ళేజాతి పశువులో?

పోతూన్న ట్రక్కువైపు తల పంకిస్తూ, ఎల్సాతో
అనేవాణ్ణి:

'అదేపోయింది గాని భోజనం సంగతి చూడు.''

ఆమె జవాబిచ్చేది :

'ఒక్కనిముషం. ఆవులికి కాస్త గడ్డి వేసిరానీ.'

ఆవులకీ, దూడలకీ గడ్డివెయ్యడంలో ఎల్సాకి సాయం
చేసేవాణ్ణి. ఆ పని పూర్తిచేసుకుని యిద్దరం యింటికిబైలు
దేరేవాళ్ళం. కుర్కిమాకీల శమతానికీ మాయింటికీ ఒక్క

కొండే అడ్డు. అదేకనక అడ్డులేకపోతే మాయిల్లు కనిపిస్తూనే వుండును. పెనురాతిబండలతోనిండిన ఆ కొండప్రక్కనుంచి చుట్టుతిరిగి, సెలయేటిదరికి చేరుకునేవాళ్ళం. సెలయేరుకొండని చుట్టి, లోయకిదిగువగా, మాకొండకీ కుర్కిమాకీ కమతానికీ మధ్యలో జలపాతంగా పడుతుంది. అక్కడే, జలపాతాని కెగువగా ఓ వెడల్పైనచెక్కను యేటిమీదవంతెనగా వేసేరు. చెక్కవంతెనమీదనుంచే మాయింటికి బోవాలి. వంతెన దిగువనే జలపాతం నురుగులుగ్రక్కుతూ పడి పెద్దమడుగు యేర్పడుతూంది. మడుగుప్రక్కనే పడిపోయి మా కొండను పడమటివైపునుంచి యెక్కితే స రా స రి గా మాయిల్లు వస్తుంది. అదంతా మాకు కొట్టిన పిండనుకోండి.

---

## నాలుగో ప్రకరణం - మా యింటిపట్టు

మాయిల్లు......నా కంతా కళ్ళకి కట్టినట్లుంది, యిప్పటికీ, వేసవికాలం, - ఆ నా డాదివారం, - ఆరోజున మాకొత్త యింటికి చేయాల్సిన మిగతా అలంకారమంతా పూర్తిచేసి, సామానంతా లోనికి జేరవేసినప్పుడు యెంతనిండుగా, సందడిగా, సంతోషంగావుందో మే మెప్పటికీ మరిచిపోలేము.

నేనూ, యిల్లాలూ సామానుసర్దుతూన్నాము. పిల్లలిద్దరూ కేరింతాలుకొడుతూ, కొండగోడదగ్గర గడ్డిలో గంతులేస్తు

న్నారు, హెన్రా కుర్కిమాకీ యీ శాద్వలస్థలేశాన్నే 'కూరలపెరడు' అని పేర్కొనేది !

కాని, అప్పటి కాచోటు యింకా 'కూరలపెరడు' గా లేనేలేదు. పారను దించుతే సగందిగేసరికే 'ఖంగ్' మని రాయితగిలేది. క్రిందంతా నల్లరాయే. ఆ కాస్తస్థలాన్నీ కూరలపెరడుగా చేయడానికని నేనే ముప్ఫైయెనిమిది బళ్ళ మట్టీ, వొండ్రూ తెచ్చిపోసేను. ఆ తర్వాతనే యీ చిన్న మళ్ళు నాలుగూ కాస్త పచ్చబడినాయి.

కూరపాదుల్లో పోసినమట్టికీ, వొండ్రుకీకూడా కుర్కిమాకీ పద్దులపుస్తకంలో నాపేర ఖర్చుపద్దు పడింది. కొండమీదికి మట్టి మోయడానికుపయోగించిన బండీ, గుర్రం బాడుగ క్రింద మరోకొంతమొత్తంకూడా నా కాతాన ఖర్చుపడింది. పోనీ పడనీ. నేను దాన్నిగురించి అంతగా అనుకోనులే. కామందుల్ని ప్రతి చిన్నచిన్నవిషయానికీ పీడించి వేధించుకు తినడం యేమంతబాగుటుందో మీరే చెప్పండి ?

అదేపోయినడబ్బుగాని, ఆ మరుసటి వేసవిలోనే మా యింటికి కావాల్సిన కూరగాయలన్నిటినీ ఆ నాలుగుమళ్ళ లోనూ పండించగలిగేను. ఆ కూరలు మా యింటిల్లిపాదికీ క్రిస్మసుపండుగదాకా సరిపడ్డాయి. గట్లమీద పూల మొక్కలుకూడా పాతేను. మా చిట్టితల్లి 'మార్తా' వుండే, అదే పూలమొక్కల్నిచూసేది. అదే యెక్కణ్ణుంచో పొద్దు తిరుగుడు మొక్కలు తెచ్చి నాటింది. కాని యెండే కరువైన

చోట అవి యేపుగా పెరుగుతాయా? ఉదయం, సాయంత్రం కొంచెంసేపుమాత్రమే వాటికి యెండ తగిలేది. అదైనా సుదీర్ఘమైన వేసవిదినాల్లోమాత్రమే. నిటారుగా ప్రక్కనే లేచిన కొండగోడే మధ్యాహ్నంవిడత మా యింటిచాయలకి యెండ తగలనిచ్చేదేకాదు.

మా పిల్లడి సరదాలేవేరు. వాడు పూలమొక్కలుపాతడు. మా యింటిపట్టుకే సరిగా యెండే తగులదని చెప్పేనుగా. వాడికి యెండంటే చాలాయిష్టం. కొండగోడమీదనుంచి వ్రేలాడేగడ్డీ, దుబ్బులవ్రేళ్ళూ, చెట్లకొమ్మలూ సాపేక్షగా చూస్తూ, అందని యెండపొడకోసం అర్రులు సాచేవాడు. కొండకొననున్న భూర్జవృక్షాన్నిచూస్తూ నిల్చుని, మెల్లిగా పైకెక్క ప్రయత్నించేవాడు. నెఱియల్లోకాలూని, పట్టుదొరికిన రాళ్ళుపట్టుకొని పైకెక్కడానిక ప్రయత్నించేవాడు. కాని తరుచుగా పట్టుజారి క్రింది కూరపాదులలోకి దొర్లి పడిపోయావాడు. ఆ రోజుకారోజు ఉసులు చిక్కించుకుని మరి కొంచెంపైకెక్కేవాడు. చివరకి మా 'లావురీ' కొండకొనమీది కెక్కితీరుతాడని నేను గట్టిగాచెప్పగలను.

తల్లి వాణ్ణిచూస్తూ, సంతోషంతో పుప్పొంగిపోయాడు. నాభార్యవుందే, - ఆమె పొట్టిగా, బొద్దుగావుంటుంది; మంచి దార్ఢ్యంగలదే. ఎంతెంత బరువులైనా ఆమె గుండ్రని భుజాలమీదపెట్టుకుని మోసేస్తుంది. కుర్కిమాకీల గోశాల

లోని పాడియావులన్నిటినీ ఆమె ఒక్క చేతిమీదుగా పాలు పితికినరోజులున్నాయి. ఆయనకి పధ్నాలుగు ఆవులుండీవి. ఇన్నివున్నాయని ఆమె సణిగినదెప్పుడూ లేదు. ఆమె ముఖం యెప్పుడూ నవ్వుతూనేవుంటుంది. ఎంతశ్రమచేస్తూన్నా నిత్యం ఉల్లాసంగానే కనిపిస్తుంది. పరాయి పంచన తలదాచుకునే రోజులలోనే నిత్యోల్లాసినియైన నా యెల్సాకి యిప్పుడు స్వంతయిల్లంటూ యేర్పడిందీ అంటే యెల్లా వుంటుందో ఆలోచించండి. అసలు ఆడవాళ్ళ స్వభావమే అంత. వాళ్ళకి యేదోఒకటి, తలదాచుకొనే స్వంతయిల్లు, ఒకరి ప్రేక్ష్యం లేకుండా స్వేచ్ఛగావుండేది వుండాలని మహా ఉబలాటం. వాళ్ళల్లా పుట్టేరు, మరి.

మాకొండ ఉత్తరపువాలు మరీవాటంగానూ, బోడిగానూ వుండీది. ఎల్సాకి దానినల్లే బోడిగావుండనీయడంయిష్టంలేదు. మేము అక్కడికి కాపురం వెళ్ళిన నాటనుంచీ ఆమె అటే తిరుగాడుతూ అక్కడక్కడ పెరిగిన నాచుగడ్డిమీద గడ్డ పారతో పొడిచి చూస్తూండీది.

ఆమె ప్రియత్నాలు వృధాగాలేదు. గడ్డిక్రింద రెండు చోట్ల పొడుగునా, లోతైన పగుళ్ళున్నట్లామె కనిపెట్టింది. ఆ రెండుచోట్లా గునపంతో లోతుగా త్రవ్వి, కొండక్రింది నుంచి మన్ను తట్టలతో మోసితెచ్చి పోసింది. ఓ నెటియలో నాలుగు క్యూరాంట్ (వాకపాద) లూ, మరోదాంట్లో రెండు రాస్ప్ బెర్రీ మొక్కలూ నాటి, నీళ్లు పోసింది.

వాటికోసం ఆమెపడే తాపత్రియంచూసి నే నప్పుడు నవ్వినమాట నిజమే. అదంతా వృథాశ్రమ అనికూడా అన్నానే అనుకోండి. ఆ తర్వాత రెండేళ్ళలో అవి యెదిగి, పూచి, కాయ నారంభించేయి. అందులోనూ రాస్ప్ బెర్రీ చెట్లు మరీ దిగబోసినట్లు కాచినాయి.

అప్పుడింక నన్నుచూసి నవ్వడానికి ఆమెవంతు వచ్చింది.

"ఏం? ఇప్పుడేమంటావు? అదంతా వృథాశ్రమే కదూ? కానా? ఇప్పుడీ పళ్ళుకూడా వృథాయేనా?"

ఓ గిన్నెడు రాస్ప్ బెర్రీ పళ్ళను నాముందు పెట్టి, గుప్పెడేసి తీయడం, నానోట్లో కుక్కడం, పనిమాలా పెదవులమీదా, బుగ్గలమీదా చిదిపి, రసం అంతటా పులమడం ప్రారంభించేది! కోంటెపిల్ల!

ఆ మట్టున ఆమెని పొదివిపట్టుకుని, మూటలా యెత్తి, యింటికప్పుకంటా యెగరేసి పట్టుకునేవాణ్ణి. ఆమె వెచ్చటి పెదవులమీదా, గులాబీబుగ్గలమీదా, చిన్నముక్కుమీదా, నీలికళ్ళమీదా రసంచిందినమూలితోనే ఉక్కిరిబిక్కిరయేలా ముద్దులు కురిపించేవాణ్ణి. కళ్ళమీద ముద్దెట్టుకుంటూంటే ఆమె గమ్మున కళ్ళుమూసుకుని, తలవెనక్కి విరగదీసుకుని, కిలకిలా నవ్వుతూంటే చూడ్డానికి రెండుకళ్ళుచాలవనిపించే దనుకోండి!

నాభార్యా మంచిదిట్టమైన ఘటమేలెండి. మనిషిఅంతగా కనిపించదుగాని బాగాబరువుగానేవుంటుంది. ఐతే నాకు అదో లెక్కా? నేను ఊనాపివాణ్ణేం గాదుగా! మేమిద్దరం ఒకరి

ప్రక్క ఒకరం నిలుచుంటే ఎల్సా జుట్టు నా భుజాలక్రింది కేనా రాదు, మరి.

ఆ దినాల్లో ఆమెని యింటికప్పుకంటా యెగరేయడమంటే అవలీలగావుండేది, నాకు. నా భార్యానీ, పిల్లల్నీకూడా మూపున యెత్తుకుని, పొలాల్లోనూ, అడవుల్లోనూ, యెక్క డికి మోసుకెళ్ళమన్నా శిగవూవు వాడకండా పోగలను; మీరు దించమన్న చోట, పచ్చికమీదదించి, వాళ్ళందరితోటీ 'నన్ను ముట్టుకోకోయ్ నానూల కాకీ' ఆడగలను. అప్పుడు నాకు ముప్పైఆరు వెళ్ళినాయి. ఆ వయసుకి సాధారణంగా ఎవరికైనా, ఒళ్ళు గట్టిపడి, బిగిసిపోతుంది. అందుచేతనే ఆ శీతకాలంలో వాళ్లు నన్ను పటాలంలోకి తీసుకోలేదు.

---

## ఐదో ప్రకరణం – మా తమ్ముడు విల్హో

ఆశీతగట్టున నన్ను సైన్యంలోకి తీసుకోకపోడానికి కారణం తన ప్రయత్నమేనని హెర్రా కుర్కిమాకీ నాకు నమ్మకంగా చెప్పేరు. ఎంతపడితే అంతఒట్టు! ఆయన యింకెన్నో వివ రాలుకూడా యిచ్చేరు. హెల్సింకీలో మంచిఉద్యోగపదవిలో నున్న తనకుమారుడు విహ్టోరీ ద్వారానే నాకా వుపకారం చేయగలిగేనని మా కామందు అన్నారుకూడాను. సరే, ఘంచ్ఛిదే. నేనా తండ్రికొడుకులకి కృతజ్ఞుణ్ణిగానే వుంటానను

క్కోండి. ఈ పాడుయుద్ధాలవల్ల యెల్లాంటిమంచీ కలుగుతుందనే నమ్మకం నా కెప్పుడూ లేదు.

మా కామందు పూర్తిపేరు హ్యూగో కుర్కీమాకీ. ఆయన దగ్గరే నాతో బాటు పావో పికుర్కానెన్ కూడా పనిచేస్తూంటాడు. అప్పటికి వాడికి నలభై రెండు దాటినాయనుకోండి. పలుకుబడివుంటే వయస్సుతో నిమిత్తం ఏముందిలెండి. పావో వయస్సు పాతిక్కి మించకపోయివున్నా వాణ్ణి పటాలంలోకి తీసుకోకండా భూస్వామి చేయగలిగేవుండేవాడు. ఎందుకంటే వాడు మంచిపనివాడు. పావో చేయలేనిపని లేనేలేదు! పొలం దున్నడం, అడివినరకడం, కమ్మరం, కంచరం, వడ్రంగం, జీనులుకుట్టడం, జోళ్లుకుట్టడం, తోటమాలిపనీ,– అవీయిదీ యేమిటి, చెప్పన్నపనులూ వీడే చేస్తాడు.

కాని, మాతమ్ముడు విల్హోను పటాలంలోకి పిలిచేరు. కల్లీ పోన్ జన్ పా క్రీమరీలో పనిచేసేవాళ్ళందరిలోకీ వీణ్ణొకణ్ణే పటాలంలోకి తీసుకుపోయేరు. కారణం స్పష్టమే. యజమానికి విల్హో అంటే తలనొప్పి. ఆయనకే అన్నమాటేమిటిలెండి. వాడు యెవరెవరిదగ్గర పనిచేసేడో వాళ్ళందరికీ విల్హోనిచూస్తే తలనొప్పే! వాడెప్పుడూ దేనికో ఒకదానికి తగాదా పెడుతూనే వుంటాడు. ఏ యితర పనివాడూ కోరనివన్నీ కోరడం, వాటికోసం తగువెట్టడం వాడికి మామూలే. వాణ్ణిచూస్తే యితరులుకూడా పాడవుతారని చెప్పి యే యజమానైనా వొదుల్చుకో చూస్తాడు.

ఈవిషయమై వాడితో యెన్నిసార్లో వాదంపడుతూండేది నాకు. వాడికి జ్ఞానం కలిగిద్దామని నాకు చేతనైనన్ని విధాలుగా ప్రయత్నించేను. ఇల్లావుంటే బతుకు బండలై పోతుందిరా! అనికూడా చివరకెన్నోసార్లు సూటిగాచెప్పేనుకూడాను. నామాటలన్నీ చెవిటివాడిముందు శంఖూదినట్లే ఐనాయి.

నాకు జవాబుగా మావాడు కేవలం చిరునవ్వి వూరుకొనేవాడు. నేనేం అంత తెలివితక్కువవాణ్ణి కాదుగా. అప్పుడే అనుకున్నా వాడేదో చమత్కారంగా జవాబివ్వాలనుకుంటున్నాడని! వాడి నీలికళ్ళలోని కొంటెచూపు చూసేసరికే పొట్టి పట్టేవాణ్ణి. కాని, వాడు పైకి యేమీ అనేవాడే కాదు. అస్పష్టమైన చిరునవ్వుతో వాడి ముఖం కొంచెం విస్ఫారితమయేది. అంతే.

ఫిన్నుల్ని గూర్చిన మరోచమత్కారగాథ యేదో వాడి పిచ్చి బుర్రలో తిరుగుతూండి వుంటుంది. వాడికి యెబ్బెట్టుకంగా తోచిన యే ఆచారాన్నో, అలవాటునో యెత్తుకుని, దాన్ని పరిహసిస్తూ తూర్పారపట్టడం వాడికి కొట్టినపిండి. కాని యీ దఫామాత్రం వాడు పెదవి మెదల్చకుండా గమ్మున వుండి పోయేడు. వాణ్ణి మాయింటికి భోజనానికిపిలిచేనులెండి. అంచేత గృహస్థుకి కష్టం కలుగ జేయకూడదనుకొని వుంటాడనుకొన్నాను.

నేనే వాడితో అన్నాను.

"చచ్చి స్వర్గానవున్న నాన్న మాటల్నైనా గౌరవించవు? నాన్న యేమనేవాడో గుర్తుందా? భూదేవిని వదలి పోకండి, నాయనా!"

విస్సో జవాబిచ్చేడు.

"ఒకసారి కట్టుబడి వుంటేగదూ, వదలిపోడం అనేసమస్య వచ్చేది? ఈ విషయంలో పాపం, నాన్నమాత్రం ఏమంత ఆదర్శపాత్రుడుగావున్నాడులే! బ్రతికినన్నాళ్ళూ నాన్న వెన్ను విరిగేలా చాకిరీ చేసేడేగాని చివరకి ఆఖరిదినాల్లోనైనా చేరెడు నేల—, పాదుపెట్టుకొనే పాటిదైనా, స్వంతం అంటూ సంపాదించ గలిగేడా?"

నేను వాణ్ణి యీసారి పడగొట్టే ననుకున్నా.

"నాన్న సంపాదించలేదుగనకనే యిప్పుడు మనమైనా సంపాదించి అతని ఆత్మకి శాంతిని చేకూర్చాలిరా."

వాడు మళ్ళీ చిరునవ్వేశాడు.

"నువ్వు అప్పుడే వ్రేళ్ళుపారే ననుకుంటున్నావు! కదూ? కాని ఆవ్రేళ్ళెంతలోతు వెళ్ళేయో కాస్త చెపుదూ, వింటాను."

ఇల్లా అంటూ వాడు మా యిల్లున్న కొండరాతిమీద మడమ గుచ్చుతూ, వ్రేళ్ళెంత లోతు దిగినవో పరిశీలిస్తూ న్నట్లు అభినయించేడు.

దీనికేం జవాబివ్వాలో నాకు తెలుసు. కాని యిల్లాటి ఆకతాయి పెద్దమ్మకి జవాబెందుకో చెప్పండి? ఇంతకూ సిరి సంపదలు యెవడికేనా ఆకాశం మీదినుంచి ఒక్కసారి

ఊడిపడతాయిటండీ? అందులోనూ స్థిరాస్తే? భూమంటే మాటలనుకున్నారా? చుట్టూ కనుబారినంత మేర చూసినా ప్రతీ అంగుళము నేలా ఎవరో ఒకరి సొత్తేనాయె! ఎవడి ఆస్తిని ఎవడు సుఖసుఖాల వదలి పెడతాడో చెప్పండి? నా కెవరేనా కొంతభూమిని దానపట్టా రాసి యివ్వాలనేమో విళ్ళో అభిప్రాయము! భూమినంతసీ మనకిందే వుంచుకుని, యితరులచేత కూడా మన కింద పనిచేయించుకోడం లాభకరమని అందరికీ తెలుసునాయె! పొలంపనిచేసే కూలీకి తిండిపెట్టి, దినానికి పదిమార్కులు కూలియివ్వడం యేమంత కష్టంగాదు. హెచ్చ్వాగాదు. ఆ పదిమార్కులేనా రొఖ్కం యివ్వనే అక్కర్లేదు. కూలీమాత్రం మార్కులు నూరుకు త్రాగడుగదా? వాటితో యేవో కావాల్సిన సరుకులు కొనుక్కోవాలి. అవి యజమానే యిచ్చి, వాటిఖరీదును పద్దులో రాస్తాడు. ఈలాటి లావాదేవీల్లో యజమానికి కాస్తోకూస్తో లాభం వుండేతీరుతుంది. తన లాభనష్టాలు తెలియని కామందుల్ని నేనెక్కడా చూడలేదు. ఆమాటకొస్తే కూలీకీ తెలుస్తుందికాని సాగుబడికావద్దూ? ఈపరిస్థితుల్లో యే భూస్వామి నుంచైనా చేరెడు భూమి సంపాదించాలంటే ఒకటి రెండేళ్ళలో యెల్లా సాధ్యమౌతుందనుకున్నాడో? ఆ రెండేళ్ళూ మరొకరిపొలంలో కూలికి పోవడమంటే రెక్కలు ముక్కలు చేసుకోవడమేనని యెవరికి తెలియదు? కాని, యిల్లాటి విషయాల్ని గూర్చి మా తెలివితక్కువ విళ్ళోదగ్గర చర్చించి

ప్రయోజనమేమిటి? వాడికి లోకమంటే ఏం తెలుసునంటా? ఐతేనేం, వాణ్ణి వదల్చుకోడానికి యేదో ఒక జవాబివ్వాలికదా?

'ఏదో ఒకటి, యిల్లంటూ యేర్పడిందిగదరా?'

జవాబిచ్చేనేకాని వాడికళ్ళల్లో కొంటెచూపు చూసేసరికి 'యెరక్కపోయి అన్నానే!' అని అదటు పుట్టనేపుట్టింది, నా మనస్సులో. లోపల్నుంచి కులాసా ఉబికివస్తూంటే వాడి ముఖం చిరునవ్వుతో, కొంటెతనంతో విప్పారింది.

'ఇల్లు! ఏం యిల్లురా! ... ... ఓహోహో! ఇదా! ... ఔను! ఈ యిల్లేకదూ? సంసారులకేదో యిల్లు మరి? అన్నయ్యా! యిల్లుకాదురా; పెద్దభవంతే అవరా!'

ఇల్లాఅంటూ, యింట్లోనే మునివ్రేళ్ళమీద నడుస్తూ, యేదో దిగ్భ్రమకలిగించే దృశ్యాన్ని చూస్తున్నట్లు మొగం గాలిలోనే పైకెత్తిచూడనారంభించేడు. ఈలోగా వాడి టోపీ రెండుమూడుసార్లు జారి, వాడి బంగరుతలకట్టు బైటపడింది. వాడిలో కుర్రతనపు లక్షణాలు యింకా పోనేలేదు. పైగా ఆ కుర్రతనమంతా అనువుగానిచోట్ల బైటపడి, యిబ్బంది కలుగచేస్తూంటుందికూడాను. అంతటితో పోనిస్తే బాగానే వుండును.

'ఓహో! ఏమియిల్లండీ! దానికేంగాని, దీనికిగాను యిప్పటికెంత చెల్లించివుంటావురా, నువ్వు?'

తెలుసునండీ, వాడికి యెక్కడకొడితే నాకు తగులుతుందో. అన్నగారినికదా యెంతబాగా దెబ్బలు కొట్టినా?

ఇందులో సంతోషించతగ్గ దేముందిలెండి. నాకు సాధ్యమే ఐతే కొళ్ళం నిలుచున్నచోటే గుమ్మరించి, వ్యవహారా న్నప్పుడే పరిష్కారం చేసుకుని వుండనూ? హెర్రా కుర్కి-మాకీ వాళ్ళో ఒక్కమాటు ప్రోగుపొయ్యడానికి నాదగ్గర యిరవై వేలమార్కులు యేవీఅంటా? లేవుగనుకనే కామందు చెప్పిన షరతులుకి అంగీకరించి యిల్లు తీసుకున్నా. ఇల్లాగే నేను బతికినన్నాళ్ళూ చాకిరీ చెయ్యాలనీ, అప్పుడైనా నేను చచ్చినాకగాని యిల్లు పూర్తిగా నా పిల్లలకి సంక్రమించదనీ తెలుచుకుంటూంటే నాకూ ఒక్కొక్కప్పుడు పుట్టెడు దిగులు కలిగేది. ఐతేమాత్రం మనం చేయగలదేముంది? హెర్రా కుర్కిమాకీ యీయిల్లూ, స్థలం దానపట్టా రాసి వుచితార్థంగా యిస్తాడనుకోలేంగదా! వీళ్ళో యీమాత్రంసంగతి గ్రహించ లేదూ? వాడు గ్రహించాలని అసలు ప్రయత్నిస్తేగదూ? పైపెచ్చు వాడికుర్రతనపు మాటలతో నాకే కోపం తెప్పించి, రెచ్చగొట్టాలనుకుంటూంటే!

సరిగా ఆ సమయానికే నా పెళ్ళాం అక్కడికి వచ్చి, మెల్లిగా నన్నడిగింది.

"భోజనానికి బల్లమీద యేమి వడ్డించేది?"

నే నడిగేను.

"ఏమిటీ నువ్వనేది?"

ఆమె జవాబిచ్చింది.

"మాళిగలోంచి జున్నూ, మాంసం తెచ్చేదా?"

నే నన్నాను.

"అవసరంలేదు గాని బంగాళాదుంపలున్నాయా?"

ఆమె అన్నది.

"లేకేమవుతాయి?'

'పాలూ, వెన్నా వున్నాయా?"

"ఆఁ! వున్నాయి."

"సరే! అవిచాలు! ఈ హడావుడి దేని కింక?"

"ద్రాక్షాసవం మాటేమిటి?'

"ఏమీ అక్ఖర్లేదు. పాలతో కొంచెం కాఫీ చెయ్యి. అదైనా మంచిదేకదా!"

అసలు సంగతి యేమిటంటే నాకు మా తమ్ముడిమీద కోపం వచ్చింది. వాడికి నా కోపాన్ని తెలపాలని కోరికగా వుంది. పెద్ద పెద్ద కబుర్లు చెప్పే శాకాహారీరాయుళ్ళందరికీ మేపడానికి కాదు. నేను శ్రమపడి జున్ను, మాంసం, ఆసవం భద్రపరచింది! మాళిగకి తలుపుగావున్న రాతిపలక తీసి మిగిలివున్న శాస్త్రజున్నుగడ్డం, గొడ్డుతొడా, జాడీ అడుగున వున్న ఆసవం సమర్పించుకోడానికి నేనేం తెలివితక్కువ వాణ్ణిగాను! హెర్రా కుర్కినూంకీ కోసం యెన్నిరోజులు రెక్కలు ముక్కలయ్యేలా, వెన్నువిరిగేలా పనిచేస్తే నేనొక్క గొడ్డుతొడ కొనగలిగేనో గ్రహించగలిగివాళ్ళకి పెట్టినా అందంచందం! నా యింట విందు గుడవటానికిముందు, తినే వాళ్ళు యీ విషయం గ్రహించాలనీ కోరుతా

"జున్నూ, మాంసం లేకండానే యీ పూట కాలక్షేపం చేద్దాం. ఏదో మామూలు భోజనంగానే పోనీ."

కల్లీ పోహ్‌జన్ పా క్రిమరీనుంచి యింతదూరం, పన్నెండు కిలోమీటర్లు కాళ్ళీడ్చుకుంటూరావటంలో విల్హో అభిప్రాయం ఏమిటంటంటా? తన తెలివితక్కువనీ, పొగరుబోతుతనాన్నీ ప్రద ర్శించడానికేనా? అబ్బే! యిల్లాంటి నడవడిక వల్ల యేమంత కిట్టుబాటుండదని మా తమ్ముడు గ్రహించేలా చేయాల్సిందే!

నేను అప్పటి కోపంమీద, వాడి తెలివితేటల్ని గూర్చి ఒకటి రెండుసంగతులు జ్ఞాపకానికి తెచ్చేవాణ్ణే. కాని సరీగా ఆ సమయానికే విల్హో మా పిల్లలతో ఆటలాడ్డం ప్రారంభించ డంవల్ల నేనింక ఆ ప్రసంగం తేలేదు. వాడికేం తెలుసులేండి. ఇంకాచిన్నతనం; నా కంటె పూరాగా పదేళ్ళు చిన్నవా డాయె! ఏదోకాస్త యేపుగా పెరిగి నా యెత్తున్నాడేకాని వాడిలో ఆదా యేదండీ?

పట్టుకుచ్చులాంటి తలకట్టూ వాళ్ళూ మా పిల్లలున్నారే, వాళ్ళకి విల్హోదగ్గర మాచెడ్డ చనువులెండి. ఒకర్నివిడిచి ఒక రిని గాలిలో పైకెగరేసిపట్టుకుంటూంటే వాళ్ళు కడుపు చెక్కలయేలా ఒకటేనవ్వు. విల్హోకూడా పిల్లలతో సమంగా ఒకటేనవ్వు! అల్లాంటివాడితో కఠినంగా, కోపంగా మాట్లా డ్డం యెల్లాగంటా? చేతులు పైకెగిసినపుడు వాడి నీలిసూటు బిగుతుగా శరీరాన్నంటుకొనివుంటే, విశాలమైన భుజస్కం ధానికీ, పిరుదులకీ మధ్య సన్నని కటిభాగం ప్రవేలెట్టి చూపి

నట్లు గానవచ్చేది. మహోన్నతుడైన మా తమ్ముణ్ణి చూస్తే యెవరికైనా పరమానందం కలుగకమానదు లెండి.

నావలెనే మా తమ్ముడుకూడా శరీరదార్ఢ్యంలో మా నాన్ననే పోలేడు. పై పెచ్చు వాడు ముఖకవళికలో మా అమ్మ అందాన్నంతనీ పుణికిపుచ్చుకున్నాడు. మా అమ్మకళ్ళు పెద్దవి; నీలంగా, సంతోషాన్ని వెదజల్లే వెప్పుడూ. సరిగ్గా అదే మోస్తరు తిన్నని చిన్నముక్కూ.., నిరంతరం చిరునవ్వులు చిందులాడే చక్కటి నోరూకూడ వీడు మా అమ్మనుంచే వారసత్వంగొన్నాడు. ఆవిడేగనక బ్రతికివుండి మా తమ్ముణ్ణి చూసిందీఅంటే అచ్చంగా తన ప్రతిబింబాన్నే చూస్తున్నాననుకొనే దనుకుంటా!

తన తమ్ముడి ముఖం అచ్చంగా అమ్మ ముఖాన్నే పోలి వుండంటే యెవరికి సంతోషంగా వుండదండీ? ఏ మాట కామాటే చెప్పుకోవాలి. ఐనా అంత పరిహాస శీలమైన స్వభావం వుండడం యేమంత మంచిదిగాదు. దానికేంగాని మా భోజనంలో యేమీలేకపోయినా నే ననుకున్నంత అసంతృప్తికరంగాలేదు. పాలు తాజావి; వెన్నకూడా అంతే; ఉర్లగడ్డలు పసిమిగా, పెద్దవిగా వున్నాయి: ఉర్లగడ్డల తొక్కలు శుభ్రంగా తీసేసి వండుతూంటుంది, నా గృహిణి. వేపిన ఉర్లగడ్డముక్కల్ని బాణలిలోంచి గిన్నెలోకి వంచిన వుడు వాటిమీంచి తెల్లని ఆవిరీ, పరిమళం యిల్లంతా వ్యాపించింది. అల్లాటి పదార్థాలతో భోజనం అసంతృప్తికరంగా యెల్లావుంటుందో చెప్పండి, మాకి

భోజనందగ్గర కూర్చున్నాం. విల్సో ముందే 'పకోడి' తీసి, వేడిదుంపలో గ్రుచ్చి యెత్తి తినడం ఆరంభించేడు. బాకు కొననుంచి వేడిదుంపను యెడంచేత్తో పట్టుకుని, వెన్న ముద్దలురాచి, ఓ ముక్క కొరికేడు. ఈలోగా దుంపవేడిమికి వ్రేళ్ళుకాలుతూంటే ఊదుకోడం, నమలిన ముక్కని ఓ గ్రుక్కెడుపాలతో కంఠం దిగేటట్లు చేయడం, - యిదీ వాడి తీరు. మా నాన్నకూడా ఉర్లగడ్డల్ని సరిగ్గా యిదేమోస్తరుగా తినేవాడు.

రొట్టిమీదకూడా వాడు వెన్న పుష్కలంగానే రాస్తాడు. వాడు తిన్నాడంటే నాకు సంతోషమే. ఇదంతా చెపుతూన్నానని వాడు తినిపోతున్నాడని నేను అసూయ పడుతున్నాననుకోనేరు గనక! మీ పుణ్యమాయని అల్లా అనుకోకండేం. ఎల్సా రెండు కప్పుల్లో కాఫీపోసి పెట్టింది. పంచదార వేసి పాలతో తయారుచేసిన మొదటిరకం కాఫీ అది, యేమనుకున్నారో! నేను తిండిలో లోభించను యెప్పుడూ. ఐతేనేం వాడికదంతా యెందుకు? ఫిన్నిష్ రైతుల పరమ లోభిత్వాన్ని గూర్చిన చమత్కార కథని చెప్పకండా వూరుకుంటే వాడి ప్రత్యేకత ఏముంది?

మరొకళ్లైతే పెద్దవాడు, అన్న యేమనుకుంటాడో- అని జాగ్రత్తగానే మాట్లాడి వుందురు. అదీగాక తాను అతిథిగా వచ్చిన వాడాయె! విల్సో బహు నిర్లక్ష్యస్వభావంగలవాడు లెండి. వాడి కెవళ్ళ భయమూ లేదు, ఎవ రేమనుకుంటాగో

అనే జంకు గొంకూ అసలేలేదు. వాడు ఆ సమయంలో చెప్పిన కథ వినండి, యెల్లాంటిదో!

'ఓ ఫిన్నిష్ రైతు, భార్యాతో సహా విమానంలో ఓ యెగురు యెగురుదా మనుకున్నాట్ట. కాని, అందుకోసం డబ్బు ఖర్చు చేయడం అతగాడి కెంతమాత్రం యిష్టం లేదు. అతగాడి కోరిక విన్న ఒక పైలట్‌కి కుతూహలం కలిగింది. తాను చిల్లిగవ్వకూడా తీసుకోకండానే వాళ్ళిద్దర్నీ యెగుర వేస్తాననీ, కాని ఒక్కటే షరతుందనీ అన్నాడు. విమానంలో వున్నంత సేపూ రైతు నోరువిప్పి, కిమ్మన్నాడంటే నూరు మార్కులు యిచ్చుకోవాలి. ఇదొక్కటే షరతు- 'సరే' అంటే 'సరే' అనుకున్నారిద్దరూ. విమానంపైకి లేచిందయ్యా! ఎంతోసేపు విమానాన్ని పొలాల మీాదుగా, అడవుల మీాదుగా, కొండలమీాదుగా శరవేగంగా పోనిస్తూ, గిర్రున చక్రాలు కొట్టిస్తూ, పిల్లిమొగ్గలు, పల్టీలు వేయిస్తూ, యింకెన్నో అఘాయిత్యాలు చేయిస్తూ వచ్చినా రైతుమాత్రం 'ఆఁ! ఊఁ! ' అనలేదు. ఆ మట్టున పైలట్ బాగా పైకి పోయి, పల్టీలు కొట్టి కొట్టి, గమ్మున లకు ముకిపిట్టలా క్రిందికి దిగడం, మళ్ళీ పైకెగిరి అదే రీతిగా చేయడం ఆరంభించేడు. ఇల్లా చేస్తే భయపడి రైతు అరు స్తాడని పైలట్ ఆశ! చెయ్యడం కంటె చెప్పడం యెప్పుడూ సులభమేగదూ? రైతు కిమ్మన్నాడంటే నూరు మార్కు లిచ్చుకోవాలి! ఫిన్నిష్ రైతూ అన్నవాడు అల్లాటి తెలివి

తక్కువపని యెప్పుడూ చెయ్యడు. పైలట్ మేఘమండలం దాటి యెగరడం, గభుక్కున చాపరాయిలా పడడం,– యిల్లా ఓ యిరవై స్టార్లు చేసి వుంటాడు. తన జీవితంలో అంత వరకూ యెప్పుడూ చెయ్యని ఆఘాయిత్యపు పనులు చేసి చేసి, శుభ్రంగా అలిసి, చచ్చిడి పోయేడేగాని రైతుమాత్రం పెదవి విప్పలేదు! పైలట్‌కి ప్రాణంవిసిగి, చివరకి క్రిందికిదిగిపోయేడు. రైతుతో అన్నాడుగదా: 'దిట్టంగా నిలబడ్డావే?' రైతు ముఖానకూడా వాటేస్తే నెత్తురులేదు. 'ఆఁ! ఏదో! నిల బడ్డాను.' అన్నాడు. 'నిజం చెప్పు! అరవాలని ఒక్కసారీ అనిపించలేదూ? నీ పెదవులు వాటంతటవే తెరుచుకుని కేక వెయ్యాలని ప్రయత్నించలేదూ?' రైతు వున్నవిషయాన్ని అంగీకరించేడు. 'నువ్వన్నది నిజమే. ఒక్కమాటుమాత్రం నేను అరవటానికి సిద్ధపడ్డాను. ఎప్పుడో తెలుసా? మా ముసిల్ది విమానంలోంచి చాపరాయిలా బైటికి పడిపోయిందే, అప్పుడు!'

ఇంతమట్టుకు చెప్పి, విక్టో పకపకా నవ్వనారంభించేడు. ఎల్లాకూడా నవ్వుతూంది. టేబిలు కావలిప్రక్క కూర్చున్న పిల్లలిద్దరూకూడా కిచకిచలాడేరు. కాని, నాకు ఆ కథలో చమత్కారమేమీ కనిపించలేదు. అదీగాక, యీకథ చెప్ప డంలో మావాడి ఉద్దేశ్య మేమిటీ అనడుగుతా? నామీద రాళ్ళు విసరడమే వాడి ఉద్దేశ్యమైతే నాయింటికి రావడ మెందుకు? నాబల్లదగ్గర భోజనానికి కూర్చోడమెందుకు?

కాని తే యిది నామనసులో కలిగిన అభిప్రాయమేగాని, పైకిమాత్రం నేను వాడితో యేమీ పల్లెత్తుమాట అనలేదు. వాడు కథ చెపుతూన్నంతసేపూ యేమీజరగనట్లే మౌనంగా కూర్చుని, చాకుతో ఉర్లగడ్డలమీద వెన్నరాస్తూ, ఒక్కొక్కటే నోట్లో వేసుకుంటూ వుండిపోయేను. ఎల్సా నాకోసం కాఫీ తెల్లకప్పులో పోసింది. నేను కాఫీ తీసుకుంటూంటే ఆమె మావాడికప్పులో మళ్ళీకొంచెం పాలూ, డికాషనూపోసి, పంచదార బేసిన్ వాడిదగ్గరగా పెట్టింది.

ఆరోజున మాభోజనం గృహస్తునూ, గేస్తురాల్నీ సూటిపోటిమాటలని నొప్పించాల్సినంత అధ్వాన్నంగాలేదు! బల్లమీదిగుడ్డ సరికొత్తది; ఆకర్షనీయమైన నీలిరంగులో, అందమైన నొక్కులతో, చొట్టలతో యెంతో బాగుంది. అతిథి అర్థాకలితో బోనక్కరలేనంత సమృద్ధిగాపదార్థాలున్నాయి. వాడికంతకు మిక్కిలి యేంకావాలో నాకర్థం కాలేదు.

తాను అనగూడని మాటలేవో అనివుంటాననీ అప్పటికి వాడూ గ్రహించివుంటాడు. అందుచేత నేగాబోలు మళ్ళీ నన్ను కాస్త మాటమంచి చేసుకుందామనుకుని వుంటాడు. నాతో అన్నాడు :

'ఒరే! అన్నయ్యా! ఆరైతు బహుశా నీవంటి 'ముషోన మీాన్* ఐవుంటాడురా. అల్లాంటివాళ్ళ జేబులెప్పుడూ ఖాళీయే గదూ ?'

కాని నేను వాడికేమీా ప్రత్యుత్తర మీాయలేదు. కాఫీ త్రాగుతూ కూర్చునిపోయేను. మళ్ళీ యిలాఅనడంలో వాడి అభిప్రాయమేమిటీ అంటా ? సరేనయ్యా! వాడు ముషోన మీానే ఐవుంటాడనుకొందాం. ఐతే ఏమిటి ? అల్లాటివాళ్ళ జేబుల్లో డబ్బేమీావుండదే అందాం. ఐతే ఏమిటీఅంటా?

కాఫీత్రాగడం పూర్తిచేసేక కూడా నేనేం మాట్లాడలేదు. అప్పటికే విహ్లో నన్నుగురించి మరిచిపోయి, పిల్లలతో ఆటలు మొదలు బెట్టేడు. మీారూ యీా సరికి గ్రహించే వుంటారు, వాడికి పిల్లలంటే మా చెడ్డ సరదాఅని. మొహం విశారంగా పెట్టి, ఖాళీ ఐపోయిన వెన్నగిన్నెవైపు తలెగురవేస్తూ ఆశ్చర్యద్యోతకమైన పరిహాస స్వరంతో,-

| | |
|---|---|
| 'ఆయితీ! హోయ్! మీాస్సా వోయ్?' | 'అమ్మా! ఏమిటే? వెన్నె మైందే?' |
| 'కిస్ అ సోయ్?' | 'పిల్లికూన తిందే!' |
| 'మిస్సా కిస్సా?' | 'పిల్లి యెక్కడే?' |
| 'ఐతన్ అల్లా.' | 'గాదె క్రిందనే.' |
| 'మీాస్సా ఐత్తా?' | 'గాదె యెక్కడే?' |

* ఒకతరహా కూలివాడు. సరిపడా తిండిపెట్టి, యేదోకొంచెం కూలి డబ్బులిస్తే పనిచేసేవాడని యర్థం. పాలేరువంటిపదం.

ఇల్లాంటి రోకటిపాటలు బడిపిల్లలందరికీ కొట్టినపిండే మా వాడా పాట అందుకున్నాడండీ, ఆమట్టున. గాదె యెక్క-డుందో; అదెల్లా అంటుకున్నదో; నిప్పును నీళ్లెల్లా ఆర్పేయో; నీళ్ళని యెద్దు యెల్లా త్రాగిందో; యెద్దుని గొడ్డలి యెల్లా నరికిందో; గొడ్డలి దుంగలో యెల్లా దిగబడిపోయిందో; దుంగని పురుగులెల్లా తినేసేయో; పురుగుల్ని పిట్టలెల్లా యేరేసేయో; పిట్టలన్నీ డెబ్భైయేడు సరస్సులూ, సముద్రాలూ దాటి యెల్లా యెగిరిపోయేయో; యిదంతా యేకరువు పెడుతూ, ముఖభంగిమలు మారుస్తానే వున్నాడు. ముఖాన్ని యెంత వికారంగా పెట్టినా అందంగానే వుంటాడండీ, మా వాడు. మా పిల్లలిద్దరూ ఒకటే కిచకిచలూ; వికవికలూను; వాళ్ళ సంతోషం యేమని చెప్పమన్నారు?

చెప్పొద్దూ, పిల్లలు ఉత్సాహంగా కేరింతాలు గొడుతూంటే నాకూ యెంతో ముద్దుగా వుంటుంది. అప్పుడుకూడా నా కెంతో ఆనందం కలిగింది. మా వాడివైపు ప్రసన్నంగా చూడకండా వుండలేకపోయేను. ఇంతకూ వాడిమీద నాకు కోపం దేనికంటా? ఎవడో ఒకడు మూర్ఖంగా ప్రవర్తించేడే అనండి; వాడిమీద కోపగించడం యేమంత వివేకమంటా? అదీగాక విన్స్లో చెప్పేడే, 'ముహోనమీస్' అని,- అంటే తిండిపెడితే పనిచేసే వాడన్నమాటలెండి,- వాళ్ళ విషయమై వాడు చెప్పింది కేవలం పచ్చినిజం! నాకూ అనుభవమే గాదూ? అల్లాంటి రైతు వాడికి, నిత్యం మడత ఖుధుఘుల్లో

గుడిచేవాడికి, ఏమానయానం లాంటి చిల్లర విషయాలకోసం నూరుమార్కులెక్కడినుంచి వస్తాయో చెప్పండి? అటువంటి వాటికోసం డబ్బు మూలుగుతూండడానికి వాడేమేనా పొలం బుట్రా వున్నవాడా? వాడనే దాంట్లో అర్థమేమైనా వుండొద్దూ?

ఆ రైతువాడు పంతానికి నిలబడి వుండగలిగేడంటే ఆశ్చర్యం ఏముంది? నవ్వడానికేముంది? పైపెచ్చు వాణ్ణి మెచ్చుకోవాల్సి వుంటుందంటాను. ఎందుకంటారా? వాడేమని పందెం కాచేడు? 'కిమ్మని అంటే నూరుమార్కులిచ్చుకోవాలి' అనే గదా— అదీసంగతి; సరే. వాడు ఊఁ! అని కూడా అనలేదు! దానికి మీరేమంటారు? వాడు ఆరుసార్లైనా నోరు విప్పలేదు! అంటే, దానికర్థం? వాడిదగ్గర ధీమా వుందన్నమాట! గిర్రునత్రిప్పి, నేలనిబెట్టి కొట్టినా ఒక్కమాట ఆడలేదు! మనిషంటేవాడు! ఒక్కసారిమాత్రం—, కేవలం ఒక్కసారే,— నోరువిప్పే పర్యంతం ఆయేడుటగాని సంబాళించుకో గలిగేడు. అదైనా యేపరిస్థితుల్లోను? వాడి భార్య, ముసిల్ది విమానంలోంచి బైటికి జారిపోయినపుడుట! హ్హాఁ! హ్హాఁ! హ్హాఁ! మా చెడ్డమాటకారండీ! మావాడున్నాడే విల్హో! ఏం చిత్రమైన కథలు చెపుతాడని! ...........

ఇల్లా తలుచుకుంటూనే పకపకా నవ్వారంభించేను. ఆ గడబిడలోకప్పులుక్రిందపడగొడతానేమోనని దూరంగా నెట్టుతూ, ఖికఖికలాడ్డంచూసి విల్హోకి ఆశ్చర్యంకలిగింది. అడిగేడు;

'ఎందుకురా, అన్నయ్యా ! నవ్వుతావు ?'

నేనన్నాను, నవ్వుతూనే:

'కేవలం ఒక్కమాటుమాత్రమే వాడు నోరు తెరవడానికి సిద్ధమయ్యేడు !... ... ...వాడిముసిల్ది బైటికి పడిపోయి నప్పుడు !......'

అంటూంటే మళ్ళీ పొట్టచెక్కయేట్లా నవ్వొచ్చింది. వాడొక్కక్షణం నాకేసి ఆశ్చర్యంగాచూసి, పకాలుమని నవ్వుతూ, ఉక్కిరిబిక్కిరై బెంచిమీంచి క్రిందికి పడిపోడానికి సిద్ధమయేడు ! చాలసేపు నవ్వేక, గుక్కత్రిప్పుకుని అన్నాడు:

'అందుక నేలావుంది ! మనవాళ్ళు పూరి కే చెప్ప లేదు,- 'ఫిన్ను కెప్పుడూ నవ్వు తెప్పించేమాట శుక్రవారం నాడు చెప్పకు. ఎందుకంటే అందులో చమత్కారాన్ని అతగాడు ఆదివారంనాటికి గ్రహించి, చివరకి చెర్చిలో ప్రార్థన జరుగుతూండగా కితకితలాడుతాడు !' నీతో యేపనిచేయాలన్నా చాలసేపు తీసుకుంటుందిరా, అన్నయ్యా !'

మొదట్లో వాడు ఆ హాస్యోక్తిమీద నవ్వుతూన్నాడను కున్నా. కాని, తర్వాత, వాడు నన్నుచూసే నవ్వుతూన్నా డనిపించింది. వాడికులుకు తగ్గించాలని బుద్ధిపుట్టింది:

'ఎవడి జేబులైనా పట్టిపీ అంటే అందులోనవ్వడానికే ముందిరా ? బీదతనాన్నిచూసి వేళాకోళంచెయ్యడం బుద్ధి హీనత కాదూ ?'

నేనీమాట అనీఅనడంతోనే వాడుముఖం గంభీరంగా పెట్టేసేడు. అందులో వాడు గట్టివాడులెండి. పకపకలాడు తూన్న వాడంతట్లోకే నిష్ఠురంగా మాట్లాడుతాడు! అంద మైన నీలికళ్ళల్లోంచి నావైపు చురుకుగాచూసి, అందు కున్నాడు:

'బీదతనాన్ని చూసి పరిహాసించాలని యెవడన్నాడు? నవ్వా ల్సింది, మనపల్లెల్లో అమల్లోవున్న బుద్ధిమాలిన పాడు అళ వాటూ ఆచారాలూ చూసి!'

'అల్లాంటి ఆచారాలేవిరా?' అన్నాను, నా కర్థంగాక. కుర్చీ గోడదరికి వెనక్కి త్రోసి, కాస్సేపు ఆలోచిస్తూ కూర్చుని, యిష్టంలేనట్లు మాట్లాడ నారంభించేడు.

'నీకుమాత్రం తెలియదా యేమిట్రా, అన్నయ్యా! దాని బాధలు నీవంటివాడు నిత్యం అనుభవిస్తూనేవుంటాడాయె? నువ్వేచెప్పరా, యిరవైయేడు సంవత్సరాలుగా నువ్వొ మరొకరి భూములమీద కూలిచేసుకుంటూ జీవిస్తూన్నావు. ఇది న్యాయమేనంటావా? ఈ యిరవై యేడేళ్ళనుంచీ స్వంత పొలాన్నిగూర్చి కలలుగంటూన్నా, యింతవరకు కాలూ నేందుకు యీకొండ రాయిగాక మరేమీ లేకపోవడం; పోనీ యీరాతిమీదైనా పూర్తిహక్కు లేకపోవడం న్యాయ సమ్మతమేనంటావా? నాఅన్నదిలేని యిల్లాంటివాళ్ళు మన స్వర్గసీమలో యెంతమంది వున్నారంటావు? సుహోమీ! తల్లి! జన్మభూమి! నువ్వింకానయమే. చాలమందితోపోలిస్తే నీపని

నయంగానే వుందనుకో. నీకుచేరెడు పొలమైనా లేకపోయినా. కొండమీద కాపురముండాల్సివచ్చినా, యేదోలాగెంటుకు పోతూన్నావు. నీకున్నబలం, ఆరోగ్యంమూలాన కాలక్షేపం అవుతూందనుకో. నీకున్నబలం గుర్రానికూ్యడాలేదు! 'ముసోనమీాన్' లగతే యిట్లుంటే యింక 'దుఖోకలై నెన్'* లగతేమిటి? చెప్పు. వాళ్ళకి జీవితంమీద ఆశవుండేందుకు అవకాశంవుందా? వాళ్ళకి బ్రతికినన్నాళ్లూ కాస్త తిండీ, తల దాచుకోనేపంచా ప్రసాదించే యజమాని, పనిచేయించుకోనే అనుకో,– దొరికితే గొప్పఅదృష్టమే! కాని నిజానికి వాళ్ళకి ఆ ఆశకూడాలేందే! అవసరపడినప్పుడు పనిచేయించుకుని, తర్వాత వెళ్ళగొడితే అడిగేదాత యెవడంటూ? అట్టి నిర్భాగ్యుల్ని కాపాడేందుకు మనకు చట్టాలేవీ? అందాకాయెందుకు? హెర్రా కుర్కుసూకీ రేపునిన్ను పనిలోంచి తరిమేస్తే, నిన్ను కాపాడగల చట్టంయేదైనావుందా, చెపుదూ? మన స్వర్గభూమిలో అసంఖ్యాకులైవున్న గ్రామీణవ్యవసాయకూలీల్ని కాపాడేచట్టం యింతవరకూ యెందుకు చేయలేదు? వాళ్ళంతా యజమానుల దయాధర్మాలకి వదలిపెట్టబడ్డారెందుచేత? యజమానులకి ఒకచట్టంవుందా? ఎవడియిష్టం వాడిది! కామందుల యిష్టారాజ్యంలో ఒకడు దినానికి ఐదుమార్కులిస్తే, యింకోడు యేడిస్తానంటాడు; మరొకడు పదంటాడు!

---

* కేవలం సుప్పెడు మెతుకులకే పనిచేసేవాడు. సాధారణంగా ముసలివాళ్లు, ఆడవాళ్ళు, రోగిష్టివాళ్ళు యీ తరహాకి చెందుతారు.

ఐదేళ్ళు తనదగ్గరే నమ్మకంగా చాకిరీచేస్తూ, పడుంటే, అల్లాంటివాడికి ఓభూస్వామి కాస్తమడిచెక్క పాలుకిస్తాడు. మరోడు పదేళ్లు చేసినవాడికిస్తాడు. చాలమంది యజమానులు యెంతకాలం పనిచేసిన వాళ్ళకైనా యివ్వరు! అందాకా యెందుకు? మనదేశంలో 'పాల్కతోర్ల్ వైనేజెలు' లకిమాత్రం నిశ్చితవేతనాలంటూ వున్నాయా? యజమానులే వాళ్ళ యిష్టానుసారంగా కూలిరేట్లు నిర్ణయిస్తారు. మచ్చుకి నా విషయమే తీసుకో. నాకు గంటకి యెనిమిది మార్కులు; పెట్రూనెన్‌కి పన్నెండు; మళ్ళీ యిద్దరం చేసేపనీ ఒకటే! ఒక్కొక్కప్పుడు నేనే యెక్కువ పూచీగల పనిచేస్తూంటా కూడాను. ఐతేనేం? యజమాని యిష్టం. ఇల్లాచేసి తీరాలని వాళ్ళకి చెప్పేదెవరు? ఏవో పెద్దపెద్ద కార్ఖానాలు, మిల్లులూ వున్నాయంటే అక్కడమాత్రమే పనివాళ్ళకి యేవో కొన్నైనా హక్కులున్నాయి. అంతే. అక్కడికీ యజమానులు వీలు చూచుకుని యెగవేస్తూనే వుంటారు. వైనో అహోనెన్ రంపపుమిల్లునే తీసుకో. అక్కడి కార్మికుల నెత్తెక్కితొక్కితే వాళ్లూరుకోరు. వాళ్ళంతా యేకంగా గట్టిగానే నిలబడ గలరులే! కాని మనమో? దిక్కులేని పశువుల్లాటివాళ్ళం. అందరికీ వ్యక్తిస్వాతంత్రమంటూ పెద్దపెద్ద కబుర్లు చెప్పే వాళ్ళు చాలమందిని చూస్తూంటాం. ఆమాటలువిని, పాపం, అమాయికులంతా తామూ స్వతంత్రులమేనని మురిసిపోతూం

♦ కేవలం డబ్బుకూలికే పనిచేసేవాళ్ళు.

టారు ? తన కాలుసేతులు అంగుళం అంగుళానికీ బంధించబడి వున్నాయనీ, తన పీకమీద కత్తిపెట్టి వుంచేరనీ, పైపెచ్చు యీ కొండంత బండ తన మెడలో గుదియగా కట్టేరనీ యెవడూ గుర్తించడు! మనం యూరోపులో నివసిస్తున్నాం, నాగరకుల మనిపించుకుంటున్నాం; కాని యూరోపులో యింకే దేశంలోనూ గ్రామీణ కూలీలు మనంత దుస్థితిలో లేరు. అహఁ! ఇంకెక్కడా వ్యవసాయకూలీలు మనంత దౌర్భాగ్యస్థితిలో లేరనుకో. రష్యాసంగతి నేను చెప్పడమే లేదు! ... ...'

వాడికేసి రెప్పార్చకుండా చూసి నే నాశ్చర్యచకితుణ్ణైపోయేను. నాయెదుట కూర్చున్నది విన్స్తావేనా? దేశపరిస్థితుల్ని గురించి వాడనేదంతా నేను అర్థంచేసుకున్నా ననుకోండి. చాలమంది పరిస్థితులికి ఆతృప్తులయే వున్నారనుకోండి. కాని వున్నట్లుండి హఠాత్తుగా రష్యాను లాక్కురావడం, దాన్ని నెత్తికెక్కించుకోడం......యిదేమిటంటా ?......

'రష్యాసంగతి నేను చెప్పడమే లేదు!' అంటాడు! విన్నారుగాదూ, మావాడి వరస ? వాడిబుర్రలోకి యీ భావాలు యెక్కడినుంచి వచ్చేయంటా? మంచివాళ్ళకీ, పెద్దమనుష్యులకీ దూరమై, అ హో నెక్ అంపపు మిల్లులో పనిచేసే పోరంబోకులూ, చెత్తాకారీ వెధవలూతో స్నేహంచేస్తే యింకెల్లాంటి బుద్ధులబ్బుతాయి ? అందుకనే సహవాసం మంచిది

చెయ్యాలంటారు పెద్దవాళ్ళు! విళ్లో తెలివితక్కువ బుర్ర లోకి రకరకాల దరిద్రగొట్టు భావాల్ని వాళ్ళే జొప్పించేరు? ఇప్పుడా భావాల్ని తొలగించాలంటే యెవడితరం?

రష్యానుగూర్చి చెప్పడట! వాండి రష్యా, వాడూ... ......శాస్త్ర వినండి వాడిధోరణి. ఈ కుర్రకుంక కేం తెలుసునో రష్యానుగూర్చి! అన్నిటికీ రష్యాయే బొడ్డుకోసి పేరెట్టినట్టు మాట్లాడుతాడు! లోకంలోవున్న దుర్మార్గమంతా ఆ రష్యామూలాన్నే కలుగుతూందని యీ వాకుడుగుల్లకేం తెలుసు? తూర్పు దక్షిణాలనుంచి గదుముకొచ్చి, మనల్ని నొక్కేస్తూన్నది ఆ రష్యాయే కాదూ? రష్యా పొరుగున వుండబట్టేగదా నిత్యం బెదురుతూ, బెగ్గడిలుతూ జీవించాలిసివస్తూంది, మా వాళ్ళంతా? ఇవన్నీ వాడేమేనా ఆలోచిస్తున్నాడా?

మీారేమన్నాసరేగాని, ఒకటిమాత్రం యదార్థం. రష్యా దురుద్దేశంతో మనవాకిలి వెలుపలనే తోడేలులా కాచుపెట్టుకుని వుంది. అదొచ్చిందీ అంటే గొఱ్ఱెని తినేవాడు పోయి బఱ్ఱెని తినేవాడొచ్చినట్లుంటుంది! దాని పాపిష్ఠిగాలి సోకటంవల్లనే మన శీతకాలాలు భరించలేనంత శీతలంగానూ, వేసవులు వడగాడ్పులతో దుర్భరంగానూ వుంటున్నాయి! ఏమంటారు? ఈ వర్తమానాలన్నీ అచ్చులోకే యెక్కేసేయి! ఈ భోగట్టానీయని వార్తా పత్రికా, పుస్తకమూ లేదంటే నమ్మండి, మా దేశంలో. చదవడం రాక

పోయినా మీకు యీ విషయాలు తెలిసేవుండాలి. ఎందు కంటే చెర్చిలో మతగురువులు యెన్నిసార్లో రహస్యానుగూర్చిన యీ భోగట్టా పబ్లీకుగా ఉపన్యసించడంలేదూ ? వీళ్ళందరి కంటె తానే మహాతెలివైన వాణ్ణనుకుంటున్నాడు గాబోలు మావాడు ! గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించిందనే సామెత ఊరికేపుట్టిందా ?

ఇల్లాంటి తెలిసీ తెలియని మాటలింకెప్పుడూ చెప్పకండా విల్సోకి తగినట్లు బుద్ధి చెపుదామనుకుంటూండగానే అంతలో హిల్డా కుర్క్మాకీ మా వాకిట్లోకి వచ్చేసింది. కామందు కుమార్తె స్వయంగా వచ్చి, మాయింటిని గౌరవించుతూంటే యింకో గొడవలో పడివుండడానికి నేనంతమర్యాద తెలియని వాణ్ణేంగాను.

ఆమె సరాసరిగా లోనికి రాకండానే తలుపు తట్టుతూ,–

'లోనికి రావచ్చా? ' అంది.

నేను వెంటనే జవాబిచ్చేను.

'ని ర భ్యం త రం గా– లోనికి రామ్మా, నియోతీ!* మా యింట్లోకి నీ కెప్పుడూ స్వాగతమేనమ్మా! కూర్చో. మాతోబాటు కొంచెం కాఫీ పుచ్చుకుందువుగాని. '

అంటూనే లేచి బెంచీమీద నాచోటుఖాళీ చేసేను, ఆమె కోసం. కాని ఆమె కూర్చోకండానే అంది.

---

* పెండ్లికాని కన్యలను సంబోధించేతీరు. ఇంగ్లీషులోని మిస్ వంటిది మాట, మనం 'చిరంజీవి' అని పిలిచే వంటిది.

'అబ్బే! వద్దు, వద్దు. నమస్కారాలు. మీరు శ్రమపడ వద్దు. ఊరిఖేనే ఒక్కమాటు చూసి పోదామని వచ్చేనంతే. ఈదారిని బోతూంటే మీ మాట జ్ఞాపకం వచ్చింది. మన యిరుగూ పొరుగూ కొత్తయింట యెల్లా వుంటున్నారో చూసి పోదామని తోచింది. అందుకనే యిటు వచ్చేను. ఇక్కడ యెంతో బాగుంది.'

ఆమె అదివరకే ఒకసారి మా యింటికి రావడం, సరిగ్గా యివే మాటలనడం మరిచిపోయి వుంటుంది, బహుశా. అది జరిగి చాలరోజులైందిలెండి. ఆ దఫా కూడా విల్సో మా యింటికి వచ్చి వున్నాడని గుర్తు. మిగతా మాటలకేం గాని దారిన బోతూ వచ్చేనన్నదే, అదేనాకర్థం గాలేదు. ఇక్కడ దారేమీ లేదే? ఈ చుట్టుపట్ల రోడ్డు అసలే లేదు. అరవ సరాసరి మా యింటికే వస్తుంది......ఎందుకైతే మనకెందుకు? అనుకుని నా గృహస్థ ధర్మాన్ని అనుసరించి మళ్ళా అన్నాను.

'అదేమిటి? నిల్చున్నావు! కూర్చోవమ్మా! నియీాతీ! ఏదో ఒక్కకప్పు. మా యింటికి వచ్చేవుగదా? అదైనా మర్యాదకే గదా. ఎల్సా! కప్పులో కాఫీ పొయ్యి!'

పొయిమీద వేడికాఫీ తెచ్చి బల్లమీది కప్పులో పోసింది, ఎల్సా. పాలజగ్, పంచదార మగ్ కూడా దగ్గరగా వుంచుతూంటే, హిల్డా నవ్వుతూ అంది,

'మిత్రులిందరుండగా ఒక్కర్తెనే త్రాగనా? నాకు తోడెవరూ లేరూ? అతిథి విశ్వాసాన్ని తోసిపుచ్చడం న్యాయమే? ఐనాలే! నువ్వండీ యిల్లాచేస్తావనుకో లేదు!'

నన్ను సంబోధించిందేగాని ఆమె చూపులు విస్సో యెదుటనున్న ఖాళీ కప్పుమీదేవున్నాయి. ఇక వూరుకుంటే బాగుండదని నేనన్నా.

'ఎల్లా! మాకు కూడా కాస్తకాఫీ పొయ్యి! ఇల్లా కూర్చోవమ్మా, నియీంతీ!'

ఆమె కూర్చుని, కోపీతీసి చేతబట్టుకుంది. చక్కగా దువ్విన జుట్టు జడగా అల్లి వెనక్కి వేసింది. పల్చగావున్న ఆకుపచ్చగౌను ఆమె కెంతో అందంగా వుంది. ఆమె దుస్తుల నుంచి వచ్చే సువాసనలతో గదంతానిండి, ఆకస్మికంగా వసంతలక్ష్మి ప్రత్యక్షమైనట్లుంది.

నే నెంతో ఆసక్తితో కాఫీని గుటకలు వేస్తున్నాను. అటువంటి అపురూపపు అతిథి వచ్చినపుడు మర్యాద నతిక్రమించడం నావంటి గృహస్థుకి ధర్మంగాదు గదా. కాని, విస్సో వాడు తన కాఫీ ముట్టనైనా లేదు! ఎక్కడికో తొందరగా వెళ్ళేవాడిలా లేచి నిలుచున్నాడుకూడా, బాకును ఒరలో వుంచుకుంటూ. శిరఃకంపంతోనే మా అందరిదగ్గరా వీడ్కోలు తీసుకుంటూ, అన్నాడు.

'అన్నయ్యా! మళ్ళీ యింకోసారి వస్తా లేరా!

'సరే. మరి!'

వాడు కొండదిగిపోతూంటే నేను కిటికీలోంచి చూస్తూనే వున్నాను. ఏటి దరికిదిగి, మలుపులో ఒక్క నిముషం కనుమరుగై, ఆ వెంటనే బల్లవంతెనమీాద కన బడ్డాడు. వాడి బరువుకి బల్ల వంగిపోయిందే గాని వాడు మాత్రం యెంతో లాఘవంగా నడుస్తూన్నాడు. నీలిసూటులో వాడెంతో ఆకర్షనీయంగా కనిపించేడేమో, వాడి వెడద మూాపు నా కన్నులికి పండుగ చేసినట్లైంది, మళ్ళీ.

ఔను! అంతా అనుకుంటూన్నాకానీ నేనే ఏమో అను కున్నా. ఐతే నిజమేకావచ్చు. బాక్సింగులో మా వాడు యీా మధ్య చాలమందిని చిత్తు చేసేడనుకున్నారు. మ త్రీరు వోనకాసాలో, తోయ్ వోకోస్కీనెన్, యింకా కొందర్నీ గెలిచేడన్నమాట నిజమేనన్నమాట. ఆరిపిసుగూ! వాడి భుజాలు, వడీ చూస్తూంటే అందులో అసంభవం యేమిాా లేదని అప్పుడే అనుకున్నా. ఈ మధ్య మావాడు బాగా కండ పెట్టేడు, మనిషి బాగా వెడల్పయేడు.

భూస్వామి కుర్కిమాకీ కుమారుడు విహ్టోరీ ప్రతిసారీ సెలవులకి యింటికి వస్తూంటాడు. ఆ సమయాల్లో తప్పకండా కిపీమాలోని కార్మిక క్లబ్బులోను, లప్పెన్ రంటాలోను బాక్సింగు పోటీలు పోట్లాడుతూంటాడు. మా విల్హోకూడా కార్మిక క్లబ్బులో సభ్యుడే. మా ప్రాంతలో కుర్రాళ్ళు బాక్సింగులో ఉద్దండపిండాలులెండి. కార్మిక క్లబ్బులో చాల మందిని విహ్టోరీ బాక్సింగు రింగులో మొదటిచుట్టులోనే

చిత్తుచేసేసేడు ! ఒక్క మత్రీరుగోవకాసాలోమాత్రం మిగిలి పోయేడు. వాడు విస్హాటోరీని దెబ్బకి చిత్తుచేసి పడగొట్టేసేడు!

విహ్లోమాత్రం విహ్టాటోరీతో యెన్నడు భేటీపడలేదని చెప్పడం మరచేపోయేను. విస్హాటోరీని మత్రీ చిత్తు చేసేడు. అంతే. విహ్లో ముందరికివచ్చి మత్రీని సవాలుచేసేడు. మూడో చుట్టులోనే మత్రీ మట్టికరిచేడు ! ఇంకోసారేమైందను కున్నారు ? విస్హాటోరీని తోమ్ వ్కోస్కీనెన్ ఓడించేడు. కొద్దిదినాల్లోనే కోస్కీనెన్ విహ్లో సవాలు నంగీకరించడం, చిత్తు కావడం జరిగిపోయింది. కోస్కీనెన్ యెడమ పిడికిలి వజ్రాయుధమే అనుకుంటూ రందరూ, అల్లాంటిది ఆతడుకూడ విహ్లో ముందు ఆరోచుట్టు దాటి నిలువబడలేకపోతే ! వెను దిరిగి పోతూన్న మూవాళ్ళ్లీ, వాడిభుజాల్నీ చూస్తూంటే యిందులో అసంభవమేమీ వుండదనేనమ్మకం నాలో కలిగింది.

మా యింటికీ కుర్కిమాకీల భవంతికీ మధ్యలో యింకో కొండవుందని చెప్పేనుకాదూ ? దాని చాటున విహ్లో కను మరుగైపోయిందాకా నియాతీహిల్డా అటువైపే చూస్తూండ డం నేను గమనించక పోలేదు.

అప్పుడామె మావైపు తిరిగి కులాసాగా చిరునవ్వుతూ కాఫీకప్పును చేతిలో పట్టుకునే సంభాషణ ప్రారంభించింది. నేను, ఎల్సా కూడా ఆమెవైపు ప్రసన్నభావంతోనే చూసేం. నియాతీ మా కామందుల ఆడుబిడ్డ. ఈమె వయస్సులో చిన్న దన్న మాటేగాని సజానికీమెకూడా మాకు యజమానే

గదూ ? హిల్డా పిల్లల నుద్దేశించి ఎల్సాతో ప్రసంగంలోకి దిగింది :

'పిల్లలెంతలో యెదిగేరు !'

ఎల్సా పిల్లలిద్దర్నీ పొదువుకుని, తెల్లని తలకట్లు సాదరంగా నిమురుతూ జవాబిస్తోంది :

'మా చిట్టి తండ్రులు పెద్దవాళ్లై త్వరలోనే మాకు సాయమవుతారు !'

నియాతీ కాఫీ త్రాగి, కప్పు టేబిలు మీద వుంచింది :

'ఎల్సా ! మీ ఆదరణకి వందనాలు. వద్దు, వద్దు, యింకొద్దు ! ఇప్పటికే యెక్కువైంది. కాఫీ యెంచక్కగావుంది !'

నేనంతలో మాటకలిపి అన్నాను :

'ఇక్కడకి రావడం నీకు ఆహ్లాదకరంగావుంటే తరుచు వస్తూండమ్మా. నీ కెల్లాంటి అభ్యంతరంలేదు. నువ్వొరావడం మా కెంతో సంతోషం అనుకో. ఓ కప్పు కాఫీ అతిధికి యివ్వడం మా కెప్పుడూ యిష్టమేనమ్మా, నియాతీ !'

తొడిగిన చిలకరంగు ఫ్రాకును నడుందగ్గర తెల్లటి పటకాతో బిగించిందామె. లేచినిల్చుని ముడుదలుపడిన ఫ్రాకును, పటకాను సరిచేసుకుంటూ మాకు వందనాలు చెప్పింది. పటకాదగ్గర ఆమె నడుము యెంతసన్నంగా వుంది ! నారెండు జానలూ కలిపితే వాటిమధ్య యిముడుతుంది, హిల్డాకన్య నడుం ! దానిక్రిందా, పైనాకూడా అవయవాలన్నీ వుండాల్సిన పరిమాణంలోనే వున్నాయి. స్త్రీల పత్రికల్లోని ఫాషన్ ప్లేట్ల నమూనాగా వుందామె !

నియీాతీ హిల్డా ఆకర్షణీయమైనదే గాని ఒక్కటే లోటనిపించింది, ఆమెఅందానికి. చిన్నముక్కు కొంచెం వెడదగావుంది, నోరుకొంచెం పెద్దదనిపిస్తూంది. అదొక లోటు కాదనుకోండి. పెదవులకి రంగు వేయకపోయినా దొండ పండ్లే అనుకోండి. టోపీ సరిచేసుకుంటూ, చిరునవ్వుతూ హిల్డా మావైపు చూసింది.

ఆమె నవ్వు చూస్తే నాకెల్లాగో అనిపించింది. పెదవులు చిరునగవులో వికసించినట్లున్నా ఆమెలో యేదో విన్నదనం గోచరిస్తూంది. ఎక్కుపెట్టిన విండ్లలాటి నల్లని కనుబొమలు భ్రూమధ్యంలో ముడివడి వున్నాయి. ఆ బొమముడి హాస జన్యమైనది మాత్రం గాదని చూడగానే తెలుస్తూంది. పింగళ వర్ణంగావున్న విశాల నేత్రాల్లో కూడా సంతోషచ్ఛాయలు తోచడమేలేదు. భ్రుకుటీ విక్షేపాన్నిబట్టి ఆమె యెందుకో ఆశ్చర్యపడుతూందని స్పష్టం. ఆమె మా దంపతులవైపు చూస్తూందేగాని ఆమె దృష్టంతా యెక్కడో వుందని యిద్దరం గ్రహించుకున్నాము.

'వెళ్ళివస్తా' నన్నపుడామె దేనినో మరిచిపోయినట్లు చుట్టూ చూపులు బరపింది. ఆమె యింకేదో మాతో మాట్లాడ గోరుతూందని గ్రహించి, నేను అందించేను :

నియీాతీ! తొందరేమిటమ్మా! వెడుదువుగాని కాస్సేపు కూర్చో!'

ఆమె ఆలోచన లెక్కడో వుంచుకున్నట్లు జవాబిచ్చింది:

'ఏమిటీ? ఒద్దు, ఒద్దు! వందనాలు. అబ్బే! పనేం లేదు. ఫూరికేనే, యీ దారిన బోతూ, ఓ మాటు చూడిపోదామని ... ... యిరుగూ పొరుగూ కదూ? అంతే.'

'నువ్వు చాల మంచిదానవమ్మా, నియీాతీ! ఎప్పుడేనా వస్తూంటావుగదూ? నిన్ను చూడ్డానికి మా కెప్పుడూ సంతోషమేనమ్మా!'

వాకిలివరకూ కూడా నడుస్తూ ఆమెను సాగనంపేను. నియీాతీ యెత్తుమడమల జోడుతోనే కొండ దిగుతూంది. ఆమె ఫ్రాకు వెడదమైనచోట అంచులు గమనవేగాను గుణ్యంగా పిరుదులమీద నాట్యమాడుతూన్నాయి. పరిపుష్టములైన పిక్కలమీద గులాబిరంగు స్టాకింగులు మీాద చూపులు జారిపోతూన్నాయి. నియీాతీ చక్కని చుక్క!

---

## ఆరో ప్రకరణం - యుద్ధం రానేవచ్చింది!

విక్టో మళ్ళీవస్తానని చెప్పి వెళ్ళేడేగాని తిరిగిరానేలేదు. వాడదే ముందిగాని, వాళ్ళే వాణ్ణి రానీకండా చేసేరంటేనే బాగుంటుంది. మా వాణ్ణి పటాలంలోకి పట్టుకుపోయేరు. ఆ శీతకాలం మాకూ బోల్షివిక్కులకీ యుద్ధం ప్రారంభమై, ముమ్మరంగా సాగుతూంది. కాస్త దారుఢ్యం గల మగాళ్ళ నందర్నీ యుద్ధంలోకి లాక్కుపోయేరు.

వాడు క్రీమరీలో పనిచేస్తున్నాడని చెప్పేనుకదూ ? అది జాతీయావసరమైన పరిశ్రమగా ప్రభుత్వం ప్రకటించింది. అంటె అందులో పనిచేసేవాళ్ళు పట్టాలంలోకి పోనక్కర లేదన్నమాట. అయినా వాణ్ణి పట్టాలంలోకి తీసుకుపోయే రంటే, కారణమేమిటో తెలుసుకోవాలని యెవరికైనా వుంటుంది. మా వాణ్ణీ, వాడి ధోరణినీచూస్తే యెవడికైనా ఒళ్ళుమండుతుంది. పిట్ట కొంచెం కూతఘనం అన్నసామెతగా వ్యవహరించి వాడు యజమాని ఆదరాన్ని కోల్పోయేడు. అంచేతే యీ పాట్లన్నీను.

క్రీమరీలో వాడుండడం అవసరమే. కాదంటే, అక్కడ పనిచేస్తున్న యితర కార్మికు లందరూ యెంత అవసరమో వీడూ కూడా అంత అవసరమూను. కల్లీ పోహాజ్‌కా ప్రభుత్వానికి రెండుజాబితాలు పంపించేడు. క్రీమరీకి అత్యంతావసరమైన కార్మికుల జాబితా ఒకటి, అనవసరమైన వాళ్ళ జాబితా రెండోది. మిగతావాళ్ళందర్నీ మొదటి జాబితాలో కెక్కించి, వీణ్ణో నొక్కణ్ణీ రెండోజాబితాలో చేర్చేడు, యజమాని. ఇంతకీ ఒకరి ననాల్సిన పనేమిటిలెండి ; మన బంగారమే మంచిదైతే...

ఆయన యజమాని. తనకు యిష్టులైన పనివాళ్ళని అతడు యెంచుకుంటాడు. వీణ్ణో శుద్ధ తెలివితక్కువగా ప్రవర్తించి వుండకపోతే వాడూ యజమానికి యిష్టుడుగానే వుండేవాడు. వాళ్ళిద్దరి మధ్యా యే పొరపొచ్చెములూ లేకుండా వుంటే

కల్లీ ఫోఫ్ంజర్ పా వాణ్ణి వదల్చుకుందామని యెందుకు ప్రయత్నిస్తాడండీ? కల్లీ క్రీమరీ యుద్ధావసర పరిశ్రమల జాబితాలోది; అతడు తనదగ్గర పనిచేసే ప్రతి ఒక్కడూ తన కత్యం తావశక్యమనీ, యే ఒకడు తక్కువైనా క్రీమరీ మూసెయ్యాల్సి వుంటుందనీ, వెన్నను ప్లానుప్రకారం సప్లై చేయలేక పోతాననీ గనక దబాయించేడంటే సరి? ప్రభుత్వమేమో వెన్నను యెగుమతిచేయలేకపోతే యుద్ధం యెల్లాసాగుతుంది? అంచేత పరిశ్రమల యజమానులు చెప్పినట్లువినక ప్రభుత్వానికి గతిలేదుగదా!

కాని, — విల్సోయే పొగరుబోతుతనంగా వ్యవహరించి రంగమంతా చెడగొట్టేశాడు. కూలికివచ్చి పాలికి మాట్లాడితే యజమానీ అన్నవాడు ఊరుకుంటాడుటండీ? సరే, జరగాల్సిందే జరిగింది. తనలాంటి ముష్టి వెధవలు మరికొందరితో కూడి, కుడీ – యెడమా అనుకుంటూ, సిపాయిటోపీ-అంగీ – పంట్లాం, – అన్నీ దిక్కుమాలిన ఖాకీ రంగువే, – ధరించి, పల్లెటూరి మట్టిరోడ్ల వెంబడేపడి కాళ్ళీడ్చుకుంటూ, కాకిగోలగా పటాలప్పాటలు పాడుతూ మావాడూ పోవాల్సి వచ్చింది. తాను చేతులారా తెచ్చిపెట్టుకుంటే అనుభవించక తప్పుతుందా?

ఆ దిక్కుమాలిన పాటలు పాడడం విల్సోకి యేమంత ఆహ్లాదకరంగా వుండవులేండి. సిపాయి బ్రతుకులోని బండారం యెవరెరుగరంటా? పగవాడికైనా వద్దురా, బాబూ

ఆ సౌభాగ్యం! తనకి గాకున్నా యితరులకైనా సిపాయీల వల్ల యేమేనా ప్రయోజనముందా? అంటే అదీ పూజ్యమే. సిపాయీలు దున్నుతారా? విత్తుతారా? కోస్తారా? ఏదీలేదు. ముప్పూటలా మేయడం తప్పసుగదా, వాళ్ళకైనా, పై పెచ్చు యిసక రోడ్లమీద, ఓ గాడిద బరువు మోసుకుంటూ తిరిగే యీ దిమ్మరులకి ఓ ముద్ద యెక్కువేకావాలి! ఇల్లా తిరిగే యీ పలుగాకిమూకకోసం దేశంలో యింకో అంతెను ది ఓ ముద్ద తక్కువ తింటూ, యింకో రెండు గంటలుసేవు పనెక్కువచేస్తూ వుండాల్సిందే గదా? ఇన్ని తెలిసీ యుద్ధం చేస్తున్నామంటే యేం చేయగలమో చెప్పండి!

దీని కంతకీ మూలకారణం ఆ రష్యాయే. కాని, మా విష్ణు వున్నాడే వాడు రష్యాని పొగడని ఘడియ లేదు! లోకం అంతా కోడై కూస్తూంది, గాదుటండీ, ఆ రష్యాని గూర్చి? మా పత్రికల్లోను, పుస్తకాల్లోను, ప్రభుత్వ పత్రా ల్లోనూ, ప్రకటనల్లోనూ కూడా స్పష్టంగా రష్యాయే లోకంలోని చెడుగు కంతకీ కారణమని రాసేస్తే? బడిపిల్లలకి కూడా తెలిసిన యీ విషయాన్ని మా వాడు కాదంటాడు! ఊరందరిదీ ఒకదారీ, ఉలిపి కట్టెదొకదారీ అంటారు విన లేదూ? అల్లావుంది, మా వాడి సంగతి. ఈ యుద్ధాలకీ, యితర చిక్కులకీ యెవర్ని అనుకున్నా ఒప్పుతాడుగాని ఆ రష్యామీద యీగ వాలనివ్వడు గదాండి మా వాడు, వాడి దృష్టే వేరుట!

ఇదివరదాకా మా వాడొక్కడే అనుకున్నా గాని వాడి లాగే ఆలోచించేవాళ్ళు యింకా చాలమంది వున్నారని నాకు యీ మధ్యనే తెలిసింది. మీ మాట యేమోగాని నా కిది తెలిసి నప్పటినుంచీ యెంతో ఆశ్చర్యంగానేవుంది. శుద్ధీ బద్ధం లేదండీ వాళ్ళకి. అంతా ఒకటే మోస్తరు!

'చేన్ని కోరేమో అదే వచ్చింది!'

'ఆ! మన సుహాసినీకి పూర్వపు ఔన్నత్యం యిప్పు డొస్తుంది!'

'విత్తనం ఒకటీ, పంట యింకోటీ యెందుకవుతుంది?'

'ఈ గాడిద గత్తర చేసింది ఒకళ్ళూ, అనుభవించేది మనమూను!'

అంతా తలోమాటానూ, యీ వరసని! తలుపులు మూయగలం గాని నోళ్ళు ముయ్యగలముటండీ?

ఇల్లాంటి మాటలింకా యెన్నో, యెందరో అంటూంటే విన్నాక స్పష్టమైంది. మా విల్లో బాపతు జనం దేశంలో చాల మందేవున్నారు. అందులోనూ ముఖ్యంగా ఆ జంపం మిల్లు లేదండీ,– అహో సేద్దీ,– దాంట్లో పనిచేసే వాళ్ళంతా ఆ బాపతు వాళ్ళే! విల్లో దగ్గిర్నుంచి వుత్తరాలేవైనా వస్తున్నాయేమో తెలుసుకోడానికి జంపంమిల్లు కార్మికుల దగ్గిరికి అప్పుడప్పుడు వెడుతూండే వాణ్ణి. అందువల్ల తెలిసింది, వాళ్ళసంగతి నాకు! తా చెడ్డకోతి వనమెల్లా చెరిచిందన్నట్లు మా వాణ్ణి అసలు చెడగొట్టింది వీళ్ళే! వాళ్ళపాపం వాళ్ళనే

కట్టికుడిపింది లెండి. తగ్గ ప్రాయశ్చిత్తం జరిగింది. ఆ దరిద్రు లందర్నీ పాతాళంలోకి మెడబట్టి గెంటుకుపోయేరుట! ఆమాట విన్నాక నా మనసు కాస్త చల్లబడిందనుకోండి. అంపం మిల్లు చాలభాగం మూతబడి, ఒక్క చట్రంమీదే పని జరిగేది, ఆ తర్వాత.

ఎలియాస్ కూడా యీ సంఘటనలు జరిగేక యెంతో సంతోషించేడు:

'ఇల్లాంటి వెధవకభుర్లు చెప్పే సజ్జుని ముందుగానే రష్యా ఫిరంగుల యెదుటికి పంపడం యెంతో మంచిదైంది! దేశ ద్రోహులు! పిర్క్కలీ! వాళ్ళందర్నీ పురుగుల్లా యేరి పారె య్యాలి. మనలో విభేదాలువస్తాయని కాచుకూర్చున్న ఆ రష్యన్ నా కొడుకులికి తగినట్లు బుద్ధి చెప్తాము రా! ఫిన్నుల్లో రెండభిప్రాయాలు లేవు! ఫిన్నులంతా ఒక్కటిగా నిలవబడి తమ తల్లిగడ్డ సువోమీ కోసం ప్రాణాలు తృణ ప్రాయంగా అర్పిస్తారని ఋజువుచేస్తాం, పిర్క్కలీ! ఎటువంటి అల్లరి చిల్లరిపనులూ జరగకండా తగిన కట్టుదిట్టాలు తీసు కుంటూమోయ్, పిర్క్కలీ!'

వాడు అటువంటి కట్టుదిట్టాలు తీసుకుంటూన్నమాట వాస్తవమే. ఎవరేమనుకుంటూన్నారో వింటూ కనిపెడు తూనేవుండేవాడు, ఎలియాస్. యుద్ధాన్ని రష్యా కోరలేదనీ ఫిన్నుప్రజలూ కోరలేదనే, దీన్ని కోరి ప్రారంభించింది ఫిన్ లాండ్ పాలకవర్గాలేననీ యెవరో యిద్దరు యెక్కడో అను

కున్నారుట. ఆ సంగతి పోలీసులకో, మరొకళ్ళకో రిపోర్టు చేసి, ఆ దరిద్రుణ్ణి అరెస్టుచేయించేదాకా ఎలియాస్ నిద్రపోందే !

ఆ లాంటివాళ్ళని గూర్చి నిర్మొహమాటంగా వుండాలనీ, వెంటనే పోలీసువాళ్ళకి రిపోర్టు చేయాలనీ నాతోకూడా చెప్పేడు, ఎలియాస్. మన దేశంమీద రష్యా దురాక్రమణ గావిస్తూంటే యిటువంటి పంచమాంగదళాన్ని మనమధ్య వుంచుకుని వూరుకోడం గొరివితో తల గోక్కోడమేనని అతడన్నాడు. ఔనుమరి ? మాతృదేశంకోసం ప్రతిఒక్కడూ శక్తివంచన లేకండా పాటుబడాలి. యుద్ధరంగానికి పోలేక పోయినా యింకా యెన్నో అత్యవసర కార్యాలుంటాయి గదండీ ! యథాశక్తి !

యుద్ధం యెల్లాచెయ్యాలో చూపించడానికి ఎలియాస్ కూడా పటాలంలోకి పోవాలనే అనుకున్నాడు. కాని మధ్యలో ఓ చిక్కు వచ్చిపడింది. తాను యుద్ధావసర పరిశ్రమల్లో పనిచేయడంవచ్చింది, దిక్కుమాలింది ! వాడు యెల్లాగో మనసు సరిపుచ్చుకుని, అయిష్టమైనా వెనక్కి దిగజారిపోయి, క్రేమరీ పనిలోవుండే వీలైనంత అత్యధిక సేవ చేస్తాడు. మీరేమీ సందేహించనక్కర్లేదు, ఎలియాస్ విషయంలో. వాడు తనవిధి నెప్పుడూ, యెక్కువన్నా చేస్తాడు, పిర్కీలీ ! యుద్ధరంగంలో గాకండా వెనకనుంచే చేస్తాడండీ, వాడు. ఎలియాస్‌కీ నాకూ వున్న పరిచయాన్నిబట్టి, వాడు నన్నుకూడా జాగ్రత్తగా వుంటూండమని హెచ్చరించేడు, దానికేంలెండి.

# దక్షిణపవనం



## పదో ప్రకరణం — పావో పిస్కెనెన్

చేయాల్సిన పని చేతుల నిండుగా వుంది. యుద్ధపు రోజులు గాదండీ! అది తెలిసే నేనూ జాగ్రతగా వుంటున్నా. కామందు కుర్కిమాకీ అంటూనే వుండేవారు మనం వంచిన నడుంయెత్తకండా పనిచెయ్యాలని. ఎందుకంటూరా? మనంచేసే ప్రతీ అదనపు గంటపనీ రష్యాకు సమ్మెటపెట్టుగానూ, యుద్ధరంగం లోని మనవాళ్ళకి వత్తాసుగానూ కూడా వుంటుందిట!

మేమూ,- నేనూ, పావోకూడా అధికంగా పనిచేసే వాళ్ళం. కాని ఒకక్కప్పుడుమాత్రం పావో బారలు జాపుకుని, సణుగుతూ, సాధిస్తూండేవారు. ధాన్యాన్ని మోసుకొచ్చి భూస్వామి గాదెల్లో నింపడమూ, మాంసాన్ని వుప్పులో వూరవేసి పీపాల కెక్కించడమూ, యింకా యిల్లాంటివే నూటొక్కపను లుండేవి. ఇవి మేము చేయడంవల్ల రష్యాకి దెబ్బ యెల్లాగో, మావాళ్ళకి సాయం యెల్లాగో బుర్ర బద్దలు కొట్టుకున్నా పావో చిన్న బుర్రకి అంతుపట్టలేదు. ఇల్లాంటి చిన్న విషయాల్నే గ్రహించలేని మట్టిబుర్రని భుజాలమీద పెట్టుకుని ఒకర్ని నిందిస్తే ప్రయోజనమేమిటో మీరే చెప్పండి?

మూడ్పులైన తర్వాత అడివి కొట్టుడూ, కలపమోత; తర్వాత రాయితోలడం పూర్తిచేసేం. ఆ రాయంతా పిండి మిల్లు కట్టడానికి లెండి. సెంత్రా కుర్కిమాకీ ప్లానులు పెద్దవే. కల్లీ పోహాజన్ పా క్రీమరీకి పోటీగా ఒక పెద్ద క్రీమరీనీ, పిండి మిల్లునీ స్థాపించాలని ఆయన ఉద్దేశ్యం. పోహాజన్ పా క్రీమరీలో పని చేయడానికి వలసిన ప్రేరకశక్తి అంతా గుర్రాల వల్లనే లభిస్తూంది. అల్లా గాకుండా తన క్రీమరీనీ, పిండిమిల్లునీ, విద్యుచ్ఛక్తితో నడపాలని కుర్కిమాకీ ప్లాను. ఆ ప్రాంతం లోని రెండు సెలయేళ్లనీ కలిపి, ఆ నీటితో జలవిద్యుత్‌ను ఉత్పత్తి చేయాలని నిశ్చయించుకుని, ఆయనగారు అందు క్కావాల్సిన డైనమో, యితర యంత్ర పరికరాలకీ అప్పుడే స్వీడన్‌కి ఆర్డరిచ్చేసేరు. మా యజమాని ముందుచూపులో యెవరికీ తీసిపోడులెండి.

పని పూర్తై మోటారు విద్యుదుత్పత్తిని ప్రారంభించి నపుడు మా యింటికికూడా మెరుపు దీపాలు పెట్టిస్తానని ఆయనగారు ఓ రోజున నాతో చెప్పేరు :

'ఐనాకి ! నువ్వు నాకు నచ్చిన పనివాడివోయ్. నీవంటి వాడికి యేమిచ్చినా నాకు సంతోషమేననుకో. నీకు యిల్లు కట్టించడం, యివ్వడం అయిందిగదా ! ఇక దీపాలు పెట్టించ డమే తరవాయనుకో, కర్రెంటు రానీవోయ్. ఒక్కదమ్మిడి యివ్వద్దునువ్వు. కర్రెంటు ఊరికే నే యిస్తానులే. నువ్వూ, నేనూ బ్రతికున్నంతకాలం దీపాలు వెలిగించుకో. నేనేమీ

అనుకోను. ఎటొచ్చీ వైరింగు (ఎలక్ట్రిక్ తీగెలు) ఖర్చులు మాత్రం నీ ఖాతాలో ఖర్చురాస్తా. అంతే. ఏమంటావు ?'

ఆయనకి నామీదనున్న నిర్హేతుక కరుణ కేమని జవాబీయాలో నాకేం తెలియలేదు. ఏదో జవాబీయాలిగదా ! యని అన్నాను:

'మీ దయకి కృతజ్ఞుణ్ణి, బాబూ ! అపారమైన మీ కరుణకి అర్హుడనో కానో తెలియడమే లేదండి, అయ్యా !'

కాని, ఆయన నన్నే మీ మాట్లాడనీయకుండానే,-

'ఫర్వాలేదులేవోయ్ ! దాని దేముందిలే, ఐనాక ! మనం మానవులం. ఒకరికొకరం సాయపడుతూండాలి. అది ప్రతి ఒక్కరి విధిని. దేశానికి గడ్డుదినాలు వచ్చేయనుకో, యిప్పుడు. ఈ తుపాను నెట్లో యెదుర్కొని, కడదేరాలి గదా ! ఇందుకై శక్తివంచనలేకండా చిన్నాపెద్దా అందరం పనిచేయాల్సిందే ననుకో. భారంఅంతా దేవునిమీద వేసి, మనవిధుల్ని మనం నెరవేర్చాలి, తప్పదు.'

నేనింకేం అనగలను:

'కామందులు నన్నెరుగుదురు. నా రెక్కలలో శక్తి వున్నంతవరకు యేలోటూ......'

మాటమధ్యలో యజమాని అడ్డొచ్చి,-

'నే నెరగనుటోయ్ ! నీ విషయంలో నా కెప్పుడూ సందేహంలేదు.'

అంటూనే ఆయన వెనక తిరిగేరు, వెళ్ళిపోడానికి. ఆయనతో యీ సందర్భంలో యేవో నాలుగుమాటలు చెప్పడం

బాగుంటుందని నా మనసులో యెంతో యిదిగా వుంది. కాని నోటమ్మట మాట పెగిలివస్తేనా? అంతకంతకి దూర మవుతూన్న ఆయనగారివైపే మౌనంగా చూస్తూ, యే ఆలోచనా తోచక అక్కడే స్రానులా నిలబడి పోయేను.

నా దృష్టి ఆయన వీపుమీదే నిలబడిపోయింది. నర్కి మాకీ స్కంధభాగం చిత్రమైనదిలెండి. భుజాలదగ్గర కంటె ఉదర భాగంలో యెక్కువ వెడల్పుగా వుంటుంది! అందు లోనూ బరువైన చలికోటు తొడుక్కున్నపుడా తేడా విస్ప ష్టంగా కానవస్తుంది; ఆయన కాళ్ళా అంతే. బొందల్లా లావుగా, బరువుగా దిమ్మెసాల్లా వుంటాయి. ఆ యేనుగు కాళ్ళతో భూమిమీద దబాయించి నిదానంగా అడుగు వేస్తూ, దాని బలాన్ని పరీక్షిస్తూన్నాడా? అన్నట్లు నడుస్తా డాయన.

అక్కడెంతోసేపు నిలబడేందు కేదీ? అవతల యెన్నో పనులు! తొందరగా గుర్రాల సాల వైపు నడిచేను. పావ్లో చాలసేపటినుంచీ పాగలోనే కూర్చుని గుర్రపు సామాను మరామతు చేస్తున్నాడు. వాడితో అన్నానుగదా:

'నువ్వీ చిల్లర పనులతోనే కూర్చుంటే యెల్లాగరా? మనం బండి తోలుకెళ్ళాలి, గుర్తుందా?'

వాడు నావైపు సాకూతంగా చూస్తూ అన్నాడు.

'పని కావచ్చిందిలే. ఇంక వాటిల్నే కొంచెం పొడుగు చెయ్యాలి.'

ఇల్లా అంటూనే పావో ఆరెను వాలు ముడిలో గుచ్చేడు. వాడెంత గింజుకున్నా ఆ ముడి విప్పలేక నే పోయేడు. ఊరికే ఒగర్చుతూ, రొప్పుతూ గట్టిగా పట్టు పట్టే సరికి వాడి బండ వ్రేళ్లు తెల్లబారిపోయి, చేతులమీది నరాలుబ్బినాయేగాని ముడి లొంగలేదు.

'ఏదీ, యిల్లా యియ్యి!'

అంటూ వాలును వాడిదగ్గర్నుంచి పుచ్చుకుని చిటికలో ముడివిప్పి పొడుగుచేసేసేను. నా వ్రేళ్ళంత బలహీన మైనవి గావు లెండి. రెండో వాలు నందుకుని త్వరలోనే దాని ముడికూడా విప్పి సరిచేసేను.

పావో వ్రేళ్ళయినా అంత శక్తిలేనివిగావు. కాని, యీ మధ్య వాడి ఓపిక మరీ క్షీణించింది. వాడు ఆ రోజు కారోజు దిగనారి పోతూన్నాడు, మరీను.

వాడి చరిత్ర, పాపం, చాలా విషాదకర మైంది. చాల కాలం క్రిందటిమాట. కూలిపని చేస్తూనే కొంతడబ్బు మిగుల్చు కున్నాడట. దానితో స్వంతవ్యవసాయం పెట్టు కుందామని వాడి ఆశ! ఏదో కొంద్ర కాస్త కౌలు కిమ్మని వాడు కామందు కుర్కిమూకీని అడిగేడు. అంతా అనుకొనే మాటలుస్మండీ. వాడప్పుడు మాంచి ముమ్మరంగా వుండీ వాడట. మంచి పనివాడేమో బాగా సంపాదించీవాడు కూడాను. కౌలు పొలం తీసుకోడానికిగాని, యేదోకాస్త మడిచెక్కో, స్వంత కొంపో సమకూర్చుకోడానికిగాని వాడి

దగ్గర తగ్గ స్తోమతు వుండీదిట. మంచి హుషారైనవాడు కూడాను. తన కోర్కె సఫలమై తీరుతుందనే ధీమా వాడిలో పూర్తిగా వుండడంవల్లనే వాడు అల్లా వుండగలిగేడు.

మనకి కావలసిన భూమిని,– ఖరీదుకే అనుకోండి,– యివ్వడాని కెవడో సిద్ధంగా వున్నాడని ముందే ఆశలు పెట్టుకోడం దేనికి? అయ్యో! దేవుడా! మహిమలు, మంత్రాలు రోజులు పోయినాయోయ్! ఇల్లా అనేవాణ్ణి నేనెప్పుడేనా చూస్తానా? అనుకుంటూంటా.

'నేనూ సంపాదించే నండీ కొంతభూమి! ఇదివరకు నాకు చేరెడు భూమైనా వుండేదేకాదు. నిజం! ఇదిగో! చూడండి! కావాలంటే. నువ్వుకూడా కావాలంటే కాస్త తీసుకోవోయ్ నేనేం అనుకోను. నాకు తినా, కుడవా, ఒకరికి పెట్టా కూడా వుందిలే.'

ఈ విధంగా మాట్లాడగల అదృష్టవంతుణ్ణి చూడాలని, నాకు మహావుంది సుమండీ, చెప్పొద్దూ. అటువంటి పుణ్యశాలిని చూడాలని యెవరికుండదంటా?

స్వంత పొలం లభించే అదృష్టం పడుతుందని ముందాస్తిగా మనం యెప్పుడూ అనుకోనే కూడదు. ఎందుకంటే దృష్టి తగిలి, వచ్చేదికూడా బెదిరి పారిపోతుందంటారు! నా కటువంటిది కలిసొచ్చినా త్రోసిపారేస్తా! అనేటట్లుండాలి. పావో అందుకు సంసిద్ధుడుగా లేడేమో, తన ఆశలు విఫలమయేసరికి యీ లోకమే కలువుగా కనబడసాగింది. 'నాదీ అను కొనేం

దుకు జానెడు భూమైనా దొరకదురా, దేవుడా!' అనే స్థితికి వచ్చిన రోజునే పావో మొదటిసారి చిత్తుగా తాగేసేడు. రెండు రోజులుదాకా వాడీ లోకంలోనే లేడుట. ఓవారం పోయేక వాడు మళ్ళా పూర్తిగా పుచ్చుకున్నాట్ట!

అనవసరంగా తాగుడు మొదలెట్టి పాడై పోకపోతే, నానా పెడత్రోవలూ పట్టకపోతే ఆ పాళాన గమ్మున వుండి పోయి, రెండుమూడేళ్ళాగి మళ్ళీ అడగకూడదూ అంటూ? తాగడంవల్ల వాడికి వచ్చిన లాభం యేమిటి? తాగేవాడి దగ్గర డబ్బుంటుందిటండీ? కర్పూరంలా హారించి పోయింది. 'ఆ డబ్బంతా నాశనంగాక ముందే కామందుల్ని మళ్ళీభూమి యిమ్మని అడగరా' అని నేను సలహా యిచ్చేను. కాని, ఛస్తే మళ్ళా అడగను గాక అడగనన్నాడు వాడు.

పావో యెంత తాగినా యే గొడవా వుండేదిగాదు. యజమాని పొలాల్లో పనిచేసే పాలేర్లు, కూలీలు వుండడానికి కట్టించిన బారకీచుల్లోనే వాడి మకాం. చిత్తుగా పుచ్చుకున్నాక బారకీచులో వాడి మంచంమీద చతికిలపడి, మాటా మంతీ లేకండా యెదుటిగోడకేసే చూస్తూ, రెప్పలార్పకుండా కూర్చునే వాడు. అల్లాగే కొంతసేపుండిపోయి తర్వాత ఓ ప్రక్కకి తిరిగి పడుకుని నిద్రపోయేవాడు. అంతే.

ఆ బారకీచుల్లోనే నివసించే కూలీలు తరుచుగా పావోని యేడిపించుకుతిరిగేవాళ్ళు. వసంతఋతువంతా, వ్యవసాయపు రద్దీ రోజుల్లో చాలమంది రోజుకూలీలు కూడా పనిచేస్తూం

టారు. వాళ్ళందరూ కూడా ఆ బారకీచుల్లోనే మకాం. పావ్లో పిట్టలాంటి మనిషీ, నెమ్మదైన వాడూను. ఆకూలీలో! చెయ్యెత్తు మనుష్యులూ, చెడ్డగడబిడగాళ్ళూను. వాళ్ళెంత అల్లరిచేసి యేడిపించాలని ప్రయత్నించినా పావ్లో పసిపిల్ల వాడిలా తేటకళ్ళలోంచి అమాయికంగా చూస్తూ, తెల్లని కనుబొమలు కుంచించి మౌనంగా వుండిపోయేవాడు. వాళ్ళెప్పుడేనా మరీ పేట్రేగిపోతే మాత్రం చరాలున బాకు తీసేవాడు. అంతే. దానితో వాళ్ళు కిమ్మనకండా వూరుకుని తప్పుకునే వాళ్ళు.

పావ్లో పొలం సంపాదించేక పెళ్ళి చేసుకుందామని అనుకున్నాట్ట! వాడి కావరకే ఓ పిల్లమీద మోజు కుదిరిందిట. కాని ఆమె భూమి కొన్నాకగాని పెండ్లాడ నన్న దనుకున్నారందరూ. కన్నెతనం శాశ్వతంగా వుండిపోయేది గాదాయె. అల్లాంటప్పుడు హద్దూ పద్దూ లేకుండా యెంతకాలమని వేచి వుంటుందామె మాత్రం? భూమి మాట దేముడెరుగునుగాని యేళ్ళూ పూళ్ళూ గడిచిపోతున్నాయి! ప్రాణం విసిగి ఆమె యింకోణ్ణి చూసి, ముడెట్టుకుంది. పావ్లో హతాశుడై మిగిలున్న డబ్బుకూడా తాగి పాడుచేసేసేడు. పాపం!

నేను వాలుల్ని సాఫుచేస్తూ వాణ్ణడిగేను.

'ఈ వేళ వేటిని తోలుకెళ్ళాలిరా! త్వరగా గుర్రాల్ని బైటికి తోలు!'

'త్వరగా' అన్నప్పుడు పాల్ నాకేసి క్రీగంట సాభిప్రాయంగా చూసి, జవాబిచ్చేడు:

'జాత్రివె నెన్, రియూపన్.''*

'జాత్రివె నెన్‌ను ముందుగా తోలుకురా. కంఠతలాసిక తగిలించి చూద్దాం.'

నేలమీద చిందరవందరగా వున్న తోలుముక్కలు, సామాను సర్ది, ఒబ్బిడిగా పెట్టినతర్వాతనే పాల్ గుర్రాన్ని తీసుకొచ్చేడు. ఏవస్తువు యెక్కడపెట్టాలో పెట్టనిదే వాడికి తోచదు. సామానేదీ, చివరికి సూదికూడా చిందరవందరగా పారేయడు. సామానుకోసం ఓ చిన్నకొయ్యపెట్టె తయారుచేసేడు. కొవ్వొత్తిముక్కలు, తోలుముక్కలు, దారపుకొసలూకూడా యేరి, జాగ్రతపెట్టేకనే పాల్ వెళ్ళి జాత్రివె నెన్‌ను తీసుకొచ్చేడు.

జాత్రివె నెన్ పెద్ద రాకాసిలా వుంటుంది. ఆపేరు దానికి అందుకనే పెట్టేరు. దానిప్రక్కన పాల్ చిన్న పిల్లాడిలా వుంటాడు. వాడు దానికి కంఠె తగిలించడం పెద్ద తంటాగా వుండేది. జాత్రివె నెన్‌కి తల యెగరేసే అలవాటుందేమో, దానికి కంఠె తొడగాలంటే పాల్‌లాంటి వాళ్ళనిద్దర్ని ఒక రొకరిమీద నిలబెట్టాల్సిందే!

---

* గుర్రాల పేర్లు. 'జాత్రివె నెన్' అంటే 'రాకాసి' అనీ, 'రియూపన్' అంటే గ్రేళ్ళు లేక చెంగనాలు అనీ అర్థం.

కంఠతలాసికని తగిలించేక తోకపట్టీని బిగిస్తూ పావ్లోతో అన్నాను:

'రియాపస్‌ను కూడ బైటికి తీసుకురా. ఈవేళ యెనిమిది క్రోవలేనా వెయ్యాలి, కనీసం.'

పావ్లో రియాపస్‌ను తీసుకొచ్చి రెండో సరుగుడుకి పూన్చుతూన్నాడు. బాగా బలిసిన పృష్ఠంగలిగిన యెర్రటి గుర్రం, అది. తఱుచు కాళ్ళు గాలిలోకెత్తి చెలగాటలాడ టం దాని స్వభావం గనకనే దానికి ఆ పేరువచ్చింది. రెండు సరుగుడు బళ్ళూ పూన్చి బైలుదేరబోయే వేళకి తెల్లవారు తూంది. ఆ వెలుతురులో పావ్లో గుండ్రముఖం మీాది సన్నటి ముడుదల్ని స్పష్టంగా చూడగలిగేను. ఇటీవల వాడి పెదవులు మరీ పలుచబారి, కన్నుల క్రింద చర్మపుముడుదలు కొన్ని సంచుల్లాగ యేర్పడినాయి. వాడి చిన్నగడ్డం మాసి రడండంవల్ల మరింత కోనదేరినట్లు గానవస్తూంది.

ఆ వాడు మంచు అంటే లెక్కచేసే వాడే గాడు. చకచకా ఛడావుడిగా అటునిటు తిరుగుతూంటే నిప్పు తునకలాగే వుండేవాడనుకోండి. ఎప్పుడూ యేదోపనిచేస్తూ, అదీ యిదీ సవరిస్తూ, పని ఆలస్యమవుతూందని నన్నే కేకలేస్తూండే వాడు. అల్లాంటిది యిప్పుడు ప్రతీ పనిలోనూ వాడు వెనక బడ్డం, నేను తొందరచేయడం మామూలైపోయింది!

వాడు చిన్నతనంనుంచీ పనికి బాగా అలవాటుపడి వుండ టంవల్ల యెప్పుడూ వాడి చేతులు వూరికేవుండవు. ఇప్పుడు కూడా యేపనైనా తొందరగానే చెయ్యాలని వాడు ప్రయ

త్నిస్తాడు. కాని యేదో మూంద్యత, ఆశక్తత వాడి చేతుల్లో ప్రవేశించింది. అందుకనే నేను వాణ్ణి తొందరచేయాల్సి వస్తూంది, యిప్పుడు.

కంచె కొనలు రెండూ దగ్గరగా లాగడానికి తంటాలు పడడం చూచి నేను వెళ్ళి సాయంచేస్తూంటే, వాడి వూపిరి బరువుగా నా మొగానికి సోకింది. ప్రాతఃకాలమైనా అప్పుడు కూడా పావో త్రాగే వున్నాడని పసికట్టి, చలికి యెర్రబారిన వాడి చిన్నముక్కువైపు చూసేను. పావో పాదాలు నేలను తాటిస్తూ, చలిబాధ తీర్చుకోడానికి కొంకరించిన చేతులతో ప్రక్కల్ని రాచుకొంటూ, బరువుగా వూపిరితీస్తూన్నాడు.

'త్రాగడానికి వేళా పాళా లేదుట్రా? చివరికి యీ త్రాగుడే నీ ప్రాణాల్ని తీస్తుంది సుమా, పావో!'

అన్నాను వుండబట్టలేక. వాడు కోటు కాలరును పైకెత్తి, తోలుటోపీ చెవుల్ని భుజాలమీదికి లాగుకుంటూ బూంక రించేడు.

'పోరా, నా కెవడి సలహా అక్కర్లేదు!'

ఇంక యేం మాట్లాడతానో మీరే చెప్పండి? స్లెడ్జిబండ్ల తోకకమ్ముల్ని లోనికి తీసుకుని గుర్రాన్ని అదలించి అడివికి బైలుదేరేం. పొగమంచు దట్టంగా పట్టివుందేమో, దారి పొడుగునా దిగి, బళ్ళ వెనకే నడుస్తూ పోవాల్సి వచ్చింది.

పెద్దరోడ్డుమీద మంచు బ్రద్దలుగొట్టి, తొలగించేరు. అంచేత నా రోడ్డునే బడి రైలుస్టేషను దాకా పోయేము,

అక్కడ నుంచి మలుపుతిరిగి అడ్డుబాటనే ముందుకి సాగేము. అది సరాసరి అడివికి పోతుందే కాని రహదారీ అంతగా వుండదు.

పెద్దరోడ్డుమీద మాకెదురుగా యెందరో పాదచారుల్నీ, బళ్లన్నీ, మోటార్లనీ కూడ కలుసుకున్నాం. ఎదరబడ్డ ఓ ట్రక్కులోంచి యెవరో కేకేసినట్లైంది :

'హే ! ఐనారీ ? ఏయ్ ! పిర్కీలీ !'

హఠాత్తుగా సమీపంలోంచే ఎలియాస్ యెర్రనిముఖం, నల్లటిమీసం దూసుకుపోవడం చూసేను. ట్రక్కులోంచి బైటికివంగి, మిట్టెన్లు తొడిగిన చేతులు నావైపు వూపుతూ, నవ్వుతూన్నాడు, ఎలియాస్. వాడి తెల్లటి పళ్లు సూర్యకిరణాల్లో మంచులా మిలమిల మెరుస్తూన్నాయి.

వాడి ప్రక్కసీటుమీదే ఎల్సా కూర్చుని, యెదరగాలికి ముఖం త్రిప్పుకుని వుంది. ఈవేళ పాలట్రక్కుతో కెర్స్తీ యెందుకు పోలేదు చెప్మా ? ఆమె కీపూట యింక పనులేవీ లేవే ? ఒకవేళ ఎలియాసే మొగమోటపెట్టి ఎల్సాని రమ్మని వుంటాడా ?

ఎలియాస్ ముఖం నాకు మూరెడు దగ్గరలోంచి దూసుకుపోయింది. వాడిటోపీ, కోటుకాలరూ పిండిమంచుతో నిండిపోయి వున్నాయి. అదివరకెన్నోసార్లు దగ్గరలోనే ఎలియాస్ పళ్లికిలించడం చూసేనుకాని, అదేమి చిత్రమోగాని యీ సారే వాడిని సరిగా చూడగల్గే ననుకున్నా ! ఎదురు బోదు

దుగా పోతూన్న మేమిద్దరం చూసుకునేందుకు వ్యవధి నిముష మేనా లేకపోయినా ఎలియాస్ నిజస్వరూపాన్ని యిప్పుడే చూసేను !

ఆ మాటకి వస్తే వాడు నవ్వుతూన్నట్లేలేదు. నాతోడు ! ఆరోజున మంచు దట్టంగా పట్టివుంది. కాని సూర్యకిరణాలు సూదుల్లా పొడుచుకు వస్తూనే వున్నాయిలెండి. ఆ కాంతిలో చూస్తే వాడి మొగాన నవ్వూలేదు, సింగినాదం లేదు ! నా మాట నమ్మితే నమ్మేరు లేకపోతే లేదుగాని కేవలం నోరు తెరిచి, పళ్ళికిలించి, బోదురు కప్పలా యేదో అరుస్తూన్న ట్లనిపించింది.

అబ్బే ! ఎలియాస్ యెర్రని పెదవులమీదా కన్పించదు నవ్వు; సీమచింత గింజల్లాటి వాడికళ్ళల్లోనూ కన్పించదు ! కుక్కలా తెల్లటి పళ్ళికిలించి. నోరు తెరిచి, అరిచేడంతే !

'ఐనారీ ! హుషార్ ! మన సత్తా వాళ్ళకి చూపిస్తాంలే ! తొందర పడవద్దనరా ! షిర్కలీ !'

వాడి పూలు మిట్లెన్ను నేను కనుమరుగై పోయేదాకా వూపుతూనే వున్నాడు.

వాడో విచిత్రమైన వ్యక్తి. మంచివాడే అనుకోండి. దేశానికి అవసరమైనవాడూ గావచ్చు. కాని,- వాడు నా కళ్ళబడకండా యెక్కడో దూరంగా వుండిపోతే బాగుండును! ఎందుకో చెప్పలేను గాని, దాన్ని తగలెయ్యా ... ...

ఆ సమయాన్నే ఎల్సాకూడా నన్ను చూసి నవ్వింది. కేవలం కళ్లతోనే అనుకోండి! తెల్లటి శాలువలో చుట్టి వున్న గులాబి పూగుత్తిలాంటి ముఖాన్ని ఓక్షణం నావైపు త్రిప్పింది. అంతే. అంతలోనే మళ్ళా ఆమె ముఖం త్రిప్పేసింది! ఎదరగాలినుంచీ, ఎలియాస్ నుంచీ ఎల్సా ముఖం త్రిప్పేసుకుంది!

ఈ జీవితంలో నేను పొందిన వాటిలోకల్లా నా ఎల్సా అత్యుత్తమమైంది. ఈశ్వరుడు డామెకి దీర్ఘాయురారోగ్యాన్ని యిచ్చుగాక! అంతకంటె నేనేమీ చెప్పను.

---

## ఎనిమిదో ప్రకరణం – అరణ్య మార్గంలో

స్టేషన్‌లోంచి రైలుబండి అప్పుడే వెళ్ళిపోయింది. ప్లాటుఫారంమీద జనం యింకా సందడిగా వున్నారు. ఎందరో మా కెదురుగా వస్తూనూ వున్నారు.

మా కెదురు వస్తూన్న ఓ కారులో పరిచితముఖం కనబడింది. ఎర్రటి పెద్దనోరూ, నల్లని పొడుగాటి కనుబొమలూ చూసి ఆ ముఖం గుర్తుపట్టి, సంతోషంతో నాచేతిని ఊపేను. మోటారులో పోతూన్నది హిల్డా కుర్కిమాకీ. ఆహ్వాన పూర్వకంగా చేతినూపుతూ కేకేసేను :

'తెర్వ్! నియాతీ! తెర్వ్!'*

---

* ఓహో! చిరంజీవి! ఓహో!' అని అర్థం.

కాని, ఆమె నన్ను గుర్తుపట్టినట్టు లేదు. నా వైపు యేదో అనిశ్చితంగా తల పంకించిందంతే. ఆ తర్వాత పావో, నేనూ బళ్ళవెనక పరుగెత్తేటప్పుడు యీ సంగతి వాడితో చెపితే యే జవాబూ యివ్వకుండానే, అసహ్యంగా చిరునవ్వునవ్వి, చలికి నల్లబడిపోయిన ముఖాన్ని కోటుకాలరులోకి కుంచించి దాచుకున్నాడు!

నియీాతీ హిల్డావైపు ఆదుర్దాగా నేను చేయూపుతూ కేకేయడం, ఆమె గుర్తించకనే పోవడం ఆ దౌర్భాగ్యుడు కనిపెట్టే నవ్వేడు. నాకు చాల చిన్నతనం అనిపించింది సుమండీ చెప్పొద్దూ! మొగుడు కొట్టినందుకు కాదుగాని తోడికోడలు దెప్పినందు కేడ్చిందన్న సామెత నిజమే. నేను ముందు స్లెడ్జి* మీాద యెందుకు బైలుదేరేనా? అనిపించింది. వెనక స్లెడ్జిమీాదే నేనుంటే నా ఆదుర్దా, చేతి నూపడం, యివేవీ పావో చూసివుండేవాడు కాదు గదా? వాడు చూడకపోతే నేను సమర్ధించుకోవాల్సిన పనే వుండీదిగాదు. ఉపాలంభనగా వాడు పళ్ళికిలించేందుకు అవకాశమూ వుండేదికాదు! కానీండి. జరిగిందానికి యేంచేస్తాము?

ఏదైనా మంచి సెబ్బరలు కలిసే వుంటాయనుకోండి. నేను ముందు బండిలో యెందుకు బైలుదేరేనా? అనుకుం

---

* సరుగుడు లేక చరుగుడు. బండిలాగే యిదీ బరువులు మోయడానికీ, ప్రయాణాలకీ ఉపయోగం. చక్రాలకు బదులు మంచుమీాద జారే కమ్ములుంటాయి.

టూండగానే తగిన లాభమూ యెదురొచ్చింది! స్టేషన్ సమీపంలోనే రోడ్డుమీద ఓ పెద్ద ఖాళీపెట్టె పడి పగిలి వుంది. నున్నటి దేవదారు చెక్కలతో చేసి, లోపల పల్చని తగరపురేకు పరిచిన పాకేజిపెట్టె అది. బండినాపి, దాన్ని లోపల పడేసేను. కాని అంతలోనే అదెవరిదో నని సందేహం కలిగింది. ఆ సమీపంలోనే ఓ పాకదగ్గర మనుషుల్ని కేకేసి, అడిగేను:

'అల్లదిగో అక్కడ పడున్న పెట్టె మీదా?'

వాళ్ళంతా తమ రెవరిదీ కాదని తలలూపేరు. అది యిప్పుడు పూర్తిగా నాదే అదే గనక మా కామందుల పొలాల్లో యెక్కడేనా దొరికితే తీసికెళ్ళి ఆయన యింట్లో అప్పగించాల్సి వచ్చేది. కాని అదృష్టవశాత్తు యిది పబ్లిక్ రోడ్డుమీద దొరికింది! కుర్కిమాకీ భూములలోంచే పోయినా యీ రోడ్డుమీద ఆయనగారికేమీ హక్కులేదు. ఆ రోడ్డు మీద యెన్నో బళ్ళూ, కారులూ పోతూంటాయి, వచ్చీ పోయే జనానికి లెక్కేలేదు. అంచేతనే ఆ రోడ్డు కుర్కిమాకీకి సొంతసొత్తుగాదు. ఆ రోడ్డుమీద వున్న వస్తువులూ ఆయనివి గాదుగదా? పట్నానికిపోయే లారీ దేనిలోనుంచో అది జారి పడి వుంటుంది. దాన్ని నేను యజమానికి వప్పగించాల్సిన పని అసలే లేదు.

దాని చెక్కలూ, తగరంరేకూ పెట్టి, యే షెల్ఫో, చిన్న బీరువో చేసుకోవచ్చు. నెగడిమీద గోడని కొట్టినట్లైతే

షెల్ఫులో యే సామానైనా పెట్టుకోవచ్చు. షెల్ఫు లోప లంతటా పరవాలంటే అందులోని రేకు సరిపడదు. పోనీండి, క్రిందిఅరలకి యేవో రంగు కాగితాలంటించి చెక్కలు గాన రాకండా చేయవచ్చును. అదంతా ఆవిడకి తెలుసులెండి. తయారయేక చూస్తే షెల్ఫు మజాగానే వుంటుందిలెండి. షెల్ఫుకి కావాల్సిన మేకులు కూడా యీ పెట్టెనే వున్నాయి. దానికిపోగా యింకా మిగులుతాయి, కొన్ని.

నా కప్పుడొక విషయం జ్ఞాపకం వచ్చింది. వెనకోసారి కామందుల పొలాలలోంచి బులికిపోయిన చెక్కల షెడ్ని వాళ్ళముంగిటికి దొర్లించుకొచ్చేను. దానిలోంచి యెన్నో మేకులు పైకే కనిపిస్తూన్నాయి. ఆ షెడ్ని నేను దొర్లించు కొచ్చినా, మేకులు నావి గావుగదా. ఆ మేకులన్నీ పట్టు కారుతో పెరికి, దాగలిమీద సాపుచేసి, కామందురాలి కిచ్చేను. ఇంట్లో పెత్తనమంతా ఆమెదే లెండి. గాదులు, గొదాములు, కొట్టుగదులు, భోషాణాలు,- అన్నీ తాళాలు వేసి, ఆమెగారే దగ్గ రుంచుకొంటుంది.

స్నానాలగది కట్టుకోడానికి కొన్ని పాతచెక్కలలోని మేకులు నేనే తీసుకున్నాను; వాటి ఖరీదు నేను చెమటోడ్చి చెల్లించుకున్నాను గదామరి ?

మరోసారి నాకు అడవులదగ్గరలో యేదో రెంచి దొరి కింది. యజమాని భూమిమీద దొరికింది గనక దాన్ని ఆయన స్టోరుగదిలోనే యిచ్చేసేను. ఏ వస్తువుమీద హక్కు యెవరిదో నాకూ కొంచెం తెలుసులెండి!

ఇంకోసారి. హైరోడ్డుమీద గొళ్ళెం తెగిన గుర్రపుకళ్ళెం దొరికింది. దాన్ని కుర్కిమాకీ కివ్వలేదు నేను. ఆ చుట్టుపట్ల యెవరిదైనా పోయిందా? యని వాకబుజేయగా అంతా లేదన్నవాళ్ళే. అప్పుడుదాన్ని యింటికి తీసుకెళ్ళి, ఎల్సాతో పరిహాసంగా అన్నాను:

'ఎల్సా! చూసేవా! మనకిప్పుడు కళ్ళెం యెల్లాగో అమరిందనుకో. గుర్రం ఒక్కటే తరవాయి. అదికూడా లభిస్తే మన కెంతో వుపయోగంగా వుంటుంది!'

ఆమె ముఖంమీద చిరునవ్వు తొంగలించింది. కాని అది సంతోషజన్యమైనది మాత్రంగాదు!

స్వంత గుర్రాన్ని గూర్చి తలపెట్టడం నాబోటివాడికి హాస్యాస్పదమైనదిలెండి. అబ్బో! గుర్రమే! నాబోటివాడికి! నక్క యెక్కడ? నాకలోక మెక్కడ? ఆవుని కొందామని యెంతకాలంనుంచో అనుకుంటూన్నాము, నేనూ, ఎల్సా. పైసా పైసాచొప్పున పొదుపుచేసి జాగ్రత పెడుతూన్నా కూడా యింతవరకు అలవిగాలేదు. ఖర్చు తగ్గించుకోడానికి యెన్నో వుపాయాలు అవలంబించేము. అంతవరకూ తెప్పిస్తూన్న 'సుహోమెక్ కువలేతీ' (బొమ్మలపత్రిక), 'కన్సర్ తోర్త్' (పాప్యులర్ లేబర్) వార్తా పత్రికా, రెండూ మానేశాను. పొగత్రాగటంకూడా తగ్గించేను. తగ్గించేనన్నమాటేగాని ఒక్క దమ్ముకోసం నా మనసు యెప్పుడూ పీకుతూనే వుండేదనుకోండి. ఇంతాచేస్తే ఆవును కొనగలి

గామూ! అంటే అదీసున్నే. కొనబోతే కొరివీ, అమ్మబోతే అడివీ అన్నట్లున్న యీ రోజుల్లో నాబోటి సన్నరకానికి తిండికి పోగా మిగలడంకూడానా? కూలోళ్ళకీ, పాలేళ్ళకి యింతకు మించి యేముంటుంది, ఏటిమీద యేరొచ్చినా కుక్కకి కతుకునీళ్ళే గతి? అన్నసామెత విన్నారుగాదూ?

సిరీ సంపదా సుఖసుఖాల వస్తాయా? అబ్బే! చిల్లిగవ్వ దగ్గర్నుంచీ సిగ్గూ శరమూ లేకండా ప్రోగుచేయడమే పనిగా పెట్టుకోవాలి. కాస్తా కూస్తా ఊర్చి, చేర్చి ప్రోగుపెట్టడమే గాక ఆస్తే ఖర్చుగాకండా చూసుకుంటూ, పొదుపుగా వుంటేనే డబ్బుచేరుతుంది, యెవరిదగ్గరకైనా.

ఉదాహరణ కావాలంటే మా యజమానినే చూడండి. వాళ్ళింట యేదీ వృథా చెయ్యరు. పాతపీలికలు, చిన్న తోలు ముక్కలు, రబ్బరు ముక్కలు, పాతమేకులు, కాళీడబ్బాలు, పగిలిన సీసాలు,- అదీయిదీ యేమిటి? యిటువంటి చెత్త చెదారం అంతా ప్రోగుచేసి, వేటికవి కేటాయించి, యెక్కడికో పంపిస్తూంటారు!

అంతేకాదు. నిత్యం వాడుకునేవి, అరిగి విరిగి పాడైపో తూనే వుంటాయిగా? మరొకరైతే వాటిని పెంటకుప్ప మీద గిరగిరా త్రిప్పి పారేసేవాళ్ళు. కాని మా కామందు దేన్నీ అంతసులభంగా వదలడు. మాటి, మరామత్తు చేసి వాడుతూనే వుంటాడు! పొలాలకి పెంటతోలే బండి చాల పాతదైపోయింది. ఎన్నోసార్లు విరిగి, మూలబడుతూనూ

వచ్చింది. కాని, దాని విషయమై ఆయనతో ఎప్పుడు చెప్పినా 'బాగుచేయించాలి!' అంటాడు! మళ్ళీ మాట్లాడ లేక నేనే దాన్ని చెక్కలూ, మేకులూ కొట్టి, మాసికలు వేసి, మరామతు చేసి, వాడుతూండేవాణ్ణి. మళ్ళీ విరిగి దాకా వాడడం, విరిగితే మళ్ళీ బాగుచేయడం; యిప్పటికీ ఆ అతుకుల బొంతతోనే కాలక్షేపం చేస్తున్నాము. దాని స్థానే కొత్తబండికి ఖర్చు చేయాల్సిన సొమ్ము పిల్లల్ని పెడుతూ యజమాని దగ్గరేవుంది!

ఇంకో దేశంలో సంగతులు నాకు తెలియవుగాని యిక్కడ మా సుంోమీాలో మాత్రం యెవరేనా సంపన్నులవడం యిల్లాగే. ఇక్కడన్నీ రాళ్ళూ రప్పలే. అవి మానవుల్ని ఒకరినుంచి యింకోణ్ణి వేరుచేసి, వాళ్ళ హృదయాల్ని కూడా శిలాసదృశాలుగా చేసేశాయి. ఎప్పుడూ కురిసే మంచు వానలు కూడా యిక్కడి మనుష్యుల మనస్సుల్ని కొయ్య బారేట్లు చేసి, అనురాగ మార్దవాలు అపురూపం చేసి నాయి. బురదనేలలు, సరస్సులు, అడవులు మా దేశంలో సర్వే సర్వత్రా వ్యాపించి, మానవ సంబంధాల్ని మరుగు బరుస్తున్నాయి.

ప్రాకృతికమైన యీ ఆటంకాలే మళ్ళీ మానవులు సాగించే జీవిత పోరాటంలో వాళ్ళని అభేద్యంగా సంఘటిత పరిచేశీను! ఏమిటో యీ వైరుధ్యం!

మానవుల హృదయాల్ని శిలా సదృశాలుగా నొనర్చి, వాళ్ళని తోడేళ్ళలా భయంకరులుగనూ, కొరకొరలాడే వాళ్ళుగనూ చేసి; ఒకరొకరి సంపర్కం లేకండా తమ చుట్టూ రాతిగోడలూ, ముళ్ళ కంచెలూ నిర్మించుకునేట్లు చేస్తూన్నదీ యీ ప్రకృతి ప్రభావమే! మా సుహోమీ అంతా యిల్లాంటి కంచెలు, దడులూ, అడ్డుగోడలు, ఆటంకాలతో నిండి వుందనుకోండి!

మాటల ధోరణిని యెక్కడికో పోయేం! మంచు దట్టంగా పట్టిన ఆనాటి ఉదయాన ఆ అరణ్యమార్గాన మేము చాలా దూరంపోయేము. కురిసిన మంచుబిందువుల బరువుకి దేవదారు వృక్షాల కొమ్మలు నేలబారుకి వంగిపోతూన్నాయి స్లెడ్జి గుర్రాల భుజాలమీదుగా కాడికట్టుమీద విలువంపుగా వుండే నొగకి రాచుకుని కొమ్మలు మంచు బిందువుల్ని జల జలా రాల్చేవి. ఆ మంచు నామీద గాకండా వెనక బండి మీద కురిసి, పాహోని తడిపేసేది. తడిసినపుడల్లా వాడు క్రింది కురికి, మంచు దులుపుకుంటూ, బండి వెనక్కాలే పరుగెత్తుకు వచ్చేవాడు. అదీ ఒకందుకు మంచిదే ఐంది. పాహో పరుగెత్తకండా బండిలోనే కూర్చునివుంటే, వాడి పొట్టి కోటులోనే చలికి బిర్రబిగిసిపోయి వుండేవాడు!

మా బూట్ల క్రిందా, స్లెడ్జి రన్నర్ల* క్రిందా మంచు పట పట లాడ్డం, కిరకిరమనడం లేదు. ఒకటే మ్రోత పెడుతూ,

* స్లెడ్జి అంటే చక్రాలు లేని బండి. సరుగుడు అని చెప్పవచ్చు. మంచుప్రదేశంలో జారి, వేగంగా పోడానికి యిరుప్రక్కలా పొడుగునా ఆధారములైన కమ్ములుంటాయి. వీటిమీదే పరుగిడుతుంది గాన వాటిని 'రన్నరు' లంటారు.

క్రైంచ్‌మని పాడేది, మేం పోతూంటే. పైనుంచి కురిసే మంచు దట్టంగా పిండిలా పొడిగా వుండేది!

బోల్షివిక్‌ల పురోగమనం యెందుకు ఆగిపోయిందో ఆ సమయాన నా కర్థమైంది. ఆ యేడు శీతువు మరీ దారుణంగా వుందిలెండి. మా సుహోమీలో తుహినపాతం, హిమప్రవాహాలూ అధిగమించగల సైన్యాలు యెక్కడా లేవంటే నమ్మండి!

ఆ శీతువులో చలీ, మంచూ కూడా దుర్భరంగా వున్నాయి. మంచు కొల్లలుగా కురిసి, భూమ్మీద అన్నిటినీ కప్పేసి, బులబులాగ్గా పొరలుగా యేర్పడుతూంది. మేము అరవ మీదుగా కొండనెత్తానికి చేరుకుని చూద్దుము గదా, చూపు పారినంతమేర లోయా, అడివీ, రోడ్డూ అంతా పిండి ఆరబోసినట్లు తెల్లగా, వెండి సముద్రంలా, అలలు అలలుగా కళ్ళు జిగేల్మనిపించేలా కానవచ్చింది!

ఆ హిమసముద్రంలో మహా వృక్షాలు ప్రమానులు సగాని కంటా మునిగిపోయేయి. జీబుగావున్న చెట్ల కొమ్మలు కురిసిన మంచు భారానికి వంగిపోతూన్నాయి. ఫిన్లాండుతో యుద్ధం చేయడమంటే మాటలుగాదు! అసలు యీ మంచులో నాలుగడుగులు నడుద్దురూ, తెలుస్తుంది మజా! మొలబంటిగా మంచులో దిగబడి కెక్కు కెక్కుమంటూంటే యెక్కడినుంచో మెషిన్-గన్ గుండ్లు వర్షంలా కురిసి, నీ శరీరాన్ని తూట్లు తూట్లుగా కొట్టి పారేస్తాయి.

అక్కడ కొంచెంసేపాగి మళ్ళీ ముందుకు సాగుతూన్నాం. ఆకాశాన్నంటే చెట్లు ఆమూలాగ్రం పిండిమంచుతో తెల్లగా కనిపిస్తున్నాయి. తెలుపు, తెలుపు, తెలుపు! చూస్తూంటే కళ్ళు పీకుతాయి. మనసులో బెరుకు జనిస్తుం దెల్లాంటివాడి కైనా. అందులోనూ మార్గం పర్వతాగ్రశిలల్ని భేదించుకుని పోయినచోటా, నిటారుగా గోడల్లావున్న పెనుబండల మీదా భూర్జవృక్షాలు జీమూతాల్లా పైన వ్రేలాడుతూ, ఆ దృశ్యానికి అలవాటు పడనివాళ్ళ హృదయాల్ని ఘనీభవింపజేస్తూంటాయి.

పొగమంచుతో పరివేష్టితాలైన పెనువృక్షాలు వడగండ్ల బరువుకి వంగిపోయి ప్రాచీన గాధల్లోని వృద్ధరాక్షసుల్లా నిలబడి వుండేవి. వాటిని జయించడంమాటటుంచి, సమీపించు,- నీ పస కనిపిస్తుంది. హిమప్రవాహాలే సజీవములైనట్లు ఒక్కుమ్మడిగా గుండ్లవర్షం కురిపించి, తల వ్రక్కలుచేసి, అగాధాల్లోకి దొర్లించేస్తాయి.

ప్రకృతి నిశ్చైతన్యమై స్థంభించి, ప్రాతఃసూర్యకిరణాల్లో గులాబిరంగుగా మెరిసే మంచులో కప్పడిపోయివుంటే అదో పీడకలలా వుంటుంది! ఎంత గుండెదిటవుగల వాళ్ళనైనా చలింపచేసే భయానక స్వప్నం అది!

పిండిమంచుతో కప్పబడిన మా గుర్రాలు గాధల్లోని భూతాల్లా అగుపిస్తున్నాయి. ముకుపుటాల్లోంచి ఆవిరి మేఘాల్ని వెడలగ్రిక్కుతూన్న దయ్యం నా బండిని లాగుతూ

పరుగెత్తుతూందనిపిస్తూంది! వాతావరణంలో రక్తపువాసనే గనక లేకపోతే అదంత భయావహమైనది గాకనేపోను; అంత దట్టమైన మంచులోనూ సుఖంగానే వూపిరి తీయగలిగే వుందురు మానవులు. ప్రభాతసూర్యునికిరణాలుకన్నులపండువు గానే వుండేవి; హిమబిందువులు తోరణాలుగా వ్రేలాడు తూన్న గుర్రాలు భూతాల్లాగాక దేవతామృగాల్లా అని పించేవే!

ఈ జగత్తునంతనీ యీశ్వరు డనేకరీతుల్లో సౌందర్య పూరితం చేస్తూన్నాడు. ఆయా ఋతువులూ, వాటిలో ప్రభ వించే ప్రతీదీ కూడ అత్యద్భుతసౌందర్య గలవే! ప్రాణు లీ లోకాన్ని ప్రేమించేట్లు చేయడానికే దాని నంతటి సౌంద ర్యంతో నింపింది! కాని, యేదీ? మానవులకు ఆ సౌందర్యాన్ని చూడ్డానికి తీరికేదీ? కన్నులేవీ? మానవులంతా ఒకరినొకరు హింసించుకుంటూనో, వెన్ను విరిగే గాడిదచాకిరీ చేస్తూనో వుంటూన్నపుడీ ప్రకృతి సౌందర్యం యెవడికి కావాలంటా?

అల్లాగని యీ హింసాకాండంతా, దాపరికం యెందుకు? యుద్ధమే అనండి,- నేనూ, పావో కోరి తెచ్చేమనుకున్నారు గనక! మాకున్న యీ సంపదలు పోతాయేమో ననే భయంతో యుద్ధానికి దిగేమా? ఔను! ఫిన్నిష్ ప్రజలు యుద్ధాన్ని కోరేరంటే, నా బోటివాళ్ళున్నమాటే! నేనూ, పావోను! హ్హాఁ! హ్హాఁ! హ్హాఁ!

కాని, మా విట్టోకి యేముంది? మాకున్న ఐశ్వర్యసంప దలు వాడికి లేవుగా? వాడికూలి గంటకి తొమ్మిదిమార్కులు;

అంటే నా రోజుకూలికంటె వాడి గంటకూలి రెండుమూర్దు లు తక్కువ! అందుచేత వాడికీ జీవితంలో అనుభవించ దగిందీ అంతగాలేదు. ఇక అటువంటి నిర్భాగ్యుడెందు కోసం యిత రులమీాద యుద్ధానికి బైలు దేరుతాడో మీారే ఆలోచించండి?

పైగా విల్హో అంటాడుగదా, మా సువోమీా ప్రజలకంటె చుట్టుపట్ల అన్ని దేశాలవాళ్ళూ యెంతో బాగా బ్రతుకు తూన్నారని! లోకంయింతే నంటాడు, వాడు. సువోమీా తప్ప మిగతా అన్నిచోట్లా ప్రజలు స్వర్గ సౌఖ్యాలనువిభవిస్తు న్నారట! ఇక 'రష్యాసంగతి వాడేమీా చెప్పనే అక్కర్లేదు !'

ఏ వాదాన్నైనా అనుసరించేవాళ్ళు లేకండా వుంటే అది పిడివాదంగానే వుండిపోతుంది. కాని యెంత పిడివాదం గానీండి, అనుసరించేవాళ్ళు చాలమంది తయారయేరంటే అదే వేదాంతం, సిద్ధాంతం ఐపోతుందనుకోండి. అందుకనే 'పదుగు రాడుమాట పాటియై ధరజెల్లు......' అన్నారు! అంత మందీ ఒక్కుమ్మాటుగా పిచ్చివాళ్లై పోతారని యెవరనగలరు? ఈ యుద్ధాన్ని ఫిన్నిష్‌పాలకవర్గాలే కోరితెచ్చి పెట్టేరన్నం దుకు ఎలియాస్ అరెస్టు చేయించిన వాళ్ళిద్దరూ మూర్ఖులు కారన్నమాట! పై పెచ్చు ఆ చుట్టుపట్ల చాలమంది, వాళ్ళు తెలివైనవాళ్ళూ గౌరవనీయులూ అంటూన్నారు !

ఇదంతా ఆలోచిస్తే,— ఏమిటోలెండి. ఐనా మా విల్హో నాకు తరుచుగా జాబులే రాయడు. ఐనా వాడురాసిన ఆ

వృత్తరంలోనే ఏమంటాడంటే,— 'నేనీ జాబులు తొందరగా ముగించాలనే యెంతో ఆతురపడుతూన్నాను. అన్నయ్యా! నేను విశేషంగా రాయడం మంచిదిగాదు. ఎందుకంటే రెండు పంక్తులకే తిట్లు ప్రారంభిస్తానని భయం. జరుగుతూన్నదానికి నేను తిట్టిపోయకుండా వుండలేకపోతున్నాను. పరిస్థితులమీద నాకెంత అసహ్యంకలుగుతూందంటే......' ఇదీ వరస!

మా వాడికంత అసహ్యం కలిగించిన ఆ పరిస్థితులేమిటో తెలుసుకోవాలని లేదూమీకు? తన కత్యంత ప్రేమ భాజనమైన రష్యాకి సమీపంలోనే వున్నాడుగా, యిప్పుడు? అటువంటి అవకాశాన్ని కల్పించిన పరిస్థితుల్ని దూషించడమెందుకంటూ? భూషించక? రష్యా మా సువోమీ పైకి దక్షిణాన్నుంచి కాల మేఘంలాగే విరుచుకు పడుతూందిగా? దాని రాకకై యెదురుచూస్తూ, ఆనందాతిరేకంతో నెమిలిలా నాట్యం చేస్తూండక, యీ చిరాకు దేనికంటూ?

ఇక మామాటా? నేనూ, పావో నాట్యంచేసే మనఃస్థితిలో లేము. మా ఆలోచనకు భాజనమైనవి రష్యా గాక మరెన్నో వున్నాయి! ఆ దేవుని వెలుగు, ప్రకృతి సౌందర్యం మాలాంటి వాళ్ళకోసంగాదు!

హెూత్రా కుర్కి మాకీ మమ్మల్ని ఊరికే తొందర చేసేస్తూన్నారు. అదివరకు కూడా ఆయనకి యేపనిలోనూ జాప్యం పనికిరాదనుకోండి. కాని యిప్పుడు మరీ యిదై

పోయింది. యుద్ధం జరుగుతూందని మాకు జ్ఞాపకం చేయకండా ఒక్కపూట గడవటంలేదు! మరి మేమూ మా శక్తివంచనలేకండా పనిచేస్తూనే వున్నాము. యుద్ధకాలం గదాండి; అందులోనూ మాతృదేశం ప్రమాదంలో వున్నపుడు యెవరు ఒళ్ళు దాచుకుంటారో చెప్పండి?

యుద్ధంరోజులు గదాండి; పని రద్దీరోజుల్లో మాత్రం మనుష్యులు దొరుకుతూన్నారా? అక్కడికీ హెంత్రా కుర్కి మాకీ ప్రయత్నంచేస్తూనే వున్నారు, కూలీల్ని తేడానికి. కూలీలు దొరకనీండి, దొరక్కపోనీండి, పనులేవీగా ఆగడానికి లేదుగదాండి! మామూలు వ్యవసాయం పనులుగాక మిల్లూ, క్రీమరీ కట్టుబడికి కలపకొట్టటా, చేరవేతా కూడా యిప్పుడే వచ్చేయీయెను.

అంచేత నేనూ, పావో పని కురదలా వుండకండా శాయశక్తులా పని చేస్తూనేవున్నాము. నూతన నిర్మాణాలకి కావాల్సిన రాయీ, కలపా, సున్నం,- యేదీలోటు రాకండా తోలుతూ లెక్కలు ముక్కలు చేసుకుంటున్నాం. బారకీ చుల్లో దండిగా కూలీలున్నప్పు డెల్లా జరిగేదో అల్లాగే యేలోటూ లేకుండా సరినొత్తుకు పోడానికే గాదండీ, మా ప్రయత్నం! దేవుడి దయవల్ల యీ యుద్ధం మంటూ ముగిస్తే, మళ్ళా శాంతి దేశంలో సుస్థాపితమైతే...... మాకు విజయప్రాప్తియై...... దేశం కాస్త చల్లబడితే... అప్పుడుమళ్ళీ మేంకూడా...... ఏమిటీ? మాకేమిటి?...

యుద్ధం ముగిస్తే మాబోటిగాళ్ళకేమిటి? ఏమీలేదు! అయ్యో! దేవుడా! అరటిపండొలిచి చేతబెట్టినట్లు అంతా స్పష్టమే. ఏటిమీద యేరువచ్చినా కుక్కకి కతుకనీళ్ళే! ఐతే మాకుకూడా స్వంతపొలం,- పోడూ బీడూ, చెట్టూ చేమా, దూడాదుడికీ అన్నీ వున్న స్వంతకమతం,- యెప్పటికేనా...... ఏమో? అల్లాంటి ఆశ యేమీ కనబడదు. ఏమిటో లేండి, నక్కఆశ! మా గతియింతే. ఏ కామందు కమతంలోనో అనుదినమూ కండలు కరిగించి పనిచెయ్యడం, కడపటికి కబళానికేనా గతిలేకండా......మాబోటివాళ్ళ బ్రతుకింతే గాబోలు!......

ఎందువల్లనో నీ బుర్రలో అన్నీ క్రుంగదీసే ఆలోచనలే గిర్రున తిరిగిపోతాయి. కరిచే ఆ చలిలో, మంచులో; హిమశ్వేతమై దీర్ఘమైన ఆ రోడ్డుమీద స్లెడ్జి రన్నర్లు* కైంయ్‌మని మోతపెడుతూంటే; రెండు ప్రక్కలా మంచులో దోగాడుతూన్న మహావృక్షాలు నిశ్చలంగా బ్రహ్మరాక్షసుల్లా నిలబడి చూస్తూంటే,- నీ వూపిరి స్తంభించినట్లూ, మెదడు బిగుసుకుపోయినట్లూ అనిపిస్తుంది.........ఐనా మాకు యిదంతా కొట్టిన పిండేలెండి!......

---

•

# దక్షిణపవనం

## తొమ్మిదో ప్రకరణం - కష్ట సుఖాలు

నేనెంతగా కాళ్ళు విరగద్రొక్కుకున్నా ఆరోజున యేడు త్రోవలు వేసేసరికే గగనమైంది. త్రోవకి రెండుబళ్ళమీదా రెండు బాదులు చేర్చేవాళ్ళం. చలికి యెముకలుకూడా కటకట లాడిపోయేయి. సాయంత్రం అయేసరికి మా తల ప్రాణం తోకకి వచ్చిందనుకోండి.

కష్టానికేంలెండి. అదేపోయిందిగాని. నేను పావో కంటె అదృష్టవంతుణ్ణనే చెప్పాలి. గుగ్గిళ్ళూ, సన్నగా నరికిన లేబచ్చికా కలిపి గుఱ్ఱాల ముందు పెట్టి, గాట్లో కాస్తకాస్త గడ్డి పడేసి మా యింటికి పోయేను. ఇల్లాలూ, బిడ్డలూ నాకోసం యెదురు చూస్తున్నారు; కణకణ లాడే నెగడి యెఱ్ఱటి నాలుకల్ని చాచుతూ నన్నాహ్వానిస్తూంది; ఉర్లగడ్డ ముక్కలు మూకుట్లో దోరగా వేగి, కమ్మని వాసనల్ని వెదజల్లుతూన్నాయి. ఈ వాతావరణం యెటువంటి కష్టాన్నైనా చేత్తో తీసిపారేస్తుంది గదా!

నేను సుఖదాయకమైన సంసార వాతావరణంలోకి అడుగిడితే, పావో బావురుమంటూంటే బారకీచుల్లో, కొయ్యమంచంమీద యెముకలు కటకట లాడేట్లు దొర్లుతూండాలి, మరి, గుఱ్ఱాల చెమట ఆరేవరకు వేచియుండి, నీళ్ళెట్టి, మరి

కాస్త గడ్డేసి మరీ తిండికి పోవాలి. అన్ని గుర్రాలకీ వాడే నీళ్ళూ మేతా చూడాలి. మళ్ళీ తెల్లవారుఝామున నాలుగు గంటలకి అన్నిటికీ వోట్లు వెయ్యాలి, నీళ్ళు పెట్టాలి. పాలకత్తె కెర్స్టూ లహూతీనెన్ కూడ బారకీచుట్లోనే వుంటుంది. ఆమెకీ యిల్లూ, వాకిలీ లేదు, పెళ్ళి కాలేదు. ఆమె యింత వుడకేసి పెడితే యేం తినేవాడో, యెప్పుడు కొయ్య మంచం మీద మేను వాల్చేవాడో యెవరికీ తెలియదు. పాపం! వాడి ఒంటరి బ్రతుకు అల్లా ఐపోయింది.

పాన్నో భోంచేసి వెళ్ళేక ఆమె వంటగది సవరించి తన గదికి బోయింది. అక్కడ ఓ గంటసేపు యే పత్రికో చూస్తూ కూర్చునేది, కెర్స్టూ. సాధారణంగా 'వైకోన్ లోవ్పూ' (వారాంతం) వార పత్రికలోని యే 'నిజమైన ప్రేమకథ' నో చదువుతూనో, దాంట్లో ప్రకటించబడిన పడుచు వాళ్ళ చిరునామాలకి జాబులు రాస్తూనో, అదీ గాకపోతే ఆ పత్రికకి పంపడానికి తానే ఒక ప్రకటనను తయారు చేస్తూనో కాలక్షేపం చేస్తుందామె.

సాధారణంగా ఆ ప్రకటనలన్నీ ఒకమాదిరిగానే వుంటూంటాయి:

'కావాలి! యువకులు కావాలి!'

'ఇదిగో! వినీలకేశులూ, సుదీర్ఘ శరీరులూ ఐన యువకుల్లారా! మంచి తరుణం! మించబెట్టి 'కించనొందకండి!

'చక్కనిచుక్క, కమనీయ స్వభావ, కాన్వాసుకి ఐన తరుణీమణి స్నేహపూర్వకంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేందుకు వాంఛిస్తూంది.

'మీ జాబును, ఫోటోతో సహా యీ చిరునామాకు పంపగోర్తాను.' ... ... ...

పాపం! కెర్స్తాకి దేవుడు రూపాన్నియలేదు. ముఖా ముఖిగా యెదుటబడి యే పడుచువాణ్ణీ ఆమె ఆకర్షించ లేకపోయింది. పోనీ, యీ జాబులద్వారాగానేనా యెవడో ఒకడు ఆమెకి లభించి, కెర్స్తాకన్నె చెర వదలితే అంతే చాలు!

ఇంటికి పోయేక, దేవదారు పెట్టె క్రిందపెట్టి, యెల్సాతో అన్నాను:

'దీని చెక్కలతో ఆదివారం పెల్ఫు దిగ్గొడతా.'

బల్లమీద కూర్చుని పిల్లల్ని దగ్గరసా తీసుకుని తొడల మీద కూర్చోబెట్టుకుని లాలిస్తూ అడిగేను:

'నేను లేనప్పుడు మీరేం అల్లరి చేయలేదుగదా? ఏంరా? లవురీ! నువ్వు బళ్ళోంచి యింటి కెప్పుడు వచ్చేవు?'

నాలుగ్గంటలకి, నాన్నా!' అన్నాడు వాడు.

మార్తాను గాల్లో కెగరేసి పట్టుకుంటూ, ముద్దుగా వెన్ను చరుస్తూ అడిగేను:

'ఏం తల్లీ! ముందుటినుంచి నువ్వూ వెడుదువుగాని లే. అమ్మకి వెళ్ళాలని వుందా?'

దానిదేముంది లెండి. దానికి వెళ్ళాలనే వుందనుకోండి. కాని, ముందు దానికి బూట్లూ, చలికోట్లూ కొనాలి గదా? ఆమాట తలుచుకొంటేనే భయంగావుంది, చెప్పొద్దూ. కరువులో అధికమాసం అన్నట్లుంది. ఏది కొందామన్నా ధరలు మండిపోతూన్నాయామె. ప్రసంగం మార్చాలని, ఎల్సా నడిగేను:

'విశేషాలేమిటి? క్రీమరీ దగ్గర ప్రభుత్వ రేడియో ప్రకటన విన్నావా?'

'ఆ! విన్నా.'

'ఏమంటారు?'

'రష్యావాళ్ళకి తీవ్రనష్టాలు సంభవించేయట. కాని, వైపురీ కేసి పురోగమించేరట, కొంచెంగా.''

'విహ్లో యిప్పుడేమనుకుంటున్నాడో!' నాలో నేనే అనుకున్నా. వాడేమనుకుంటున్నాడో యెల్లా తెలుస్తుంది? వాడు రష్యా అంటే యేమిటో యిప్పుడు స్వానుభవం మీాద తెలుసుకుని వుంటాడు!

పిల్లలిద్దరూ యేవో పాతపేపర్లు తిరగేస్తూ, బొమ్మలు చూచుకుంటూ వాళ్ళధోరణిలో వాళ్ళున్నారు. నేనూ వుబుసుపోక పత్రికా సంపుటం ఒకటి తీసి పుటలు తిరగేస్తూన్నా, యేమీా చూడకండానే. కొంచెంసేపట్లో యింటి వెచ్చదనం నాలో వుత్సాహాన్ని, సంతోషాన్ని కలిగించి, మళ్ళీ ప్రకృతిలోకి దెచ్చింది.

ఎవరికైనా నాసరే స్వంత యిల్లు అంటూ ఒకటి వుంటే బాగానే వుంటుంది. బైట యెన్ని అవస్థలు పడినా, గడప దాటి యింట్లోకి కాలుబెట్టు. అంతే. మన కత్యంతా ప్తమైన, ప్రేమ భాజనమైన చిన్నలోకం యిక్కడే వుంది! తలుపు ఒక్కటే అడ్డు! వెలుపల కష్టం, చలి, శ్రమ, అసంతుష్టి,- అన్నీ పీడాకరములే. ఐతేనేం, నా కిప్పుడు అవేమీ పట్టవు! నా జీవిత మంతా యీ నాలుగు గోడల లోపలే వుంది. బైట యే కడగండ్లు గుడిచినా, కనీసం యీ చిన్ని ప్రపంచంలో నైనా నేను సుఖం, వెచ్చదనం. విశ్రాంతి, సంతుష్ఠి,- వీటిని రుచి చూడగలుగుతూన్నా, అంతవరకు అదృష్టవంతుణ్ణే!

నెగడి సమీపంలో యేదో పని చేస్తూందేమో, ఎల్సా ముఖం కంద గడ్డలా యెర్రబడి పోయింది. కవోష్ణమైన ఆమె బింబోష్ఠం యిప్పుడు మరింత వెచ్చగా వుంటుంది, బహుశా. కాని, ఆ సంగతి నిజమో కాదో తేల్చుకోవాలీ అంటే మా పెద్ద చిక్కొచ్చిం దనుకోండి. పిల్లలు అక్కడే వున్నారామె. ఇల్లాటి తమాషాలు వాళ్ళ యెదుటనే చేసే రోజులు వెళ్ళి పోయినాయి, వాటి దుంపతెగా!

ఏ మాటా లేకండా నిశ్శబ్దంగా వుండడం కిట్టక, అన్నాను. 'ఆ వేగడం చాల్లెద్దూ. బాగానే వుంటాయి. కాఫీవుందీ?'

'ఆఁ! వుంది!' అంది ఎల్సా.

నాకు హిల్డావిషయం చటుక్కున గుర్తొచ్చింది.

'చలికాలపు సెలవులకి హిల్డా వచ్చిం దనుకుంటా. ఏదో ఒకరోజు మనల్ని చూడ్డానికీ వస్తుందేమో ?'

'ఏం? ఎందుకు వస్తుంది?' తిరిగి ప్రశ్నించింది, ఎల్సా.

నేను జవాబిచ్చేను.

'క్రిందటిసారి యెందుకు వచ్చిందేమిటి ? ఇప్పుడూ అందుకనే వస్తుంది! అంతే. ఇరుగు పొరుగు వాళ్ళంగదా, రాకూడదూ ?'

బాణలిని తీసుకొచ్చి టేబిలుమీద వుంచి, పిల్లలకంచాల్లో ఉర్లగడ్డముక్కలు వేస్తూ, ఆమె అన్నదిగదా.

'ఆమె ఊరికే చూడ్డానికి రాలేదు!'

'ఐతే మరెందుకు వచ్చిందంటావు ?'

నా భార్య ఆలోచిస్తూ కాస్సేపు వూరుకుని, ఒక్కొక్క రొట్టే, ఫోర్కూ మా ముగ్గురి ప్లేట్లలోనూ వుంచింది. మేం తినడం ప్రారంభించేక గంభీరంగా అంది.

'నిన్ను చూడ్డానికి !'

నోట్లో నములుతూన్న ముక్కని మింగడం మరిచి, ఆమె వైపు కళ్ళుప్పగించి చూస్తూ వుండిపోయేను. ఆమె నావైపు చూడనైనా చూడనట్లు ఉదాసీనంగా చేతిలోని ఫోర్కును ఆడిస్తూ కూర్చుంది. వున్నట్లుండి ఆమె నవ్వేసి, అంది.

'ఏమిటి దయ్యాలు పట్టేలా అల్లాచూస్తావు? తినక !'

పిల్లలుకూడా బంగాళాదుంపముక్కలు ఫోర్కులతో గుచ్చి తింటూనే నవ్వేసేరు. గోడమీది అద్దంలోకి దొంగ చూపులు చూస్తూనే మళ్ళీ తినడం ఆరంభించేను. హ్హాఁ! హ్హాఁ! హ్హాఁ!......నా ముఖం చూస్తూంటే నాకే నవ్వొస్తూంటే!

మొహంలో నవ్వడాని కేముంటుందంటూరా? వుంది. నా మాట నమ్మండి. పొడుగైన పెద్ద కోలముఖం నాది. చింపిరిజుట్టు దగ్గిర్నుంచి గడ్డం కొనకి, వుంటుందో మూరెడు! బరువైన పెద్దదాడ, పెద్దనోరూ, దానికి తగినట్లే మందమైన పెదవులు! ఇక ముక్కో! అది ముక్కుగాదు, కాలి బూటు గాని! ముక్కు క్రింద పెదవిమీది స్థలం ఉబ్బెత్తుగా ఓ బెత్తెడు వెడల్పున అటునిటు వ్యాపించివుంది! అందులోనూ అప్పుడే మంచులోంచి వచ్చేనేమో యెర్రగా కందిపోయివుంది నా ముఖమంతా.

నా మొహం......ఆఁ! మొగాళ్ళకి అందం యెందుకు లెండి!......హ్హాఁ! హీ! హీ!......కాని, అది వుండే, మా ఎల్సా, అది మంచి వాటమైన పిల్ల లెండి. చిన్న ముక్కూ అదీ పొట్టిగా, దిట్టంగా వుంటుంది, లంజ! నవ్వుతుంది లెండి, దాని పని చెపుతా, తొందరపడకండి! పిల్లలకి కునుకు పట్టాలి; దీపం పెద్దది చేస్తుందిగా, అప్పుడు చెబుతా. బుగ్గలు, పెదవులు దొరికించుకుని...నవ్వేమిటో అప్పుడు తెలుస్తుంది!

మా యిల్లుందే, అట్టే పెద్దది కాదులెండి. గుమ్మంలోంచి యెదుటి గోడ దరికి నా అంగతో ఐదు అంగలుంది. తూర్పు గోడలో ఓ కిటికీ వుంది. ఇంటిమధ్య నాలుగైదు చెక్కలు* వాసి ఖాళీగా వుంది. ఇంట్లో కుడి భాగంలో నెగడీ, మేం పడుకునే మంచమూ సరిపడ్డాయి; యెడంవైపున కుట్టు మిషను, టేబిలు, పిల్లల మంచం, యీ వైపే రెండో కిటికీ ఉత్తర ముఖంగా వుంది.

ఇంటి కప్పూ, మంచా లున్నచోట గోడలకీ అట్టలతో సరంబీ చేసేము. లోతట్టు పూర్తిగా సరంబీ చేయడానికి సరిపడా అట్టలు లేవుమరి. అంచేత పాత పేపరు కాగితాలతో మిగిలిన చోటంతా అంటించేను. గోడలన్నీ మాసికలుగా కనిపించినా చలి నాపింది లెండి. మట్టి పిల్లైతే నేమండీ యెలకల్ని పట్టితే చాలదూ ?

వేపుడు కూర తింటూనే యెల్సాతో అన్నాను:

'ఎప్పుడూ వేపుడులో అంత నూని పోస్తావేమంటా ? చూడు ! మూకుడు అడుగున యెంత నూని మిగిలిందో ?'

ఆమె యే జవాబూ యీయలేదు. దానికర్థం ఆమె నాతో యేకీభవించలేదని. అల్లాంటి సందర్భాల్లో ఆలితో వాదించి, ఒప్పించగల వాడెవడూ వుండడు. బూర్లె మూకుడు

---

* చలిదేశాల్లో యిళ్ళు పూర్తిగా చెక్క దూలాలతో కడతారు. గోడలు, నేల, పైకప్పు,- అంతటా చెక్కలే. చలికి ఆగుతాయనే యిట్లు నిర్మించడం. మన దేశంలో సాధారణపు మట్టి యిండ్లలాగ అక్కడ కొయ్యయిండ్లు మామూలు.

పిల్లల దగ్గరికి నెట్టిం దామె. రొట్టె ముక్కల్ని దాంట్లో ప్రూట్సుకు తినమని వాళ్ళకి నేర్పిపెట్టింది లెండి.

మా యింట ఓవెన్♦ కట్టుకోనే లేకపోయేం. అందుచేత పొంగే బన్ రొట్టెలు చేసుకొనే అవకాశంలేక మామూలు పల్చని తాజా రొట్టెలే చేసుకొనే వాళ్ళం. ఎల్సా అప్పు డప్పుడు ప్రూరుకోలేక పొంగే రొట్టెలు చెయ్యాలని ప్రయ త్నించేది కాని అవి సరిగా వచ్చేవే గాదు. ఐనా మా యిల్లు చిన్నది; అందులో ఓవెన్‌కి తావుండదు. ఇంకా స్త పెద్ద యిల్లు, కనీసం రెండు గదులేనా వుండేదైతే వాటన్ని టికీ సావకాశం వుండే దనుకోండి. ఒకవైపు పిల్ల లిద్దరూ యెదుగుతూన్నారాయె. ఇంతమందికీ ఒకే గదిలో యిరుకిరు కుగా వుండడం యెల్లా సాధ్య మాతుందో చెప్పండి ?

ఇల్లు చాలదనుకుంటే సమస్య పరిష్కారం అవుతుందా ? కొత్తదీ పెద్దదీ యిల్లు యెల్లా వస్తుంది? ఈ ప్రశ్న నా మనసు నెప్పుడూ పీడిస్తూనే వుంది. ఎందుకంటే అప్పటికే నాకు ముప్పైఏడూ, ఎల్సాకి ముప్పై వెళ్ళేయి. కొత్త యింట్లో నూతన జీవితాన్ని యిక యెప్పుడు ప్రారంభిస్తా మంటా ? ఏదో ఒకటి తొందరలో ప్రారంభించకపోతేనూ, ప్రారంభించినా యేబోడి కొండమీదో, చిత్తడి నేలలోనో

---

♦ కుంపటి సరాసరిగా తగలకుండా వేడి మాత్రం తగిలేలా మట్టితో పూసి కట్టిన ఒక తరహా పొయ్యి. దీంట్లోనే బన్ను రొట్టెలు చేస్తారు.

ఐతేనూ దాన్ని నివాస యోగ్యంగా చేసుకొనేటప్పటికి మా తనువులు చెల్లిపోతాయి.

నాకు పళ్ళూ, పళ్ళతోటలూ అంటే మాచెడ్డ సరదా. ఐదారేళ్ళలోగా మా స్వంత పొలంలో పండ్ల చెట్లు నాటుకో గలిగే నంటే ఫర్వాలేదు. క్యారాంట్లూ, గూస్ బెర్రీలూ ఐతే ఫలితం నేను అనుభవించగల ననుకోండి. కాని ఆపిల్ చెట్లు నాటితే తినే సమయం వచ్చేసరికి, పన్నూ కన్నూ వుండొద్దూ ? అందులోనూ మాబోటి కష్టజీవులికి ముసలి తనం త్వరగానే పైబడుతుంది కూడాను. అడివి నరికి, మోడు త్రవ్వి, రొంపి నేల లెండగట్టి, రాయీ రప్పా యేరి బాగుచేయడం యెంత కష్టమో; రాత్రింబగళ్ళు విశ్రాంతి లేకండా వెన్ను విరిగే బండచాకిరీ చేస్తే ముసలితనం యెంత శీఘ్రంగా పైన బడుతుందో నాకు తెలుసు.

మా యింట్లోంచి చూస్తే అక్కడి లోయంతా కట్టెదుట కానవస్తుంది. లోయ మధ్య సెలయేరు, రెండువైపులా అడివీను, అదంతా సాగులోకి తేడానికి మానవు లెంతకాలం నుంచి, యెందరు రక్తం ధారపోస్తే ఐంది ! పోడు కొట్టాలి, కాల్చాలి; మోడు నరకాలి, తవ్వాలి; బోదెలు తీయాలి, ముడుగు దింపాలి, రాయీ రప్పా యేరాలి, గట్టు వెయ్యాలి; దున్నాలి, మళ్ళు చెయ్యాలి; పంట పొలాలుగా చేయడ మంటే సుఖ సుఖాల అయ్యే పనా ?

ఎల్సా గులాబి చెక్కిళ్ళవైపూ, అద్దంలోని నా ముఖం వైపు చూస్తూ, కాఫీ మెల్లిగా గుటక వేస్తూ ఆలోచిస్తూన్నా: మేం యింకా యెంతకాలం దార్ఢ్యంగా వుంటామేమిటి? జీవితాల్లో చెప్పుకో తగిందాంట్లో సగంపైగా గడిచేపోయిం దప్పుడే! కాని, నిజంగా మానవోచితమైన సుఖ విశ్రాంతి మయమైన బ్రతుకు మేమింత వరకు యెరుగనే యెరగం! అది యింకెప్పుడు ప్రారంభించుతుంది? మాకు అనుభవాని కెప్పుడు వస్తుంది? ఎప్పుడూ యేదో ఆటంకం రావడం, వాయిదా పడుతూండడమూను. ఇప్పుడు యీ దిక్కుమా లిన యుద్ధం ఒకటొచ్చింది. దీనికి కారణం యెవరైతేనేం, నాశన పీనుగులు! వాళ్ళ శ్రాడు తెగా! సంసారాల్ని యీవిధంగా నాశంచేసిన ఫలం కట్టి కుడపక పోతుందా, వెధవల్ని?

ఇప్పటికంటే సుఖమయజీవితం మాట దేవు డెరుగును! అది కలలోని వార్తగా చేయడమే గాక వున్న బ్రతుకునే బండలు చేసిందండీ, యీ యుద్ధం మధ్యస్థంగా వచ్చి. నిత్యం వాడుకునే వస్తువులు యెన్నో బజారులోంచి మాయమే ఐపోయేయి. వున్నవాటి ధరలు మండిపోతున్నాయి. కాఫీ పొడి లాంటిది కూడా కలికానికైనా కనిపించడంలేందే? డబ్బా అడుగున వున్న కాసిన్ని కాఫీగింజలూ మొన్ననే వేయించి, పొడి గొట్టింది, ఎల్సా. మళ్ళా కొందామంటే యెక్కడా దొరకందే! ఎందుకేనా మంచిదని ఆమెకి జ్ఞాపకం చేసేను:

'క్వా స్తంత కాఫీ పొడి దాచివుంచు, అక్కర గడుస్తుంది. నియాతీ హిల్డా యెప్పుడో చటుక్కున మనింటికి రావచ్చు, చూడ్డానికి. ఎందుకేనా మంచిది !'

కాని, ఆ సెలవుల్లో నియాతీ మా యింటికి రానేలేదు. ఆ తర్వాత చాల రోజులకి, యేప్రిల్ ఆఖరున ఓ వారం సెలవు దొరికిందట! అప్పుడు వచ్చిందంతే మళ్ళా. అప్పటికి శీతకాలపు యుద్ధం ముగియనే ముగిసింది కూడాను.

---

## పదో ప్రకరణం, యుద్ధానంతరం.

ఈ రి దఫా నియాతీ హిల్డా మమ్మల్ని చూడవచ్చినప్పుడు విల్హో కూడా వుండటం తటస్థించింది. ఆ శీతకాల యుద్ధం లోంచి వాడు సిగపూవు వాడకండా వచ్చేడు, దైవానుగ్రహం వల్ల. వాడు వచ్చేకనే హిల్డా వచ్చినట్లు జ్ఞాపకం, నాకు. విల్హో హఠాత్తుగా వచ్చేడేమో మేము యే యేర్పాట్లూ చేసే అవకాశమే లేకపోయింది. అంచేతనేమో మా కల యికలో కలుగదగినంత ఆనందం కలుగనే లేదు. నిన్ననే మేము విడిపోయినట్లుంది! ఏ భయంకర యుద్ధానుభవాలూ మా యిద్దరి మధ్యా అడ్డుగా లేనట్లే అనిపించింది నాకు!

విల్హో వచ్చినప్పుడు ఎల్సా యింట లేదు. ఆమె రాకకోసం నిరీక్షిస్తూ, యేదో ఆ మాటా యీ మాటా ఆడుకుంటూ కూర్చున్నాం, యిద్దరం. వాడు మామూలుగానే ఫిన్నుల్ని

గూర్చిన కథలూ, యెత్తి పొడుపులూ, ప్రారంభిస్తాడనుకుని, ముందే వాడి చిన్న తనాన్నీ, తొందరపాటునీ మనసులో నే క్షమించేసేను. మేంమళ్ళా కలిసేం. అదేపది వేలు. ఆసంతోషం కలిగించినపుడు, వాడు యేవో చిన్న తనపు మాటలంటే నేను కోపగించనా? కాని, యెందుచేతనో వీడ్లో ఆ దఫా అంతగా మాటాడనేలేదు. వాడు చూడ్డానికే యేదో అలిసినట్లు కనిపించేడు. అటువంటప్పుడు వాణ్ణి మాటల్లో పెట్టి, మరింత అలసట పెట్టడం యెందుకని నేనూ అట్టే మాట్లాడించలేదు. కాస్సేపు కూర్చున్నాక వాడే మెల్లిగా మనసులోని ఆలోచనల్ని బైట పెట్టేడు.

'ఇంటి దగ్గర అంతా మారిపోయివుంటుం దనుకున్నాను. యుద్ధంలోంచి బ్రతికి బట్టగట్టి యింటికి పోగలుగుతూన్నా గదా యని యెంతో సంతోషించేను! కాని, తీరా వచ్చేక చూస్తే అంతా వెనకటి మాదిరే, నాకు సంతోషించాల్సిన మార్పేమీ కనిపించదు.'

నా ఆశ్చర్యానికి అంతే లేదనుకోండి.

'ఇక్కడ మారాల్సింది యేముందంటావురా?'

మా తమ్ముడు చాల నిరుత్సాహుడుగా వున్నాడని వాడి వాలకమే చెప్తుతూంది. మోచేయి టేబిలుమీద ఆనించి, అరచేతిలో తలపెట్టు కూర్చున్నాడు. మెల్లిగా నిరుత్సాహంగానే జవాబిచ్చేడు.

16

'ఇంటికొచ్చేసరికి మళ్ళీ వెనకటిపనే, వెనకటి యజమానే! అదే బండచాకిరీ, అసంతోషకరమైన జీవితపరిస్థితులు! హోప్‌జన్‌పా, క్రీమరీ యజమాని మునపటికి మల్లేనే నావైపు పళ్ళికిలిస్తూన్నాడు! పోనీ అంటే, నీ చిన్న నువ్వూ అదే కొండ గుట్టమీద వున్నావు! భూమినిగూర్చి నువ్వుకన్న కల లేమైనాయి?'

ఇన్ని రోజులుకి యిప్పుడు మేము కలుసుకున్నాం గదా? నాకు జ్ఞాపకం చేయాల్సినది యీ నష్టజాతకం టండీ! అసలే యీ విచారం నా బ్రతుకును విషపూరితం చేయకుండా వుండాలని నేను మరచి పోజూస్తూంటే మధ్యలో వీడువచ్చి పుండులో పుల్లబెట్టిన సామెతగా యీ కెలకటం యేమిటంటా? నా మనసు దాని కోసం యెంత తపన జెందుతూందని! నాకే గనక పొలం లభిస్తే, దాంట్లో యేం చేసి వుండే వాడినో! కాని, అసలు పొలం చారెడైనా సంపాదించడం యెల్లాగా? అనేదే ప్రశ్న. భూమంటే అంత తేరగా వుందా, యేమన్నానా? అదేమైనా ఆకాశాన్నుంచి ఊడిపడేదిటండీ? అటువంటప్పుడు దాన్నిగూర్చి యీ అనవసర ఆందోళన యెందుకంటా? ఐనా పైకి జవాబిచ్చేను గదా:

'ఒరేయ్! విల్లో! నువ్వీ మంచంమీద నడ్డి వాల్చరా. ఒదినకోసం పిల్లల్ని పంపించా. ఆమెవచ్చి, తిండాని కేదేనా చేస్తుంది.'

మొగాన్ని చేతులతో కప్పుకుని ఒక్కనిముషం మౌనంగా వుండి, అంతలో లేచి నిల్చుంటూ అన్నాడు, వాడు;

'అనవసరంగా రక్తపుటేరులు ప్రవహించడానికి కిదే మొదటిసారి కాదు గదగా?'

నే నన్నాను.

'అనవసరం యేమిట్రా? రష్యా మన మీదికి రాకుండా ఆపడానికే గాదా యీ యుద్ధం!'

మాట మధ్యలో అడ్డొచ్చి, విశ్వా అన్నాడు.

'వాళ్ళని ఆపి, యెంతో బుద్ధి తక్కువ పనిచేసేం!'

ఏమిటి, వాడి ధోరణి? శ్రమవల్ల అలసిపోయిన వాడి బుర్రఅంతా గందరగోళంగా వుందనుకుంటా. వాడికేసి కళ్ళు ప్పగించి చూస్తూన్నానేగాని యేమీ అనలేక పోయినా.

'రష్యా వాళ్ళొచ్చి, మన దేశంలో కొందరి బుర్రలమీద మేకులు కొడితే బాగుండుననిపిస్తూంది! నీలాంటి వాళ్ళ కను కోకురా. నీ వంటివాళ్ళని వాళ్ళు కొట్టడం మాట అటుంచి, నెత్తిన బెట్టుకుంటారు. ఇల్లాంటి కొండరాళ్ళమీంచి తీసుకెళ్ళి లోయలో మాంచి పొలం చూసి, అందులో కాపురం బెట్టి స్తారురా, నీలాంటివాళ్ళచేత!' అన్నాడు విశ్వా.

బైట వరాండాలో యెవరూ లేరుగదాయని, లేచి చూసి వచ్చేను. అదృష్టవశాత్తూ అక్కడెవరూ లేరు. కిటికీ వెలు పలకూడా యెవరూ లేరనుకోండి. మా వాడి మాటలెవరూ వినలేదు. అమ్మయ్యా!

వాణ్ణి యిల్లాంటి పిచ్చిమాటలు మాట్లాడ నీయడం ప్రమాదమే. మంచంమీదితలగడలుసర్దుతూవాడితో అన్నా

'విల్హో! కాస్సేపు విశ్రాంతి తీసుకోరా. కోటు తీసెయ్. ఇల్లా పడుకోరా!'

అల్లాంటి మాటలు మాటాడనిస్తూ, ఊరుకోడానికి వీల్లేదు. అలిసిపోయినప్పుడు నోటమ్మట యే మాటలైనా రావచ్చు. ఎవరు చెప్పగలరు? కాని, విల్హో ఊరుకోదలిస్తేనా? అఁహాఁ!

కాని ఆ సమయంలోనే నియీతీ హిల్డా కొండెక్కి రావటాన్ని నేను ఉత్తరపు కిటికీలోంచి చూసేను. ఆమె అప్పుడే చెక్క వంతెన దాటి, కొండ దారిని పైకెక్కుతూంది. విల్హో వీపు కిటికీ వైపు త్రిప్పి వుండడంవల్ల వాడామెను చూడ లేదు.

ఈ సారి తలుపు తట్టేవరకూ వూరుకోకండా, నేను ముందే తలుపు తెరిచి ఆమెని ఆహ్వానించేను:

'నియీతీ! లోనికి రావమ్మా!'

హిల్డా కన్య లోపలికి వచ్చింది. పుష్పవర్షం కురిసిందా? అన్నట్లు గదంతా సువాసనతో నిండిపోయింది, మళ్ళీ. ఈ తూరి ఆమె ధరించింది, దళసరైన పొడుం రంగు వూలు కోటు. అప్పటికి బైట యింకా చలిగానే వుంటూంది లెండి. మంచు అన్నిచోట్లా కరగలేదు. ఆమె కోటుకీ నడుం పటకా వుంది. బిగుతైన నడుం పటకాలో హిల్డాని చూస్తే మధ్య రిబ్బన్‌తో కట్టిన వూలగుత్తి గుర్తొచ్చింది!

ఈ సజీవ పుష్ప గుచ్ఛంలోనూ అన్ని రంగులూ వున్నాయి! శంఖంలాటి తెల్లని కంఠం దగ్గర పొడుంరంగు

కోటు కాలరు క్రింద ఆకుపసరు బ్లౌజూ, దాని తెల్లటి కాలరూ తొంగిచూస్తూన్నాయి. ఎరుపు, పసుపు, నీలి రంగు పూలున్న సిల్కు రుమాలు కూడ అక్కడే పైకి కాన వస్తూంది. కాని, యీ పూంగుత్తిలో కంతకీ మనోహరమైన దామె ముఖ పద్మం! నువ్వుపువ్వులాంటి చిన్న ముక్కూ, మంకెన పువ్వులాంటి పెదవులూ, నల్ల కలువల్లాంటి కళ్ళూ, పొడవైన నల్లటి కనుబొమల క్రింద 'నన్నుచూడ' మంటే 'నన్నుచూడ' మంటూన్నాయి. ఆమె ముఖంలోని లావణ్యంమాత్రం సామాన్యమా? విచ్చిన పువ్వులాంటి ఆమె ముఖానికి తగ్గట్టే చక్కని తలకట్టూ, దానిమీద అందమైన టోపీను!

హిల్డా నాతో కరస్పర్శ చేస్తూ, క్రీగంట విల్హోని చూస్తూనే పలకరించింది:

'ఓహో! విల్హో కూడా యిక్కడే వున్నాడే! – ఏం, విల్హో! కులాసాగా వున్నావా?'

అప్పుడు వాడు లేచి, పాదాలు దగ్గరగా చేర్చి నిలుచుని, తల కొంచెం ముందుకి వంచి, ఆమె చేతిని చాలనం చేసేడు. ఏమీ మాటాడకండానే కూర్చుని, ముఖంమీద పడు తూన్న పొడుగాటి జుట్టును పోగ్గా వెనక్కి త్రోసుకుంటూ చిలక్కొయ్య నున్న తన టోపీవైపు చూపులు బరపేడు. వాడి ఉద్దేశం ఏమిటో?

హిల్డా ఉత్సాహంగా మాట్లాడుతూంది:

'ఈ దారిని బోవాల్సి......చూడండి! ఎంత చక్కటి దృశ్యం! వివిక్తమైన యీ కొండ సెత్తం యెంత అద్భుతంగా వుంది! ప్రక్కనే నిఠారుగా కొండ కొన, పైన తురాయిలా భూర్జ వృక్షమూ! ఇక్కడి ప్రకృతి సౌందర్యాన్ని వర్ణనాతీత మైందంటా, నేను. ఎవరో పేర్చినట్లు ఆ బండ రాళ్ళూ, పర్వతపాదాన్ని ప్రక్షాలన చేస్తూ, ప్రవహించే ఆ సెల యేరూ,- ఇదో స్వర్గఖండంలా వుంది! తెల్లటి కిటికీలతో యీ చిన్న యెర్రటి యిల్లు దూరానికి పంచదారతో చేసిన బొమ్మరిల్లులా యెంచక్కా వుంటుంది! ఏం? అల్లా లేదూ? ఇక యీ చిన్నగది యెంత ఆహ్లాదకరంగా వుందని? ఫిన్నులకి సహజ లక్షణమైన పరిశుభ్రత ప్రతి వస్తువుమీదా పాదు కొని వుంది. ఐనారీ! ఎల్సా యెక్కడ?'

'ఇప్పుడే వస్తుంది, నియీాతీ!'

'ఏంచక్కటి చిన్నగది! మీా తమ్ముడు వచ్చి చాల సేపైనదా? కుతూహలకరమైన యుద్ధవార్త లెన్నో చెప్పివుంటా డనుకుంటా. ఏం?'

హిల్డా మాటలు నన్నుద్దేశించే అయినా, ఆమె దృష్టంతా విల్హో మీాదేవుంది. వాడు మాత్రం ముఖం తిప్పేసుకుని, యింకోవైపు చూస్తూన్నాడు, మొద్దు!

ఉన్నట్టుండి విల్హో లేచి, మా యిద్దరినీ వుద్దేశించి కొంచెం వంగి వినతి చేస్తూ,-

'క్షమించాలి! ఇంకొకరికి మాట యిచ్చేను. సరిగ్గా యీ సమయానికే కలుసానని. మరిచే పోయేను!'

అంటూ మేకు నున్న టోపీ వైపు చేయి చాచేడు.

అయ్యో! దేవుడా! ఆ క్షణంలో ఆమె విల్హో వైపు చూసిన చూపులు! చూచేరూ, ఎవరో చంపబోతూంటే సకరుణంగా 'అయ్యో! నన్ను చంపుతావా? బ్రతుకనీయవూ? దయలేదూ?' అని వేడుకుంటూన్నట్లున్నాయి, ఆ చూపులు! చిన్నపిల్లలు కదుపుతారే, ఆ విధంగా హిల్డా పెదవులు కంపించేయి. కంఠంలో అడ్డు పడిన ముద్దను దిగమ్రింగుతూ న్నట్లు ఆమె గుటకలు మింగింది!

వాడు ద్వారంవైపు వెళుతూంటే ఆమె విస్ఫారిత నేత్రా లతో జాలిగా, బెదురుగా వాడివైపే చూస్తూ నిల్చుంది. వాడు గుమ్మందాటి, తలుపులు మూతబడ్డాక ఆమె కళ్ళు నేల మీదికి వాల్చేసింది. ఏమీ తోచనట్లు చేతి గ్లోవుల్ని వూరికే తడువుకుంటూంది. కొంచెంసేపట్లే నిలుచుండి, మళ్ళీ ప్రకృతిలోకి పడినట్లై, తలెత్తి కిటికీ కేసి చూస్తూ అంది:

'ఇక్కడ యెంత బాగుంది!.........'

ఆమెనోట వెలువడిన మాట లివే ఐనా స్వరంలో యెంతో దుఃఖం యిమిడివుంది. 'ఇక్కడెంత దుఃఖకరంగా వుంది' అన్నట్లే! ఆమె కళ్ళు విల్హో మీదే వున్నాయి. కొండ చాటున అదృశ్యుడయేవరకూ వాడి వైపే చూసి, తర్వాత నా వైపు తిరిగింది.

అప్పుడు విల్హో వైపు ఆమె చూసిన చూపు నాకు మరవు రాదు. ఆమెతో యేం మాట్లాడాలో నాకేమీ పాల్పోలేదు.

ఇదంతా క్షణంలో నాకళ్ళ యెదుట జరిగి పోయి; నాకూ మతి పోగొట్టింది. క్షణాలు యుగాలా అనిపించేయి. భారంగా వున్న ఆ నిశ్శబ్దాన్ని భంగం చేయాలని యేదో పలకరింపుగా అన్నాను:

'కొన్ని రోజులుంటావా ? నియాతీ !'

ఆమె వుత్సాహంగానే జవాబీయ ప్రయత్నించింది:

'అబ్బే ! ఎన్నో రోజులుండను. విహాటోరీ హెల్సింకీ నుంచి యెల్లుండి కారు పంపుతాడు, నా కోసం.'

విహో వెళ్ళిపోయిన తర్వాత మాటలేకండా నిశ్చేష్టురాలై నిలిచిపోయినప్పటి అసందర్భ పరిస్థితుల్లో నుంచి బైట పడ్డానికి యేదో మాట్లాడాలనే ఆమె కూడా అనుకుంటూాండి వుంటుంది.

నాకూ యేమాటా తోణకటం లేందే. ఏమి మాట్లాడనా? యని ఆలోచిస్తూ కూర్చున్నా. అంతలోనే ఆమే ముందు మాట్లాడింది:

'విహో యెన్నో విషయాలు చెప్పివుంటాడు. వాళ్ళు అక్కడ యెల్లా యుద్ధం చేసేరట ?'

విహో యెంతో అలిసిపోయి వచ్చేడు. భోంచేసి, విశ్రాంతిగా నిద్ర బోదామనే వచ్చేడు, వాడు మాయింటికి. ఐతే పరుగెత్తి పోవడం యెందుకంటా ? వాడు యెవర్నీ కలుసుకోనక్కరలేదు. నాకు తెలుసు. అది వాడి పిచ్చివూహల్లో ఒకటి ! నా ఆలోచనలు కప్పివుచ్చుకుని, హిల్డాతో పైకి అన్నాను:

'మన వాళ్ళు రష్యా వాళ్ళని చావగొట్టేరుట. అందు చేతనే వాళ్ళు గత్యంతరం లేక కాకిసాళ్ళి. సోర్తవాలా, వైపురీ నగరాల్ని ఆక్రమించుకున్నారు! మన వాళ్ళింకా బోల్షివిక్కుల్ని తుక్కు రేగ్గొడితే లప్పీన్ రంటా, హెల్సింకీ, తంపిరీ నగరాల్ని కూడా తీసికోవాల్సి వచ్చేది. వాళ్ళు. అవీ తీసుకున్నాక యింకేం చేసేవాళ్ళో ఆ ఈశ్వరుడికే తెలి యాలి! మన రోజు బాగుంది గనకనే మన వాళ్ళు రష్యన్ లని బాదటం మానేసేరు!'

ఆమె నవ్వి, అంది:

'నువ్వెంత కటువుగా హాస్యం చేస్తావు!'

ఎల్సా యీ సమయంలోనే పిల్లలతో సహా యింటికి వచ్చింది. హిల్డా ఆమె వైపుతిరిగి పలకరించింది:

'ఎల్లా వున్నావు, ఎల్సా? ఈ సెలవులకి నేనింటికి వచ్చేక, మనం కలుసుకున్నాంగదూ.'

'ఆఁ! కలిసేం, నియ్యాతీ!'

'పిల్లలెంత యెదిగేరు!'

నియ్యాతీ ప్రతిసారీ యీమాటల్నే అంటూంటుంది. ఎల్సా కూడా మామూలుగానే వాళ్ళని చేరదీసుకుని తలలు నిమ రుతూ జవాబిచ్చింది:

'వాళ్ళు త్వరలోనే మాకు సాయపడతారు!'

నా భార్యవుందే ఆమె బహు ఖచ్చితమైన మనిషి లెండి ఆమెకి యిష్టంలేని దేది జరిగినా నిర్మొహమాటంగా ధుమ

స్తుంది. హిల్డాకీ ఆమె విషయం తెలుసు. కాని యే విషయం మీాదా సంభాషణ సాగకండానే హిల్డా గ్లోవులు తొడు క్కుంటూ లేచింది.

'నేను వెళ్ళాలి యింక. మీా పనికి అడ్డు వచ్చినందుకు క్షమించాలి.'

నే నంతలో నే అందుకుని,-

'ఎంతమాట! నియాితీ! నువ్వేమీా అడ్డు రాలేదూ. కాస్సేపు ఆగవూ? తొందరేమిటి? ఎల్సా కాఫీ తయారు చేస్తుంది. కొంచెం పుచ్చుకుని వెడుదువుగాని.'

'ఒద్దు, ఒద్దు, వందనాలు. ఇంటివద్ద కనిపెట్టుకునివుంటారు సెలవు.'

ఆమెని సాగనంపడానికి నేనూ కొంచెం దూరం నడిచేను. కాలిబాటనే కొండ దిగి పోతూన్న ఆమె విగ్రహాన్ని చూస్తూ కొంచెంసేపు కొండవంచనే నిల్చునిబోయేను. ఆమె స్టాకింగులు బురదకొట్టుకుని వున్నాయి. సెలయేటిమీాది బల్లవంతెన దాటుతూ ఆమె కాలుజారి పడిపోబోయింది. అంతలో నిల ద్రొక్కుకుని, వంతెన దాటి, నడక జోరుచేసింది. ఆమె యెటూ చూడ్డంలేదు. నడకకు లయగా ఆమె కోటుకొనలు ఊగులాడుతున్నాయి, వెనక!

వెల్లనైన ఆకాశాన్నుంచి వాన కురియ నారంభించింది. జరిగిన దాన్ని సమరుకు తెచ్చుకో యత్నిస్తూ, ధోరణిలో పడి అక్కడే నిల్చునిబోయేను. అంతలో వాన జోరుగా

సాగింది. చల్లని చినుకులు నన్ను స్పృశించి, మళ్ళీ ప్రకృతికి దెచ్చేయి. అప్పుడే యేదో జ్ఞాపకం వచ్చిన వాడిలా గబగబ యింట్లోకి వెళ్ళిపోయేను.

---

## పదకొండో ప్రకరణం, ముందు ప్లాను

ఆవిడా, పిల్లలూ ఉల్లగడ్డలు ఒలుస్తూ కూర్చున్నారు. ఎల్సా నన్ను మందలించింది:

'విల్హెల్మ్‌ని యెందుకు పోనిచ్చేవు ?'

'నేనేం చేయగల' నన్నట్లు నిరాశాసూచకంగా చేతులు చాచి అభినయించేను. పట్టుకుని ఆపడానికి వాడేం ముక్కుపచ్చలారని చంటిపిల్లాడా, యేమైనానా?

దుంపలు వొలుస్తూ మౌనంగా ఒక్కనిముషం కూర్చుని సాలోచనగా అన్న దామె:

'అతడుకూడా ఆమెను ప్రేమించినట్లైతే వాళ్ళ దాంపత్యం యెంతో బాగుంటుంది!'

నేనూ యిదే అనుకుంటున్నాను, మనస్సులో. అడగా పెట్టకండా అన్నిటికీ నేనూ వున్నానంటూ పానకంలో పుడకలా అడ్డొస్తారు, యీ ఆడాళ్ళు! వీళ్ళతో చావొచ్చి పడ్డదండీ!

బైట చేయాల్సిన పనేమీ లేకపోయినా, వానకోటు వేసుకుని వాకిట్లోకి బైలుదేరేను. అక్కడ ఒకచోటే నిలబడ

కండా యేదో పని చేస్తూన్నట్లు అటునిటు తిరుగుతూ, అలో చనలో పడ్డాను.

దక్షిణపుగాలి వీస్తూంది. మా యింటి వెనకగోడను వాన జడి గొడుతూంది. ఆ ప్రక్క చూరుకిందే యెండుకట్టె లున్నాయి. దక్షిణపు జడినుంచి కాపాడ లేకపోవడమేగాక పైన కురిసిన వర్షాన్నికూడా ధారలుగా కట్టెల ప్రోగుమీదికి జార్చి కట్టెల్ని తడుపుతూంది, చూరు.

మంచువానలతో వడవడ వణికించే మా దేశపు శీతకా లాలు సుదీర్ఘమైనవి. వాటి తర్వాత కవోష్ణమైన జడులతో వర్షఋతువు యెంతో ఆహ్లాదకరంగా వుంటుంది. సుఖకర మైన వెచ్చదనం యెప్పుడూ దక్షిణాన్నుంచే వస్తుంది, అదే మిటోగాని! జిల్లు మనిపించే వాతావరణాన్ని కవోష్ణంగా చేసి, మంచును కరిగించి వెచ్చజల్లులు కురిపించే గాలి గానీ, పొలాల్లో మంచును కరిగించి, కడిగేసే కవోష్ణవర్షధారలు గానీ, సుఖకర మైనసూర్యరశ్మిగానీ, యివన్నీ మాకు దక్షిణాన్నుంచే వస్తాయి.

కొండ అడ్డుగా వుండడంవల్ల మా యింటికి సూర్యరశ్మి యెప్పుడూ తగలదు. కాని వెచ్చటి* వర్షానికీ, గాలికీ మాత్రం మాకు కరువు లేదులెండి.

కట్టెలమీద కప్పిన బెరడుడిప్పల్నించి నీరు దిగకుండా [illegible]విని సరిచేసేను. మాకు యిక్కో చిన్న పాక యెంత అవస

* ఉత్తరశీతమండల ప్రాంతంలో ప్రజలకు వెచ్చని వర్షం, గాలి, ప్రాణం లేచొచ్చేటట్లు సుఖకరంగా వుంటాయి. మన వేడిదేశాల్లో ప్రజలు 'చల్లనగుట' అనేది సుఖదాయకమని భావించినట్లే వారు 'వెచ్చనగుట'ను కోరుకుంటారు, 'కడుపుచల్లనై' = 'కడుపువెచ్చనై'

రమో అప్పుడు తెలిసింది. కర్ర లెక్కచేనా? ఇంకా ఎన్నో సామానులు జాగ్రత పెట్టుకోవాల్సివుంటుంది. అవును కొనాలని మే మిద్దరం యింకా కలలు గంటూనే వున్నామాయె!

ఐతే, పాకగానీ షెడ్‌గానీ యే పేరునచిలిచినా, దాన్ని కట్టాలంటే మాకు చెక్కలు కావాల్సిందే. కాని ఆ చెక్కలు ఆకాశాన్నుంచి రాలేవి కావుగదా, మరి? వాటిని డబ్బు చెల్లించేనా కొనాలి. లేదా వృక్షతీగల్లా పెనవేసుకున్న యీ కడరాలు కటిగేలా పాటుపడైనా సంపాదించుకోవాలి. నా నాళ్ళ పొంగులువారుతూ ప్రవహించే [illegible]క్తాన్ని ధార పోస్తేనే గాని [illegible] వస్తువైనా యిస్తుంది?

[illegible] షెడ్ గోడ[illegible] చెక్కల[illegible] బదులు [illegible] రాళ్ళు [illegible] [illegible] వచ్చి [illegible] రాళ్ళ[illegible] [illegible] చెక్కల్లేమి [illegible], [illegible] వానుగ్రహం వల్ల కూరగాళ్ళకి యెడంప్రక్క [illegible] [illegible] పాకగోడలు లేవదీస్తున్నా [illegible] మరో పెద్దరాళ్ళప్రోగు కూడా వుంది అదివారాల్లో అక్కడనుంచి పెద్దరాళ్ళు పైకి దొర్లించుకొస్తు చేసివేస్తున్నాను. ఈ రాళ్ళతో కట్టిన గోడలు కోటగోడల్లా వున్నాయి. వుంటే మునిగిపోయిం దేమిటిలెండి? మరో నాలుగు కాలాలపాటు దృఢంగా నిలబడ తాయి. పోతే యిక షెడ్ కప్పుమీదికి చెక్కలుండాల్సిందే. అది తప్పదు, మరి.

అసలు చెక్క లవసరం లేకండా, నేను కట్టగలిగిందల్లా ఒక్క నేలమాళిగ మాత్రమే. ఇంటివెనక కుడిప్రక్కగా కొండలో పెద్దనెఱియ వుంది. దాని క్రిందిభాగాన్నే నేలమాళిగగా తయారుచేసేను. గునపంతోటీ, సుత్తితోటీ నెఱియను మరికొంత విశాలంగా చేసి, ద్వారందగ్గర రాళ్ళతోనే లాజు విలబెట్టి, పైన మట్టి పూసి గిలాబాచేసేను. ఇక తలుపొక్కటే తరువాయి. దానికీ ఓ పెద్ద రాతిపలక తెచ్చి అమర్చేను. బస్. నేలమాళిగ పూర్తైది. కాని, దానిలో దాచుకోడానికి మా యింట నేముంది? అంచేత దానిలో బోలెడు జాగ ఖాళీగానే వుండిపోయింది పోనీండి. వున్నవి జాగ్రత్త పెట్టుకోవాలన్నా మాళిగ అవసరమే గాదూ? ఐదుగోనెల వుర్లగడ్డలు, ఓ పీపానిండ వుప్పుగొక్కులు, గంపెడు బెర్రీపళ్ళు.- యివే మాకున్న సంభరమంతా. ఒక్కొక్కప్పుడు కొంచెం పందిమాంసం, వెన్నా, జున్నుగడ్డా, ఖూజాతో పాలూనూడ వుంటూంటాయి. అసలు సరుకంటూ వుండాలేగాని దాచేందుకు చోటూవుంది, తిండానికి జనమూ వున్నాం!

శీతకాలం రాగానే మాళిగలో గడ్డి పరిచి, మంచుతో కప్పేవాణ్ణి. అందులో తినుబండారాలేవీ ఆ మంచులో వుంచడంవల్ల చెడేవిగావు. చలికాలంలో యెప్పుడూ అవి తాజాగా తీసినట్లే వుండేవి. వేసవి రాగానే అందులోని మంచూ, గడ్డీ గాదం అంతా తీసి శుభ్రం చేసేసి, తలుపు

తెరిచేవాణ్ణి. గదంతా వెచ్చటిగాలితో నించి, కమ్మని తావి గొడుతూండేది.

నేలమాళికనుంచి నా దృష్టి మళ్ళించి, లోయవైపు తిరిగేను. వానజల్లులోంచి చూస్తే లోయంతా తెర గట్టినట్లు కనిపిస్తూంది. వెచ్చనిగాలి వీపును స్పృశించి, సుఖకరంగా వుంది. దక్షిణాన్నుంచే సుఖకరమైన వెచ్చనిగాలీ, వెలుతురూ వస్తాయని సంతోషించేందుకూ లేదు. ఆ దక్షిణాన్నుంచే కాదూ రష్యా మామీాద గత శీతకాలంలో విరుచుకు పడ్డది? కష్టసుఖాలు యే క్షణంలోనైనా, యే దిక్కునుంచైనా రావచ్చు!

'రష్యాయే గనక వచ్చివుంటే...' అంటాడు విష్ణో. ఏదో అది వచ్చి మహా త్రగ్గి తలకెత్తేటట్లు! చివరకి యుద్ధం వచ్చినా వాడికి బుద్ధిరాలేదు. గంజి పోసినా యింకా ఉట్టి వంకే చూసేడట, యిల్లాంటి బుద్ధిమంతుడే అయివుంటాడు. ఇంకా నయమే, వాళ్ళు వైపురీ దాటిరాలేదు!

ఏవో ఆలోచనల్లోపడి కూరమళ్ళ దగ్గిరికి వచ్చి, కాలితో గట్లమీాదికి మట్టి త్రోస్తూన్నా. ఈమధ్య పడిన వేసవి జల్లులకీ, వెచ్చని వాతావరణానికీ మొక్కలన్నీ గట్లమీాంచి మెదిగి వెలుపలికి వ్రాలుతూన్నాయి. వాటిని కాలితో మడి లోపలికి నెట్టి, చిన్నరాళ్ళనీ, పెల్లల్నీ గట్లచుట్టూ పేర్చనారంభించేను. రాళ్ళు పేర్చకపోతే పాదుల్లోని మట్టి కాస్తా జడివానలకి క్రిందికి కొట్టుకుపోతుంది. పాపం, మార్తా

పూలమొక్కల మడిలోని మన్ను కాస్తా కొట్టుకునేపోయింది. మొక్కల మొదళ్ళలో మాత్రం కాస్త కాస్త మట్టి మిగిలి వుంది. ఐనా యీది ప్రొద్దుటికుగుకుమొక్కలకి అనువైన చోటు కానేకాదు. అసలు యిక్కడికి యెందుకు తెచ్చిలిత్తేను? అటువంటప్పుడు అవి పూచే దెక్కడ? బిడ్డ మనస్సుకి సంతోషం కలిగించడం యెక్కడ?

మా వాడి ఉల్లకుట్టుమాటలకే తెలిసి! 'ఇంకా యీ కొండ దిబ్బమీదే వున్నావే?' అనడగడం సులభమే. ఇక్కడ వుండక యెక్కడికి పోతాను, యేట్లోకి! -లోయల్లోని పంట భూములు, పనికివచ్చే భూములు అందరికీ పంచి యిచ్చే నిషధ యోగ్యాలు యీ ప్రపంచంలో లేవు. చదవేస్తే వున్న మతీ పోయిందన్నట్లుంది. మా వాడి వరస. తనే మహా తెలివైన వాణ్ణనుకొనే వాళ్ళల్లాగే మాట్లాడుతారు. పోనీ, తనెందుకు సంపాదించుకో లేదో? ఆ పాతసూటే తొడుక్కుని, అదే ఓవర్ కోటు (పైన ధరించే కోటు) వేసుకుని బికారిలాతిరక్క పోతే......

వాన నా ముఖాన జోరుగా కొడుతూంది. ముఖం త్రిప్పుకుని లేచి నిల్చుని, వొళ్ళు విరుచుకున్నా. రాళ్ళూ రప్పలూ ఆమట్టునే వదిలిపెట్టి, అక్కడే గుంటలో చేతులు కడుక్కుంటూన్నా, విల్హోని గురించిన ఆలోచనలు నా బుర్రలోంచి పోడంలేదు.

ఔను! వాడు యింకా యేకాకిగానే వుండడం యెందుకంటూ? ఆమెకి యిష్టమే. ఇక వాడిదే తరవాయి. ఊరిఖే విగానమేషాలు లెక్కపెడుతూ కూర్చోకండా, 'ఊఁ! అంటే అన్నిచిక్కులు తీరిపోతాయి. నిక్షేపంలాంటి సంబంధం! అయ్యయ్యో! ఎటువంటి అవకాశంరా; విల్వా! ఎంత బుద్ధిహీనుడివిరా! సిరి రా మోకా లొడ్డడం అనే సామెత ఊరిఖే వుట్టిందా?......

విల్వా, హిల్డా విడివిడిగా నడచిపోయిన బాటవెంబడే సెలయేటి ఆవలివైపు నా దృష్టి పోయింది. ఇద్దరూ కలిసి పోకండా యేం ఖర్మం వచ్చిదంటూ? కలిసే మా యింటికి రాకూడదూ? వాళ్ళని అడ్డుపెట్టే వాళ్ళెవరు? ఏమో? మా విల్వా మనస్సులో యేముందో? వాడు నా తమ్ముడు గాడూ? ఐతే, అప్పుడు హెంర్రా కుర్కిమ్యాకీ నాకేమవుతాడు?.....

అన్నిరకాల భావాలతో ఉక్కిరిబిక్కిరై వేడెక్కిపోయిన నా శరీరం ఆ జడివానకి కాస్త తమాయించింది. ఎవరికీ తోచని పిచ్చివూహాలుకూడా ఒకటి రెండు నా బుర్రలోకి వచ్చిన వాహోజున. కాని, వాటిని నే నెవరితోనూ చెప్పను. చివరకి ఎల్సాతోటి కూడాను! ఆడవాళ్ళకి యిల్లాంటి వెల్లా అర్థమవుతాయో చెప్పండి?

భోజనసమయంలో ఎల్సా మళ్ళీ వాళ్ళిద్దర్నీ గూర్చే మాట్లాడింది. కాని, అదంతా వొట్టి ఊకదంపుడు. నాకు తట్టిన

వ్యూహాలున్నాయే,- అవి ఆమెకి మచ్చుకొకటేనా తోచ లేదనుకోండి! ఎంతైనా ఆడుది ఆడుదే కదా?

నే నామెతో అన్నాను చివరకి:

'ఏ ఆదివారంనాడో మనం వెళ్ళి విశ్వాని చూసివద్దాం.'

---

పన్నెండో పరికరణం, పునర్దర్శన ప్రయత్నం.

అనుకున్నానే గాని నేను విశ్వాని చూడ్డం చాల రోజుల వరకూ పడనేలేదు. ప్రతీసారీ అనుకోకండానే యేదో పని తగులుతూండడం, అందుమూలంగా వాణ్ణి చూడ్డానికి వెళ్ళ లేక పోతూండడం, జరిగేది. అదీగాక నియోతీ కుర్క్యమాకీ యీ తూరి యింటికి రావడం చాల ఆలస్యమైంది. వేసవి సగం గడిచేక గాని ఆమె యింటికి రానేలేదు. ఆమె వచ్చేక నేను తీరికచేసుకుని, విశ్వా దగ్గిరికి బోయేను, చూడ్డానికి.

నన్ను చూసి వాడు పరమానందభరితుడై పోయేడు. నా యిసపచేతిని పట్టుకుని యెంతో ప్రేమతో, మార్దవంతో చాలన చేసేడు. వాడి ఆనందం చూస్తే యెందుకో గాని నాకు అసూయ కలిగింది, చెప్పొద్దూ. ఐతేనేం, నాకు వాడు తమ్ముడేగాదూ. అటువంటప్పుడు నా మనసులో దురుద్దేశం యెందుకుంటుంది లెండి. వచ్చే ఆదివారం మాయింటికి రమ్మని చెప్పడానికేగదూ, నేను వాడిదగ్గిరికి వెళ్ళింది. దురుద్దేశాలు వుంటే యెందుకు పిలుస్తానో చెప్పండి.

నా మాట వినగానే వస్తా నంటూనే, వాడి శక్తి కున్నంత లోనే నన్ను యెంతో ఆదరించి ఆతిథ్యమిచ్చేడు. ఆ తర్వాత వాడి దగ్గరున్న పుస్తకాలన్నీ నాకు చూపించేడు. అబ్బో! వాడిదో పెద్దలైబ్రరీ అని చెప్పాలి. చరిత్ర, రాజకీయాలు యెన్నో ప్రమాణగ్రంథాలు, ఓ పెద్ద విజ్ఞానసర్వస్వం, బోలె డన్ని నవలలు,– యిల్లాంటివన్నీ వున్నాయి. డబ్బంతా వీటి కోసం తగలేస్తూన్నట్లున్నాడు!

ఆ తర్వాత బాక్సింగు గ్లావుల జత కొత్త దొకటి తీసి చూపించేడు. అవి తొడుక్కుని నా గూబమీద రెండు చపే టాలు తగిల్చి, వాటి ప్రాశస్త్యాన్ని బోధపరిచేడు కూడాను! కులాసాగా మునపటి ధోరణిలోవున్న వాణ్ణి చూడ్డానికి నాకు నిజంగా యెంతో సంతోషమైంది. పరిహాసంచేసే నీలికళ్ళూ చక్కని తలకట్టూ,– వాడూ చూడ్డాని కెంతో ఆకర్షనీయంగా వుంటాడు!

వాడూ యజమాని బారకీచుట్లోనే యితర పనివాళ్ళతో బాటుగా నివసిస్తాడు. వాడి తోటివాళ్ళంతా అక్కడికి చేరి గైటరు వాయిస్తూ పాటలు పాడనారంభించేరు, నేను వచ్చే ననే ఉత్సాహంతో. విక్టర్ కూడా కంఠం కలిపేడు. వాళ్ళతో బాటు ఆ తర్వాత వర్కర్సు క్లబ్ కి పోవడానికి వాళ్ళంతా సన్నాహమయేరు. విక్టర్ నన్ను రోడ్డుదాకా సాగనంపేడు. ఆ సమయంలో వాడికి మళ్ళీ జ్ఞాపకం చేసేను.

'ఇతే నువ్వు మరిచిపోకుండా వుదయమే వస్తావుగదూ?

వాడూ వాగ్దానం చేసేడు:

'అల్లాగే! తప్పకుండా వస్తా.'

ఇక్కడికి వ్యవహారం సగంమట్టుకి నెరవేరినట్లేగద! ఇంక నియాతీ కుక్కమా కీని కలుసుకోవాల్సి వుంది. అంతే. ఆమె కూడా ఆ రోజే నాకు కనబడింది.

'కులాసాగా వున్నావమ్మా, నియాతీ?'

నియాతీ హిల్డా ఓరునవ్వుతూ చేతిని నావైపు జాచింది.

'వందనాలు, ఐనారీ! కులాసాగానే వున్నా. విశేషా లేమిటి? నీ కుటుంబం అంతా కులాసా అనుకుంటా.'

'ఆహాఁ! అందరం కులాసాగానే వున్నాం, నియాతీ!'

ఆమె ఒక్కక్షణం తటపటాయించి, అడిగేసింది.

'విల్హో యెల్లా వున్నాడు?'

నేను భుజాలు కుంచిస్తూ, అన్నాను:

'ఆఁ! వాడికేం? గుర్రంలా వున్నాడు.'

'ఈ మధ్య మీా యింటికి యెప్పుడేనా వచ్చేడా?'

'అప్పటినుంచీ రానే లేదు. రేపు ఆదివారం వస్తాడని తోస్తుంది.'

'వచ్చే ఆదివార మే?'

'ఔను! ఉదయం వస్తాడు.'

చుట్టుపక్కల పరికిస్తూ, అన్నదామె:

'ఈమధ్య వాతావరణం చాల బాగుంటూంది!'

'జా నమ్మా!' అన్నాను అంతే. ఎవరి దారిన వాళ్ళం వెళ్ళిపోయాం.

భేష్! అంతా నేను అంచనా వేసినట్లుగా నే జరిగిపోతూంది. మా తమ్ముడి భవిష్యత్తు విషయంలో యింతమాత్రం సంశయించ నక్కరలేదు. వాడు ముష్టెత్తుకోడానికి బాగావుండాలనే గాదూ మేమంతా కోరేది? వొట్టి వెర్రిబాగులవాడు; వాడి బాగే వాడికి తెలియదు. అల్లాంటప్పుడు అన్ననైన నేను ఆ విషయంలో శ్రద్ధ వహించొద్దూ? లోకానుభవంవున్న పెద్దవాళ్లు కాకపోతే వాళ్ళని కాస్త దారిలో పెట్టే వాళ్ళెవరో చెప్పండి?

మా తమ్ముడు ఐశ్వర్యవంతుడైతే నేనూ సుఖంగా వుండొచ్చు ననేది నిజమే. భేద మేముందీ? కుడి చెయ్యా, ఎడం చెయ్యా! అంతే గదా? కొంచెం వెనకా ముందూ అయినా మన ముందుదారి చూసుకోవద్దా? అంటూ, దిక్కుమాలిన కొండరాళ్ళమీద చిక్కుకునిపోయి, దారీ తెన్నూ తోచకండా వున్నానా! చచ్చేదాకా అక్కడే వుండలేను గదా? నా బాగుకి యీ భుజదండం వుపయోగపడకుంటే, బుర్రేమైంది?

సిరిసంపదలకి అడ్డుదారి! నా చిన్నారి వ్యూహం వుందే అది తలుచుకుంటూంటే నాకే ఆనందంగా వుంది. ఆదివారం కోసం యెదురుచూస్తున్నా. ఇద్దర్నీ ఉదయంపూటే రమ్మని యెందుకు సూచించేనో తెలుసా? ఎల్లా అప్పటి కింకా

కుర్కి-నూకీల గోశాలల్లో పాలు తీస్తూ పనిలో బిజీవుంటుంది. ఇక పిల్లల్ని యిరుగుపొరుగు యిళ్ళకి పంపించి, భోజనం వేళ దాకా ఆగుకోమంటాను పెద్దచదువులు లేకపోతేనేం, నాకు అంతమాత్రం వుపాయం లేకపోలేదు.

---

## పదమూడో ప్రకరణం - విఫలసమాగమం

ఆదివారం వుదయమే హిల్డా కొండమీదికి వచ్చేసరికి యింటి దగ్గర నే నొక్కణ్ణే వున్నాను. మా కూరమళ్ళు, నేలమాళిగ, మార్తా పాతిన పూలమొక్కలు, ఎల్సా పాతిన క్యారాంటులు, రాస్ప్‌బెర్రీలూ, చివరకి నేను రాళ్ళు పేర్చి కడుతూన్న షెడ్ గోడలూ,- అన్నీ కూడా ఆమెకి చూపించేను. అవన్నీ చూసి యెంతో బాగున్నాయని మెచ్చుకుంది, నియీతీ:

'ఎంత బాగున్నాయి! అద్భుతం, ఐనార్! నీముందు గారడీ వాడెందుకు పని కొస్తాడు? ఇంద్రజాలంగా వుంది! నల్లరాతికి జీవం బోసి, కలకల్లాడేటట్లు చేసేవు! ఇక్కడ మరో ప్రపంచాన్నే సృష్టించేవుగదా! ఆహాఁహాఁ!'

ఇందులో యింతగా ఆనందించేందు కేముందంటా? అర్థం గాక అడుగుతా. కొండలో నెరియలు కొట్టడం, పెనుబండల్ని భుజాలమీద మోయడం, యెండ తగలని ఆ బోడి కొండమీద కాపుర ముండడం, తట్టెడు తట్టెడుగా మన్ను తెచ్చి పోసి కూరమొక్కలు పెంచడం, వేసవిలో వానజల్లు

లకీ, మంచుకరిగీ యే చారికు మన్ను కొట్టుకుపోయినా బెంగ పెట్టుకున్నాకుర్చోడం,- యిల్లాటివన్నీ యెంత ఐంద్రజాలికున్నైనా నాకు సంతోషాన్ని కలుగచేయగలవా? పాపం, నియాతీ హిల్డాకి నా కష్టసుఖా లేం తెలుసును!

నిజమైన మంచిపోలం యిచ్చి చూడండి. రెండుమూడే ళ్ళలో నా యింద్రజాలమహిమ తెలుస్తుంది! అప్పుడైతే నియాతీ యింకా యెంత ఆశ్చర్యపడుతుందో? పోనీండి, దానికేం చిన్నపిల్ల, ఆమె కిప్పుడే కష్టసుఖాలేం తెలుస్తాయి? నా భుజాలమీాద తల వ్రాలిపే అలంకారార్థం కాదుగా వున్నది! అది అంత అందంగా లేకపోవచ్చు గాని దానిలో ఊహాపోహాల కేం కొదవ? ఎత్తైన దౌడ యెముకలు, పొడుచుకొచ్చినట్లున్న గడ్డం, బూటులాంటి ముక్కు,- వీటితో నా మొహం ఆకర్షణీయంగా లేదనే అనుకోండి. ఐతే యీా బుర్రలో వున్న మెదడుందే, అది యింకే బుర్ర లోని మెదడుకీ తీసిపోదనీ, తన పని నదిమూాంఛి పకడుగానే చేసుకుపోగలదనీ చెప్పగలను.

ఎవడైతే నేమి? ఎంత తెలివైన వాడైతే నేమి? ఈ ప్రపంచంలో బతికాలీ అంటే కొంచెమైనా నక్కజిత్తు లవ సరమంటాను. ఎవడికి వాడే వీలైనంత హెచ్చు సౌఖ్యాన్ని అనుభవించాలని కృషి చేస్తాడుగదా? అలువ టప్పుడు నేను మాత్రం సుఖపడటాని కెందుకు ప్రయత్నించకూడదో చెప్పండి?

ఆ ప్రయత్నాల్ని నక్కజిత్తులే అనండి, మరోటే అనండి. ఏదో ఒకటి. ఏం చేస్తాం ?

అన్నానే గాని తీరా విన్గో వచ్చినపుడు వాడి యెదుట నేను కొంచెం యిబ్బెట్టుగానే నిలబడ్డాను. వాడుమాత్రం నన్ను చూడగానే చిరునవ్వుతూ, కళ్ళలో సంతోషం తాండ విస్తూంటే గభ్భున వచ్చి నా చేతిని రెండుచేతులా పట్టుకుని పెనుగుతూ చాలసేపటికి గాని వదలనే లేదు. వాడికీ ప్రపం చంలో వున్నది నేనొక్కణ్ణేగదా! నేను వాడి దగ్గర నిష్క పటంగా మసలలేక పోతూన్నందుకు నాకెంతో కష్టం అని పించింది. ఐనా యింతమటుకు వచ్చేక చేసే దేముంది? తలుపు తెరుస్తూ వాణ్ణి యింట్లోకి నడవమన్నాను:

'రా రా విన్గో! ఒదిన యిప్పుడే వస్తుంది. ఔను గాని, నీతో చెప్పడం మరిచేపోయేను. నియాతి హిల్డా యిక్కడే వుంది. తెలిసిందా ? ఈ దారిన బోతూ ఒక్కమాటు చూసి పోదామని వచ్చింది. ఇరుగూ పొరుగూ కదరా! ఎప్పుడీ మార్గాన పోతూన్నా మమ్మల్ని చూడకండా వుండదు లే. ఈ వేళా అల్లాగే......ఇంతదగ్గరలో వున్నప్పుడు యింకా తరుచుగానే రావచ్చును!'

హిల్డా ఆశ్చర్యంగా విండ్లలాంటి కనుబొమ లెత్తి నావైపు చూసింది. ఆఁ! ఇల్లాంటి వాటికి సంకోచించే స్థితిలో వున్నానా ? నా ప్లాను పూర్తిచేయాలి? చేసినట్లే. ఇక కాగల కార్యాన్ని గంధర్వులే తీరుస్తారు.

ఆమెని చూడ్డంతోనే విల్హో ముఖం గంభీరమైంది. ఒక్క క్షణం తటపటాయించి, నేలచూపులు చూస్తూ, తిరిగిపోదామా? వద్దా? అనుకుంటూన్నట్లుగా నిలబడిపోయేడు. కాని ఆమె అప్పటికే లేచి, విల్హో దగ్గిరికి వచ్చి హృదయపూర్వకంగా నవ్వుతూ నిల్చి చేయి కలిపింది. వాడూ మర్యాదాసూచకంగా తల కొంచెంవంచి చేయి జాచక తప్పలేదు.

అసలు ఆ ప్రియదర్శినికి తన చేయి నందీయకండా యే మానవుడైనా యెల్లా వుండగలడో నా కర్థంగాదు– వసంత కాలంలో వినిర్మలాకాశంలోని సూర్యబింబం తన చుట్టూ తేజోష్ణాల్ని ప్రసరించునట్లే పల్చటి తెల్ల ఫ్రాకు, యెర్ర పటకా ధరించిన హిల్డా కన్య పరిసరాల్ని సంతోష ప్రీతి భావాలతో నింపుతూంది.

వాళ్ళిద్దరూ చేతులు కలిపేక నాకింక పనేముంది? అక్కడ. ఏదో పను లున్నట్లు నాలుగువైపులా తచ్చాడుతూ కాస్సేపు తిరిగి,–

'విల్హో! కాస్సేపు కూర్చోరా! నువ్వుకూడా నమ్మా, నియోతీ! తొందర పనులేమీ లేవుగా? ఇప్పుడే వస్తా... ఇక్కడున్నట్లే. నిముషంలో......'

అంటూ ముంగిటికి బోయేను. అన్నానే గాని అక్కడ మాత్రం మహా పనేముంది గనక? ముంగిట నిలబడితే కిటికీలోంచి వాళ్ళకి కనబడుతూంటాను. గనక యింటివెనక్కి

పోయి, కట్టెలగుట్టమీద మేను వాల్చేను. నేనేం సామా న్యపు మనిషనా యేమేనేనా; పడుకుంటే నా తల యింటి గోడ నానుకుని చూరుక్రిందికి వుంది! నేను చేయాల్సిందేదో చేసేను మరి. ఇంక యిందులో పిసరంతకూడ నేను కలుగ చేసుకో దలచలేదు. ఇదీ విషయం.

నిటారుగావున్న కొండ సూర్యుని కడ్డుగా వుంది. దాని నీడలో చూరుక్రింద కట్టెలగుట్టమీద పారేసేను, యీ శరీ రాన్ని. కొంచెంసేపు అంతా నిశ్శబ్దం. భూర్జవృక్షంమీద పిట్టల కిచకిచలు మాత్రం కొద్దిగా వినబడుతూన్నాయి. కొండకొనమీది చెట్లు, పొదలు, గడ్డిదుబ్బులు,- అన్నీ సూర్యకాంతిలో మిలమిలమంటూన్నాయి. వున్నట్టుండి విన్గో గొంతు వినబడింది:

'పొగ అలవాటుందా ?'

అంతస్పష్టంగా ప్రతిమాటా వినబడ్డం నా కాశ్చర్యం కలి గించింది. అదే గాదు. సిగరెట్ కేసు తెరవడం, సిగరెట్‌ను మూతమీద కొట్టడంకూడా నాకు వినబడింది. హిల్డా కంఠం నాకు మరీ సమీపంగా వినవచ్చింది:

'ఉంహుం! అక్ఖర్లేదు. వందనాలు.'

ప్రతి సవ్వడీ వినబడిందంటే అర్థం యేమిటి? అచ్చే, గోడ కట్టుబడి యేం బాగా లేదన్నమాటే. రెండు బల్లకూర్పు గోడ లకీ మధ్య ఖాళీజాగాలో నింపిన రంపపుపొట్టు సరిగా సర్దుకో లేదనేనా దీని మూలాన గ్రహించాల్సింది? ఇప్పటివరకూ యీ

విషయం నాకు తెలియనే లేదు! ఇప్పుడు లోపలి ధ్వని విన రావడంవల్లనే యిది నాకు తెలిసింది. లోపలా వెలుపలా నిల బెట్టిన బల్లకూర్పులమధ్యలో నింపిన రంపపుపొట్టు తడిది; అందుచేత ఆరేక అది గడ్డలు గడ్డలుగా చేరిపోయింది. పైనుంచి బాగా దట్టించి కూరినా, యింకా అక్కడక్కడ ఖాళీలు వుండిపోయాయి. పొట్టు దట్టంగా, పొందికగా చేరుకోలేదు. తర్వాత క్రమంగా తడి ఆరి, యెండిపోయి యెక్కడికక్కడే గడ్డలు కట్టింది. రెండుకూర్పుల్నీ చేరుస్తూ బిగించిన కమ్ముల మీద, యినుపవూచలమీదా మాత్రం కాస్తకాస్త పొట్టు మిగిలిపోయింది. ఈ కారణంచేతనే లోపల చీమచిటుక్కు మన్నా నాకు వినిపిస్తోంది.

'నువ్వెప్పుడూ యిటుకేసి రానేలేదేం?'

అడిగింది హిల్డా. విల్లో జవాబిచ్చేడు:

'ఇక్కడ నాకు పనేముంది?'

'బాగుంది....పనే వుండాలా? అన్నని చూసిపోడానికైనా లే రాకూడదా? అదీగాక......ఇక్కడ ప్రకృతిదృశ్యం యెంత బావుంటుంది!'

ఒక్కక్షణం వాడేమీ మాట్లాడలేదు......బహుశా సిగరెట్టు దమ్ము లాగుతూండవుంటా డనుకున్నా. అప్పు డన్నాడు:

'కలుసుకున్నా లేకపోయినా అన్న అన్నే! తరచు కలుసుకో కుంటేమాత్రం వాడు నాకు అన్న గాకపోతాడనే భయం లేదు!'

గదిలో గోడలమీద తాపిన అట్ట లెందువల్ల చెమ్మగిలుతూన్నాయో, లోన వెచ్చదనం యెందుకు నిలబడడం లేదో యిప్పుడు తెలిసింది. ఇంతకాలంనుంచీ నాకు తెలియనే లేదు! గోడల్లోంచి మాటలు వినబడ్డ వల్లనే దానికి కారణం తెలిసింది. బాగానేవుంది. ఐనా నిశ్చయం చేసుకోడానికి తలను కొంచెం యెత్తి, యింకోడగ్గర చెవి పెట్టి యేమైనా వినబడుతుందేమోనని చూసేను. అక్కడికీ ధ్వని అస్పష్టంగా వినబడింది!

'నిన్నాకర్షించేదీ, ఆనందింపచేసేదీ యిక్కడేదీ లేనే లేదూ?'

విల్హో మాటలు మరీ స్పష్టంగా వినిపించేయి. వాడి గొంతు చిక్కగానూ గంభీరంగానూ వుంటుందలెండి.

'నీ అభిప్రాయంలో నా కిక్కడేది ఆనందదాయక మనుకుంటున్నావో అడగవచ్చా?'

ఆ తర్వాత అడుగు సవ్వడి వినబడింది. ఆమె లేచి వాణ్ణి సమీపించివుంటుంది.

'విల్హో!'

ఆమె యెంతో మృదువుగా వుచ్చరించిం దామాటని; చెవిలో వూదినట్లే అనుకోండి. కాని, అదీ నాకు స్పష్టంగానే వినబడింది. ఆ స్వరాన్నిబట్టే హిల్డా కళ్ళు ఆ సమయంలో వాడిపైపు యెల్లాంటి చూపులు బరపినవో మనం గ్రహించుకోగలం.

'మన మొదటి సమాగమావేశం జ్ఞాపకం వుందనుకుంటా? కార్మిక క్లబ్‌లో జరిగిన డాన్సు పార్టీలో కదూ? అప్పుడు నీ ధోరణి వేరుగావుంది.'

వాడి సణుగుడులో విసుగూ, దిగులూ గోచరమవు తూంది:

'నువ్వెవరవో నాకప్పుడు యేం తెలుసు?'

'అదంతా నేనెవరనా? అన్నదానిమీద ఆధారపడినట్టు!'

'ఆc! ఆధారపడివుంది!'

ఎల్లాగో చెప్పు?'

'సమాజంలో ఎవరి స్థానం వాళ్ళదే. నువ్వు కుర్కామాకీ కన్యవు; నేనో? పీటర్కానియేమీ కుటుంబంవాడిని. ఎంత తర్కించినా యిందులో మార్పేమీ వుండదుగదా?'

దిక్కుమాలిన గోడ! ఓ కర్రతో దానిమీద కొట్టాలని బుద్ధిపుట్టింది, నాకు దెబ్బకి రంపపుపొట్టు క్రిందికి సర్దుకుంటుంది. సరిగ్గా ఆ సమయానికే హిల్డా నవ్వు వినిపించి, 'వాళ్ళని ఎవరు గొట్టడం మొదుకులే!' అనుకుని వూరుకున్నా.

ఈ మాటామె నవ్వు విచిత్రంగా తోచింది. కటువుగా; రాకపోయినా తెచ్చుకున్న నవ్వు అది!

వాళ్ళ మాటకేంగాని గోడవుందే, దీనికి కొంచెం దమాయింపు అవసరం. చెక్క పేడు దెబ్బ కిదేమీ చెక్క బడదు గాని గొడ్డలి మడమ తిరగేసి చుట్టూ కొట్టి, చెక్క కూర్పుని కొంచెం సళ్ళువదలించాలి. చెక్కలగోడలు రెంటికీ

మధ్యాన పై భాగంలో కాళీలు ఏర్పడినాయిగదూ, రంపం పొట్టు దిగబడిపోవడంవల్ల. ఆ ప్రదేశాన్ని ఎండిన నాచుతో నింపవచ్చునను కొంటి. రంపపుపొట్టు కావాలంటే డబ్బు చెల్లించాలి; పైగా జహోనెన్ మిల్లునుంచి బండిమీద తెచ్చుకోవాలి. నాచుఐతే మడుగులో వుంది కదూ. అది పోగుచేసి, ఎండబెట్టి, అటకమీదినుంచి బల్లసూరప్పలమధ్యకి కుక్కితే పోతుంది. శతకోటి దరిద్రాలకి అనంతకోటి వుపాయాలు గదండీ!

దీని కంతకీ మళ్ళీ ఆదివారందాకా వేచియుండాల్సిందే. ఇవాళంతా వృథా ఐపోయినట్లేకదా. ఉదయంనుంచి యిప్పటివరకూ యేం చేసినట్లు, నేను? ఏ పనీ చేసుకోకుండా, కునికిపాట్లు పడుతూకూర్చుని, ఓ పడుచుకీ – పడుచువాడికీ జరిగే ప్రేమసంభాషణలు వింటున్నాను. నా తెలివి తగులడ్డట్టే వుంది!

నాకిష్టం లేకపోయినా మాటలు వినబడుతూనేవున్నాయి:

'విల్హో! నువ్విల్లా మాట్లాడితే నేను నిన్ను అర్థంచేసుకోలేనుసుమా. దీని కర్థం నువ్వుకూడా యీ వర్గవైషమ్యాల జబ్బుతో బాధపడుతూన్నావనేనా? మనిద్దరికీ మధ్య యీ వర్గకలహాసిద్ధాంతం తెచ్చిపెట్టడం అర్థం లేనిది. అటువంటి తెలివితక్కువ నువ్వుచేస్తావని నే ననుకోను. లేక నేనే పొరపాటు చేస్తున్నానంటావా? నాదే-పొరబాటైతే అది నాకెంతో ఆశ్చర్యకరమూ శోచనీయమూకూడా అవుతుంది. తమ దేశంలోనే, జాతిలోనే, స్వజనంలోనే వైషమ్యాలు

తేవాలనుకొనే వాళ్ళని నేనర్థం చేసుకోలేను. అసలు అల్లాంటి వాళ్ళ బోధనలు అర్థంచేసుకోవడానికి యత్నించడమె అనవసరం.'

'బాగుంది చాలా బాగుంది నువ్వు చెప్పేది ఈవేళ నియాతీ నాకొక నూతనసిద్ధాంతాన్ని బోధిస్తాందన్నమాట!'

నియాతీ బాగాచదువుకున్న పడుచు. ఆమె యెంత బోధించినా పాఠం మావాడి బుర్ర కెక్కడంలేదు పైగా వాడామెను పరిహాసిస్తాన్నాడు!

'ప్రపంచాన్ని నడపు పురుషాన్న సూత్రాలు యివి గాదని తెలుసుకో. నా మాట నమ్ము మానవ జీవితమంతా అదృష్టంమీదే ఆధారపడివుందని ఓవరకు గుడ్డివాడికైనా స్పష్టమవుతుంది వ్యక్తి జీవితచక్రంలో ప్రతి భ్రమణమూ కూడా కేవలం యాదృచ్ఛికమే. అల్లాగే మానవసమాజంకూడాను.'

'సామాజిక జీవితంలో ప్రతిఘటనాకూడా ఒక నిర్ణీత సూత్రబద్ధమైయే వుందని ఋజువుచేసిన ఒక గొప్పసిద్ధాంతం వుంది. దాన్నిగూర్చి నియాతికి పరిచయం లేదనితోస్తుంది.'

నీ అభిప్రాయం నాకు తెలుసునులే. అదొక భ్రమ. అదీ గాక, విన్నా! అదంత ప్రాముఖ్యమైందికాదు. నేను నిశ్చయంగా చెప్పగలను. మానవజాతి అదృష్టాన్ని నిర్ణయించేదది కాదని తెలుసుకో. జీవితపథ మెప్పుడు యెగుడుదిగుడులుగా తన కిచ్చవచ్చిన మార్గాన్నే పోతుంటుంది. దాన్ని యేవో కొన్ని నిర్ణీతమైన సూత్రాలికి కట్టుబరచి వుంచడం

సాధ్యంగాదు. మానవజీవికలో ప్రధానపాత్ర వహిస్తూన్నది ప్రేమ ద్వేషాలు, మంచిసెబ్బరలు, తెలివిమూర్ఖతలు, ఉదాత్త తానీచత్వాలూ, సౌందర్యవికారతలు,- యింకా...'

హిల్డా మరికొన్ని ద్వంద్వాలకోసం అన్వేషిస్తూన్నట్లు ఒక్కక్షణం ఆగింది. ఆలవకాశం తీసుకుని విల్హో అందుకున్నాడు.

"కలిమి లేములూ, నిండుకడుపుమండుకడుపు ..."

ఈ మాట లనేటప్పుడు వాడి ముఖంమీది వ్యంగధోరణి చిరునవ్వు నాకు చిరపరచితమే లెండి. అబ్బ! మా వాడున్నాడే మా కొంటెవాడండీ. వాడి బుర్రలో యేదో వుంది, బాబూ వుంది.

ఆమె యింకా వాడితో వాదించడం మానదలచని దే.

'విల్హో! కలిమిలేములు అనేవి పూర్తిగా సాపేక్షకమైన మాటలు. వాటిని కొలిచేందు కొక నిర్ణీతమైన కొలబద్ద అంటూ వుండడం అసంభవం."

కాని మావాడూ తక్కువ తిన్నవాడు కాదుగా? వ్యంగ్యంగా,-

"ఔను! నియీాతీ! అందులోనూ ఐనారీ పీత్కానియే మీ నాలుగు కూరమళ్ళూ, హ్యూగో కుర్కిమాకీ పదకొండు వందల యెకరాలూ,- వీటిని పోల్చి చూస్తే మనం యే విషయాన్నీ తేల్చుకోనే లేము!"

హిల్డా కొంచెం కంగారు పడినట్లు తోచింది.

"దానికీ దీనికీ సంబంధంలేదు. వొట్టివృాకదంవుడు! విల్హో! ఇంగ్లీషువాళ్ళ సామెత విన్నావుగాదూ? సంతృప్తియే సుఖం, అని. ధనం యెంతున్నా సంతృప్తే ప్రధానం. మా నాన్న కంటె విూ అన్నగారే యెన్నోరెట్లు ఆత్మీయుంగా సుఖ వంతుడు. మా నాన్న రాత్రీబగలూ యేదో గొడవతో నిద్రాహారాలు, శాంతిసౌఖ్యాలూ యెరగడు!"

ఈ మాటలు వినగానే నేను కట్టెలమీద లేచి కూర్చు న్నాను. ఓ సుందరనారీ! నువ్వెంత మాటలు నేర్చిన జాణ వైనా నన్ను మాయపుచ్చ లేవమ్మా. ఆత్మసుఖం చెడ్డదనీ, నిరసించ దగిందనీ నేనూ అనను. కాని, పొట్ట నింపడాని కేమీ లేనప్పుడు నువ్వు ఆత్మతో యేంచేస్తావమ్మా? పిచ్చి దానవు! మూడుపూటలా మేత వేయకపోతే ఆత్మమాత్రం యెన్నాళ్ళు నీ సుందర దేహాన్ని అంటిపెట్టుకుని వుండగలదమ్మా! చెప్పవమ్మా, చూదాం,

విల్హో ఆమె కేమని జవాబిచ్చేడో నేను వినలేదు. అసలు వాడేజవాబూ యివ్వనే లేదేమో? ఊరికే భుజాలు కుంచిం చుకుని, చేతులతో నిరాశాసూచకంగా అభినయించివుంటాడు. వాడిదగ్గర యీ పద్ధతీ వుందిలెండి. ఎదుటవాళ్ళని నోరు మూయించడంలో అంతవాడు వుండడు.

ఒక్కమాటు ఆగి, ఆమె మళ్ళా అంది.

"విల్హో! నువ్వేమీ నాదగ్గర ఋజువుచేసేందుకు ప్రయ త్నించకు..."

ఆమె చెప్పేది పూర్తిగాకుండానే వాడు అడ్డొచ్చి అన్నాడు.

"నియాతీ! దేన్నీ ఋజువుచేయాలని నేను ప్రయత్నించడం లేదు. పైపెచ్చు ఆ ప్రయత్నాన్ని చేస్తూన్నది నువ్వే. నా జీవితంలో యింత అమాయికంగా చర్చించేవాళ్ళని నేను చూడలేదంటే నమ్ముతావా?..."

ఈసారి విల్హో చెప్పేమాటలకి ఆమె అడ్డొచ్చింది. ఆమె స్వరమే పూర్తిగా మారిపోయిందీసారి.

"విల్హో! అదంతా పోనిద్దూ. నే నిక్కడికి వచ్చిన దిందుకేనా? అవన్నీ నా కెందుకో చెప్పు? నీతో నాకు తర్కాలేమీ వద్దు. డబ్బూ, పొలాలూ, వర్గాలూ, అవన్నీ మండిపోనీ. నా కెందుకు? ఒక్క ప్రశ్నకిమాత్రం జవాబీయవూ? ఇస్తాననవూ?"

కట్టెలమీద చేతు లానుకుని లేచేను. వాళ్ళ మాటలు వింటూ యిక్క డెంతసేపని కూర్చోను? తమ సంభాషణ యితరులు వినాలని కాదుగా వాళ్ళుకోరేది! ఏదో కాకతాళీయంగా యిక్కడ కూర్చోడం తటస్థించింది. అంతే. గోడలోపల ఖాళీ లుండిపోయే యిసుక కూడా యీ సందర్భంలో నాకు తెలిసొచ్చిందిగా. కూర్చున్నందుకు ప్రాణమేం పోలేదు.

ఊరికే కూర్చుంటే నాకు రోజు వెళుతుందా యేమిటి? పోదా మనుకుని అక్కడ కట్టెలు చెదిరిపోయినవి సర్దుతున్నా. అవతలివైపునుంచి నియాతీ హెల్గా కంఠం సానునయంగా సాదరంగా మాట్లాడ్డం వినిపిస్తూంది:

'విల్లో! నిజంగా చెప్పు ! నిజం చెప్తానని మాట యియ్యి!'
మావాడు నీళ్ళు నములుతూన్నట్లు జవాబిచ్చేడు.

"నాకు అబద్ధమాడాల్సిన అవసర మేముందని ?"

"చెప్పు, విల్లో ! " ఆమె గొంతు యెంతో మార్దవ ప్రేమానునయభావాల్ని వెలార్చుతూ వినిపించింది. నా ఆశ్చర్యానికి అంచుల్లేకపోయేయి.

"దాపరికం వుంచకూడదు, విల్లో! మనం మొట్టమొదటి సారి కలుసుకున్నాం చూసేవూ, అప్పుడేం జరిగిందో జ్ఞాపకం వుందా ? ఆ రోజున విందు ముగిసేక నన్ను యింటికి దిగ బెడుతూన్నప్పుడు నాతో యేమన్నావో మళ్ళీ ఒక్కమాటు చెప్పు."

"బాగానే వుంది..."

"మరిచిపోయేవా ?"

"ఎందుకు మరచిపోతాను ?"

"అది నీ హృదయపూర్వకంగా అన్నదేనా ?"

"అదంతా మళ్ళీ తవ్వడం దేనికి ?"

"జవాబిస్తానని, మాట మీరుతున్నావా, యిప్పుడు ?"

వాడేమీ మాటాడలేదు. కర్రబిలగుట్టమీద సరిగా పెట్ట డానికని ఓ పెద్దదుంగ నెత్తినవాణ్ణి దాన్ని పెట్టకండా గాలిలో అల్లాగే పట్టుకుని వుండిపోయేను. చిటుక్కుమన్నా యెక్కడ వాళ్ళు బెదిరిపోతారో ? ఏమంటాడు ?

"జవాబుకోసం యెదురుచూస్తూన్నాను, విల్లో !"

ఎప్పుడో అన్నమాటలు మళ్ళీ చెప్పమంటే యెవరికైనా కష్టమేనుమండీ. కాని యీ ఆడాళ్ళు వదిలిపెడితేగా ? ఈ సున్నితదేహాలలో అంత శక్తీ, పట్టుదలా యెల్లావున్నాయో? నా కర్థమేగాదండీ. అంతలోకీ విల్లో మాట్లాడేడు :

"అప్పు డన్నదాన్నే మళ్ళీ యెన్నిసార్లైనా అంటాను !'

సుఖ పారవశ్యాన్ని సూచించే నవ్వు వినిపించింది. కాని హిల్డా నవ్వుతూండగానే మధ్యలో వాడన్నాడుగదా :

"మళ్ళీ యెన్నిసార్లైనా అంటాను ! నియీాతీ ! కాని, అందువల్ల కలిగే ఫలితం యేమీా వుండబోదు.''

"అంహాం ! ఎందు కుండదు ? విల్లో ! ఎంతో ఫలితం వుండితీరుతుంది. నా విల్లో ! నువ్వు వట్టి పిచ్చిపిల్లాడివి ! ఏదీ ? అది వసంతకాలం, రజనీతిమిరావకుంఠనంక్రింద మన మిద్దరమే నడిచిపోతున్నాం. మనంగాక అప్పుడు లోకంలో యింకేదీ లేదనిపించింది ! విల్లో ! అప్పుడు నువ్వన్నమాటలు యెంత బాగున్నాయి ! అంతకంటె మంచిమాటలు యెవరు చెప్పగలరు? అబ్బ! జీవితాన్ని సుఖాశాకల్పనలతో తన్మయం చేసే ఆ మాటలముందు మరేదీ నిలువలేదు. నీ జుట్టు యెంత బాగుంటుంది ? ముట్టుకోనియ్యి ! అదీ ! అబ్బా! తల వెనక్కి తీసుకుంటా వేమిటి ? ఏం పెంకిరాలుగాయమ్మా ! ఎల్లాగ నీతో వేగడం...''

నేను వినాలని ఉద్దేశించి అన్నమాటలు గానప్పుడు నే నెందుకు వినడం ? ఇంటిచూరులోంచి జరిగి దూరంగా

పోయి కూరగమళ్ళు చూస్తున్నా. మొక్క లప్పుడప్పుడే పైకి వస్తూన్నాయి. వాము బాగానే మొలిచింది. కారట్లు నూనూగు తోకల్ని పైకెత్తుకుంటూ వస్తూన్నాయి. ఈమడిలో వెల్లా కలుపుతీసింది. బీట్ రూటు, టర్నిప్ లు యిప్పుడిప్పుడే మొలక లెత్తుతూన్నాయి. వాటి విషయంలో కొంచెం శ్రద్ధ తీసుకోవాలనుకుంటూ.

కొండని చేర ఒకమడిగట్టున గుబ్బెపు బటాణీలుగుచ్చేను. పసరుఆకులు వేసి, అప్పుడే సన్నని నులితీగలతో రాళ్ళను పట్టుకుంటూ యెండ వెలుతురులవైపు అర్రులు జాచి సాగుతూన్నాయి. ఏమిటో ! వాటికి యెండను చూసే భాగ్యం యెన్నటికీ లభించదు. పాపం. ఆ మడిగట్టుదగ్గిరికి యెండ యెప్పుడూతగలదు. చివరకి మధ్యాహ్నమప్పుడుకూడాఅంతే.

ఏ కాస్తో యెండ తగులుతూన్నది మిగితా మూడు మళ్ళలోనూ వేసిన బంగాళాదుంపలకే. అవన్నీ చక్కగా ఒకే వరసన బైలుదేరి, బలంగా పెరుగుతున్నాయి. కాని వాటి గట్లమీాద మార్తా నాటిన పూలమొక్కలు నాసిగా కనిపిస్తూన్నాయి. వాటిని పూలు పూయడమే గగనం, పరిమళం మాట దేవు డెరుగును! విడిగా మట్టిదిబ్బ పోసి పాతిన ప్రొద్దుతిరుగుడు మొక్కలు యిప్పుడిప్పుడే రెండో జత ఆకులు వేస్తున్నాయి. ఆ మట్టిదిబ్బ కొట్టుకుపోకండా చిన్నచిన్న గులకరాళ్ళు తెచ్చి చుట్టూ పొదిగేరు, పిల్లలు. ఏదో పిల్లలు గాదూ, సరదా !

ఇంట్లో వాళ్ళిద్దరూ ఆడుకునే మాటలు వినరాదనుకున్నా, అవి నా చెవుల బడుతూనేవున్నాయి. వీళ్ళెనంత దూరంగా పోయి, కొండగోడ దరినే నిలబడ్డా, మాటలన్నీ విస్పష్టంగా వినబడుతూంటే నేనేం చేస్తాను? ఆమె వాణ్ణి జయించేసే ననుకుంటుంది. ఓ క్షణంలో మెత్తబడ్డట్లు కనిపించి, అంత లోనే కరుకెక్కుతున్నాడు. వాడు! పడుచువాళ్ళ మాటలు పట్టు బిగువుగానే వుంటాయిగదూ, యెల్లాగైనా. విల్లో అన్నాడు:

"అన్నమాట లేదని యెందు కంటాను? విచిత్రమైన నీ భావాలమాట అల్లావుంచితే యీ ప్రపంచలో కల్లా నువ్వు అపురూపమైన దానవని యిప్పుడుకూడా అంటాను. ఒకసారి గాదు. లక్షసార్లు అంటాను. నువ్వు నా మనస్సును యెల్లా జయించేసేవో నాకు అర్థం కానేలేదు! వేలమంది కన్యల్లోంచి యేంచుకోవాల్సివస్తే యిప్పటికీ నిన్నే యెంచుకుంటాను! ఆ మాట చెప్పడానికి వెనకదీయను. ఔను! నీకు బ్రతుకు తెరువు తెలుసు. వాస్తవికలోకంలోనే వుంటావు నువ్వు! నువ్వంటే నే నెంత ప్రీతితో చూస్తున్నానో చెప్పడానికి మాటలేం సరిపోతాయి? నాకు తెలుసు. నువ్వు మేఘాల్లో విహరించవు! పగటికలలు కనవు! నీ వయసూ, వైభవం వున్న అనేకమంది పడుచుల్లాగ అర్థంలేని ఆశాసౌధాలు కట్టవు నువ్వు! దివ్యప్రేమకలలు నీ స్వభావానికి దూరం! అట్లని నీ అభిరుచుల్లో మొరటుదనం లేదు. నిశ్చలంగా ఆలోచించు

కుని, నీ భావిని ఖచ్చితంగా యెంచుకున్నావు. నీ ప్రాయంలో పొరపాటు సహజం. కాని, నువ్వో! భవిష్యత్తును నీకూవలె సుస్పష్టంగా దృష్టిపథంలో వుంచుకొనే తెలివీ, నిబ్బరం యెందరి కున్నాయి?''

ఇక్కడ వాడిమాట కామె అడ్డొచ్చింది.

"ఔను! విల్లో! ఔను! నేను నీకు బరువుగా వుండ బోను. నా యూనివర్సిటీ కోర్సు పూర్తిచేసుకున్నాక అధ్యాప కత్వాన్ని తీసుకుంటాను. ఏం?......"

కాని, వాడు వినిపించుకోనట్లు మాట్లాడనారంభించేడు.

"ఒక్క చిన్నసంఘటన నా మనస్సులో హత్తుకుపోయింది. అది నీకు జ్ఞాపకముందో లేదో? నేను ఛెర్రీ వృక్షా న్నెక్కేను, పూలగుత్తి కోయడానికి. మంచిమంచి గుత్తులు చిటారు కొమ్మనివున్నాయి. చక్కని ఛెర్రీపూలగుత్తి* కోసి, చెట్టుదిగి వచ్చేను. ఆ సమయంలో నా చొక్కా గుండీ ఒకటి తెగి పడి పోయింది. నువ్వు బ్లౌజులోంచి మూడు రంగుదారాలూ, మూడు సూదులూ తీసి, అక్కడి కక్కడే బొత్తాం కుట్టే సేవు. పట్టుదల వ్యాశక్తి నీలో మూర్తీభవించే యనడాని కీవుదాహరణ చాలదూ? ఎంత శ్రద్ధ!''

'ఔనౌను! విల్లో! ఇంత చిన్నవిషయాన్ని జ్ఞాపకం వుంచుకున్నావూ అంటే యెంత మంచివాడివు!''

* ఎర్రని పూలు గుత్తులుగా పూస్తుంది. ఛెర్రీ వృక్షం. ఈ పూలగుత్తి క్షేమచిహ్నం. వివాహనిశ్చయానికది ఫలించడం చిహ్నంగా భావిస్తారు.

"నియాతీ! అదిగాదు సంగతి. అప్రాముఖ్యమైనవి నీ దృష్టిని మరుగుపరచనీకు. నిన్ను నువ్వే మరిచిపోకు. కాని మన భవిష్యత్తు ఒక్క విషయంమీద ఆధారపడివుంది. ఒక్క మాట అడగనా?"

"ఓఁ! అడుగు, విల్హో! వింటున్నా."

"నాకోసం నువ్వు తలిదండ్రుల్ని విడువగలవా? కుటుంబంతో తెగ తెంపులు చేసుకోగలవా?"

విల్హో! ఏమిటి నువ్వనేది? పిచ్చెత్తిందా? నిజంగా నేనా నువ్వు మాట్లాడేది? పరిహాసాని కాదుగదా?"

"పిచ్చో, వెర్రో, నా ప్రశ్న వేసేసేను. నీ జవాబుకై నిరీక్షిస్తున్నాను."

"అసంగతమైన ప్రశ్న అది. విల్హో! పురాతనగాథల్లో కానవచ్చే నాయికానాయకుల్లా స్వాప్నికప్రపంచంలో నేనా మన మీనాడు విహరించవల్సింది? పోనీ మనం చేసేదానికి ప్రయోజనమేనా వుండాలా? ఇరవయ్యోశతాబ్దంలో నివసిస్తున్న మన కుండాల్సిన లోకజ్ఞానం మనలో లోపించలేదే!"

"ప్రియతమా! కుర్కిమాకీ కన్యా! నేను ముమ్మాటికీ నిన్నడగదలచిన దిదే."

"అయ్యో! దేముడా! ఇదేమిటి! అసలు యిటువంటి విధానంలో ఆలోచించడమే అదో పెద్దపొరబాటు. విల్హో! ఈ సమస్య నువ్వు సరిగా ఆలోచించనే లేదనుకుంటా. ప్రియా! మనకు హితమైన......యిల్లా...దేనికి? ఊఁ! విల్హో, చెప్పు!

ఆ ప్రశ్న పరిహాసానికే వేసేనని చెప్పు! నన్ను పరీక్షించ డానికే గాదూ?"

విల్లో యేమీ మాటాడలేదు. ఆమె మాటలే మళ్ళా యింట్లోంచి లాలనగా మృదువుగా వినిపించేయి.

"అయ్యో దేవుడా! ఈ పిచ్చిపిల్లవాడితో నేనేం చెయ్యా లోయ్, బాబూ. విల్లో! విల్లో! వింటున్నావా? నీ స్వాభి మానాన్నీ, ఆభిజాత్యాన్నీ నే నెంతో మెచ్చుకుంటున్నాను. ఏదైనా మితిమీరితే ప్రమాదకరమే అవుతుంది. అంతేగాదు. అది మూర్ఖత్వం అనిపించుకుంటుంది. కూడాను."

"కావచ్చు. నువెల్లా అనుకున్నా మంచిదే. కాని, నన్ను నా దృష్టిలోను, ప్రజల దృష్టిలోనూ, అంటే నా కామ్రేడ్స్ దృష్టిలోనూ కించెపరచుకోడంకంటె అదే మేలు!"

'అయ్యో! మళ్ళీ కామ్రేడ్సట!......విల్లో! ప్రియ తమా! నా మాట వినవూ......'

నే నిక్కడ నిలుచోడం అనవసరం. ఇంటి ఆవలి ప్రక్కకి పోడానికి ప్రయత్నించినా. కొండ అక్కడినుంచి నిటారున దిగి పోతుంది, కాని, అక్కడికీ వాళ్ళ మాటలు వినిపిస్తూన్నాయి, నేనేం చేస్తాను? సానునయపూర్వకంగా బ్రతిమాలుతూన్న స్త్రీకంఠం; దుఃఖం పొంగి పొర్లివస్తూ కంఠం రుద్ధమై అశ్రు పూరితమైనప్పుడు వెలువడే మాటలసవ్వడి, అది. పురుష కంఠం పట్టుదలగానూ, బింకంగానూ, ఆవేసమయంలో మృదువుగానూ వుంది.

ఒక క్షణంపాటు ఆడగొంతు వినబడలేదు. ఆమె తన మాటల్ని ఊపిరిలోనే లీనంచేసి, ప్రశ్నిస్తున్నట్లనిపించింది. ఎందుకో వెనక్కి తిరిగి తూర్పుముఖంగావున్న కిటికీలోకి చూడాలనిపించింది. ఆ కిటికీకి సరాసరిగా ఉత్తరముఖమైన రెండో కిటికీ వుంది. రెండుకిటికీలకీ మధ్యలో యిద్దరి తలలూ కనబడ్డాయి.

ఇద్దరూ గదిమధ్యలో నిలుచున్నారు; యిద్దరిముఖాలు అత్యంతసమీపంలోనే వున్నాయి. హేల్గా మొగమెత్తి విల్లీని చూస్తూంది ఏదో రహస్యం మాట్లాడుతూన్నట్లామె పెదవులు కదులుతూన్నాయి. ఆమె తన పెదవుల్ని విల్లీ ముఖం దగ్గిరికి తీసుకుపోతూన్నట్లుంది. వాడు ఆమె ముఖంలోకి అధో దృష్టితో చూస్తూ, శిరఃకంపపూర్వకంగా యేదో చెపుతూ న్నాడే గాని తన పెదవుల నామె పెదవులతో కలపడానికి యత్నించుతూన్నట్లు లేదు.

అటుపోతూ ఒక్కక్షణంమాత్రమే నేనా కిటికీవైపు చూసేను. కొండక్రిందికి వెళ్ళి యే రాయో రప్పో చేసివేసు కుంటే ఫలంపాటు గాని ఊరికే జాప్యం చేస్తే నాకేల్లా గడు స్తుంది ? ఇంకొక్కక్షణం కూడా వాళ్ళ మాటలు వింటూ కూర్చోను గాక కూర్చోను. ఆదివారమే కానిండి. ఐతేనేం, కుండల్లో గుర్రాలు తోలుతూ కూర్చుంటే నాపని కడతేరి నట్టే !

ఓ రాతిని దొర్లించుకొచ్చి పైకి చేర్చి, మళ్ళీ యింకో దానికోసం క్రిందికి వెళ్ళేను. చిన్నా పెద్దా రాళ్ళని కొండ

పైకి దొర్లించుకునీ, మోసుకునీ వస్తున్నేవున్నా, చెమటలు కక్కుతూ— కాని నా మనస్సంతా వాళ్ళిద్దరి పెదవులూ కలుసుకున్నాయా ? లేదా ? అనే ఆలోచనలో మునిగివున్నాయి.

ఎల్సా వచ్చి, కాఫీ పెట్టింది. గ్రుడ్లు వేల్చింది. భోజనాల దగ్గర మాటలేఅంతగా లేవు. పరిహాసాలూ, నవ్వుల్లూ అసలే లేవు. హిల్డా నా భార్యవైపు చూస్తూ చిరునవ్వుతూ, యింటిని గూర్చి, బిడ్డల్ని గూర్చి కుశలప్రశ్నలు వేస్తూంది. కాని ఆ చిరునవ్వు పెదవులమీదే కాని మనస్సులో తుఫాను చెలరేగుతూందని హిల్డా ముఖమే చెపుతూంది.

ఇద్దరూ ఒక్కసారిగే లేచి వెళ్ళొస్తామన్నారు. విల్హో నా దగ్గిరకి వచ్చి, ప్రశాంతంగానే అన్నాడు :

"ఈ మా సమావేశానిక్కై నేను నీకే వందనా లర్పించాలనుకుంటా !"

ఈ మాట అనేసి, ఆమెతో బైలుదేరేడే గాని, వాడు వందనాలూ చెప్పలేదు. వెళ్లవస్తా ననీ అనలేదు. సగౌరవంగా నియీాతీకి కైదండ యొసగి, కొండ దింపి, వంతెన దాటించి తీసుకువెళ్ళిపోయేడు. అంతే.

వాళ్లూ వెళ్లిపోడంతోనే నేను మళ్ళా రాళ్లు మోయనారంభించేను. ఎంత పెద్దరాళ్ళనీ నేను లెక్కచెయ్యను, నన్ను తమ భారంక్రింద అణిచివేయగలంత పెనుబండలు వచ్చినపుడు నేను మరీ సంతోషిస్తూన్నా. ఐనా అవీ నన్ను వంగదీయలేదు. నాలోనేదో ప్రవేశించింది. ...

యేదో బాధ, మనసులో పీడ, ఏదో అహితమైన భావాన్ని అణచివేయడానికి పోరాడుతూన్నట్లున్నాయి. నా సర్వాంగాలూ. అందుక నేభయంకరంగా బండరాళ్ళతో పెనుగులాడి. చెమటలు కక్కుతూన్నా నాకేం లక్ష్యమే లేదు!

ఆ రోజు మోసినన్ని రాళ్ళు నే నదివరకెన్నడూ మోయలేదు. కాని నే నారాళ్ళతో తంటాలుపడుతూన్నంతసేపూ, షెడ్ గోడలు కడుతూన్నంతసేపూ, నా కావిషయమే మనస్సులో మెదులుతూంది. చివరికి వాళ్ళిద్దరి పెదవులూ కలుసుకోనే లేదు!

---

## పద్నాలుగో ప్రకరణం – యుద్ధఖైదీలు.

ఆ తర్వాత మళ్ళీ చాలరోజులవరకూ విల్హ్లోని నేను చూడనే లేదు. నియోతీ హిల్డా కూడ మళ్ళీ మా యింటికి రానేలేదు. నే నామెను మాత్రం అప్పుడప్పుడు కలుసుకునేవాణ్ణి. అల్లాటి సమయాల్లో దూరాన్నుంచే టోపీ తీసి చేతబట్టుకునేవాణ్ణి; నా వందనాన్ని ఆమె మందస్మితంతో శిరఃకంపన చేస్తూ అందుకునేది. విల్హో క్షేమంమాత్రం వాడి మిత్రులద్వారా వింటూండేవాణ్ణి. వాడు కులాసాగానే వున్నాడనీ, పని చేసుకుంటూ, తన కాలానంతటినీ గ్రంథపఠనంలో వెళ్ళబుచ్చుతూన్నాడనీ అంతా చెప్పేవాళ్లు. వాడు కులాసాగా వున్నందుకు ఆ ఈశ్వరుని కనేకవందనాలు. ముమ్మాటికీ అదే పదివేలు.

నేనూ వాణ్ణి చూడబోలేదు. వెడితేమాత్రం లాభ మేమిటి లెండి. ఆ రోజుసంఘటన తర్వాత నేను వాడికళ్ళల్లోకి సూటిగా చూడలేక నే పోదును. మొహం చెల్లద్దూ?

శిశిరఋతువులో విహ్టోరీ కుర్కికూకి హెల్సింకీ నుంచి సెలవుల కింటికి వొచ్చేడు. తరుచుగా కార్మిక క్లబ్బులో బాక్సింగు పందేలు జరుగుతూండేవి. విహ్టోరీ వాటిల్లో పాల్గొంటూ యెందరిమీదో నెగ్గుకుంటూ వస్తూన్నాడు. సన్నగా శలాకలా వున్నా మంచి శక్తిసామర్థ్యాలు, చురుకుదనం గలిగి, తన ముష్టిఘాతా న్నెక్కడ, యెప్పుడు ప్రయోగించాలో తెలిసి ప్రయోగించగల ఆ పడుచువాణ్ణి తరుచుగా బాక్సింగు రింగులో చూసేవాళ్ళు, ఆచుట్టుప్రక్కల ప్రజలంతా.

ఆ సెలవుల్లో విహ్టోరీ వరసగా ముగ్గుర్ని ఓడించేక ఉర్హో జుకోలా వంతువచ్చింది. ఇద్దరూ చాలసేపు పోట్లాడేక, పందెం సమం ఐనట్లు ప్రకటించేరు. అంతే. ఆ మరునాడే విల్హో ఉర్హోని ఛాలెంజి చెయ్యడం, మొదటి చుట్టులోనే పడగొట్టడం ప్రజలంతా విచిత్రంగా చెప్పుకున్నారు.

వడ్రంగి ఉర్హో జుకోలా దీర్ఘబాహుడు. మంచి బాక్సరు. అతనితో సమంగా పెనగిన తర్వాత విహ్టోరీ చారవచేసి నిల్స హాపానెన్ తో పోట్లాడి ఓడిపోయేడు. నిల్స విహ్టోరీని నాలుగో చుట్టులో కొట్టిన ముష్టిఘాతాని కాతడు స్మృతితప్పి పడిపోయేడు. తర్వాత మూడోరోజునే విల్హోతో పడింది నిల్స్‌కి. ఆరవ చుటదాకా నిలబడ్డాడు గాని చివరికి

రక్తసిక్తమైన ముఖంతో నిల్చునిపోయేడు. జనం ఊరికే విరగబడిపోయి చెప్పుకున్నారీ సంగతి.

"కార్మిక క్లబ్బులో యిది మామూలుమర్యాదే అయిపోయిందండీ! కుర్కిమాకీని పడగొట్టినవాడు విల్హోకి పాదాక్రాంతుడు గావాల్సిందే. తాడి తన్నేవాడి తల తన్నేవాడుండకపోతాడా!"

కానైతే విల్హో అల్లా యెందుకు చేస్తున్నాడో యెవరికీ తెలియదు. ఎవరిదాకానో యెందుకు? విహ్టోరికే తెలియదు! విహ్టోరి కుర్కిమాకీ తెలివితక్కువవాడేం గాదు. ఆవలిస్తే పేగులు లెక్కబెట్టే రకం. అతడు విల్హో విచిత్రప్రవర్తనకి కారణమేమిటా! అని తెలిసికోడానికి చాలాప్రయత్నాలు చేసేడు. ఆఖరికోసారి కారణం చెప్పాలని విల్హోని నిగ్గదీసేడు కూడానుట. కాని విల్హో అతనికే జవాబూ యివ్వలేదుట. సవ్వాలకపోసే సెలికళ్ళతో రెప్ప వాల్చకండా విహ్టోరిని ఆపాదమస్తకం యెగాదిగా చూసేవాడు. విల్హో యేదో మెల్లిగా గొణిగేవాడుకూడాననీ, పళ్ళు బిగించి మెల్లిగా,-

"త్వరలో నీకే తెలుస్తుందిలే!" అనిలావుంది అనేవాడనీ కొందరు చెప్పుకున్నారు కూడాను.

నేను విల్హోని కలుసుకోకపోడం తప్పే అని ఒప్పుకుంటా. తప్పేగాదు తప్పున్నర! తర్వాత విచారించేను గాని గతజలసేతుబంధనంలా నిష్ప్రయోజనమే. ఆ సంవత్సరకాలంలోనూ ఒక్కసారైనా వెళ్ళి చూసివుండాల్సింది. కాని యిల్లాజరుగుతుందని యెవరనుకున్నారు? ఈ రోజుల్లో సంఘటన లేవీ

మెల్లిగా జరగవు. ఏది జరిగినా ఉరకలమీదా, పరుగుల మీదాను. ఆ వసంతంలో అయినా నేను పోలేదు. ఆ తర్వాత యింక లాభమే లేకపోయింది. అయ్యయ్యో! మా తమ్ముళ్ళు విన్నా! ఎంతపని చేసేనురా? భగవంతుడా!

కాని యిప్పుడేమనుకుని యేం లాభం లెండి. ఆ రోజుల్లో మా స్వామీకి జర్మన్ పటాలాలతో బాటు యిసపగజ్జెల తల్లి కూడా వస్తూందని యెవ రనుకున్నారండీ? హెల్సింకీ లోనూ, మరి కొన్నిచోట్లా నాజీ పటాలాలు దిగినాయనీ, అక్కణ్ణుంచి వాళ్ళని రైళ్ళమీద ఉత్తరానికి జేర వేస్తూనారనీ అనుకున్నారు. వాళ్ళువచ్చేరంటే యేమో అనుకున్నాం గాని యిల్లా జరుగుతుం దని యెవ రనుకున్నారు? కాని, యీ మాటలు చెప్పుకునే టప్పుడు కొందరు ముఖం చిట్లించుకునేవా ళ్ళనిమాత్రం నేను కనిపెట్టకపోలేదు. విషయం తెలుసుకోవా లని బుద్ధి పుట్టి హెంర్రా కుర్కిమాకీని ఓ రోజున అడిగితే ఆయన స్పష్టంగా చెప్పేసేరు:

'జర్మనీలాంటి గొప్ప దేశం మనకి అండగా వుందని మనం సంతోషించాలి, గర్వపడాలి. ఈసారి తెలుస్తుంది బోల్షివిక్కుల పని!'

నా కామాటలు ఆశ్చర్యం కలిగించేయి:

'వాళ్ళు మళ్ళీ మనమీదికి వస్తున్నారా ఏమిటి? బాబు గారూ! కొంప దీసి.'

బరువైన వాలిపోతూన్న మూతల్లాంటి కనురెప్పల క్రింది నుంచి నావైపు దొంగచూపులు చూస్తూ హెర్రా కుర్కి మాకీ కొంచెంసేపు తనలో తానే ఆలోచించుకున్నాక ఖచ్చితంగా చెప్పేరు:

'ఔనోయ్! వాళ్ళెంత పేట్రేగి పోతూన్నారని!'

నిజం! బోల్షివిక్కులు యెక్కడ యెప్పుడు యుద్ధచర్యలు ప్రారంభించేరో నాకు సరిగా జ్ఞాపకంలేదుసుమండీ. పేపర్లలో నైనా ఆ వార్తలేం వచ్చినట్లులేదు, పోనీ దానిదేం వుంది. ఎవరో ఒకళ్ళు మనకి మిత్రులుగా సాయపడుతూన్నారంటే సంతోషమే గాదండీ! అదీ ఒకందుకు మంచిదే. గుండెలమీద చెయ్యేసుకుని హాయిగా నిద్ర బోవచ్చు. ఎలియాస్ కూడా అల్లాగే చెప్పేడు. పైగా వాడన్నాడుగదా:

'కాని మనం నిద్ర బోదలచుకోలేదు! జ్ఞాపకం పెట్టుకో, ఐనారీ. ఇల్లాంటి సమయంలో నిద్ర బోవడమా? పిర్క్కలీ! మనంకూడా నిలబడి నడుం బిగించాలోయ్. ఆగవోయ్! తొందర పడకు, మరి. కలలోకూడా అనుకోని సంగతులు జరుగుతాయి, నువ్వే చూస్తావు! మన దేదో మళ్ళీ రష్యా నుంచి లాక్కుంటాం. అంతతో సరిపెడితే మనం చెప్పుకోనే దేముంది? పిర్క్కలీ! అందరికీ పంచిపెడతాం భూములు లాక్కుని! నీ యజమానికంటె ధనికుడ వైపోతావు. చూసుకోరా!'

అల్లాంటి అదృష్టం పడుతుందని వినడాని కెవరికైనా సంతోషంగానే వుంటుంటి, మరి. పెడతా నంటే యెవరికేనా ఆశ

కలుగుతుంది గాదండీ. వాళ్ళవల్ల యిన్ని చిక్కులు వచ్చిపడ తాయని అప్పుడెవరనుకున్నారు? పెద్దమ్మ యెప్పుడూ విల్హోని వెంటాడుతూనే వుంది. వాణ్ణే ముందుగా పటాలంలోకి తీసుకు పోయేరు. వాడు పనిచేస్తున్నది క్రీమరీలోనని చెప్పేనుగా. జర్మనీకి వెన్నా, మీగడా యెగుమతి చేసే జాతీయప్రాము ఖ్యతగల పరిశ్రమలో పనిచేస్తూన్నా వాణ్ణే ముందుగా యీ సుడిగుండం లాగేసింది.

వసంతంలో కొండలమీది మంచు కరిగి వరదలు ప్రారంభ మైనాయి. హెర్రా కుర్కిమాకీ బాడవా బీళ్ళలో గడ్డిని అప్పుడప్పుడే కోతపట్టేము. అప్పటికే మా పటాలాలతో బాటుగా విల్హో తూర్పు కరేలియాలో రష్యామీదికి పురోగ మిస్తూన్నాడు. వాడి స్నేహితు లిద్దరు యీ విషయాన్ని నాతో చెప్పేరులెండి. వాళ్ళు అప్పటికింకా అహోనెన్ అం పవుమిల్లులోనే పనిచేస్తూ వుండిపోయేరు. విల్హో నాకు జాబులే రాయడం లేదు. వాడి మనస్సులో నామీద కష్టంగా వుండి వుంటుం దనుకుంటూ, ఇల్లాగ ఓ సంవత్సరం చూస్తూండగానే గడిచిపోయింది. కాని విల్హోనించి నాకు ఒక్క కబురేనా రాలేదు.

ఆ తర్వాత వాడు పూర్తిగా అదృశ్యుడై పోయేడు. అదెల్లా జరిగిందో నేను పోల్చుకోనే లేకపోయేను. పటాలంలో వాడి తోటివాళ్ళు రంపంమిల్లులో వున్న వాడి స్నేహితులకి జాబు రాసేరుట. విల్హో యిక మనలో లేడని ఆ ఉత్తరంలోని

సారాంశం. ఆ రోజున భయంకరమైన యుద్ధం జరిగిందట. గుండ్లవర్షం చాలమందిని తుడిచి పెట్టేసింది. నేలంతా దున్నేసి నాయిట, షెల్లులు! అంతే! ఆ యుద్ధం తర్వాత యిక మళ్ళీ విల్హోని యెవరూ చూడలేదట!

ఐతే దీని కర్థం యేమిటి? వాడు చనిపోయీ వుండొచ్చు; లేదా రష్యన్‌లకి ఖైదీగా చిక్కీ వుండొచ్చు. ఆ యుద్ధంలో కొందరు ఖైదీలుగా పట్టుబడ్డారనీ, విల్హోకూడా వాళ్ళలో వుండివుండచ్చుననీ వాడి మిత్రులు నన్నూరడించేరు. కాని, హెుర్రా కుర్కిమాకీ ఆ రెండూ పర్యవసానంలో ఒకటే నన్నారు. నే నాయన నడిగేను:

'రెండూ ఒకటే యెందు కవుతాయండీ?'

హెుర్రా కుర్కిమాకీ నిబ్బరంగా అన్నారు:

'యుద్ధఖైదీన్ని బోల్షివిక్కు లేం చేస్తారో నాకు తెలుసు నోయ్!'

'ఏం చేస్తారు?' తొందరగా అడిగేను, మళ్ళా.

'గోళ్ళతో ప్రారంభిస్తారు.'

నాకు గోళ్ళేమిటో అర్థం కాలేదు.

'గోళ్ళేమిటండీ?'

ఆయన నా అజ్ఞానాన్ని పోగొట్ట దలచి, విశదంగా చెప్పేరు:

'ఖైదీలని దిసమొలతో బల్లకి అంటగట్టి, గోళ్ళలో సూదులు గ్రుచ్చుతారు. తర్వాత మిగతాపని పూర్తిచేస్తారు.'

ఈ మాటలు వినేసరికి నా నెత్తిమీది వెంట్రుకలుకూడా లేచి నిలబడ్డాయి: బెరుకుతోనే అడిగేను:

'తర్వాత యేం చేస్తారు?'

ఆయనకి బోలెడు తొందరపను వుంటాయి. ఐనా నా అజ్ఞానానికి జాలిపడి, విపులంగా అదంతా సెలవిచ్చేరు:

'అంతా మామూలేనోయ్! కాలి వ్రేళ్ళూ, చేతి వ్రేళ్ళూ చెక్కేస్తారు; తర్వాత కొంచెంకొంచెగా కాలుసేతులు నరుకుతారు. ఒక్కమాటుగా చచ్చిపోకండా జాగ్రతగానే చెక్కుతారులే. ఆ మట్టున చర్మం ఒలిచి, తారు పట్టించి, సంకెళ్ళతో ఓ చీకటికొట్టులో పారేస్తారు. ఇల్లాంటి విషయాలు అందరూ తెలుసుకోవాల్సిన అవసరం యెంతేనా వుంది. ఆ కాకిమూకనిగూర్చి లోకం అంతకీ, తెలుసు. దేవుడూ దయ్యం అనే లేదు వాళ్ళకి! నువ్వింత అజ్ఞానంలో పడివున్నా వేమిటి! పేపర్లేనా చదవడం లేదుటోయ్, ఐనారీ?'

చాల రోజుల్నుంచి పేపర్లు చదవడంలేదని ఆయనదగ్గర ఒప్పుకున్నా. చదవడానికి తీరిక వుంటేనా? మింగ మెతుకు లేదు మీసాలకి సంపెంగనూని అన్నట్లు రోజుకి పదిమార్కులు సంపాదించేవాడికి వార్తాపత్రికావై భోగం కూడానా? అని ఆయనగారి ముఖంమీదే అడిగేద్దామనుకున్నా. కాని అడగనే లేకపోయేను చెప్పొద్దూ. ఎల్లా, నేనూ అత్యవసరంగా కొనాల్సిన వన్నీ కొనాలంటేనే కనీసం నాలుగువేల మార్కులుండాలి. ఇంట్లో ఒకటుంటే ఒకటిలేదు గదాండి. సంసారం యీదడం మాటలా యేమేనేనా? కాని, అదంతా ఆయనకి

చెప్పడం అంతగా అవసరమని నే నాసమయంలో అనుకో లేదు. ఆయ నేం ఆర్చేవాడా తీర్చేవాడా? పోనిద్దురూ.

అయ్యో! అక్కణ్ణుంచి మా కామందు వుపదేశం చేస్తూ, వుపన్యాసం ఆరంభించేడు. దేశాన్ని ప్రేమించే ప్రతివాడూ పేపర్లు విధిగా కొని చదవాలట. అల్లా చెయ్యకపోతే అంతా అనుకుంటారట, తనకి ప్రాణదాత, జీవనదాత, రక్షకురాలు ఐన మాతృభూమిని గూర్చి వీడికి కొంచెమైనా లక్ష్యం లేదని. కొరగాని కొడుకు పుట్టేడనీ, తల్లిపాలు త్రాగి రొమ్ము గుద్దే పరమదుర్మార్గుడురా వీడనీ కూడా అనుకుంటారుట! ఔను మరి! అనుకోరూ? అంచేత నేను మారు పలక్కుండా యీ విషయంలో ఆయనతో యేకీభవించేను—

'నిజమే, బాబయ్యా! తమరు చెప్పేది ముమ్మాటికీ నిజ ముండి!'

నేను పేపర్లు చదవ నందుకు ఆడిపోసుకుంటే అదే పోయింది గానీండీ, మా తమ్ముడి సంగతి తలుచుకుంటూంటే నిజంగా యేడుపొస్తూం దనుకోండి. ఏం చెయ్యాలో, ఏం చెప్పాలో యేమీ తెలియడం లేదు. ఆలోచించడానికే మహాభయంకరంగా వుంది...కాని మా కామందు నన్నింకా విజ్ఞానవంతుణ్ణిగా చేయడం అవసరం అనుకున్నారో యేమో, యేదో జ్ఞాపకం చేసుంటూన్నట్లు ఒక్కమాటుండి మళ్ళీ అందుకున్నారు:

'ఐనారీ! ఏ దెల్లావున్నా ఒక్క సంగతి మాత్రం నిశ్చయంగా చెప్పగలను. చచ్చి, సమాధిలో వుండటమే మేలనిపించే దుర్భరస్థితిలోనే విన్నో వుండివుంటాడని నిశ్చయమే. అదీగాక వాడప్పటివరకూ యింకా బ్రతికివున్నాడా? అనేదీ నమ్మకం లేదనుకో. ఒకవేళ బ్రతికున్నా యీ క్షణంలో మొండిగావున్న కాలుచేతులితో సంకెళ్ళతో, కాల్చి పారేసిన కనుగుడ్లలో చీకటికొట్లలో మూలుగుతూ పడుంటాడు. అందులో సందేహమే లేదనుకో. బోల్షివిక్కుల సంగతి నాకు బాగా తెలుసు.'

విన్నదల్లా నమ్మే మూర్ఖుణ్ణి గాదనుకోండి, నేను కాని కుర్కినాకీ ముఖం చూస్తే, ఆయన నా తమ్ముడి దుర్గతికి యెంత దుఃఖిస్తున్నాడో తెలుస్తోంది. అల్లాటప్పుడు నేనాయన్ని నమ్మకపోవడం యెల్లాగ? పైగా ఆయన యింకేం లాభం లేదన్నట్లు చేతుల్ని నిరాశాసూచకంగా త్రిప్పుతూ, తలాడిస్తూ, దీనపుమొహం పెట్టేడాయన! ఇంక నమ్మక చావనా?

నా పిడికిళ్ళు బిగిసిపోయినట్లూ, పళ్ళు పటపట మంటూనట్లూ నాకు తెలియనే తెలియదు.

'వాళ్ళని నాశనం చేయాల్సిందే!'

నా కోపం, అరవపూ హెచ్చరా కుర్కినాకీని మరింత విచారపూరితుణ్ణి చేసినట్లు ఆయన వైఖరే తెలుపుతూంది. ఆయన ముఖంమీది ముడుత లెక్కువైనాయి. శిరఃకంపం చేస్తూ

ఆయన వెళ్ళిపోయేరు. నేను ఆ కోపంమీాద వెళ్ళి, గడ్డికోసే యంత్రానికి గుర్రాల్ని పూన్చి బీటికి బైలుదేరేను. వెర్రి బాధతో వళ్ళంతా కుతకుత లాడిపోతూంది. గుర్రాల శరీర మంతా చెమ్మట నురుగుతో నిండిపోయిాదాకా గడ్డి కోసి కోసి, గుర్రాలు అడుగువెయ్యని స్థితిలో వాటిని విప్పి, పాగలో వదలి వచ్చేసేను.

రూపు చెడి, ముద్దగా ఐపోయిన నా తమ్ముడి విగ్రహం నా కళ్ళకి కట్టినట్లే వుంది. ఏం చేస్తాం!

రోజులు గడిచిపోతూన్నాయి. ఆకురాలుకాలం వెళ్ళి పోతూం దనగా ఒకసారి యెల్సా నాతో అందిగదా:

'రష్యన్ యుద్ధఖైదీల్ని రోడ్డు పని చేయించడానికి లప్పీన్ రంటాకు లాక్కొచ్చారని అంతా అనుకుంటున్నారు.'

ఆ చుట్టుపట్ల భోగట్టా అంతా ఆమె కెప్పటికప్పుడే తెలు స్తుందిలెండి. పోహ్జన్‌పా క్రీమరీకి వెళ్ళి వస్తే యిక చెప్పనే అఖ్ఖర్లేదు. అన్నివైపులనుంచీ పాలు తెచ్చేవాళ్ళక్కడికి వస్తూ వుంటారు. ఇక ఎలియాస్ వున్నాడే వాడికి యెల్సాని చూస్తే యెంతో యిది. ఏ భోగట్టా కానీండి, ఆమెకి చెప్పనిదే వాడూరుకోడు. తనకి తెలిసింది పందిమంది చెవుల్లోనూ పడెయ్యందే వాడికి తోచనే తోచదు. వాడి స్వభావమే అంత. దానికేం లెండి. పుర్రెకో బుద్ధి! ఎలియాస్ మనసులో యే విషయమూ దాగదు. అదీ మంచిదే.

వాడు యుద్ధంలోకి పోదామని యెంత కోరుకున్నా యిా తూరికూడా వాళ్ళు తీసుకోందే యేం చేస్తాడు ? తనకి తటస్థిం

చిన యీ అనవకాశాన్ని గూర్చి కనపడ్డ వాళ్ళందరి దగ్గరా వాపోయీవాడు, ఎలియాస్. చివరికి మా యెల్సాతో కూడ యీ సంగతి చెబుతూ, తానే గనక యుద్ధరంగంలో వుంటే రష్యన్లని యేం చేసేవాడో వివరంగా వర్ణిస్తూ, అభినయం పట్టేడట! ఒక్క టామీగన్ పట్టుకుని నిలబడ్డా డంటే తానొక్కడు చాలడుటండీ! ఆ రష్యనులని ఊచకోత క్రింద కోసి పారేసేవాడు, ఎలియాస్!

కాని, యిదంతా నేను స్వయంగా వినలేదు సుమండీ. నే విన్నదీ, జ్ఞాపకం వుంచుకున్నదీ యేమిటంటే రష్యన్ ఖైదీల్ని లప్పీన్‌రంటాకు రోడ్డుపని చేయించేందుకు తోలుకొచ్చేరనే.

ఆదివారం నాడు యెల్సాతో అన్నా:

'విశేషా లేమిటో చూసివస్తా, పట్నానికి బోయి.'

ఎల్సా ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి, నా వైపుచూసింది: సరే: మంచిది.'

కాని నేను పట్నందాకా వెళ్ళాల్సిన పనే కలగలేదు. అసలు నాకు లప్పీన్‌రంటాలో పనేముంది? రష్యన్ ఖైదీలు దారిలోనే కనించేరు. ఇక ముందుకు బోవాల్సినదే లేదు.

ఔను! వాళ్ళు నిజంగా రష్యన్లే. వాళ్ళు పని చేస్తూన్న చోటుకి చుట్టుప్రక్కలలో సుమారు ఒకగంటదాకా తారట్లాడుతూ తిరిగేనే కాని ఒక్కణ్ణైనా గూబ కదలేయలేకపోయేను. కొట్టడం మాట అటుంచి చివరికి. ఒకడిముఖాన కూడ ఉమ్మేయనేనా లేందే! జీవిత మంటే వాళ్ళకి అంత

వాంఛనీయంగాకుండా చేయడానికి యెంతో అవరకే శ్రద్ధ తీసుకున్నారు. ఇంకే ఆ శ్రమ నా కెందుకంటాడి! వాళ్ళంతా శుష్కించిపోయి వంటిమీద గుడ్డలేనా లేకుండా వున్నారు. ఇసుకా రాళ్ళూ మోస్తూ, తట్టల బరువుకి క్రుంగి విడవడలాడిపోయి, పడిపోనే పడిపోతున్నారు, పాపం వాళ్ళు.

వీళ్ళే బోల్షివిక్కులు! నా యిల్లోని, విశేష-లాంటి వాణ్ణి పట్టుకుని, కాళ్ళూ చేతులూ నరికి, కళ్ళు కాల్చి పీకేసి, సంకెళ్ళతో చీకటికొట్టులో పడేసి చంపిన దుర్మార్గులు, వీళ్ళే! వీళ్ళ నేంచేసినా పాపం లేదు ఐనా కానీ,—......

కాని, నేను వాళ్ళ నెవర్నీ కొట్టలేదు. ఉట్టినే చూద్దామని వాళ్ళ దగ్గరి కెళ్ళేను. అందులో ఒకడు పెద్ద అంభేరుడిలా, నాఅంతమనిషివున్నాడు. కాని, తిండి లేకనో యేమో యెత్తుపడిపోయి బక్కాటంలా వున్నాడు. ఒక్క దెబ్బకి పిల్లిమంతరం వేయించి క్రింద పడగొడితే, అదీ తమాషాగానే వుంటుం దనిపించింది. బుర్రలో యీ ఆలోచన పుట్టడ మేమిటి పంట్లాం జేబులలోని చేతులు బిగిసి, వజ్రముష్టిగా అవడ మేమిటి! కాని,—......

బుద్ధి పుట్టిందే కాని నేను కొట్టనే లేదు.

మహాకాయుడైన ఆ రష్యన్ నావైపు ముఖం త్రిప్పేడు, చటుక్కున. నాకు వాని కళ్ళు కనబడనే లేదు, అవి కనుగుంటలలో యెంతో లోతున దించుకుపోయివుంటే నా కెల్లా కనిపిస్తాయి? అతగాడి నెన్నుదురు విశాలమైంది. దాని వైభా

గంలోని పెద్దగాయం యెర్రగా వుంది. అతడేస్థితిలో ఖైదీగా చిక్కేడో దాన్నిబట్టే నేను అవగాహన చేసుకున్నాను. విశాలమై కోణాలుదీరిన పెద్ద దౌడయెముకలు, బరువైన పెద్ద క్రిందిదౌడ, పెద్ద బిగినోరు, అచ్చంగా నాకుమల్లేనే వున్నాయి, వానికి. ఆశ్చర్యం! అతగాడి ముక్కుకూడా కొంచెం పైకెత్తుకుని నా ముక్కులాగే వుంది; యెటొచ్చీ అంత పొడుగుమాత్రం లేదంతే! ఇది చూసి నే నాశ్చర్యపడ్డానంటే వింతేముంది?

కాని, అతగానికి బుగ్గ లుండాల్సినచోట రెండుప్రక్కలా రెండు పెద్దగోతులు; కళ్ళుండాల్సినచోట రెండు తెల్లని గోతులూ వున్నాయి. ఈ గోతులలోంచి నావైపు చూస్తూ, పారమీద బూటుకాలుతో అదుముతూన్నాడు. అతడెంత అదిమినా పార నేలలోకి దిగబడ్డమేలేందే! మిగిలిన వాళ్ళ కేసి చూస్తానుగదా, వాళ్ళూ అంతే! బుగ్గలూ, కళ్ళూ వుండాల్సినచోట గోతులు గుంటలు వున్నాయి. ఔనండీ! ఎవరో వాళ్లపని తీర్చేసుకున్నారు! పూర్తిగా, అన్నీ కనిపెట్టి చూసే భగవంతుడు లేడుటండీ?

మా తమ్ముడికి జరిగిన ఘోరానికి వాళ్ళలో ఒకరిమీదా నేను కసి తీర్చుకోనే లేదు. ఊరికే చేతగాని వాడిలా, నాకేం సంబంధం లేనట్లుగా చేతులు వ్రేలాడేసుకుని వెనక్కి తిరిగి పోయేను. చివరకి ఒకణ్ణైనా బాకుతోనో, ఆఖరికి పిడికిలి

తోనో కొట్టలేకపోయిం తర్వాత నేనేం సోదరుణ్ణి? ధిక్! కాని, నాకు తగినట్లు బుద్ధి చెప్పేవాళ్ళే లేకపోయేరు, దిక్కుమాలింది!

---

## పదిహేనో ప్రకరణం _ పావో పాటు

అంత అప్రయోజకుడైన అన్ననైనందుకు నేనా శీతకాలమంతా పశ్చాత్తాప పడుతూనేవున్నా. ఎట్టకేలకి వసంతం వచ్చింది. ఎక్కడేనా రష్యన్‌లు అగతగులుతారా? అని వెతకడానికి నిశ్చయించుకున్నాను. కాని లక్షపనులు! ఎక్కడికి వెళ్ళడానికీ నాకు అవకాశమే దొరకందే!

వసంతంకూడా గడిచిపోతూంది. ఒకరోజున నేను మామూలుగా పనిలోకి వెళ్ళగానే పావో నాదగ్గిరికి వచ్చి, యేదో కాగితపుమడతను నాచేతిలో జారవిడిచి, అటునిటు చూస్తూ మెల్లిగా అన్నాడు.

'అది రహస్యంగా చదువుకోరా!'

నాకెంతో ఆశ్చర్యం వేసింది. వీడు చీట్లందించటం యెప్పణ్ణించి ప్రారంభించేడు? పడుచు పిల్లల్లాగ! ఈ మధ్య పావో అసలు ఒక్కమాటకూడా పలకటంలేదు. అల్లాంటివాడు చీట్లందిస్తూన్నాడు! రోజులు గడుస్తూన్నకొద్దీ వాడు మాటలే మరిచిపోతూన్నాడా? అనిపిస్తూంది, వాడి వైఖరి చూస్తే. ఎప్పుడేనా గుర్రాలతో మాత్రం ఒకటి రెండు మాట లాడే

వాడు. అంతే. మనుష్యులతో మాటలు పూర్తిగా కట్టి పెట్టేసే డనుకోండి. అల్లాంటప్పుడు వాడు పేరి అందించడం చిత్రంగా లేదూ ?

పాపో పలుకే బంగారమైంది అంటే కారణం లేదనుకో కండి. ఇటీవల వాడి శరీరం మరీ యిదిగా శుష్కించి పోతూంది. ఐనా వాడు ఉదయంనుంచి రాత్రివరకూ పని చేస్తూనే వుంటాడు. నువ్వెప్పుడు చూడు, వాడి చేతిలో యేదో పని వుంటూనేవుంటుంది. పాకలో పస్తైతే కమ్మరం, అదీ ఐతే గొడ్డారిపని, అదీ గాకపోతే భవననిర్మాణానికై తోలుకొని వచ్చిన కలపా, రాళ్ళూ దగ్గిరికి వెళ్ళి యే చెక్కడో, చిత్రికో పట్టడం చేస్తుంటాడు.

తప్పదు గనక యేదో పని చేస్తూన్నాడుగాని అతని శరీర దార్ఢ్యం మాత్రం దిగనారుతూనే వుందని వాణ్ణి చూచిన వాళ్ళెవరేనా యిట్టే గ్రహించగలరు. దుంగలూ దూలాలూ కదపాలంటే యిప్పుడు వాడివల్ల గావడంలేదు. తరుచుగా అలిసిపోయి పని ఆపి, ఊపిరి తీసుకుని, నడుం నిలబెడుతూం డాల్సివస్తూంది, వాడిప్పుడు. వాడికి గురక కూడా జాస్తీ ఐంది. పొగాకు, సారా యెక్కువగా వుపయోగించుకోడమే వాడి కొంప దీసిందనుకోండి. అందులోనూ సారా వాడీమధ్య మరీ యెక్కువగా త్రాగుతూన్నాడేమో మరింత గురక హెచ్చింది. వారం పొడుగునా చాకిరీ చేయగా దొరికిన కూలిడబ్బులు ఆదివారంనాడు మద్యరూపంలో పాపో కడుపులో పడిపోవా ల్సిందే.

హెత్రా కుర్కిమాకీ కూడా యీవిషయాన్ని గమనించేరు. ఒక ఆదివారంనాడు ఆయన బారకీచుట్లోకి వెళ్ళేసరికి పావో వాడి ప్రక్కమీద కూర్చుని యెదుటి గోడవైపు మిడిగ్రుడ్లేసుకుని మత్తుగా చూస్తూ కూర్చునివున్నాడు. అంతక్రితం సాయంకాలానికి చేసేస్తానని యజమానితో చెప్పిన పనిని వాడు పూర్తిచేయలేదు. అసలు అదెల్లా జరిగిందనుకున్నారు? పెద్ద బాదులు దారి కడ్డుగా గుట్టవేసి వున్నాయి. వాట్లని దారిలోంచి అడ్డులేకండా తొలగించాల్సివుంది. శనివారంనాడు పావో ఆ దూలాల విషయం మాట్లాడుతూ యజమానితో అన్నాడుట :

'ఈవేళ వీట్లని చెక్కడం పూర్తిచేసేస్తాను. దారిలో లేకండా తొలగించవచ్చునులెండి.'

పావో పని పూర్తిచేయాలని తీవ్రంగా ప్రయత్నించేడు. కాని పని కాలేదు. వాడికి ఓపికా తగ్గిపోయింది. అదీగాక గురకా, ఆయాసం వచ్చినప్పుడల్లా అరగంటకికాని గ్రుక్క తిప్పుకోలేక పోతూన్నాడిప్పుడు. పై పెచ్చు తరచుగా వస్తూంది, దగ్గు తెర యిప్పుడు.

అందుచేతనే పావో యజమానితో అన్నరీతిగా పని పూర్తిచేయలేకపోయేడు. అన్ని దూలాల్ని వాడిప్పుడు ఒక్క రోజులో చెక్కగలడా? వెనకటిరోజుల్లో ఐతే రాత్రంతానూ, ఆదివారంకూడా పని చేసి యెల్లాగైనా వాటిని పూర్తిచేసి వుండేవాడు. ఎందుచేతంటే చేస్తానన్న పనిని పూర్తిగాకుండా

యెప్పుడూ వదలడు, షావ్. కాని, యీ సారి దూలాలు
చూస్తే చాలా పెద్దదీ, వాడి శరీరబలం చూస్తే క్షీణదశ
లోనూ వుంది.

అక్కడికే శనివారం రాత్రి పొద్దు పోయిందాకా ఆ దూలాలతో తంటాలుపడుతూ క్రిందుమీదు అవుతూనే వున్నాడు. చివరకి ప్రాణం చాలొచ్చి, బారకీచుల్లోకి పోయి, పక్కమీద మేను వ్రాల్చేడు. బట్టలేనా విడవలేదు. ఊలు అంగీ, కోటు, ట్రౌజరూ,— వీటన్నిటితోనూ అల్లాగేపడి, ఆద మరిచి నిద్రపోయేడు. మర్నాడుదయం లేచేక వాడికి గుర్తొచ్చిందట, నాడే ఆదివారమనీ, త్రాగుడుకి పోవాల్సిన రోజనీను! సారా ధర చుక్కలలోకి పోయిం దనుకోండి. కాని వాడి కదేమీ పట్టదు. వాడికి తెలిసిందల్లా వారం కూలి డబ్బులూ త్రాగి ఖాళీ చెయ్యాలనే. సరే పాలకత్తె కెర్స్తా లహ్‌ంతీనెన్ వుందిగా; ఆమె యెప్పుడూ కనీసం రెండు సీసా లైనా అందుబాటులో సిద్ధంగా వుంచుతూనే వుండేది.

యజమాని వెళ్ళే సరికి షావ్ స్థితి యిదన్నమాట. తేట కళ్ళతో గోడవైపు శూన్యంగా చూస్తూ, పడకమీదే నిశ్చలంగా కూర్చున్న షావ్‌ని చూడగానే హెర్రా కుర్కిమాకీకి వాడి వాగ్దానం జ్ఞాపకం వచ్చిందిలా వుంది, మా చెడ్డ కోపం వచ్చింది. కీచుగొంతుతో అరుస్తూ, చిందులు త్రొక్కుతూ, షావ్‌ని తిట్ట నారంభించేడు:

'ఓరి వెధవా! నా తిండి వెక్కసమైం దేమిట్రా? పటా లంలోకి వెళ్ళాలని వుందా యేమిటి? చెప్పు. అదెంత పని? చిటికతో యేర్పాటు చేయగలను! తెలిసిందా? ఒక్కతన్ను! అంతే. నీ గతి యే మవుతుందో చూసుకో. నా కిక్కడ పని చేసేవాళ్ళు కావాలి గాని దొమ్మరి వెధవలు కాదు!'

ఆయనకి వాళ్ళు తెలియని కోపం వచ్చి, ఊరికే కేక లేస్తూన్నారు పావో కదలమెదలకండా అల్లాగే కూర్చుని గోడ కేసి చూస్తూనే వుండిపోయేడు. రోజుకూలీలుగా పనిచేసే ముసలాళ్ళిద్దరూ, కెర్తూ మాత్రం యజమాని కేకలకి జడిసి పోయి, చేతులు కట్టుకుని భయభక్తులతో నిలబడిపోయేరు. గోడవైపు చూస్తూండగానే పావో కళ్ళల్లో నీరునిండి, తళ తళ మెరిసేయి.

అంతకుముందు పావో యేడుపు నేను చూడనేలేదు. కళ్ళు నిండిపోయి, వాడిపోయిన పసిమి చెక్కిళ్ళమీంచి ధారలు గట్టి ప్రవహిస్తూంటే, సజలనేత్రాలతో శూన్యాన్ని చూస్తూ అల్లాగే కూర్చుని వున్నాడు, పావో. కన్నీళ్ళు పొంగిపొరలి వస్తూనేవున్నాయి. వాడి కళ్ళలాగే కన్నీళ్ళుకూడా యెంతో స్వచ్ఛంగా కనిపించేయి. కన్నీటిధారలు వాడి బూరెబుగ్గల మీదనుంచి చిరుగడ్డంమీద పడి, మెడలోని బూడిదరంగు రుమాలును తడుపుతూ, పూలు స్వెట్టరు మీదికీ, అక్కణ్ణుంచి ట్రౌజరు మీదుగా బూట్ల మీదికీ జారి, పక్కనంతా తడుపుతూన్నాయి.

వాడి కళ్ళు చిల్లులు పడతాయేమో ననిపించింది. కాని, వాడు వున్నట్లుండి పక్కమీద వాలిపోయి, ముఖం త్రిప్పేసుకుని, చేతులలో దాచుకున్నాడు.

పాపం! పావో! వాడో విచిత్రవ్యక్తి. వా డసలు చాలా మితభాషి. వాడి మనస్సులో యేముంటుందో మనం అర్థం చేసుకోలేమనుకోండి. అసలే పొట్టిగా, పీలగా వుండే పావో యీమధ్య అంతకంతకి మరీ చిన్నవాడైపోతూన్నాడు. ఏమి కారణమో యెవరికీ తెలియదు! వాడు చెపితేనా? వాడి, వ_త్తయై, శుష్కించిపోయిన తామరతూడులా ఐపోతూన్నాడు, వాడు మరీ మరీ.

---

## పదహారో ప్రకరణం _ విల్లో క్షేమమే!

పావో యిచ్చిన చీటిసంగతి ఆ రోజు సాయంత్రం మా కొండ దరికి వచ్చేక జ్ఞాపకం వచ్చింది.

జేబులోంచి తీసి మడత విప్పి చూడగా రెండు కాగితా లున్నట్లు తేలింది. వాటిమీద యేదో అచ్చులో వుంది. రెండూ ఒకటే ఐనట్లు తోచింది. కాని ఆ సంజమసకలో అక్షరాల పో_ల్చి బట్టలేకపోయేను. అప్పుడప్పుడే మినుకు మంటూన్న నక్షత్రకాంతిలో వాటిమీద యేదో బొమ్మ వుందని తెలుసుకుని, పరిశీలనగా చూసేను. పోలిక తెలిసి, ఆశ్చర్యంతో కేకేసేను:

'విల్హో!'

కోదండం దానిని ఒక్క పరుగులో యెక్కేసి, యింట్లోకి పోయేను. ఎల్సా చీకట్లోనే కూర్చునివుంది.

'పిల్లలు నిద్రపోయేరా?'

నిద్రపోయేరని ఆమె జవాబిచ్చింది.

'దీపం వెలిగించు! త్వరగా!'

ఎల్సా దీపం వెలిగించింది. కాగితాలు వెలుతురులో చూద్దునుగదా, వాడు విల్హోయే! అయ్యో! దేవుడా! ఇదే మిటి? నడుం పై భాగమంతా పూర్తిగా, స్పష్టంగా ఫోటోగా అందులో అచ్చుపడి వుంది! అవయవాలన్నీ పూర్తిగా, చెక్కు చెదరకండా, వేటి స్థానంలో అవున్నాయి. అవే అందమైన చిలిపికళ్ళు! బిగి చెక్కిళ్ళు! అదే చిరునవ్వు! తెలివితేటలు, ధైర్యస్థైర్యాలు తొలుకాడే ముఖం అది! దాని క్రింద ఫిన్నిష్ భాషలోనే యిల్లా అచ్చువేసి వుంది:

'అన్నా! ఐనారీ!–

'ప్రేమపూర్వక వందనాలు. నేను సోవియట్ యూనియన్‌లో వున్నాను. భయంకరయుద్ధరంగాన్నుంచి నన్ను విధి చాలదూరం గొనిపోయింది. నా గురించి విచారపడవద్దు. నా వంటి అనేకులతో బాటుగా నే నిక్కడ కులాసాగా జీవిస్తు న్నాను. ఆహారపానీయాదులు, గౌరవమర్యాదలూ కూడ యెంతో అనుకూలంగా వున్నాయి. ఈ దారుణయుద్ధకాండ ఆఖరవాలనీ, యీ గండం గడిచి నువ్వుకూడా బైటబడాలనీ

కోరుతున్నాను. అప్పుడే మన మిద్దరం మన జన్మస్థలంలో కలుసుకోగలుగుతాము. నా ఆశలు సఫలమవుతాయనే నమ్ము తూన్నాను.

నీ తమ్ముడు

విల్హో పీతాక్కానియేమీ.

ఆ కాగితాలకి రెండో ప్రక్క యీ విషయమే వాడి స్వదస్తూరీలో రాసివుంది. ఔను! ఆహాఁ! ఆ సంతకం నేను బాగా యెరుగుదును. విల్హోదే! వాడే దీన్ని రాసివుంటా డనడంలో సందేహ మేమీ లేదు. ఔనండీ, నా తమ్ముడు సమయం వస్తే నాకు రాస్తాడు గాని యింకోళ్ళ కెందుకు రాస్తాడంటా? యుద్ధంలోకి వెళ్ళేక యిదే వాడి మొదటిజాబు. అమ్మయ్య! వాడు సజీవుడై, కులాసాగా వున్నా డన్నమాట! నా పిచ్చి తమ్ముడు,-ఏదీ వాడు వట్టి అల్లరిగాడే కాని వాడి మనస్సు వెన్నలాంటిదండీ. నే నెరుగుదునుగా? వాడు కులాసాగా వున్నాడు. అంతే చాలు.

నా సంతోషానికి పారంలేదు. ఆ దఫా మా ఎల్సాని యెన్నిసార్లు బంతిలా పైకెగరేసి పట్టుకున్నానో నాకు గుర్తు లేదు. ఉర్లగడ్డల వేపుడుతో భోజనం పూర్తిచేసి, కోర్వికే* పుచ్చుకుని, యెల్సా ముఖంలోకి చూస్తూ కూర్చున్నా. ఆమె

* ఇదొక రకమైన కృత్రిమమైన కాఫీ. దేనికైనా మారుగా వుపయోగించేవాటిని 'ఎర్సాట్జ్' అంటారు. ఇతరవస్తువుల్లోంచి రసాయనికంగా తయారుచేసే దీన్ని కాఫీకిబదులు యుద్ధకాలంలో వాడేరు.

మొద్దుదిగాడండీ, మా యెల్నా. జాణ! అదీ కొంచెం ఆలో చించగలదు. అన్నదిగదా:

'బోల్లివిక్కుల్ని గూర్చి వాళ్ళు చెప్పేవన్నీ యింతే నేమో!'

'నాకేం తెలుసు? ఏమో?'

మరునాడుదయమే ఆ కాగితాలలో ఒకదాన్ని తీసుకు పోయి హెర్రా కుర్కిమాకికి చూపకండా వుండలేకపోయేను. ఇది చూచి ఆయన యేమంటారో? మా తమ్ముడి బొమ్మ చూసినప్పుడు ఆయనముఖకవళికలు యెల్లావుంటాయో? వినా లనీ, చూడాలనీ నాకు మహావుంది, చెప్పొద్దూ. ఎందుకంటే నాకింకా జ్ఞాపకమే వ్రేలిగోళ్ళా, కాలుచేతులూ చెక్కడం సందర్భం, అంతా.

కాని, నేను అనుకున్న దానికంటె ఆయన చెప్పిందే వేరైంది. విల్లో బొమ్మ చూస్తూండగానే ఆయన కళ్ళు తీక్ష ముతై, కళ్ళచుట్టూ వున్న ముడుదలు ఒకచోటికి కేంద్రీకృ తమైనాయి. మళ్ళీ కొంచెంసేపట్లో యథాప్రకారస్థితికి వచ్చి, నుదుటిమీద రెండు లోతైనవాళ్ళుగా ముక్కుదూలం మీదించి నిలువునా టోపీదాకా వ్యాపించినాయి. దుబ్బుల్లాంటి కనుబొమ్మల క్రిందినుంచి నన్ను పరకాయించి చూస్తూ, అన్నా రాయన:

'ఇల్లాంటి వాటిని పోగుచేసేవా డెవడో కనిపెట్టి పట్టుకో వాలి, మనం. తెలిసిందా? పట్టి వప్పగించాలి పోలీసులకి. ఇట్టి

తుక్కు సంతనూ నమ్మ నారంభించేమంటే మన గతి కుక్కలికీ నక్కలికీకూడా పట్టదనుకో!'

నేనూ ఆయనతో ఏకీభవించుతూ తొందరగా జవాబిచ్చేను:

'ఔనౌను! నిజం. బాబూ! మీరు సత్యం పలికేరు!'

అంటూ అక్కడే, అప్పుడే, ఆయనగారి కళ్ళముందరే ఆ కాగితాన్ని ముక్కముక్కలుగా చించి, గాలిలో జిమ్మేసేను.

ఔను మరి! ఇట్టి తుక్కు సంతనూ నమ్మ నారంభించేమంటే మన గతి కుక్కలికీ నక్కలికీ కూడా పట్టదనుకోండి. ఈవిషయం తెలుసుకోడానికే భయావహంగా వుంది. అందుకనేగా ఆ కాగితాన్ని చింపి పారేశాను! వాయుదేవుడా ముక్కల్ని నాలుగుమూలలకీ చెదరగొట్టేశాడు కూడాను. అదేపోయిన కాగితం కాని, పోలీసుల చేతులలో పడకండా తప్పినందుకుసంతోషించేను. యజమానితో అన్నానుగదా:

'ఇల్లాంటివి మరికొన్నికూడా దొరికితే బాగుండిపోను. వాళ్ళు పడేసిన కాగితాలన్నీ గనక నాకు దొరికితే యీ బూటకాన్ని మొగ్గలోనే త్రుంచేసేద్దును!......'

హెన్రా కుర్కిమూకీ తీవ్రంగా శిరఃకంపం చేస్తూంటే మాంసలములైన ఆయన బుగ్గలు తపతపలాడేయి. తర్వాత కాస్సేపు ఆ చుట్టుపట్లనే తారట్లాడుతూ, నాకేసి దొంగచూపులు చూస్తూ, ఆయన అన్నారు, గొణుగుతూన్నట్లుగా:

'నీ కోసం యింకో మంచిపని చూసివుంచేను. ఏదో కాస్త నాలుగురాళ్ళు గిట్టుబాటయేదేలే. ఫ్లై సంజాయిషీ అవసరం

లేకుండానే నిన్ను సరాసరిగా ఆ పనిలో పెట్టగలననుకో! కాని, నిన్ను నే నెంత మెచ్చుతూన్నానో నువ్వు తెలుసుకోడం అవసరమని భావించే నీతో చెప్తున్నాను. క్రీమరీలో పనివాణ్ణి పటాలంలోకి తీసుకుపోయేరు. వాడు గుర్రాల్ని తోలడమే గాక క్రీమరీలో యితరపనులూ చేసేవాడుట. పోహ్‌జన్‌పా దగ్గర యిప్పుడు మెలియాన్, ఛాపయూ మిగిలేరు. వాళ్ళనైనా వుంచుతారని నమ్మకంలేదే! అతగాడి పాలట్రక్కునుకూడా యుద్ధావసరాలకై తీసుకుపోయేరు. ఇక్కణ్ణుంచి మనమే గుర్రపుబండిమీద పాలు తీసుకెళ్ళాల్సి వుంటుంది. వాళ్ళ తప్పేం లేదు, చూసేవూ? పోహ్‌జన్‌పా క్రీమరీ అంతగా స్తోమతు వున్నది గాదని ప్రభుత్వం అనుకుంటూందంటే తప్పేముంది? ఇంతకాలాన్నుంచీ వుందన్నమాటే గాని చివరకి మోటారేనా అమర్చలేకపోయేడు! అతడి వ్యాపారపుగోడవలు మన కెందుగ్గాని, అసలు సంగతి చెపుతా. నిన్నట, తన క్రీమరీ పనిలోకిట, పంపించే దట! అదేం వీల్లేదని చెప్పేశానులే. నాకు బోలెడు పనులు. నువ్వు నాకే అవసరం! కాని, పాలు తీసుకుని రెండుపూటలా నువ్వెల్లాగా వెళ్ళాల్సి వుంటుంది, క్రీమరీకి. సెపరేటరులో పోయడం, చిలికి వెన్న దీయడం,- అంతసేపూ నువ్వెల్లాగా సాయం చేయాలి, అక్కడ. అంచేత నేను ఆలోచించిం దేమిటంటే......మన గుర్రాలసాలలోను, గోశాలలోనూ పనంతా నీమీదే వుంటుంది. దుక్కులు నువ్వు లేందే కలవ్వుగదా. షరోదార్కి

లేకండా వచ్చినవోయ్. నువ్వేం చేస్తావంటే, పనులు మరి కొంచెం వేగిరంగా పూర్తిచేస్తూండాలి. అవసరపడితే కాస్త చీకటిపడినా, పని పూర్తిచేసుకుని మరీ పోతూండాలి. నీ జీతం యిప్పుడు రోజుకి పదిమారుక్కాలేగా? దాన్ని పదిహేనుచేద్దాం. క్రీమరీలో అదనంగా చేసే పనికి నీకింకో పదిమారుక్కాలు ముట్టజెపుతాలే. ఒక్కవిషయంలోమాత్రం నువ్వు కాస్త జాగ్రత్తగా వుండాలి. క్రీమరీలో అన్ని పనులలోనూ వున్న మెలుకువలు కాస్త శ్రద్ధగా కనిపెడుతూండుసుమా. తెలిసింది గాదూ నే చెప్పేది? మన స్వంత క్రీమరీని త్వరలోనే ప్రారంభిస్తాముగా. అది నీ చేతులలో పెట్టాలనే నా వుద్దేశ్యం. ఇప్పుడే చాకచక్యంగా పనిలోని మెలుకువ లన్నీ పట్టేసే వంటే నీకు మన క్రీమరీలో పెద్దపని యివ్వడానికి నేను వాగ్దానం చేస్తున్నా. తెలియలేదూ?...'

ఆయన చెప్పిన దంతా వెంటనే నాకు అర్థం గాలేదు. హఠాత్తుగా, తలవని తలంపుగా చెపితే యింకోరికి మాత్రం యిదంతా యెల్లాగ అర్థం అవుతుంది? ఒక్కటిమాత్రం నాకు అవగాహనమయింది. అదైనా స్పష్టం చేసుకోడం మంచిది గదా యని ఆయన్ని అడిగేను:

'మొత్తం యే పనిచేసినా రోజుకి యిరవైఐదు మారుక్కాలన్నమాట!'

'ఔను!' హెర్రా కుర్క్కినూకీ తలూపేరు.

అమ్మో! దేవుడా! దీని కోసం యింతసేపు నచ్చచెప్పాలా? డబ్బు వస్తుందంటే నాకు చేదా యేమిటి? అదనంగా కూలి

యిస్తానంటే సరి, పగలూ రాత్రీకూడా. పనిచేయడానికి సిద్ధం, నేను! చక్కిరిబిక్కిరయేలా వుపన్యాసం యిచ్చి, నచ్చ చెప్పడం యెందుకు? యీ మహాద్భాగ్యానికి! కాని, అదును రోజులలో పనులు పూర్తికావేమో ననే సందేహం నన్ను బాధిస్తూంది. అందుకని ఆయనతో అన్నాను:

'కోతల రోజులలో యెల్లాగం డయ్యగారూ! పనిరద్దీలో వంచిన నడుం యెత్తడానికే వుండదుగందా!'

ఆయన నా సందేహాన్ని తీర్చేరు:

'ఆ రోజులు రానీ నేను జనాన్ని తెస్తానుగా!'

'కూలీ లెక్కడ దొరుకుతారండి, యీ రోజులలో!'

'నువ్వే చూస్తావు. తొందరెందుకోయ్!'

సరే! ఐతే మరీ మంచిది. నా పని నేను చూచుకోగలను. ఎటొచ్చీ కూలి ముట్టచెపితే అంతేచాల్లెండి!

---

## పదిహేడో ప్రకరణము - పోహ్మజన్ పాక్రీమరీ

ఆ సంతోషంతో యింటికి బోయి ఎల్సాకి మళ్ళా మజా చూపించేను. ఆమెని లుంగచుట్టి పూలచెండులా పైకెగరేసి పట్టుకుంటూంటే కిలకిలా ఒకటే నవ్వు, పువ్వులు విచ్చినట్లు! అటక తగులుతుందేమో ననేనా చూడలేదు, నేను. ఆమె అసమ్మతిని, నవ్వునూ ముద్దుల్లో ముంచెత్తేసేను. ముద్దులాలికే

ఆమె పెదవుల మాధుర్యానికి మెచ్చి, మరికొన్ని ముద్దుల్ని కొసరి కొసరి గుప్పించే సని చెప్పడానికి నాకు సంకోచమెందుకు!

హాడావుడి కాస్త చల్లబడ్డాక, స్థిమితంగా కూర్చుని కొనబోయే ఆవుని గూర్చి చర్చించుకున్నాం, ఎల్సా నేనూ. ఆవును కొనేందుకు డబ్బు కూడబెట్టడం యిప్పుడంత కష్టంగాదు. నాలుగురోజుల్లో నూరుమార్కులు, నలభైరోజుల్లో వెయ్యి మార్కులు! మాబోటి సంసారులికి యిది పెద్దమొత్తమే, మరి.

కాని, మన అంచనాలన్నీ పూర్తవుతా యనుకోడం వెర్రిభ్రమ. తానొకటి తలచిన దైవమొకటి తలచు నసే సామెత వూరికే పుట్టిందా? దురదృష్టవశాత్తూ, నా మొదటి వెయ్యి పూర్తి అయిూఅవకండానే కథ అడ్డం తిరిగింది. ఛీ ఛీ! సిద్ధాన్నం కుక్కముట్టుకు బోయినట్లే అనుకోండి. దాన్ని తగలెయ్యా!

ఎలియాస్ పోహ్జాజన్ పా అన్నది చివరకి నిజమే ఐంది. 'వాళ్ళకి మన తడాఖా చూపిస్తామోాయ్!' ఊం! అదే అక్షరాలా నిజమైందనుకోండి. యుద్ధంలో ముందు నిలబడి మా పస చూపించే వటలేము, మేము!...

క్రీమరీకి పాలుతీసుకెళ్ళిన మొదటిరోజున నన్ను చూసి ఎలియాస్ పరమానందభరితుడై పోయే డనుకోండి. వాడు పాల ట్రక్కు మీద కూర్చుని కీ గోశాలకి వచ్చినప్పుడల్లా, ఆ టీవల నేను పాలందుకుల్లో వుండిపోయినందువల్ల అత్యక్కకలుసు

కోడమే పడ్డంలేదు. నన్ను చూడగానే వాడు పళ్ళికిలించుతూ బిగ్గరగా అరిచేడు :

'ఓహో ! నువ్వే ! పిర్కాలీ ! ఐనారీయే ! ఇటు రావడమే లేదేం ? ఎల్లా వున్నావు, మిత్రమా ? నిన్న రోజంతా నేనూ, ఛాపరూ* ట్రక్కులో తిరుగుతూనే వున్నాం. చమురున్నంత వరకే గాదుటోయ్ ! ఈవేళనుంచి యింక కాలికి బుద్ధిచెప్పాల్సిందే. పిర్కాలీ ! ఈవేళనుంచి పాలు తేవడం యెల్లాగా ! అని కొట్టుమిట్లాడుతూన్నా మనుకో. 'ఎవరి పాలు వాళ్ళే తెచ్చి యిస్తారు' అంటాడు నాన్న. ఈవేళ అంతా వచ్చి పాలుపోసి వెళ్లేరు. మీగడ తీసిన పాలకోసం మళ్ళా సాయంత్రం వాళ్ళే వస్తారు. ఇంతసేపైనా కుర్కామాకీ కమతాన్నుంచి కబురూ కాకరకాయా యేమీ లేదేమా ? అనుకుంటాను! పిర్కాలీ !'

నే నన్నాను గదా :

'అక్కడ పనులు పూర్తిగానిదే యెల్లా రాను ? వస్తే యిక్కడ కొంచెంసేపైనా వుండాలిగదా ? ముస్తోనెన్ పని యివాళనుంచీ నేనే చేస్తాను. తెలుసునుగా ?'

ఎలియాస్ అందుకుని అన్నాడు:

'ఎరుగుదునోయ్! నాకదంతా ముందే తెలుసు. బహుశా కొద్దిరోజులలో నా పనికూడా నువ్వే చూడాల్సి వస్తుందేమో! ఏం? చేదా? ప్రయత్నించి చూడు. మొదట్లో గంటకి పది

---

* కాయి నడుపువాడు, డ్రైవరు.

హేను మార్కులు జీతం. అదంత తక్కువకాదుగా ? ఏం! పిర్కీ లీ!.........నువ్వు 'ఊఁ!' అంటే చాలు, నాన్నతో మాట్లాడుతాను......'

నే నన్నాను, సందేహంగా:

'అబ్బే! నాకైతే పదిహేను మార్కు లివ్వరు!'

నామాట వినగానే ఎలియాస్ విరగబడి నవ్వేడు. అందులో నవ్వడాని కేముందో, వాడి బొంద! ఎండుగ్గానీ, రెండు నిముషాలసేపు పళ్ళన్నీ బైటపడేలా యికిలించి, వెకవెకలాడుతూనే, అరిచేడు:

'పిర్కీలీ! నీ ఆకలికి వాకిలి లేదురా! తోడేలు కెంత తిన్నా కడుపే నిండదన్నట్లు. అదేం తప్పు కాదులేవోయ్. ఒట్టు! మన స్ఫూర్తిగా చెపుతూన్నా. ఆమాత్రం ఆశ లేకుంటే మనిషే కాదు. నీ లాంటి వాళ్ళు నా కొంతమందిని యిమ్మను, చెపుతా. మన తడాఖా చూపిస్తాం. కాని, నువ్వు నిజంగా చెప్పరా? నా పనికూడా చేయగలవా?'

నేను నా సందేహాన్ని విప్పి చెప్పేను:

'ఇక్కడ ముస్తోనెన్ కి దినానికి యాభై మార్కు లిచ్చేవారు; కాని హెంగ్రా కుర్కిమాకీ నాకు ఆ పనికే పదిమార్కు లిస్తానన్నారు.'

వాడు మళ్ళీ విరగబడి నవ్వుతూ,-

'పిర్కీలీ!' అన్నాడు.

ఇద్దరం కలిసి పాల బానల్ని లోపలికి మోసుకుపోయేం. లోపలికెళ్ళేక ఎలియాస్ మళ్ళీ మొదలెట్టేడు:

'పర్కిమాకీ నీకు తక్కువ కూలి యివ్వడాన్నిగూర్చి కాదురా, నే ననేది. పిర్కిలీ! అది ఆయనికి సంబంధించిన వ్యవహారం. కాని, నువ్వు నా పని కూడా చేయగలుగుతా నంటావా?'

'గంటకి పదిహేను మార్కులకేనా?' అనడిగేను.

'ఔను!'

'ఆఁ! చేస్తా. ముమ్మాటికీ!'

'పిర్కిలీ! అసాధ్యుడివిరా నువ్వు!'

పడబోత గుడ్డ కప్పిన చిన్న అల్యూమినిం టాంకులోకి పాలన్నీ పోసేము. ఎలియాస్ గాజు గొట్టాన్ని దానిలో ముంచి, పైకొనని బొటనవ్రేలితో మూసి, పైకి తీసేడు. ఆ గొట్టంలో సగంవరకూ పాలున్నాయి. దాని క్రిందికొన యింకో టెస్టు-ట్యూబులో పెట్టి, పై బొటనవ్రేలిని తీసేడు. పాలు టెస్టుట్యూబులో పడ్డాయి. ఎలియాస్ ఆ పాలు పరీక్షించి, క్రొవ్వు నూటి కెన్ని పాళ్ళున్నదీ తేల్చేడు.

టాంకులో పాలు సెపరేటర్‌లో* బోసి, మళ్ళీ బాన ల్లోని పాలు టాంకులో పోసేము. ఆ పాలకికూడా క్రొవ్వు పరీక్ష తీసుకున్నాడు, ఎలియాస్. ఆ పరీక్ష యేమంత కష్టంగా

* పాలనుంచి వెన్నను వేరుచేసే యంత్రసాధనాన్నే సెపరేటర్ అంటారు.

లేదు. ఒక చిన్న పెట్టిలో పాలతో నిండిన టెస్టు-ట్యూబులు చాలా పెట్టివున్నాయి. ఒక ట్యూబులోని పాలలో ఓ చుక్క సల్ఫ్యూరిక్ యాసిడ్ వేసి, దాన్ని యంత్రంలో పెట్టి, జోరుగా త్రిప్పేడు. పాలలోని క్రొవ్వంతా ఒక ప్రక్కకి చేరుకుంది. ఈ రీతిగా ఒక్కొక్కరిచ్చిన పాలలోని కొవ్వు వేరుబరచి, తూచి, లెక్కలు గట్టి, నూటి కెన్నిపాళ్ళు వున్నదీ తేల్చేడు. దాన్నిబట్టి ఒక్కొక్కరిచ్చిన పాలల్లోని వెన్నని బట్టి వారి కీయాల్సిన ఖరీదును సరిగా నిర్ణయించేందుకు వీలవుతుంది. ఇదంతా నేను కనిపెడుతూనేవున్నాను, ఓ కంట. అందులో కష్టమేమీ లేదు.

ఇంకో టాంకు పాలు సెపరేటరులో పోస్తూండగా ఎలియాస్ అన్నాడు:

‘ఈ దరిద్రపు పనితో నా ప్రాణం విసిగెత్తిపోయిందనుకో. గతశీతకాలపుయుద్ధంలోనే నేను యుద్ధానికి బోవాలనుకున్నా. కాని, వాళ్ళు నన్ను తీసుకోందే! ఆ యుద్ధంలో పోట్లాడిన వాళ్ళందరికీ డికరేషన్లు వచ్చేయి. నా కొక్కటీ లేదు! పిర్కాలీ! నేను వాళ్ళకంటె యెందులో తీసికట్టు? నాకూ కూడా పతకాలు పెట్టుకోవాలని వుండదూ? ఈ దఫాయేనా వాళ్ళు నన్ను యుద్ధంలోకి పంపాలి, అప్పుడు చూడాలి నా తడాఖా. యుద్ధం అంటే యేమిటో తెలియని దద్దమ్మల్ని పంపి లాభమేమిటి? సంవత్సరమైంది ప్రారంభించి, కాని యింతవరకు ‘ఫీతార్’ దగ్గిరకేనా వెళ్ళలేకపోయేరు. వెధవది, అదా యుద్ధ

మంటే? పిర్కీలీ! ఊరిఖే ముందుకు దూకడం దెబ్బ తీయడం, ముందుకు దూకడం – దెబ్బ తీయడం,– రిస్సాకి తేరుకోనేందుకు వ్యవధి యివ్వకుండా కొట్టాలి. తెలిసిందా? అంతే. ఆ రష్యన్‌లు శుద్ధమొండిఘటాలు. ఒక్క వారం వ్యవధి యిచ్చేవా, అంతే. యింక వాళ్ళని అక్కణ్నుంచి తరమడం సాధ్యం గాదనుకో. పిర్కీలీ! మనం ఆక్రమించుకున్నది దక్కించుకుంటూ, మరోకొంతకూడా స్వాధీనం చేసుకోవాలంటే మనం యెప్పుడూ యెదురుదాడి చేస్తూనేవుండాలి. ఇన్నేళ్ళుగా తయారు తింటూండి, చివర కిప్పుడు బెత్తెడు నేలేనా గడమ లేక పోవడమా? మాటొచ్చింది గనక చెబుతున్నా. నా మటుక్కు నేనూ, పీతారీలో పెద్దబజారు 'నెవ్‌స్కీ' లేదూ, అందులో ఓ పెద్దభవనం వుచ్చుకోవాలనుకున్నా! నేను పడ్డ శ్రమకు చివరకొక్క కొంప తీసుకోడానికేనా హక్కులేదా? అంటా! డామిట్! అదుందే, ఆ పీతారీ, అది అసలు మన పట్నమేనోయ్! పిర్కీలీ! తూర్పుక రేలియాలో వీలైన భూము లుగా చూసి, ఆక్రమించుకోవాలని నాన్నకీ వుందనుకో! అతడు స్వయంగా వెళ్ళి, ఆ ప్రాంతం చూసే వచ్చేడు. మంచి ఖండ్రిక మీద కన్నేసే వుంచేడులే, నాన్న. నేనూ స్వతంత్ర జీవితాన్ని యేర్పాటు చేసుకుని, చోరుచుకు పోవాలోయ్. ఇక్కడే గుడుగుంచంలో పడి కొట్టుకుంటూ, మామూలు కూలీలా పనిచేస్తూ వుంటే సార్థక మేమిటి? ఇందుకోసమే పుట్టినట్లు! ఈ యిరుకుబొక్కలోంచి బైటబడి, నా ధాటి

నేను చూచుకుని పై కెగిరిపోతా. ఆ రిస్సావాళ్ళు లేరూ? వాళ్ళనే పట్టుకుని, మనకోసం పని చేయించుకోవాల్సింది. పిర్కీలీ! అది చేయాలంటే ముందు రిస్సాని మనం ఓడించాలి గాదుటోయ్? జర్మనీవాళ్ళు మనల్ని అదే చేయమంటు న్నారు. త్వరత్వరగా రిస్సావాళ్ళని హతమార్చండని, జర్మనీ వాళ్ళు మనకి సాయం చేస్తూన్నా, మన మేం చేస్తూన్నాము? చతికిలబడి, కాళ్లు బారజాపేసేము! పిర్కీలీ!'

నాకు సందేహం కలిగి, అడిగేను:

'మనం రష్యామీద దాడిచేసినా, చేయకపోయినా, అదంతా జర్మనీవాళ్ళ కెందుకు?'

అతగాడెల్లాగా తెలివైనవాడుగా. అంచేత జవాబుగా,-

'నీకేమీ తెలియదేమిటోయ్! మనం స్నేహితులం గాదూ?' అన్నాడు.

'ఓ! అల్లాగా. తెలిసిందిలే. ఐతే వాళ్ళు చెప్పేవాళ్ళా మనం చేసేవాళ్ళమేనా. యెప్పుడూ? మనం చెప్పడం, వాళ్ళు చేయడం వుండొద్దూ? ఇంతా చేసి వాళ్ళు మనకి అతిధులు గానే వచ్చేరు. ఈ దేశం మనది; మనం యిక్కడ గేస్టులం కదా. మనమాట వాళ్లు వినొద్దా అంటా?'

వాడికి కంగారు పుట్టుకొచ్చిం దెందుకో! చేతులాడిస్తూ, తొందరగా అన్నాడు:

'నీకు తెలియకపోతే నోరు మూసుకుని వుండలేవుట్రా? అతిధులుట! పిర్కీలీ! అతిధులూ - గేస్టూ! మంచిపోలికే!

మొత్తం లింగాన్ని మింగుదా మనుకుంటే, వాళ్లు గుడినే దిగమింగే రకంరా బాబూ! సధారణ అతిథులు అనుకున్నావేమో. మనం పరాకుగా వుంటే మనల్నీ, పీటార్నీ కూడ కబళించగలరు. మన ప్లానులు భగ్నం గాకుండా వుండాలంటే ముందుకు దూకాలిరా, కళ్ళు తెరిచి! గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుని మీనమేషాలు లెక్కబెడుతూంటే నెవ్‌స్కీ వీధిలో భవంతీ పోతుంది, తూర్పు కరేలియాలో భూమీ పోతుంది! మనం మెరుపుదాడి చేసితీరాల్సిందేరా! రిస్కుని దంచి వదలిపెట్టాలి! పిర్కలీ! నేనే గనక అక్కడ వుంటేనా? దేవా! ఇక చూసుకో! వాళ్ళని దూదిపింజల్లా ఏకి పారేద్దుననుకో. తడాఖా చూపించే వాణ్ణి! మనవాళ్ళు నన్ను యుద్ధంలోకి పోనివ్వరనే అంటావా? పోనీ, ఆఖరికి ఓ డజనుమంది రిస్కా వాళ్ళనేనా పూర్తిచేయగలిగేనంటే చాలు! పిర్కలీ!'

వాడి నోటికి తలుపూ ద్వారబంధం లేదనుకోండి. ఎలియాస్ మాట అటుంచి, నేను వాడు చేసే ప్రతీపనీ జాగ్రత్తగా కనిపెట్టి చూస్తూనేవున్నా. హెన్రా కుర్కిమాకీ నన్ను హెచ్చరించటం మంచిదే ఐంది. ఏమో? నేను వాడి స్థానంలో పనిచేయాల్సి వస్తుందేమో? ఎవరికి తెలుసు? సెపరేటరు నాకు కొత్త; దాని చుట్టూ తిరుగుతూ వాడేం చేస్తున్నాడో నాకు అంతే దొరకలేదు, పనిలో కిటుకంతా తెలుసుకోవాలంటే వెయ్యికళ్ళతో కనిపెట్టాలి, మరి. వాడేమో రహస్యాల్ని చెప్పడానికి మహాయిదిగా వున్నాడాయె. ఆఖరికి వాడి పంతం నెగ్గి, వాణ్ణి యుద్ధంలోకే గనక పంపితే క్రీమరీలో వాడి

స్థానంలో యెవరో ఒకరు పనిచేయాలిగాదూ! నాకూ కొంచెం ముందుచూపూ, ఆలోచనా లేకపోలేదండీ!

ఎలియూస్ వున్నట్టుండి అడిగేడు:

'ఐనారీ! నువ్వు చివరికి ఒక్క రిస్సావాణ్ణైనా చంపాలను కోవూ? ఈ లోకంలో ఏ కీడుమూడినా వాళ్ళేగదురా మూలకారణం? పిర్కిలీ!'

నేను జవాబీయడానికి ఓ నిముషం ఆలోచించేను:

'ఔననుకోరా! కనీసం ఒక్క రష్యావాణ్ణైనా చంపాలను కున్న రోజులుండేవి గాని......'

వాడు నన్ను మాటాడనిస్తేనా మధ్యలో అందుకున్నాడు, గమ్మున:

'అద్దుగదీ! ఐతే నువ్వూ అందుకు సిద్ధమే. నన్నమాట! దాన్ని తగలెయ్యా, నే నెరుగుదునోయ్. నువ్వు మాలో వాడివేనని నాకు తెలుసు. ఒకణ్ణేం ఖర్మం? నువ్వు తలుచుకుంటే వేటు కేదుగురు! శవాలు బళ్ళమీద తోలాల్సిందే! -నువ్వురా అసలైన మనిషివంటే! మా సంఘంలో చేరాలోయ్, నువ్వు ఎన్నిసార్లు చెప్పినా అదుగో! యిదుగో! అని కాలయాపన చేస్తూవచ్చేవు. కానీ, యిదుగో! దరఖాస్తు రాసెయ్. నీకు సొంత యిల్లుంది కదూ? పిర్కిలీ! దాన్ని నువ్వు రక్షించుకో వద్దూ? మనిద్దరం వెళ్ళి రిస్సావాళ్ళని చావగొడదాం లేరా! వాళ్ళని నాశనం చెయ్యకపోతే మన ప్లానులన్నీ నాశనమే. భగ్నం పాడనుకో. పిర్కిలీ!'

ఆ సమయంలోనే వాళ్ళ నాన్న లోపలికి వచ్చేను:

'మెషిన్ తిప్పడంలేదే.? ఏమిటి చూస్తున్నావ్? ముస్తో సెన్ లేకపోతే పనంతా పడుకోవాల్సిందేనా?'

నేను గుప్‌చిప్‌గా వెళ్ళి స్లెడ్జి గుర్రాల్ని విప్పేసేను. ఫాక్టరీ మేస్త్రీ నేను చేయాల్సిన పనిని చూపి సూచన లిచ్చేడు. గుర్రాన్ని తీసుకొచ్చి గానుగలాంటి మరకి కట్టేను. గుర్రంతో బాటు గానుగరోకలి తిరుగుతూ, దానిపై నమర్చిన చక్రాన్ని తిప్పుతుంది. ఈచక్రం దానిమీది యిరుసునూ, అది మరో గదిలోని యినుపచక్రాన్ని త్రిప్పుతాయి. దానిమీంచి బెల్టు వేసి సెపరేటరుకి తగ్గిలించేరు. గుర్రం తిరుగుతూంటే సెపరేటరులోంచి ఝుమ్మ్మ్! అని ధ్వని వినబడింది. సెపరేటర్ లోని కవ్వం అందులోని పాలను చిలుకుతూందన్నమాట. కొంచెం సేపట్లో సెపరేటరుకున్న రెండు గొట్టాల్లోంచీ రెండు తెల్లనిధారలు బైలుదేరి బైటనున్న రెండు అల్యూమినియం టాంకుల్లో పడనారంభించేయి. వాటిలో పెద్దధార వెన్నతీసిన పాలది; రెండో చిన్నధార చిక్కని మీగడది.

ఎవరేనా చేయాల్సిందల్లా గుర్రాన్ని సమంగా తోలుతూండడమే. దీన్ని త్రిప్పడానికి బలమైన గుర్రం అక్ఖర్లేదు. అందుకనే వచ్చేటప్పుడు ముసలిగోడిగను స్లెడ్జికి కట్టుకొచ్చేను. గుర్రాన్ని తోలేందుకు చిన్నకుర్రాడైనా చాలు. కళ్ళెం త్రాడును గుర్రం ముందు అమర్చిన కొ[illegible]టి గురుజుకి కట్టాలి. గుర్రం రోకలిని, రోకలి గురుజునూ తిప్పుతూంటే, అది

కళ్ళెపుత్రాటితో గుర్రాన్ని లాగుతూంటుంది. నిజానికి గుర్రం తనను తానే లాక్కుంటూంది. గాన తోలే వాడు అవసరమే లేదు. నేను గుర్రం వెనకే నడుస్తూ, నాలుకతో క్లక్ క్లక్ మని హుషారుచేస్తూన్నానంతే. పాలస్ని సెపరేటరు లోంచి బైటకిరావడానికి పక్కా గంటసేపు పడుతుంది. అంతసేపూ గుర్రం వెనకాలే నడుస్తూంటే నా బుర్రలో ఎన్నో ఆలోచనలు మెదులుతూనే వున్నాయి. ఎల్సా ఆ కాగితాన్ని చూసేక అన్నమాట నాకు జ్ఞాపకం వచ్చింది. ఖైదీల గుడ్డు తోడేసి, కాళ్లు చేతులు చెక్కేసి ఘోరంగా హింసించి ఆ స్థితిలోనే వాళ్ళని సంకెళ్ళతో బంధించి చీకటికొట్టులో పడేసి, యింటికి ఉత్తరం ముక్కైనా రాయనీకుండా,- చివరకో చిన్నజాబు, ఫొటోగ్రాఫిక్ పద్ధతిలో చాలకాపీలు అచ్చువేసి, విమానంమీంచి ఆ ఖైదీ అన్న నివసించే చోటికి సమీపంలో పడేయనీయుని వాళ్ళనిగూర్చి అందులోనూ ఆ అన్న అయోగ్యుడైనా సరే ననుకోండి,- అటువంటి దుర్మార్గుల్ని గూర్చే నా ఆలోచనాప్రవాహం సాగిందనుకోండి. అల్లాంటి క్రూరుల్ని మానవులుగా పరిగణించనే కూడదు. వాళ్ళని నాశనం చేసెయ్యాల్సిందే. లేకపోతే ఎంతమంది ప్లానులో నాశనమైపోవ్వూ! పిర్కీ!

పాలస్ని సెపరేటరులోంచి పూర్తిగా బైటికి వచ్చేసేక మిగడనంతసి లోపలి గదిలోకి మోసుకుపోయేం. అక్కడ

ఓ పెద్ద సిమెంటుతొట్టి వుంది. దాంట్లో నీళ్ళూ, మంచూ కూడా వుంటాయి. మీగడ తీసిన పాలు మళ్ళీ కేన్లలో పోసి ఓ ప్రక్కగా పెట్టేసేం. వాటిని ఆయా ఖాతాదారులకి సాయంత్రం తిరిగి యివ్వాల్సి వుంటుందిగదూ. మా పాల కాన్స్‌ని తీసుకెళ్ళి స్లెడ్జి మీద యెక్కించేను. అవి తీసుకు పోయి యింటిదగ్గర యిచ్చేక, కర్కీమాకీ అమ్మగారు యీ పాలని పనివాళ్ళకీ, లేగదూడలకీ, పందులకీ వాటాలు ప్రకారం పంచియిస్తుంది.

ఈ పని అంతకష్టమైనదిగా కనిపించడం లేదు. దీనికి కూలి రోజుకి పదిమార్కు లెందుకో? నాలాంటి తెలివితక్కువవాడికి తెగే సమస్య కాదిది. పోనీ అదంతా మన కెందుకు గానీ యీ పని అలవాటైతే యింకా తేలిగ్గా వుంటుంది. నాకే నయంగాదూ? మంచుగదిలోంచి నిన్నటి మీగడ వుంచిన తొట్టెల్ని తీసుకుపోయి, వెచ్చటి నీటిలో వుంచేం. చతురంగా వున్న ఓ పెద్ద కాగుక్రింద నేను రాకపూర్వమే ఎలియాస్ నిప్పువేసి వుంచేడు.

వాడికి నేనంటే యెందుకో అంత యిది! వాళ్ల నాన్న బైటికి పోగాచూసి, ఎలియాస్ ఓ పెద్ద అబకతో మీగడ తీసి నా కందిస్తూ అన్నాడు :

'ముసలాయన లేనప్పుడే పుచ్చుకోరా, నీ క్కావాల్సింది! ఊఁ! త్రాగు, ఫర్వా లేదు. నీకు కావాల్సిన దేదైనా సరే యివ్వడానికి నే నెప్పుడూ వెనకదియ్య ననుకో.'

అది పుచ్చుకోకపోతేనే బాగుంటు ననుకోండి. పెడతా నంటే యెవరికేనా ఆశే గదండీ! నా దురాశకి నేనే సిగ్గు పడ్డాను, చెప్పొద్దూ. పుచ్చుకునేటప్పు డిదంతా యెవ డాలోచించేడంటా.

'ఇంత తాజామీగడ యిక్కడున్నపుడు, అదైనా దమ్మిడీ ఖర్చుగాకండా వస్తూన్నపుడు నే నెందుకు త్రాగకూడదు. అంతగా వస్తే యీ పూట భోజనం కాస్త తగ్గించుదాం!'

నా ఆలోచన యింతవరకే పోయింది. కాని యిప్పుడనుకుంటా, అట్లా తీసుకోకండా వుంటే బాగుండునని. ఎలియాస్ చేతులతో యిచ్చింది నిరాకరించుతేనే మంచిదని యిప్పుడనుకుంటున్నా. అప్పు డిదంతా ఆలోచించేందుకు అవకాశం యేదండీ? ఇంతకీ ఎలియాస్ చెడ్డవాడేం గాదు; దేశానికి యిల్లాంటివాళ్ళ అవసరం యెంతేనా వుంది. అందులోనూ వాడు నేనంటే అంత ప్రీతితో యిస్తూంటే పుచ్చుకోకండా యెల్లాగంటా? వాడు నావీపుమీద తట్టుతూ ప్రోత్సహించ నారంభించేడు కూడాను :

'ఊఁ! కానీవోయ్! త్రాగు! నీ కోసం నన్నేం చెయ్యమన్నా సిద్ధమే! నువ్వూ నేనూ యెప్పుడూ కలిసే వుండాలిరా! హ్హాఁ! హ్హాఁ! హ్హాఁ! మనం యిద్దరం కలిసివుంటే చేయలేని పని...'

అప్పటి కప్పుడే చాలా టాంకుల్లోని మీగడను ఛెర్న్లో పోసేం. గుర్రాన్ని త్రిప్పడానికి నేను బైటికి వెళ్ళేను. బెల్టు యిరుసుకి తగిలిస్తూ, ఎలియాస్ అరిచేడు :

'కానీ! త్రిష్కా!'

నేను గుర్రాన్ని అదలించేను. ఫెర్మ్ అంటే మరేమీ లేదు. ఓ పెద్ద పీపా మధ్యనుంచి యిరుసు చొచ్చుకుపోయి వుంటుంది. ఇరుసు తిరిగితే, పీపా దాంతోపాటు నిలువునా గిర గిరా తిరుగుతుంది. పీపాలోని వెచ్చని మీగడంతా కదిలి, చిలకబడిపోయి, పూసలు కడుతుంది. ఆ పీపాకి ఒకప్రక్క గుండ్రని గాజుపలక తాపటంచేసి వుంది. లోపలి మీగడ చినుకులు ఆ గాజు బిళ్ళమీద పడి, పైకి కనిపిస్తుంటాయి. కొంతసేపు త్రిప్పేక మీగడంతా పసిమివన్నె వెన్న పూసలుగాకట్టి, గాజుబిళ్ళలోంచి కనిపిస్తుంటాయి. అప్పుడు ఎలియాస్ లోపలినుంచి అరుస్తాడు :

'అగవోయ్! పిర్కాలీ!'

గుర్రాన్ని నిలిపి, గానుగ విప్పి, బండి దగ్గిరికి తీసుకుపోయి కాస్త గడ్డి దానిముందు పడేసి వచ్చేను. ఎలియాస్ నన్ను కూడా సిద్ధం కమ్మన్నాడు :

'వొళ్ళు శుభ్రంగా దులుపుకో. చొక్కా చేతులు పైకి మడుచుకుని, సబ్బుతో బాగా కడుక్కో. గోళ్ళలో మట్టి లేకుండా జాగ్రతగా చూసుకోసుమీ! ఇదిగో బ్రష్షూ, సబ్బూ, సీటికుళాయీ. కడుక్కున్నాక యిదిగో, యీబురఖా పైనవేసుకో!'

ఎలియాస్ కూడా శుభ్రంగా వుతికిన తెల్లటి ఓవరాలూ (బురఖా), తెల్లటి లినెన్ టోపీ ధరించి తయారయేడు. నాకూ టోపీ యిచ్చేడు.

అతడు చెప్పేపన్లు అన్నీ చేస్తూ, ప్రతిపనిమీదా ఓ కన్ను వేసి వుంచుతూ వచ్చేను. ఏమో? మన జీవితంలో యేమి చేయాల్సివస్తుందో యెవరి కెరుక?...కాని, అదీ నిజమే. నాకు గంటకి పదిహేను మార్కు లిస్తారా? అసంభవం! అంత ఆశకూడదు గాని, రోజుకి యిరవై మార్కు లిస్తే చాలు, ఆ పనంతా చేసేస్తా. లేకపోతే మారు పేరెట్టండి! ఇప్పటి యిరవైఐదూ, ఆ యిరవై కలిస్తే నలభైఐదు మార్కు లిస్తే వాళ్ళ క్రీమరీ క్రీమరీ నంతనీ నా భుజంమీద మోసుకపోయి, మీ యిష్టం వచ్చినచోట దింపుతా!

అదనపు రాబడి కెల్లాంటి అవకాశాలున్నాయో ఎల్సాకేం తెలుసు? నేను కళ్లు తెరుచుకుని చూస్తూండకపోతే లాభం లేదు. ఎలియాస్ చేసేవంతా కనిపెట్టిచూస్తూ, కిటుకులన్నీ తెలుసుకోవాలి.

గదంతా గచ్చు చేసి అద్దంలా వుంది. గది మధ్య గుండ్రని చిన్న టేబిల్-ప్రెస్ వుంది. దానిమీద చల్లటి మంచినీళ్ళు చిలకరిస్తున్నాడు, ఎలియాస్. ప్రెస్ మధ్యభాగంలో ఉబ్బెత్తుగా పళ్ళచక్రంమీదదిమ్మ అమర్చివుంది. నీళ్లుచల్లుతూ, షెల్ఫులోంచి వెన్నముద్దల్ని చట్రంతో తీసి, పాలు వోడిపోనిచ్చి, టేబిల్-ప్రెస్‌మీద పడేస్తున్నాడు, ఎలియాస్.

టేబిల్ మధ్య అటునించి యిటువైపుదాకా కొయ్యరోలరు అమర్చి, దానికొక ప్రక్క పిడబిగించేరు. పిడి పట్టుకొని త్రిప్పుతూంటే రోలరు తిరుగుతూ టేబిలును గుండ్రంగా త్రిప్పు

తుంది. టేబిలుమీంది వెన్నముద్దలు రోలరుకూ టేబిలుకూ మధ్యన పడి ఒత్తబడుతూంటాయి.

నేను పిడిపట్టుకుని త్రిప్ప నారంభించేను. రోలరూ, టేబిలూ తిరుగుతూ, వెన్నను ఒత్తుతూన్నాయి. ఎలియాస్ చల్లని మంచినీటిని చిలకరిస్తూ, వెన్నలో మిగిలిన పాల చినుకుల్ని కూడా కడిగేస్తూన్నాడు. మధ్య మధ్య అతగాడే రెండు చిన్న కొయ్యచెక్కలతో వెన్నముద్దల్ని దొర్లించి, యెత్తి రోలరు క్రిందికి విసిరివేసేవాడు. ఆ చెక్కలు నీటిలో ముంచుతూన్నందున వాటికి వెన్న కొంచెమేనా అంటుకోదు. వెన్నముద్దల్ని రోలరుక్రిందికి విసరడం, నీళ్లు కొట్టడం, ఒత్తబడిన వెన్న అప్పడమ్లాగా తయారవడం,— యిది చాలసార్లు జరిగింది.

మిసిమిరంగు వెన్నముద్దలు బాగా వడిసిపోయి గట్టిపడ్డాక వాటిని యింకా పెద్దవుండలుగా చుట్టి ప్రక్కగదిలోని టేబిలు మీంద పడేసేడు, ఎలియాస్. ఆ కొయ్య టేబిలు శుభ్రంగా కడిగి, చల్లని నీళ్లతో తడిపివుంది. వెన్న ఒక్కపిసరుకూడా దేనికీ అంటుకోదనుకోండి. అక్కడి వస్తుసామగ్రులన్నీ అంత పరిశుభ్రంగా వున్నాయి. మళ్ళీ ఛెర్నులోనుంచి వెన్న తీసి టేబిల్-ట్రెమీంద వేయడం, త్రిప్పడం, ముద్దజేసి తీసుకుపోవడం,— యిల్లాగే వెన్నంతా ఐపోయేవరకూ చేస్తూనే వున్నాము.

కాస్త వెన్నముద్ద తీసుకుని నోట్లో పడేసుకున్నా, రుచి చూడ్డానికి. ఉర్లగడ్డలూ, రొట్టీ లేనిదే అదంత రుచిగా కనిపించలేదు. నేను వెన్న తీస్తూంటే ఎలియాస్ అనేవాడు :

'తిను, తినవోయ్! ఫర్వా లేదు. నీక్కావాల్సింది తిను. నేను దాన్ని మూచూడనైనా లేను. కడుపులో త్రిప్పుతుంది. వెన్నమూట అటుంచి మీగడకూడా నాకు పడదు. దూరాన్నుంచి చూసి చందమామగుటకలు మ్రింగాల్సిందే. ఒక్క పిసరుతిన్నానా, కడుపులో చెయిపెట్టి కలిపినట్లుంటుంది. పిర్కీ లీ! తిను, నువ్వు జీర్ణం చేసుకోగలిగితే. ఊఁ! తీసుకోరా! కాని రొట్టిమాత్రం యిక్కడికి యెప్పుడూ తేవద్దుసుమా. ముసలాడు ఒక్కపిసరు పసిపట్టడంటే నిలుచున్నపళాన ఖూనీ చేసేస్తాడు. పిర్కీలీ! ఊఁ! విసురుగా త్రిప్పు. ఈ వెన్ననంతనీ భోజనాల వేళకి ముందే ముద్ద చేసెయ్యాలి. వెధవ పని. ఛీ! ఈ దిక్కుమాలినపనితో నా ప్రాణం విసిగిపోయిందనుకో. పిర్కీలీ!...నేను యుద్ధంలోకి పోయీ అవకాశం దొరుకుతుందంటావా? హ్హాఁ! హ్హాఁ! ఒక డజను రిస్సావాళ్ళనేనా... చాలు! ప్రతివాడూ పతకాలూ, శిలువలూ సంపాదించుకుంటున్నాడు. నాకు ఒకటీ లేదు. పిర్కీలీ!'



## పద్ధెనిమిదో ప్రకరణం - బ్రతుకుతెరువు,

ఎలియాన్ వాగుడు చివరకి నిజమే అయింది. శకునపక్షి ముండాకొడుకు! ఏదో కూడబెడదామనీ, అది కొందాం యిది కొందామనీ అనుకోడమే గాని మన యిష్టం యేముందండీ. దైవసంకల్పం అనుకోండి. క్రీమరీలో జరిగే ప్రతిపనినీ ఆసాంతం

కట్టో వత్తి పెట్టుకుని పూసినదంతా బూడిదలో పోసిన
పన్నీరే అయింది. పాలనీ, మీగడనూ వెల్లా వేరుచేస్తూ
న్నాడో; తిరుగుడు టేబిలుమీద వెన్నముద్దను వెల్లా
దొర్లించేవాడో; వెన్నముద్దను నీట ముంచి, కొయ్యఅచ్చులోకి
కుక్కి, అచ్చు మూసి, యిటుకలా తయారుచేసేవాడో;
దాన్ని తడిపిన నూనికాగితంలో చక్కగా చుట్టి, పార్సిలు,
వెల్లా చేసేవాడో; తర్వాత టేబిల్సును, టాంకుల్ని, ఛెర్నును
గదుల్నికూడా వేడినీటితో కడిగి శుభ్రపరచడం, రిఫ్రిజి
రేటరునుంచి మంచుగడ్డలు తెచ్చి 'కోల్డు - రూమ్' (చల్లని
గది) లోని సిమెంటు తొట్టిలో వేయడం, దానిలో వీరాగడ
డబ్బాల నుంచి చల్లబరచడం. యీ పనులన్నీ కనిపెట్టు
తూండి, ఆకళింపుచేసుకున్నాను. కాని, ఏం లాభం?

ఇవన్నీ చూసేనందుకు లాభమేమిటి? ఎలియాస్ చెప్పి
నట్లల్లా విని, అతనికి సాయంచేస్తూ అన్నిపనులూ నేర్చు
కోడం నిష్ప్రయోజనమే అయింది. 'వాడెవడో యుద్ధంలోకి
పోతాడులే. వాడినౌకరీలో నేను దూరి సుఖపడదాం'-అనుకు
న్నా. ఇతరుల కష్టాలమీదా దురదృష్టంమీదా ఆధారపడి
నేను బాగుపడా లనుకోవడ మేమిటి చెప్పండి? దుర్బుద్ధి
కాకపోతే. చివరికి నన్నూ తీసుకుపోయేరు, పటాలంలోకి.

ఇన్నీ అన్యాయంగా టేమిటి? ఎలియాస్ని, వాళ్ళ ఛాపర్నీ,
యీ కాయి ఏలోన్ని లాక్కుపోరేరు, పటాలంలోకి. వీళ్ళంతా
ఖుళ్ళలో వెచ్చగా కూర్చుని సుఖంగా కాలక్షేపం చేద్దా

మనుకున్నవాళ్ళే! పాపం! అదీగాక గడ్డపారలు కొట్టుకు పోతూంటే గడ్డిపరకలు మా గతేమిటన్నట్లు మహామహా వాళ్ళనే యుద్ధం వచ్చి యెగరగొట్టేస్తూంటే నాబోటి గాళ్లు అంగలార్చడంలో అర్ధమేమిటంటూ? మమ్మల్ని యుద్ధంలోకి ఎందుకు తీసుకు వెళ్ళేరు? చెప్పనా? యుద్ధం మా అందరికంటే కూడా యెంతో బలవత్తరమైందని ఋజువైంది గనక! లక్షలాదిగా మానవుల్ని తన పొట్టబెట్టుకోడమేగాక యింకా కావాలి! యింకా కావాలి! అంటూంది. యుద్ధమారి! ఈ వెధవ యుద్ధాన్ని యెవడు ప్రారంభించేడో గాని వాడు దుంపనాశనం గావాలి! దుర్మార్గుడు! కానీ, మన భ్రమకాని, యీ యుద్ధాన్ని ప్రారంభించింది నేను గాదంటే, నేను గాదనే వాళ్ళేగాని.........ఓ! ఫిర్కీలీ!......

పాపో ఒక్కణ్ణే యుద్ధంలోకి తీసుకుపోకుండా వుంచింది! మరీ వృద్ధుడైపోయి, బలహీనంగా వుండడంవల్లనే వాణ్ణి వదలి పెట్టేరని ఢంకామీద దెబ్బకొట్టి చెప్పగలను. అదేగాదు. వాడిరోగం? దినాలు గడుస్తూన్నకొద్దీ వాడి గుండెల్లోని యీలలూ, బుసలూ మరింత బిగ్గరగా వినవస్తూన్నాయి. ఉదయాన్నే లేచీ లేవగానే పైపు వెలిగించేవాడు. ఆ సమయాన వచ్చే దగ్గుతెరకి అరగంటవరకూ గిలగిల్లాడిపోయే వాడు; ఉక్కిరిబిక్కిరయేవాడు.

కడపటిసారి చూసిపోదామని నేను పాగ (గుర్రాలసాల) లోకి వెళ్ళినప్పుడు పావ్లో గోడదగ్గిర కూర్చుని, కళ్ళు తుడుచుకుంటూన్నాడు. అప్పుడే దగ్గుతెర తిరిగింది వాడికి, గుర్రాలు ఓట్లు నములుతూన్న ధ్వని వింటూ, పొగ వదులుతూ, ఉదాసీనంగా వున్నాడు, వాడు.

నే నెందుకు వచ్చిందీ పావ్లో గ్రహించినట్లున్నాడు, నాకేసి ఒక్క దొంగచూపు చూసి, వులక్కుండా పలక్కుండా ఉదాసీనంగా అల్లాగే కూర్చునిపోయేడు. వాడితో యేం మాట్లాడాలా ? అని ఆలోచిస్తూ, చేతులకి తొడుక్కున్న *మిట్టెన్‌లు తీసి తటపటాయిస్తూ నిల్చున్నాను. ఏదో పెద్దవాడూ, మంచివాడూను, వాడితో ప్రేమగా మాట్లాడాలి, నేను వాడికి.కృతజ్ఞుడుగా వుండాలంటూ. లప్పీన్‌రంటా వద్ద రష్యన్ విమానాలు వేసిన కరపత్రాలు తీసి, దాచి, నాకిచ్చినది పావ్లోయే కదూ, మరి ? అవి యెవరికీ దొరకనీకుండా చేయాలని పోలీసువాళ్ళు వాటికోసం ఆ చుట్టుప్రక్కలంతా గాలించేసేరు. ఎవరికేనా అవి కనిపిస్తే తమకు తెచ్చియివ్వడం గాని, నాశంచేయడం గాని చెయ్యాలి! అని ప్రతిచోటా నోటీసు లంటించి, పేపర్లలో ప్రకటనకూడా చేసేరు వాళ్ళు! కాని మా చిన్న పావ్లో వాటిని తగులబెట్టనూ లేదు, పోలీసుల కివ్వనూ లేదు. నాకు సంతోషం కలిగించాలనే కదూ

* శీతలదేశాల్లో చేతులకి తొడుక్కునే అల్లిక తొడుగులు. ఇవి నూలుతోనూ, వూలుతోనూ కూడా అల్లుతారు.

వాడీ పని చేసింది? అల్లాంటి వాడితో వీడొచ్చే సమయంలో యేం మాట్లాడాలో నాకేం తోచలేదు.

నేనింకా ఆలోచిస్తూండగానే వాడు ముందుగా నా వైపో దొంగచూపు విసిరి, పైవు నోట్లో ఓ ప్రక్కకి నెట్టుకుని పలకరించేడు:

'ఏం, ఐనారీ! వెడుతున్నావా?'

అంగీకార సూచకంగా నేను తలూపేను. వాడు పైపు పీలుస్తూ, కాస్సేపుండి మళ్ళీ అన్నాడు:

'కామందు లాభాలకి గుద్దుసున్నా చుట్టే వన్నమాట!'

వాడి మనసులో యేముందో యెవరికి తెలుస్తుంది? అందు కని అడిగేను:

'లాభా లేమిట్రా?'

పావో విపులీకరించేడు:

'కల్లీ పోహ్‌మాజన్‌పా పూర్తిగా యేభై మార్కులూ మన కామందుకు యిస్తూన్నాడు. ముస్తోనెన్ దినభత్యం అంతే గదుట్రా. వాడి పని నీచేత చేయించి, నీకు దినానికి పది మార్కులు యిచ్చి, తాను మిగతా నలభై జేబులో వేస్తూ న్నాడు. నువ్వెళ్ళిపోతే మన కుర్కిమాకీకి యీ లాభం గుద్దు సున్నా గాదట్రా? వెర్రిమొగం!'

ఏమనాలో నాకు తోచలేదు. మిస్టేల దుమ్ము దులుపు తూన్నట్లు ఒక చానిమీద మరోటి కొడుతూ, నిట్రాడులా నిల్చున్నానే గాని నోటమాట పెగిలిరాలేదు. ఇదీ సంగతి!

నాకీ విషయం యెల్లా తెలుస్తుంది? ఎవరూ చెప్పందే! నేనేమో యిప్పుడు యిక్కడినుంచి వెళ్ళిపోతూన్నానాయె. మళ్ళీ తిరిగి వస్తానో? రానో? ఎవ రెరుగుదురు? అల్లాం టప్పుడు యేదెల్లా తగులడితే యెందుకు? ఆ తెలివి మొద ట్లోనే వుండాలి గాని యిప్పుడు పేచీ పెట్టుకుంటే లాభ మేముంది? డబ్బూ పోయె, శనీ బట్టె నన్న సామెతగా వుంటుంది.

పాప్ మళ్ళీ అందుకున్నాడు:

'ఎలిశూాన్‌తో వెడుతూన్నావా?'

'అబ్బే! ఒక్కణ్ణే!'

'ఐతే వాడు నిన్ను చేర్పించలేక పోయేడన్నమాట!'

'చేర్పించడం దేనిలోరా?'

పైపు గట్టిగా పీల్చి, అన్నాడు:

'వాళ్ళ సంఘం లేదురా? అందులోకి యింకో గట్టివాణ్ణి సభ్యుడుగా చేర్పించినవాళ్ళకి సంఘం డబ్బిస్తుంది. అందుకనే వాడ స్తమానం నీచుట్టూ తిరుగుతూండేవాడు! పాపం! వాడిది వృథాశ్రమ అయిం దన్నమాట!'

దీనికి యేం జవాబీయాలో నాకు తోచలేదు. వాడు చెప్పే సంగతులు నేను కలలోనైనా వూహించివుండనివి!

రెండు నిముషా లూరుకుని మళ్ళీ అన్నాడు:

'వాళ్ళ మూకలోనువ్వూ చేరాల్సిందిరా!'

'ఎందుకని?'

'వాళ్ళలో చేరితే ఎలియాస్‌లాగే యుద్ధానికి బోనక్కర లేకండా నువ్వూ తప్పించుకుని వుండేవాడివి !'

'ఎలియాస్‌లాగా ?'

'శానోయ్ ! వెర్రి వెంగళప్పా ! వినేందుకు చెవులూ, చూసేందుకు కళ్ళూ వుండి లాభ మేమిట్రా ? యుద్ధానికి బోతావా ? లేక పటాలాన్నుంచి పారిపోయివచ్చిన వాళ్ళని వేటాడి వప్పగించడానికి వెనకే వుండి గార్డు డ్యూటీ చేస్తావా? అని వాణ్ణి అడిగేరు. వాడు రెండో పనే చేస్తా నన్నాడు. ఈ హోదాలో ఎలియాస్ అప్పుడే పని ప్రారంభించేడు. మన సువోమీకి అంతరంగికశత్రువుల్నీ, పారుబోతుల్నీ వేటాడి పట్టి కైదులో పెట్టిస్తూ తానెంత దేశసేవ చేయగలడో ఋజువు చేసుకుంటున్నా డప్పుడే! యుద్ధరంగంలో కంటె యీ పనిలోనే తానెక్కువ మగటిమి ప్రదర్శించగలనని వాడి వుద్దేశ్యంలా వుంది !'

పావో ఒక్కక్షణం వూరుకుని మళ్ళీ అన్నాడు:

'తన బాగు తెలిసిన ఘటంరా వాడు ! ముగ్గురు గడబిడ గాళ్ళని అప్పుడే పోలీసుల కప్పగించేడురా, ఎలియాస్.'

నాకు మాట్లాడేందు కేముందింక ? నా వస్తువు లేవైనా యింకా అక్క వుండిపోయేయా ? మూలలోని కబోర్డు తెరిచి చూసేను. అబ్బే ! అందులో నా వేమున్నాయి ? నా మిట్టెన్‌లు, కాన్వాసువి,- యివిగో నాచేతులోనే వున్నాయి. కబోర్డు మూసి, మాటాడకండానే పావోవైపు నా చేతిని

జాచేను. వాడూ లేచి నిల్చుని, మాటాడకండానే మోకాలైన వాడి చిన్నపంజాతో నా చేయి పట్టుకుని గట్టిగా ఒత్తి విడిచేడు. మాబోటి వాళ్ళకి బ్రతుకు తెరువే తెలియదు!

---

## పంధొమ్మిదో ప్రకరణం — ఎల్సా జాబులు.

నన్ను యుద్ధంలోకి తీసుకున్న విధా యిది. చివరకి నేనూ, నాలాంటి వాళ్ళూ పోరాడకపోతే వాళ్ళేం చేయలే రన్న మాట. నా యిల్లూ వాకిలీ బోల్షివిక్కులనుంచి రక్షించుకోవాలని చెప్పేరు వాళ్ళు. వాళ్ళంటే మరెవరూ కాదు. మా ప్రభుత్వం, అధికారులూను. అందుచేత నేనూ నామాతృదేశరక్షణకై యుద్ధానికి పోయేను. రష్యావాళ్ళు గానీ మరొకరుగానీ, నా యిల్లూ - కూరమళ్ళూ లాక్కుంటా నంటే నేను వూరుకునేది లేదు మరి. అవి నాకే చాలవు. ఆ మళ్ళలో కష్టపడి పండించిన ఫలసాయంతో మా నేలమాళిగ నింపే వాణ్ణి. ఆ కాస్త మడిచెక్కా గనక రష్యావాళ్ళులాక్కుంటే నేనూ, నా కుటుంబం మలమల మాడి చావల్సిందే గదా. ఆరు మూడుగానీ, మూడు ఆరుగానీ, నేను నా కూరమళ్ళను వదలిపెట్టను. బోల్షివిక్కుల ముందు నిలవలేక మేము తిరోగమించాల్సివస్తే మా యిల్లూ, కూరమళ్ళూ చుట్టబెట్టి నెత్తికెత్తుకుని వెనక్కి తీసుకుపోవాల్సిందని యెల్సాతో చెప్పివుండే

వాణ్ణే. కాని, ఏదండీ? ఏం మాట్లాడడానికీ అవకాశమే లేక పోయింది. ఏం చేస్తాం?

కల్లీ పోహ్ంజన్ పా క్రీమరీలో చేరి,ముస్తోనెన్, ఎలియాస్‌ల స్థానాల్లో పనిచేస్తూ డబ్బు తట్టలతో సంపాదించేందుకు నేను నోచుకోందే. దానికి బదులు ఖాకీ పంట్లాం, కోటూ తొడుక్కుని, టామీగన్ పట్టుకుని, పటాలపుపాటలుపాడుతూ రోడ్లు దున్నుకుంటూ పోవాల్సివచ్చింది. ఏ యితర ఆలోచనలూ రాకుండానే యీ పిచ్చిపాటలు పాడేవాళ్ళ మనుకుంటా. రిస్సావాళ్ళని రిమ్మతిరిగేలా యెల్లాబావగొట్టేస్తామో అనేదే మా పాటలకు కథావస్తువు. వసంతం వచ్చింది, అప్పటికి. దక్షిణాన్నుంచి సూర్యుడు ప్రకాశిస్తూన్నాడు; సుఖకరమైన కవోష్ణ వాయువులు వీస్తూన్నాయి.

ఈ దఫా నన్ను కూడా లాక్కురావడం దేనికో నా కర్థం కానేలేదు. ఇంకా ముందడుగు వెయ్యండని జర్మన్ లనడం వల్ల మా వాళ్లు దానికి తయారవుతూన్నారో యేమో? మా ప్రాణాలకి వీళ్లెక్కడ దాపురించేరండీ, యములాళ్ళలాగ? ఈ జర్మన్ వెధవల్ని యిక్కడికి రమ్మని బొట్టూ కాటుకా పెట్టి పిలిచిం దెవరంటా? అసలు వీళ్ళని ఆహ్వానించాలా? అక్కర్లేదా? అని నన్నెవరూ అడగనే లేదు. మా పైవాళ్ళకి జర్మన్‌లని ఆహ్వానిస్తే మంచిదీ అనితోచి వాళ్ళే పిలిచేరంటారా? ఐతే అది నాకు తెలియదు కాని, ఆ మాట కొస్తే కందకాల్లోకి వెళ్ళి తుపాకి పట్టుకుని వాళ్ళనే యుద్ధం చేయ

మనండి. పిలిచింది వాళ్ళా, యుద్ధం చేసి చచ్చేది మేమూనా? ఆంబోతులు పోట్లాడుకుని లేగదదూడల్ని తొక్కినాయిట! అల్లా వుంది.

నేనెంత చదువుకోని వాణ్ణైనా యిప్పు డిప్పుడే నాకూ ఒకటి రెండు విషయాలు తెలుస్తూన్నాయి. ఆ మాటకొస్తే మా కామందు హెర్రా కుర్కిమాకీ కంటె నేనేం తక్కువ తిన్నవాణ్ణి గాదు. మా విల్హో కాళ్ళుచేతులు తెగ్గొట్టి చీకటి కొట్టులో పడేసే రని ఆయన చాల బాధపడ్డారు గాని అదంతా వట్టి మొసలికన్నీరని తెలుసుకున్నా! కందకాల్లో కూర్చుని జరిగిందంతా మొదటినుంచి చివరదాకా తరిచి తరిచి ఆలోచించి, ఆయనగారు ఓ పెద్ద అబద్ధం ఆడినాడనే నిర్ణయానికి వచ్చేను.

లేకపోతే బాడ్జి* లేని టోపీ ధరించిన విల్హో ఫొటో బోల్షివిక్కుల కెక్కడిది? వాళ్లు విల్హోని పట్టుకున్నారు; వాడి టోపీ మీాది బాడ్జిని మాత్రం చింపేసి, ఫొటో తీసేరు. లేకపోతే యింకెల్లా వస్తుంది? అదీగాక విల్హో యివ్వని దే వాడి సంతకం వాళ్ళ కెక్కడిదంటా? అన్నిటికంటె ముఖ్యమైనది,- వాడి అన్న ఒకడున్నాడనీ, వాడికి జాబురాయాలనీ మా విల్హో చెప్పని దే చెయ్యని దే బోల్షివిక్కులేం కల గన్నారా? మా తమ్ముణ్ణి నే నెరగనుటండీ? వాడికి తోచి రాయాల్సిందే గాని

* ఆ యా ప్రభుత్వాల, సంస్థల చిహ్నంగా గుడ్డతో తయారుచేసి, ధరించే అంగుల పట్టీ; టోపీమీాదా, కోటుమీాదా ధరించుతారు.

లేకపోతే రాయించగలవాళ్ళు యీ ప్రపంచంలోనే లేరను కోండి. వాడే రాసివుంటే నిజంగా వున్నపరిస్థితే రాసే డన్న మాట. దాని కర్థం విష్ణో సజీవుడై కులాసాగా వున్నాడనే కాదూ ?

నా తర్కసరణి యీ విధంగా సాగిపోయిం దనుకోండి, కందకాల్లో కూర్చుంటే. విషయాన్ని పండొలిచి అరచేత పెట్టినట్టు గ్రహించగలిగిన నా తెలివికి కొంచెం గర్వపడ్డాను కూడాను. కందకాల్లోని బురదలో, నీటిల్లో కూర్చునివుంటే పైనుంచి అగ్నివర్షం కురుస్తూంటే,- అసలు యిదే మాన వుల బుద్ధిని నిశితం చేస్తుందేమో! నేను నిశ్చయంగా చెప్ప లేను సుమండీ.

ఏ దెల్లాగున్నా కందకాల్లో కాలం యీదురో మంటూ గడుస్తుంది. ఒక రోజుకీ, యింకో రోజుకీ తేడాయే కనిపిం చదు. బ్రతుకే ఓ పెద్ద పీడకలలా వుంటుంది. అంతూ పొంతూ లేని యీ పీడకలలో కూడ మధ్య మధ్య మధురతరకల్పనా మయమైన క్షణాలు కొన్ని వుంటాయి. ఇంటిదగ్గిరనుంచి ఆప్తులు వ్రాసే జాబులే యీ మధురక్షణాల్ని కల్పన చేస్తుంటాయి.

మా వూళ్ళో యేమేమి జరుగుతూన్నదీ సవివరంగా, తర చుగా జాబుల్లో రాస్తూనేవుంది. మెల్లా నేను లేకపోయి నందుకు కుర్కిమాకీ కమతంలో పనంతా నిలిచిపోయిం దను

కుంటే పొరబాటు. ఆ మాత్రానికీ ఆయన చతికిలపడి పోతాడా? అబ్బే! కోడీ, కుంపటీ లేకుంటే తెల్లారదూ? కోత లకి కూలీన్ని తెస్తానని ఆయనగారు నాతో చెప్పింది వట్టి మాట గాదు. నిజంగానే కూలీల్ని తీసుకువచ్చేరట ఆయన! కోతలకీ కొట్టుళ్ళకీ, నుక్కూకీ కట్టుబడికీ కూడ ఆయన కూలీల్ని సంపాదించేరట. పైపెచ్చు కలపా, రాయీ తోలడానిక్కూడా పనివాళ్ళని తెచ్చేడు. సుమారు పదిహేనుగురు మనుష్యులు, కనీసఖర్చుతో పనిచేసేరు, అన్నీ. పనిచేసినంతకాలం వాళ్ళకి నాలుగేసి నాక్కూలీపాలు,* మీగడతీసిన పాలు, బంగాళా దుంపల పులుసు,- యివి మాత్రం యివ్వాలి.

హెర్రా కుర్కూమాకీ మా చెడ్డ అసాధ్యుడులెండి! యుద్ధం మూలంగా యెందరో కష్టనష్టా లనుభవిస్తూంటే, దాన్నుంచే లాభాల్ని తీసే కిటుకు ఆయనకి తెలుసు! ఖైదీక్యాంపుల్లోంచి రష్యను యుద్ధఖైదీల్ని తీసుకెళ్ళి, పనులు చేయించుకుంటు న్నారట, ఆయన. అయ్యో! దేవుడా! అందరికీ యిటువంటి గొప్ప ఆలోచనలు తట్టవు! ఏమంటారు? నీ శత్రువులచేతనే నీ కార్యం సాధించుకోడం! వెనకటికి కోతేం చేసింది? పిల్లి చేత్తో నిప్పుల్లోంచి జీడిగింజలు తీయించలేదూ? అదీ తెలి వంటే! అందులోనూ ఆట్టే ఖర్చు లేకండా వుచితార్థంగా పని చేయించుకోడం! రోజూ నాలుగు నాక్కూలీపాలూ, ఓ

* 'రై' ధాన్యంతో చేసే చదునైన రొట్టె. చపాతీవలె వుంటుంది, చౌకపారు తిండి.

లిట్టరు మీగడతీసిన పాలూ, అర్ధ లిట్టరు ఉల్లగడ్డల పులుసూ యిచ్చి బండెడు చాకిరీ చేయించుకోడం. ఆ ఉల్లగడ్డలైనా యెల్లాంటివి? పందులుకూడా మూచూడని చచ్చుదుంపల తోనే కుర్కీ మాకీ అమ్మగారు ఆ పులుసు తయారుచేయించే దట! ఇదిచ్చి వాళ్లచేత తెల్లారింది మొదలు చీకటిపడేదాకా చచ్చే చాకిరీ చేయించుకుంటూన్నారు. సాయంత్రానికి ఒకడి దగ్గరా నిలబడే సత్తువ లేకండా పీనుగలై పోయీలాగ! దాన్ని తగలెయ్యా, అదో గొప్ప ఆలోచన లెండి! ఇంకే కారణం లేకున్నా యీ ఉద్దేశంతోనే యుద్ధం ప్రారంభించతగ్గ విలువ వుందంటూ, దాంట్లో! పిర్కీలీ!......

దీర్ఘములైన పగళ్లంతా ఆ తేమకందకాల్లో కూర్చో వాల్సి వచ్చిన మానవులు యే యే విషయాల్నిగూర్చి ఆలో చిస్తారో ఆ దేవుడికే తెలియదు. కందకాల్లో బ్రతుకు వెళ్ళ బుచ్చటం అంత నిరుత్సాహప్రదమైంది యీ లోకంలో యింకోటి లేదు. ఇక రాత్రుల్నిగూర్చి చెప్పనే అఖ్ఖర్లేదు. అందులోనూ శిశిరఋతువులో గడగడలాడించే కాళరాత్రు లైతే మరీను. దట్టమైన మంచు కురుస్తూ గాలివానలతో తలెత్తనీకండా, యే పనీ తోచనీకండా, పీడకలలా దీర్ఘంగా మెల్లిగా గడిచే ఆ రాత్రుల అనుభవాలు పగవానికైనా వద్దు. ఆ కొద్దిరోజులే యుగా లనిపించుతాయి. అంతవరకూ గడిపిన జీవితమంతా అసత్యమనీ, కలయనీ, యిదొక్కటే మనోవ్యాధిలా బ్రతుకంటే రోతకలిగిస్తూంటుందనీ తోస్తుంది.

నా ఎల్సా, మార్తా, లవ్‌రీలూ, కొండమీది చిన్న యెర్ర యిల్లూ కూడా యెప్పుడో క్షణమాత్రం కలలో చూపినవి మాత్రమే ఐనట్లూ వుంది!

ఆమె వుండే, మా యెల్సా, మా గట్టిపిల్ల లెండి. అందరికీ అటువంటి భార్యలు దొరకరని నా నమ్మకం. ఇంటిదగ్గర జరిగే ప్రతివిషయాన్నీ గూర్చి సవివరంగా తరచుగా దీర్ఘమైన జాబులు రాస్తూనేవుం దామె. సుఖకల్పనామయమైన కొన్ని మధురక్షణాలనైనా ఆమె తన జాబులద్వారా నా కందకజీవితంలో కలిగించింది. ఎల్సాకి యింటిదగ్గర పని తక్కువగా వుండనుకుంటూన్నారేమో? యజమాని పాడియావుల మంద పెరిగింది. పైగా కెర్స్తా పనిమాని వెళ్లిపోయింది. ఆమె పెళ్ళిచేసుకుందిట, ఆఖరికి! యుద్ధంలో కాలుపోయినవాణ్ణి. ఏదో లెండి కాస్త స్వంతకొంప్ర వుందిట. పోసి, యెల్లాగో చిట్టచివరకి కెర్స్తా కోరిక తీరి, ఆమె యేకాకిత్వం వదిలిపోయింది. పెళ్ళికోసం కెర్స్తా మొహంవాచిపోయిం దనుకోండి. పోసీ ఆమె హృదయానికి వూరట కలిగిందంటే మనం సంతోషించమూ?

లవ్‌రీ, మార్తా యేపుగా యెదుగొస్తున్నారు. మా యింటి ఛాయలకి యెండా, వెలుతురూ తగలనీకండా అడ్డుగోడగా నిలబడివున్న ఆ కొండకొమ్మమీది కెక్కడానికి వాడింకా ప్రయత్నాలు చేస్తూనేవున్నాడు. అక్కడ కావాల్సినంత యెండ వుంది. కాని యెక్కగలగొద్దూ? కొంతదూరం యెక్కడం, జారి, దొర్లుతూ క్రింది కూరపాదుల్లో దిబ్బున

పడ్డం, మళ్ళీ లేచి మొక్కవోని ప్రయత్నించడం,- వాడిది మా చెడ్డపట్టుదల లెండి. కుర్రనాగమ్మా!

వీటన్నిటికీ యేం గాని తిండి విషయమే మరీ అధ్వాన్నంగా వుందిట. ఒక్కొక్కరోజు భోజనంలోకి మిాగడతీసిన పాలూ, ఉర్లగడ్డలూ తప్ప యింకేదీ వుండడంలేదు. ఎప్పుడేనా సక్రత్తుగా చేపలు దొరుకుతాయి. బ్లాకుమార్కెటులో యేదో ఒకటి కొంటేనేగాని రోజు వెళ్ళమారదు. ధరలు చూస్తే చుక్కల నంటుతూన్నాయి. కాని, మనం చేసే దేముంది? కొన్నివస్తువులు అసలు మాయమే అయిపోయేయి. దుస్తులు, బూట్లు మొదలైనవి దొరకడమే లేదని చెప్పను గాని చలి కోటు,- వున్నదే అనండి,- నాలుగువేల మార్కులు! మాబోటి సంసారులం వాటిని గూర్చి ఆశలు వదలుకోక గత్యంతర మేముంది? ఇక బూట్ల సంగతి చూస్తే నేతిబీర కాయ చందంగా వున్నాయి. మడమలు కొయ్యతోనూ, మిాదిభాగాలు కాగితంతోనూ తయారుచేసిన జోళ్ళే యిప్పు డందరికీ ఆచారమైనాయి.

ఇక పల్లెటిప్రాంతాలలోనీ పరిస్థితులు చూదామన్నా యేమంత ప్రశాంతంగా లేవుట. కామిజార్వీ నుంచి మెల్గా పినతండ్రి జాబు రాస్తూంటాడు, ఆమెకి. ఆయన యేమేమో రాసేడుట. జర్మనీవాళ్లు మా ప్రభుత్వంమిాద ఒత్తిడి దెచ్చి, ఆ ఉత్తరప్రాంతంలో యేవో కొత్తపన్నులు విధించేట్లు చేసే రట. బోల్షివిక్కులనుంచి మా స్వాధీనాని రక్షించబూనిన

జర్మన్‌లకి ఫిన్నులు ఋణాన పడ్డారట! అందుకని వాళ్లు గొడారి కన్యాలో మురాటో దగ్గిర్నుంచి తోళ్ళన్నీ స్వాధీనం చేసుకోడానికి నిర్ణయించేరు. వాడు ససేమిరా యివ్వ నన్నాడు ఆపళాన వాళ్లు బలప్రయోగం చేసి లాక్కుపోడానికి తలపెట్టేరు. వాడేం చేసే డనుకున్నారు? గోడనున్న వేటతుపాకీ నితీసి, ముగ్గుర్ని కాల్చి చంపి, నాలుగోవాణ్ణి తుపాకిమడమతో రెక్కగూడు వసిలిపోయేలా బాదేడు. ఏదో, ముసిలాడు లెండి, అందుక నే అంతతో సరిపెట్టేడు!

ఎల్సా పినతండ్రి యింకా యెన్నో యిల్లాంటి సంఘటనలు రాసేడుట. తోయ్‌వో మాంతిలా పటాలంలోంచి సెలవు మీద యింటికి వచ్చి, వాడి ప్రియురాలు ఓ జర్మన్ ఆఫీసరుతో వుండడం చూసేడుట. మర్నాడుదయానికి జర్మన్ ఆఫీసరు గొంతు తెగి, మురుగుగుంటలో తేలుతూ కనిపించే డందరికీ. తోయ్‌వో అరణ్యాలలోకి తప్పుకుపోయేడు.

ఇంకా యెన్నో సందర్భాలున్నాయి, మరి. మావాళ్లు తరుచుగా జర్మన్‌లతో కత్తి యుద్ధాలు చేస్తున్నారు. ఏ అమ్మాయిని గురించో, మరో కారణాన్నో కొట్లాటలు జరుగుతున్నాయి. జర్మన్‌లు మా దేశానికి వచ్చింది మాతో ఖజ్జా పెట్టుకోడానికి కాదులెండి. ఐనా మావాళ్లు బొత్తిగా యేమీ తెలియనివాళ్లు లెండి. ఏమిటో? చేతావాతా గాని వాళ్లు.

కాని, ఆర్వీ హీనోలా వున్నాడే వాడు సిపాయి లెండి. వాడు చేసింద అందర్నీ మించిపోయింది. జర్మన్లతో పోట్లాట వచ్చి, వాడేం చేసే డనుకున్నారు? ఇద్దరు జర్మన్లని ఒకే పోటుతో పొడిచేసి, మూడోవాణ్ణి చాపచుట్టగా కిటికీలోంచి బైటికి గిరవాటేసి, అందులోంచే దూకితప్పించుకు పోయే డట!

మిత్రులపట్ల యెంతో మర్యాదగా ప్రవర్తించమని అధికారులు చెపుతూనే వున్నారండీ, నెత్తీ నోరూ కొట్టుకుని. కాని మా సజ్జుండే వట్టి అల్లరిమూక; మర్యాదా తెలియదు, మన్నా తెలియదు. ఏం చేస్తాం లెండి.

---

## ఇరవయ్యో ప్రకరణం యుద్ధమూ వ్యాపారమే

వసంతం, శిశిరం, హేమంతం,- మళ్ళీ వసంతం, హేమంతం, కందకాల్లో మా జీవితం ఒకే ఒక పద్ధతిలో దీర్ఘమైన పీడ కలలా సాగిపోతూంది. ఒక్కొక్కపుడు రష్యన్ బాంబులు మరీ దగ్గరలో పడుతూంటాయి. ఆ తర్వాత మేం వెళ్ళి చెదిరివున్న అవయువాలు, కండలు, యెముకలు, పీలికలుగా యూనిఫారం ముక్కలు పోగుజేసి గోతులలో పూడ్చి వచ్చే వాళ్లం. ఒక్కొక్కప్పుడు మా స్కౌట్లు రాజజోకీ నదిని దాటి ఆవలికి వెళ్ళేవాళ్ళు. కాని తర్వాత వాళ్ళ వెనక మేం వెళ్ళి చావగా మిగిలిన వాళ్ళని తీసుకుని పాకి, డేకి, ప్రాణా లరచేత

బెట్టుకుని వెనక్కి వచ్చి, వాళ్ళని మెడికల్ స్టేషన్‌కి పంపించే వాళ్ళం. ఇంకా యితరసమయాలలో రష్యన్ ఫిరంగిదళాలు మా కందకాల్ని సర్వనాశనం చేసేసేవి. మాలో చర్మం చెడ కండా మిగిలినవాళ్ళం గుండెలు చేత్తో పట్టుకుని, నోళ్లావ లించి చల్లని వానచినుకుల్నీ, కొయ్యబారించే శీతలవాయు వుల్నీ, శిశిరకాలపు శిథిల వాతావరణాన్నీ శోకసముద్రంలా గబగబా దిగమ్రింగుతూ, గాఢతిమిరావకుంఠనం వైచుకున్న కాళరాత్రులలో, కసపిసలాడే బురదలో త్రొక్కిళ్లాడుతూ ప్రాణాలు పణంగా వొడ్డి మళ్ళీ కందకాలు తవ్వుతూండే వాళ్ళం.

ఇంతకాలాన్నుంచీ నా జీవితంలో ఆశాకిరణలేశాన్ని ప్రస రించే జాబులతో మెల్లా మళ్ళీమళ్ళీ ఆ మనోహరసాంసా రిక సుఖస్వప్నాల్ని జ్ఞాపకం చేస్తూ నేవుంది. ఎప్పుడో, ఎక్కడో ఏ జన్మానో, ఒకే ఒకసారి క్షణికమాత్రం అనుభవించి, శాశ్వతంగా పోగొట్టుకొన్న సుఖస్వప్నంలా వుంది, నా గతజీ వితం అంతా. అస లిది కలా? నిజమా?

ఇక కుర్కిమాకీ గారి కమతం, కామాటం బాగానే సాగి పోతూన్నాయి. మొదట్లో ఆయనగారు పదిహేనుగురు రష్యను యుద్ధఖైదీల్ని సంపాదించేరు. ఆ తర్వాత వాళ్ళ సంఖ్య పాతిక్కి హెచ్చింది. పొలాలలోను, అడవులలోనూ పనులన్నీ చేయడమేగాక కట్టుబడి పనులుకూడా వాళ్ళే చేస్తున్నారు. సరే, పానో వుండనే వున్నాడు, వాళ్ళమీద

మేస్త్రీగా వుండి పురమాయించడానికి. వాడు రష్యావాళ్ళతో యేం మాట్లాడేవాడో? యెల్లా మాట్లాడేవాడో? వినాలనీ, చూడాలనీ నాకెంతో ముచ్చటగా వుంది, చెప్పొద్దూ!

బరువుపని, చచ్చుతిండి,- వీటివల్ల ఖైదీలు చాలమంది జబ్బుపడ్డారు. హెర్రా కుర్కిమాకీ వాళ్ళని ఖైదీల క్యాంపుకి పంపేసి, వాళ్ళకి బదులు మరికొందర్ని పంపమని అడిగేరుట. సరే. వాళ్ళూ బదిలీఖైదీల్ని పంపేరయ్యా, ఆ తర్వాత ఖైదీలలో కొందరు తమ కిస్తూన్న చచ్చుతిండిని గూర్చి ఫిర్యాదు చేయనారంభించేరు. అల్లాంటి పొగరుబోతు రకాల్నికూడా క్యాంపుకి పంపేసి, వాళ్ల స్థానేకూడ కొత్తవాళ్లని పంపమన్నాడు. మొదట్లో కొంతకాలం పంపినా త్వరలోనే కొత్తఖైదీల్ని పంపడం క్యాంపు అధికారులు నిలిపేసేరు.

దీపం వుండగానే యిల్లు చక్కబెట్టుకోవా లంటారు పెద్ద వాళ్ళు. దీన్ని బాగా అర్థం చేసుకున్నవారు, మా యజమాని! యుద్ధఖైదీలుండగానే తన ప్లానులన్నీ పూర్తి చేసుకోవాలని ఆయన గ్రహించేరు. కుర్కిమాకీ భూములలో ప్రవహించే రెండు సెలయేళ్లనీ కలిపి ఒకే పెద్ద ప్రవాహంగా చేసి, దానిద్వారా పిండి మిల్లునీ, క్రీమరీ యంత్రాల్నీ త్రిప్పే విద్యుత్తును వుత్పత్తి చేయాలనీ; ఆ జలవిద్యుత్తుతోనే కుర్కిమాకీ కమతానికీ, మా యింటికీ కూడ యెలక్ట్రిక్ దీపాల్ని పెట్టాలనీ,- ఆయన సంకల్పం. తదనుగుణ్యంగానే ఖైదీలచేత

ఆ రాతినేలలో ఓ పెద్ద కాలవ త్రవ్వుపని దాదాపు పూర్తి చేయించేరు. రెండు సెలయేళ్ళనీ కలిపే యీ కాలవపని యింకొక్క యాభై గజాలే మిగిలిపోయివుందట.

ఈ పనులు చేయడంలో ఒక రష్యన్ ఖైదీ కనుమూరి (కొండమీంచి పడి) చచ్చిపోయేడు. వాడిస్థానే యింకోణ్ణి పంపమన్నారు, అధికారులు. ఆ తర్వాతే మరో ఐదుగురు ఖైదీలు తిండి ఘండాలంగా వుందని గోలచేసేరు. దానిమీద రష్యన్ ఖైదీలందర్నీ క్యాంపువాళ్ళు తీసుకుపోయేరు. వాళ్ళకి బదులు మళ్ళీ ఒక్కణ్ణికూడా కుర్కిమాకీగారికి వాళ్ళు యివ్వందే!

ఎల్లకాలం ఒకేరీతిగా వుండదుగాదండీ. కుర్కిమాకీగార్కి పాడురోజులు వచ్చేయి. ఆయన ఖైదీ క్యాంపుకివెళ్ళి కొందర్ని పంపమంటే వాళ్ళన్నదేమిటో తెలుసా:

'మీరు కోరేది యింతట్లో నెరవేరదు. ఖైదీలు మీమీద చేసే ఆరోపణ యేమిటో తెలుసా? వాళ్ళచేత చచ్చేచాకిరీ చేయిస్తూ, అదనపుతిండి పెట్టడం మాటటుంచి, క్యాంపు యిస్తూన్న రేషన్‌లోనే తగ్గించుకున్నారని!'

ఎవరూ చూడలేదు గాని అందరూ అనుకున్న దేమంటే,- వాళ్ళ నోటమ్మట యీ మాటలు వినడంతోనే కుర్కిమాకీ గారికి ముచ్చెమటలూ పోసి, చాలసేపటివరకూ నోట మాట పెగిలి రానేలేదనీ, ముడుదలై వ్రేలాడే కనురెప్పల మధ్య నుంచి గ్రుడ్లప్పగించి చూస్తూ నిశ్చేష్టుడై వుండిపోయేడనీను!

పంధొమ్మిది వందల నలభై రెండులో యీ అధికారులే యిచ్చిన వుపన్యాసాల ధోరణి వేరు. మొదట్లో వాళ్లు పరియాచకా లాడుతూన్నారేమో? అనుకున్నారట, మా కామందు. కాని, వాళ్లు వేళాకోళాని కనలేదు, ఆ మాటలు. ఇది పంధొమ్మిది వందల నలభై నాలుగు. ఇప్పుడు పరిహాసా లాడే ధోరణిలో లేందే, వాళ్లు! పాపం!

కాని హెం్రా కుర్కిమాకీ అందుకోసమే విచారిస్తూ కూర్చోలేదు. వాళ్ళు యుద్ధభై దీల్ని యివ్వకపోతే ఆగుతుందా యేమిటి? దేశంలో చాలమంది యింగ్రియర్లు, కరేలియన్లు వున్నారు. వాళ్ళందర్నీ తూర్పు కరేలియా, పీతార్కీ ప్రాంతాలనుంచి తీసుకొచ్చేరు. వాళ్ళ నడిగి తీసుకురాలేదన్న మాట నిజమే గాని యుద్ధకాలంలో శత్రువులు గదుముకొస్తూంటే యీశషభిషలతో కూర్చుంటే యెల్లాగ? కాని వాళ్ళు నోరెత్తకండా వుండడానికి సువోమీలో మంచిమంచి పొలాలు యిస్తామని ధారాళంగా వాగ్దానాలు మాత్రం చేసేరట! లేకపోతే వాళ్ళు యిళ్ళూ వాకిళ్ళూ, పొలం పుట్రా వదులుకుని ఓ పట్టాన వూడిపడే వాళ్ళేటండీ? దేనికైనా కాలవ్యవధి కావాలిగదా? దుడుంగుమంటే అయే పనులుటండీ? పొలాలు యిచ్చే విషయం యింకా తేలాల్సివుంది, కాబట్టి కూలీ నాలీ చేసుకుని బ్రతుకుతూన్నారు, యీ జనమంతా,

మా కామందుకూడా కొన్ని యింగ్రియన్ కుటుంబాల్ని తన కమతంలోకి బదిలీ చేయించుకున్నారట. వాళ్ళు ఆయన పొలాలలోను, అడవులలోను, గోశాలలోనూ, మిల్లుకట్టుబడిలోనూ పనులుచేసి బ్రతుకుతూన్నారు.

రష్యన్ ఖైదీల్లా గాక హెంౖరా కుర్కిౖమాకీ వీళ్ళకి కూలి డబ్బు లివ్వాల్సివస్తూం దనుకోండి. ఇవ్వాల్సి వస్తే యిస్తారు. దాని కేముంది? పిండీ, వుర్లగడ్డలు, పాలూ గాక మార్కులు కూడా ఆయన యిచ్చేవారు. ఐనా ఆయన కందువల్ల నష్టం కలగలేదు. ఈ రోజులలో మార్కులకి విలువేముంది? ఇంగ్రియన్‌లు మరో గత్యంతరంలేక యీ కూలికే అంగీకరించి పనిచేసేవాళ్ళు.

హద్దూ పద్దూలేని రష్యన్ భూములలోంచి వచ్చిన వాళ్ళకి మా సువోమీలోని రాతిభూములూ, నాచుపొలాలూ యేం నచ్చుతాయి? రాజుని చూసిన కళ్ళ మొగుణ్ణి చూసుకుంటే మొత్తుకో బుద్ధేసిం దన్నట్లుంటా యనుకోండి! ఐనా యింగ్రియన్‌లు మా భూములకోసమే కనిపెట్టుకునివున్నారంటే వాళ్ళ ఓరిమిని మనం కొనియాడాలి; యే మాట కామాటే అనుకోవాలి. అదీగాక యిక్కడ బెత్తెడు భూమైనా విడిగా లేందే? మావాళ్ళే యెందరో స్వంతపొలం లేనివాళ్లుండగా పైవాళ్ళ కెక్కడిదంటా? వాళ్ళు భూమి యివ్వదలచుకుంటే మేం లేమా? ఎక్కడినుంచో వాళ్ళనీ వీళ్ళనీ పిలుచుకు రావాల్సిన అవసరం యేముందంటా? చచ్చినవాణ్ణి ఊఁ!

అనిపించినా అనిపించగలం కాని వాళ్ళు భూములిచ్చేటట్లు చేయించలేము !

ఔను! హేట్రా కుర్క్ మాకీకి యెల్లా కాలక్షేపం చెయ్యాలో తెలుసు. అందులో ఆయన్ని అనాల్సిన పనేముంది? ఆయన సాధ్యమైనంతమట్టుకు యుద్ధంవల్ల కలిగిన ఫలితాల్ని స్వీకరిస్తూన్నారు. అసలు ఆయన వేసే అడుగు ప్రతీదీ భద్రంగా భారంగా పడి, భూమితో ఆయనకుగల సాన్నిహిత్యానికి ద్యోతకంగా వుంటుందికూడాను!

ఆయన ఒక్కరే అన్నమాటేమిటిలెండి. నా మాటేమిటి? నా మటుకు నేను మాత్రం యీ యుద్ధాన్నుంచి వచ్చిందంతా రాబట్టుకుంటూనే వున్నాను. సిపాయీల జీతం పదహారు మార్కులు; నెలకి నాలుగువందల యెనభై మార్కులు అన్న మాట. నా జీతంలోంచి ఖరాగా నాలుగువందల మార్కులు రొక్కించి యెల్లాకిపంపేవాణ్ణి. ఈయుద్ధంయేటిమీాద యేడుగా సాగుతూనే వుందాయె. అల్లాంటప్పుడు నేను పంపించే డబ్బు యెంతుంటుందో మీరే లెక్కవేసి చూడండి! నేను పంపే దంతా తిండికోసం బ్లాకు మ్యార్కెటులో యెల్లా ఖర్చు చేయడం లేదనుకుంటే, మా చిరకాలవాంఛితమైన పాడి యావు మాకెంతో దూరంలో లేదని అర్థంగాదూ?

ఇప్పు డేమని తేలింది? ఈ యుద్ధం రావడంవల్లనే మేము ఆవును కొనుక్కునేందుకు సావకాశం కలుగుతూందనే గాదూ? యుద్ధాన్ని సంతోషంతో ఆహ్వానించాలనీ, యీ యుద్ధం

యిల్లాగే యింకో నాలుగేళ్ళపాటు జరుగుతూండేలా చేయమనీ దేవుణ్ణి ముమ్మాటికీ ప్రార్థిస్తూండాలనీ తేలుతూంది! ఎందుకు? యుద్ధం నాకు ఆవును యిచ్చింది గనక! అటువంటప్పుడు యుద్ధాలు రావాలనీ, ఒకసారి వచ్చేక నిరంతరాయంగా సాగుతూనే వుండాలనీ కొందరై నా కోరడానికి కారణం వుందంటారా? లేదంటారా?

కాని యేం చేయాలో దేవుడికి మనకంటె బాగా తెలుసును. యుద్ధం ముగిసింది. నా వుద్దేశంలో కూడా యిదే మా సువోమీకి క్షేమదాయకమని నన్నడిగితే ఘంటాపథంగా చెప్పగలను.

---

## ఇరవై ఒకటో ప్రకరణం — పలాయనం.

ఆ దంతా యెల్లా జరిగిందో నాకు బాగా జ్ఞాపకం లేదు. నిజమే! కథ సాంతం గావచ్చిందని వూహించి, హడావుడిగా కాళ్ళు విరగద్రొక్కుకుంటూ యేర్పాట్లు చేసుకుంటూనే వున్నామనుకోండి. కాని యెప్పుడు ప్రారంభమైందో కాని చూస్తూండగానే అంతా పూర్తైపోయింది. దూలాలు, రాళ్ళు మోసి తెచ్చి, కందకాలు త్రివ్వి, రాళ్ళు చెక్కి, గోడలు కట్టి, ఊపిరి తిరగకండా పనులు పూర్తిచేస్తున్నాం. మా రేషనులు పెంచేరు. దీర్ఘమైన ఆ వేసవి దినాల్లో సూర్యోదయ–సూర్యా

_స్తమయ పర్యంతం వంచిన నడుం యెత్తనీయకండా మా చేత పనిచేయించేరు. కాని, యేమిటో? అదంతా వృథాశ్రమే ఐంది. ఇంతకూ అసలు ప్రారంభించడమే ఆలస్యంగా ప్రారంభించేములెండి.

నేను పని చేస్తూన్నది మా రక్షణశ్రేణుల్లో రెండో దాని మీద. అదే బలవత్తరమైందని అంతా అనుకునేవాళ్ళు. కొందరు దానిని 'మృత్యుగహ్వరం' అని పిలిచేవారుకూడాను. మేము మా శక్తినంతనూ దాని వేర్వేరు లింకుల్ని బలవత్తరంగా నిర్మించడంలోనూ, వాటిని ఒకటొకటితో కలపడంలోనూ వినియోగించి పనిచేస్తున్నాం.

రష్యన్లు మేం వూహించినంతకంటె ముందే దెబ్బతీసేరు. అసలు వాళ్ళెప్పుడో దెబ్బకొడతారని మేం అనుకుంటూన్నదే. కాని యీ అనుకోడం చాలాకాలం అనుకున్నాం. చివరకి విసిగి, యింక వాళ్లు రారనుకుంటూంటే ఆ క్షణంలోనే దెబ్బకొట్టేరు.

వాళ్ళు మా 'మృత్యుగహ్వరం' లోని వరసలన్నిటినీ ఛేదించుకుంటూ, పీతారీ నుంచి ఒక్కతోపున వైపురీ మీదికి వచ్చిపడ్డారు. ఆ దాడిని నేను వర్ణించలేను గాని యెవరో అంటూంటే విన్నాను. దేవుడికి కోపం వచ్చి మా సుపోమీా పైకి నిప్పులు, గుళ్ళూ, వాటితోబాటు రష్యన్ సిపాయిల్నీ చేటలతో చెరిగి, విసిరికొట్టినట్లుందిట!

దాని వివరాలు నాకేం అంతు పట్టలేదు. ఇకముందూ అదెల్లాంటిదో తెలియకుండానే వుండేటట్లు భగవంతు డను గ్రహించుగాక అనీ కోరుకుంటున్నా. ఏదో కలలో వుండి పోయి నట్లనిపించింది. ఆకాశం విరిగి, బ్రహ్మాండగోళాలు నెత్తి మీద పడుతూన్నట్లూ, ప్రళయం వచ్చి సర్వనాశనం చేస్తూ న్నట్లూ తోచింది. నే నెవరినో, యెక్కడ వున్నానో యేమీ తోచలేదు. కలే గనక ఐతే మహాభయానకమైనదే. శిలా ఖండం నీడలో కొండచరియ మీద పరిశాంతప్రకృతిపరిసరాల్లో యెర్రని కుటీరం తెల్లని గవాక్షాలతో నిభృతంగా నిలబడ్డం కనిపించిన ఆ స్వప్నంలాంటిది మాత్రం యిది కానేకాదు!

వర్షం ధారాపాతంగా కురుస్తూ, నా వీపుమీంచి కాలు వలు కట్టి పారుతూంది. తడిసిన నా ముఖాన చపేటాలిస్తూ, కరిచేటట్లున్న చలిగాలి వీస్తూంది. ఆ పాడుయింటి నానుకునే నేను పడివున్నాను. నా చెంప ఆ యింటి పునాదిరాయి నొత్తు కుని వుంది. ఆ యింటి బాపతు యిప్పుడు ఒకటే శిథిల కుడ్యమూ, దానిమీదినుంచి కొన్ని వాసాలూ మాత్రమే మిగి లివున్నాయి. ఆరాతి నొరసికొని, మట్టిలో బోరగిలా పండు కునివున్నా. నన్నెవరూ చూడకూడ దని తప్ప నాలో మరే ఆలోచనాలేదు. ఫిరంగిగర్జనలు చెవులు ఘుడియలు పడేస్తూ న్నాయి; భూమంతా దద్దరిల్లి పోతూంది.

ఆ సమయంలో నా ఆలోచనాశక్తే పనిచేయలేదు. ఎవ రికీ కానరాకుండా దాగొని ఆత్మరక్షణ చేసుకోవాలనే ఒకే

ఒక ఆలోచన నాఅస్తిత్వాన్నంతనీ ఆక్రమించుకుని కూర్చుంది. నా భ్రమ గాని నన్ను చూడాలని యెవ రనుకుంటున్నారు? పిడుగులు కురిసే, ఆ జడివానలో, వడవడ వణికించే చలి గాలిలో నా ఆవాహనా విసర్జనా యెవరికి గావాలి? తేమగా వున్న ఆ పునాదిరాళ్ళను కౌగలించుకుని, ఆ మొండిగోడ చాటున రక్షణ నన్వేషిస్తూం పడివున్నాను.

వర్షధారల్ని, దట్టమైన పొగతెరను చించుకుని శైం శైం మని పెద్ద పెద్ద షెల్లులు మహావేగంగా వచ్చిపడుతున్నాయి. ఈలలు, ధ్వనులూ చెవులు చిల్లులు పడజేస్తున్నాయి. షెల్లులు పడినచోట్లలో బురద, నీరూ, మట్టీ చిచ్చుబుడ్డిలోంచి చిమ్మినట్లు గాలిలో లేస్తున్నాయి. ఆకులు, పువ్వులు, కాయలుతో నిండిన చెట్లూ, పొదలూ, తీగగుబురులూ అంధకారంలో నుంచి చూస్తే కానవచ్చినట్లున్నాయి, యీ యెగిరిన మట్టి ముద్దలు. టాంకులు దిక్కులు పిక్కటిలచేసే ధ్వనులతో బ్రహ్మరాక్షసుల్లా వస్తున్నాయి, యీ ప్రళయంలోంచి ముందుకి. పైకెగిరిన మట్టిగడ్డలు, మానవాంగాలూ ఒక్క క్షణం గాలిలో వ్రేలాడి, క్రిందికి పడిపోతూ, ఆ టాంకుల గోపురాలమీద తటతట వర్షిస్తూన్నాయి. క్రిందపడేవి పడుతూంటే పైకి లేచేవి లేస్తూన్నాయి, మట్టిచెట్లు.

రష్యా టాంకులు వరసలుగా దొర్లుకుంటూ వస్తున్నాయి. ఏ గోప్పో, పాడుకొంపో, చెట్టో అడ్డువస్తే మరో దారి లేక ఆ

టాంకులు వాటిని చదునుచేసుకుంటూ వచ్చేస్తూన్నాయి. బట్ట మీాది ముడుదల్ని సాఫు చేస్తూ పోయే యిస్త్రీ పెట్టిలాగే అనుకోండి. నా యింద్రియాలు పనిచేయడానికే నిరాకరించి నట్లుంది. అక్కడ వివిధధ్వనులు కలిసిపోయి ఒకటే గొడవగా వున్నందున నా చెవులు దేనినీ వినలేక నే పోతున్నాయి. నా కిప్పుడు జ్ఞాపకం వున్నదల్లా టాంకు గోపురంమీాద తగులుకుని వ్రేలాడుతూన్న యింటికప్పును చూసే ననేదే. కొంతదూరం వచ్చేక అది క్రింద పడిపోయిందని జ్ఞాపకం వుంది.

మా ఫిరంగులు బారుచేసి, టాంకులమీాద కాలుస్తూ న్నాము. షెల్లులు టాంకులచుట్టూ బ్రద్దలవుతూ పెద్దమం టలూ, రాళ్ళూ, మట్టీ యెగచిమ్ముతూన్నాయి. కొన్ని షెల్లులు టాంకుల కవచాలకి తగిలి బ్రద్దలై చెదరిపోతూ న్నాయి. ఏమి కానున్నదీ నాకు తోచనే లేదు. నా వివేచనా బుద్ధే నశించినట్లైంది. టాంకు నన్ను పచ్చడి చేయకండా వున్నంతసేపూ మిగతా అంతా యేమైపోయినా నాకేంపట్టింది? మేంవదిలే షెల్లులు రష్యన్ టాంకుల కవచాల్ని భేదించలేక తూలి దూరంగా పడిపోతూన్నాయి. టాంకులు అడ్డొచ్చిన వాటినన్నిటినీ చదును చేస్తూ అంతకంతకి సమీాపిస్తూన్నాయి.

హఠాత్తుగా ఓ షెల్లు రివ్వున బోయి టాంకు గోపురానికి తగిలి బ్రద్దలైంది. ధణధణ వణుకుతూ టాంకు నిలిచిపోయి, నల్లని పొగను చిక్కగా మేఘాల్లా చిమ్ముతూంది. అంతలో గోపురం మూాత తెరుచుకుని ఒక రష్యన్ సిపాయి

పైటి కురికేదు. వాడు మండుతూన్న మస్తుల్ని చేతులతో తట్టుకుంటూ, ఆర్ప ప్రయత్నిస్తూ దొర్లుతూన్నాడు. మరుక్షణంలో టాంకులోనుంచి పెద్ద అగిడిమంటలు నాలుకలు జాచుకుంటూ పైకి వచ్చిపడ్డాయి. ఈ జ్వాలలు టాంకు గోపురపు పచ్చరంగును నాకేసినాయి చూస్తూండగనే.

ఆ వెంటనే సరిగా నా నెత్తిమీదే ఒక బ్రహ్మాండమైన పిడుగుధ్వని వినిపించింది. నేను కళ్లు మూసేసి, నేలను గట్టిగా కరుచుకున్నాను. పునాదిరాళ్లు కదిలి, నా వొళ్లు హూనంచేసి భుజంమీద అడిచినాయి. నా క్రింద నేల లేచిపడి వచ్చింది. గర్జనలు ఉత్తరదిశగా దొర్లుకుంటూ దూరంగా పోతూన్నాయి. గాలిని చీల్చుకుంటూ, మహావేగంతో యేదో మహాశక్తి నా మీదగా పోయినట్లైంది; రష్యన్ రాక్షసి బిభీషిక నా మీదుగా దొర్లిపోయింది.

మెల్లీ నేను తలెత్తి, కళ్లు తెరిచేసరికి యెందరో రష్యన్ సైనికులు నావైపు పరుగెత్తి రావటం చూసి, భయకంపితుడనైపోయేను. నేను పడివున్న ఆ శిథిలగ్రామాన్నుంచి పొలాలమీదుగా సుదూరంలోవున్న అడివి కనిపిస్తూనేవుంది. ఆ పొలాలన్నీ రష్యన్ సైనికులతో నిండిపోయినాయి. వాళ్ళంతా టామీ గన్నులు పట్టుకుని నావైపే పరుగెత్తుకుని వస్తున్నారు. అయ్యో! దేవుడా! అదే రష్యా! మామీద విరుచుకు పడుతూంది! మేం కుడిచి కూర్చోలేక దాన్ని వేధించేం; చేసినది అనుభవించక తీరుతుందా?

ఇంకా అక్కడక్కడ మట్టీ, రాళ్ళూ గాలిలో కెగిరి పొదల్లా కానవస్తూనే వున్నాయి. ఏ కొండరాళ్ళ చాటునుంచో మా వాళ్ళు కాల్చే గుళ్ళూ, వాళ్ళ షెల్లులే లేపే యీ ప్రేలుళ్ళూ అడుగడుక్కీ అడ్డొస్తూనా, వాళ్ళు వాటినేం లక్ష్యపెట్టక పరుగెత్తి వస్తూనేవున్నారు.

వానజల్లులు వాళ్ళ ముఖాన కొడుతూన్నాయి. నోళ్ళు తెరిచి బిగ్గరగా వినవచ్చేలా బుసలుకొడుతూ శ్వాసిస్తున్నారు వాళ్ళంతా. అందరి కళ్ళూ నామీదే వున్న ట్లనుపించింది. మా వాళ్ళల్లో యెవణ్ణో చూసివుంటాడు, బహుశా. ముందు పరుగెడుతూన్న రష్యన్ టామీగన్ను యెత్తి కాల్చేడు. పరుగెడుతూనే మరోణ్ణి చూసి, మళ్ళీ యింకోవైపు కొన్ని చుట్లు కాల్చేడు. నాకు ముచ్చెమటలూ పోసేయి. నాచుట్టూ యేదో భయానకనరకం ఆవరించుకుని వున్నట్లు తోచి కంపించిపోతున్నాను కండా పోయేను. ఎటుచూసినా బ్రద్దలయే షెల్లులు, ఈలలు గుళ్ళు, పొగా, మంటలూ, వర్ష ధారలూ,- వీటితో నరకం ప్రాయంగావున్న పొలికలనులో బోల్షివిక్ సైనికు డొక్కడే సజీవియై, నిర్భీకుడై పురోగమిస్తూన్నాడు. ప్రతీదీ చూస్తూ, వింటూ, ఆలోచిస్తూ వుండగల్గిన రష్యన్ సైనికుణ్ణి యేదో అదృశ్యశక్తి నడిపిస్తూ న్నట్లనిపించింది.

అప్పుడే వాళ్ళు నన్ను చూసేరు. టామీగన్ నా వైపు తిరిగింది. రాళ్లూ, మట్టీ, సిమెంటు బెల్లులూ వానలా నామీద కురుస్తూంటే ముఖం నేల నానించి క్రింద పడుకున్నాను. కాని

బ్రతకాలంటే అక్కడికొక్క క్షణమైనా వుండకూడ దని స్పష్టమైపోయింది. రెప్పపాటులో ఒక్క వురుకున లేచినిల్చుని, నా టామిగన్ కూడా మరిచి, పరుగెత్తుకుంటూ వస్తూన్న రష్యన్‌లలోంచి ఒక్కవూపున పరుగెత్తేను. పాకైపోయి పొగలు కక్కుతూన్న ఆ రష్యన్ టాంకునూ, పాడుయింటినీ, కూరమల్లె దాటేక వున్న క్యారెంటు పొదల్నీ దాటి చిన్న చిన్న చెట్లు, పొదలూలోకి వెళ్ళిపడ్డాను. బొక్కబోర్లా పడుకున్న నా తలమీదుగా కీచుమంటూ పోతున్నాయి, తుపాకి గుళ్ళు. టామీగన్నులలోంచి ధారాప్రవాహంగా వెలువడుతూన్న గుండ్లవర్షం అది. ఆ గుండ్లజడి ఆగేవరకు ఒక్క మాటుండి, వురుకున మళ్ళీ లేచి కొంతదూరం పరుగెత్తి, మళ్ళీ పండుకున్నా. రష్యన్‌లు కేకలేస్తూ పరుగులెత్తుతూ బిభీషణ. ముందు వెనకలా, చుట్టుప్రక్కలా అంతటా వాళ్ళే.

ాంటు పొదలూ, రాస్ప్‌బెర్రీ చెట్లూ వున్న ఆ పెద్ద టలో తలదాచుకుందా మని నా ప్రయత్నం. నేలనంటుకునే వురుగులా ఒక పొదనుంచి మరో పొదకి పాకుతూన్నా. నేల యీనినట్లున్న రష్యన్ సైనికులతో తోటంతా నిండిపోయి వుంది. ఎవడి కంటబడినా నా పని ఆఖరే.

ఎందరు నన్ను దాటి పరుగెత్తేరో, మరెందరు మా గుండ్లకి కూలిపోయేరో నాకు తెలియదు. కాని ఆ గందరగోళం కొంచెం శాంతించేక నేను లేచి తోట వెనకనున్న చెట్లతోపులోకి పరుగెత్తిపోయేను. అక్కడినుంచి అడవి కెంతో దూరం

లేదు. మా ఫిన్‌లాండుకి అడవులూ, చెరువులూ పెన్నిధు ల్లాంటివి. ఒకసారి అడవిలోకి పోయేనంటే చాలు. ఇక నన్ను పట్టడం జేజెమ్మతరంగాదు. బిడ్డల్ని సాకడంయెల్లాగో కన్నతల్లికి తెలియదూ? ఎడతెగని అటవీమార్గముల్లో బడి మా యింటికి బోడానికి అత్యంతసుగమంగా వుంటుంది.

శవాలమీాదనుంచీ, క్షతగాత్రులమీాదినుంచీ దాటుతూ, ఆఖరి చెల్లతోపు దగ్గరికి వచ్చేనేను. పడివున్న వాడెవడో నా కాలు దొరకబుచ్చుకుని, రష్యన్ భాషలో 'ఆగు!' అని అరిచేడు. ఆ మరుక్షణంలోనే మళ్ళా ఫిన్నిష్ భాషలో 'సీస!' (ఆగు!) అని అరిచి, రష్యన్ భాషలో తిట్టేడు. నేను తూలి, మొహం బద్దలయేలా బోర్లా పడిపోయేను.

నేను సంబాళించుకుని లేవబోతూండగానే వాడూ లేస్తే సేడు. నా గమ్యాన్ని వాడు వూహించుకున్నట్లున్నాండా నాకూ అడివికీ మధ్య అడ్డుగా నిలుచున్నాడు, వాడు. ద్దీ? చొక్కా గుండెలమీాదచిరిగిపోయి, రక్తంతోతడిసి ముద్దయి పోయివుంది. ఎండకి కమిలిపోయిన వాని ముఖంలో యిప్పు డిప్పుడే యౌవనం తొంగిచూస్తూంది. ఎందుకో నాకు మా విల్హో ముఖం గుర్తొచ్చింది. వాడు నావైపు ముందున కడుగు వేస్తూంటే వానిముఖంలో బాధ, చిట్లింపు స్పష్టంగా కని పించింది. విల్హోకంటె కొంచెం పసిమిగానూ, పొంగరించీ వుంది, వీడి ముఖం. నాకేసి అడుగేస్తూ, బాధావ్యంజక స్వరంతో అరిచేడు;

'సీస్ !' (ఆగు !)

నా కళ్ళు అనుకోకుండానే వాడిమీద నిలిచేయి. ఆశ్చర్యం, భయం కూడ నన్నావేశించేయి. అదుగో! రష్యావాడు! దయ్యంలా యెదురుగా నిల్చునివున్నాడు. మా సువోమీలో యితగాణ్ణిగూర్చి యెంతో రాసేరు, ప్రచారం చేసేరు. విన డమేగాని వీళ్లతో ముఖాముఖిగా పరిచయం యెక్కడిది! అంతలోనే వాడు నా సమీపంలోకి వచ్చేసేడు. వాడి గడ్డం మీది గాయం, మొహంమీద బురదచినుకులు, పింగళనేత్రా ల్లోని బాధాక్రోధాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. రాక్షస తుల్యుడైన రష్యన్, శ్మశానప్రాయమైన వాడి దేశం,- వీటిని గూర్చి యిరవై యేడేళ్లుగా చెవులు తడకలుకట్టేలా వింటూ వచ్చేను. అల్లాంటి రష్యన్ యిప్పుడు నాయెదుట నిల్చుని, బిభీషికగా ముందుకు వంగి, క్రోధావేశంతో అరుస్తున్నాడు:

'ఆగరా! నిన్నంటించా! సీస్! సీస్!'

వాడేమంటున్నాడో నేను వినడంలేదు; వాడిభావం నా కర్థమూ గావడంలేదు. ఏదో ధ్వనిమాత్రం వాడి నోట్లోంచి వస్తూన్నట్లు గ్రహించే నంతే. నా అస్తిత్వమంతా ఆక్షణంలో ఒకే ప్రశ్నపైన వుంది: యిక్కడి నుంచి దాటిపోడం యెల్లాగ? మిగిలినవాళ్ళుకూడా రాకముందే కాలికి బుద్ధిచెప్పాలి. శీఘ్ర బుద్ధేః పలాయనం; ఒక్క వురుకున ప్రక్కకు తప్పుకుని పరు గెత్తేను.

కాని, వాడేం తక్కువ తిన్నాడా? నన్నే కనిపెడుతూన్నాడాయె! రెప్పపాటులో నా రెక్క దొరకపుచ్చుకున్నాడు—నాకంటె కొంచం పొట్టివాడైనా వాడి చేతుల్లోని బలం నాకు స్పష్టమైంది. పట్టు వదలిపించుకోడమే బ్రహ్మాండమైం దనుకొండి. కాని అంతలో వాడు మళ్లీ పట్టుకున్నాడు నన్ను. నాశక్తి కొద్దీ వాణ్ణి దూరంగా నెట్టేసేను. పడిపోతూన్నా వాడు నన్ను వదలలేదు. వాడూ, వాడిమీద నేనూ చాపచుట్టగా పడిపోయేము. గాయం తగిలి రక్తం కారుతూన్న అతగాడి గుండెలమీద చెట్టులా పడిన నా బరువుకి వాడి కెంతో బాధ కలిగి వుంటుందని మూలుగువల్ల గ్రహించేను. కాని యెంత బాధకలిగినా వాడు నన్ను వదలందే! ఆ పచ్చికమీదే క్రిందా మీదా పడుతూ దొర్లుతూన్నాం యిద్దరం. ఒకరినొకరం పిడిగ్రుద్దులు గుద్దుతూ, గొంతు నులుమ ప్రయత్నిస్తూన్నాం.

అంతలోనే వాడికి దగ్గుతెర వచ్చిన అదను చూసి, పట్టు వదలించుకుని, గమ్మున లేచి పరుగెత్తేను. ఆ సమయంలో వాడి నెత్తిమీద యేరాయోవిసిరికొట్టి చంపివుండచ్చు. కాని నాకు వాడిమీదకసిలేందే! వాణ్ణిచంపితేనాకువొరిగేదేముంది? అట్లాంటి పని నావల్ల కానుసుమండీ. వాడో పిచ్చివాడిలా వున్నాడు. నా సంగతి ఆ మాత్రం తెలియక్కర్లేదా అంటా?

వాడు నా తమ్ముణ్ణి చంపలేదు. మా విల్లో బతికి బాగా వున్నాడని నాకు ఖచ్చితంగా తెలుసు. అల్లాంటప్పుడు వీణ్ణి కొట్టేందుకు నాకేం పట్టింది? ఎటొచ్చీ వాడు నా మనసు గ్రహించలేక నన్ను పట్టుకోవాలనుకుంటున్నా డంటే. నేను

వాడి యినపపిడికిలిలో నొరకిపోకండా తప్పించుకుని పారిపో వాలి. అంతే. ఈసారి నేను అడివిలోకి పారిపోగలిగేను, బ్రతుకు జీవుడా అని.

---

## ఇరవై రెండో ప్రకరణం - అరణ్యావాసం

ఆడవులే నన్ను రక్షించేయి; లేకపోతే రష్యన్ల చేతిలో చిక్కి, చచ్చిపోవాల్సినవాణ్ణేగదా. ఎన్నో కొండలు దాటి, ఎన్నో చెరువులు చుట్టుతిరిగి, ఊబినేలలు అతిక్రమించి నా తల్లిదేశపు చల్లని చేతుల్లోకి పడిపోయేను. వానజల్లులూ, చలిగాలులూ కొడుతూనేవున్నాయి. బురదలో కూరుకు పోతూ నా బూట్లు జుర్రుపాములు లేపుతూన్నాయి. పాదాలు తడిసిపోయి జల్లుమంటున్నాయి. ఏమైతేనేం గాని ఆ వెనక భాగంలో రోడ్లమీద జరుగుతూన్న హత్యాకాండ. గందర గోళం నుంచి తప్పించుకుని వచ్చేనేను. అదే పదివేలు.

నిర్జనారణ్యంలో పోతూండగా ఓచోట చిన్నగుడిసెలో కొన్ని కాగితపుసంచులు కనిపించేయి. ఒక చిన్నసంచిలో మాత్రం కొంచెం గోధుములున్నాయి. మిగతా'వన్నీ ఖాళీవే. వాటి నన్నిటినీ నా కోటుజేబుల్లో కుక్కుకుని, మళ్ళీ అడివిని పడ్డాను. చీకటి పడింది. దారీ తెన్నూ లేని అడివిని బడి, గాలీ వానాలో కాళ్ళీడ్చుకుంటూ, పచ్చిగోధుమగింజలే నమ

లుతూ నడుస్తూన్నాను. రాత్రి ప్రొద్దుపోయేక ఓ పెద్ద కొండ దరికి చేరుకున్నా. దాన్ని దాటిపోవాలనుకున్నా గాని యెక్కే సరికే చాలి వచ్చేసింది. అక్కడే ఒక బండచాటున పొడిగా స్థలం చూచుకుని కాగితపుసంచులు పరిచేను. ఓ సంచిలో కాళ్ళు, మరోసంచిలో తలా దూర్చి, మరికొన్ని చించి పైన కప్పుకుని, గోధుమలసంచిని తలగడగా చేసుకుని నిద్రపోయేను. నిద్ర సుఖ మెరుగదుగదా!

నాకు మెలకువ వచ్చేసరికి బాగా తెల్లవారింది. వెలుగు వచ్చేసింది. గుడ్డల్లోంచి తేమ వంటికెక్కి యెముకల్నికూడా కటకట కొరికేస్తూంది. వాన వెలిసింది. కాని చలిగాలి మాత్రం కరిచేటట్లుంది. తలయెత్తి చూడ్డానుగదా ఆవలిప్రక్క పర్వత పాదాన పెద్ద సరోవరం, దాని యెడమవైపునుంచి కొండ చిలువలా రోడ్డూ కనిపించేయి.

రాత్రే కొండ దిగకపోవడం మంచిదే ఐంది. లేకపోతే కొంప మునిగేది. రాత్రి కొండ దిగి, సరస్తీరానికి చేరగానే, నీటిమీది ప్రకాశాన్నిబట్టి యెడమవైపున తీరం సమీపంలో వుందని కనిపెట్టి. ఆవైపు బోయివుండేవాణ్ణి. అటుబోతే రోడ్డుమీదికి చేరడం, అక్కడ యేరమ్యాన్ సైనికులో నన్ను చూసి పట్టుకోడం జరిగేవి.

సరే. ఇంతకూ యిప్పుడు నా దారి సరస్సుకి కుడివైపు నుంచే. కన్నుపారినంత మేరలో తీరం కనిపించడం లేదు. కాని, నేను అటు బోవాల్సిందే. అరణ్యాచ్ఛాదితమైన

ఆ పర్వతశిఖరాన పెనుబండ చాటున కూర్చుని, సరస్సు మీంచి ఆవలివైపు చూస్తూ, అక్కడ నాకేగతి పట్టనున్నదో యని ఆలోచిస్తూ కూర్చున్నాను. నీటిమట్టంమీంచి పెద్ద పెద్ద నల్లరాతికొండలు అలలుగా లేచివున్నాయి. ప్రతీ గుట్టమీదా దేవదారు, సరళవృక్షాలు వూచల్లా నిటారుగా నిలుచున్నాయి. ఎన్నో దశాబ్దాలుగా అవి అక్కడ నిల్చుని తమ వ్రేళ్ళను కొండ పగుళ్ళలోనికీ, కొనల్ని నీలాకాశంలోకీ నిగిడ్చి నిలిచి వున్నాయి.

ఆ బోడిబండలమీద వ్రేలూని పెరగడాని కవి యెంతో కష్టపడివుండాలి. రాళ్ళమీద జీవనదాత్రియైన రసం ఒక్క బొట్టూ లేదు. దట్టమైన రొట్టబట్టి బరువుగా వ్రేలాడే కొమ్మలతో వున్నవాటి ప్రకాండాల్ని పోషించడానికి ఆ వ్రేళ్లు యెంతో శ్రమబడివుండాలి. కాని, యెల్లాగో అవి వాటిని పోషించి వృద్ధిచేసినాయి. ఇప్పుడా బ్రహ్మాండమైన వృక్షాలు ఆకాశాన్నంటుతూ పర్వతాల్లాగే సుస్థిరమైపోయినాయి, ప్రతి రాతిబండా, గుట్టా, చెట్టూ పుట్టా, రెమ్మా కొమ్మా, ఆకూ అలరూ,- అన్నీ ప్రస్ఫుటంగా ఆ సరోవర స్వచ్ఛనీరములలో ప్రతిబింబిస్తూన్నాయి.

కేవలం సహనశక్తితోనే పాషాణశిలల్ని జయించి, జీవ విజయాన్ని నిరూపించిన వృక్షసంతతిని చూస్తే నా శరీరం పులకరిస్తుంది. ఎందు కంటారా? బోడిరాళ్ళమీద ప్రాణిజాతి వ్రేళ్లుపారి నిలద్రొక్కడం యెంత కష్టమో నాకు తెలుసు

భవమే గాదూ? జీవలోకం నల్లరాళ్ళతో పోరాడి జయించిన పుణ్యభూమి యిది! ఇట్టిచోటికికూడా వినాశాత్మకమైన యుద్ధాన్ని తెచ్చిపెట్టడం యెంత బుద్ధిహీనత! ఏమనుకుంటే యేం లాభం? అటువంటి మూర్ఖులకి యీ లోకంలో తక్కువ లేదు లెండి. ఈ కొండరాళ్ళ చాటున నిలబడి మావాళ్లు కొందరు టామీగన్‌లూ, ఫిరంగులూ కాలుస్తూ, రోడ్లమీద పోయే రష్యన్‌ల పటాలాల్ని చీకాకుపరచ యత్నించడం చూస్తే నాకు యెంతో బాధకలిగింది. ఈ నిర్భాగ్యులు తమ ప్రాణాలు వదలదలచుకొంటే మరో చోటు లేదూ? చెట్టూ చేమా లేని బోడికొండలు కావాల్సినన్ని వున్నాయామె! అక్కడ కొట్టుకుని చస్తే యేడ్చే వాడెవడు? బోడిరాళ్లు తుపాకిగుళ్ళకి చెల్లాచెదరై ఖండతుండాలుగా విరిగిపడితే విచారించేవాళ్లుండరు గదా, అంటా!

కానీ, అబ్బే! ఇదంతా ఆలోచించే వాడెవడండీ? మావాళ్లు యీ చెట్లతో పుల్లించి కాల్పులు ప్రారంభించడం, వీళ్ళకి బదులుగా రష్యన్‌లు రోడ్డుమీంచి కాల్చడం ఆరంభమైంది. షెల్లులు వర్షం కురుస్తున్నాయి. ప్రేలుళ్ళూ, పొగతో కొండలూ, అరణ్యం కప్పడిపోయింది. పెద్దపెద్ద దేవదారు వృక్షాలు ఒకక్షణంలో ధూమాచ్ఛాదితములై యుండి, మరుక్షణంలో మొదలు నరికినట్లు ఫెళఫెళమని విరిగి క్రిందికి దొర్లి పడేటప్పు డవి రాళ్ళకి కొట్టుకుని తుత్తినియలై పోతూన్నాయి.

కొండమీదినుంచి రష్యన్ భారీఫిరంగుల కాల్పు లంతకంతకు వుధృతం గాజొచ్చాయి. కొండగుట్టలమీది చెట్లతోపుల్ని షెల్లులు క్రమక్రమంగా తుడిచిపెట్టేస్తున్నాయి. వాళ్ళ కాల్పులకి సమాధానం యీయడానికి గుట్టల్లో దాగొన్న మా ఫిరంగిదళాలు ప్రయత్నిస్తూన్నాయి. ప్రేల్చినప్పుడల్లా ఫిరంగుల్లోంచి జిగేల్మని మంటలు వెలువడి ఫిరంగిస్థావరాల్ని బైట బెడుతూన్నాయి. మెషీన్ గన్ల నుంచి, టామీ గన్ల నుంచీ వెలువడుతూన్న చిరుమంటల మెరుపులతో కొండలన్నీ జ్వాలాతోరణాలు కట్టినట్లున్నాయి. పర్వతసానువులన్నీ ఆపాదశిఖరపర్యంతం ప్రేలుళ్ళతో నిరంతర ముఖరితమై పోతున్నాయి.

రష్యన్ ఫిరంగు లంతకంత కధికంగా మా తీరానున్న కొండలమీదికి షెల్లులు గుప్పిస్తూన్నాయి. సరోవరతీరమంతా ధూమజ్వాలలతోనూ, ప్రేలుడు శబ్దాలతోనూ సజీవమైవుంది. కొండలమీది చెట్లూ, బండలూ ఒక్కొక్కటే విరిగి, జారి, తునాతునకలై క్రింది అఖాతంలో పడిపోతున్నాయి.

కొంతసేపట్లో ఫిరంగిమోతలు నిలిచినాయి. గాలి వీచి కడపటి పొగచుట్టల్నికూడా ఎగరగొట్టి, కంటిచూపును విస్పష్టం చేస్తూంది. చూద్దునుగదా, పర్వతసానువులమీద సాంద్రంగా వున్న మహావృక్షాలు మటుమాయ మైపోయేయి. కొంచెంసేపటిక్రిందే ఆకాశంలోకి తల లెత్తుకుని సగర్వంగా నిలచిన చెట్లు యిప్పుడు మ్రోడువారిపోయినాయి. మ్రోడులూ,

శిథిలశాఖలూ, మాడిపోయిన ఆకులు, రొట్టా మాత్రమే యిప్పుడెక్కడెక్కడ కానవస్తాన్నాయి.

చూస్తూండగానే రష్యన్ కాల్బలాలు రోడ్డుమీదుగా కొండదిగువకి చీమలబారుల్లా మూగి, పైకెగబ్రాక నారంభించేయి. టామీ గన్‌లు, మెషిన్ గన్‌లు కొంతసేపు వాళ్ళని నిరోధించినా లాభం లేకపోయింది. అదంతా చివరికి యెల్లా ఆఖరైందో నేను చూడలేక నేపోయేను. యుద్ధరంగాని కంత కంతకూ దూరంగా సరోవరతీరాన్నే కుడివైపునబడి అరణ్యాంలోకి పరుగెత్తిపోయేను. ఆకలి దహించేస్తూంది. జేబులో కొంచెం గోధుమగింజలుమాత్రం వున్నాయి. అడవిలో తిన దగిన వేమీ లేవు. కాయలు, పళ్ళు, పుట్టకొక్కులు, దుంపలు, యేమీ వుండేరోజులు కావవి. ప్రకృతి ఫలభరితం కాడాని కింకా చాలావ్యవధి వుందాయె. కాని నేను అంతకంతకి అరణ్యాంలోనికే చొచ్చుకు పోసాగేను. మానవప్రపంచంకంటె ఆ దినాల్లో అరణ్యాలే వాసయోగ్య మనిపించేవి!

---

## ఇరవైమూడో ప్రకరణం - బందిఖానాలో

రష్యన్‌లను తప్పించుకుని మా ప్రాంతాల్లోకి చొచ్చుకుపోతూన్నానే గాని అడవిని మాత్రం విడువలేదు. అడవిలో నావంటి నిర్భాగ్యులు మరికొందరుకూడా నన్ను కలిసేరు. మేమందరం

యీ అడవిలోనే దాగోడానికీ, పిచ్చివాళ్లై పోయిన మానవుల నుంచి దూరంగానే వుండడానికీ నిశ్చయించుకున్నాం.

మా పరిభ్రమణంలో దొరికినవల్లా తిని కడుపుమంట చల్లార్చుకునేవాళ్ళం. అరణ్యంలో ఒకచోట నిర్జనకుటీరం కన బడింది. అక్కడ వెతుకగా మాళిగలో కొన్ని ఉర్లగడ్డలు దొరికేయి. ఎల్లాగో కాలక్షేపం చేయ నిశ్చయించుకున్న మాకు అవే పెన్నిధానంగా కనిపించేయి. కడుపు మాడితే గంజే పానకం అవుతుందంటారు గదా. మా స్వజనమే మమ్మల్ని వేటాడుతూన్నారాయె. కంచెయే చేను మేస్తుంటే చేసే దేముంటుంది? చివరకి ఓ రోజున వాళ్లు మమ్మల్ని పట్టు కోనే పట్టుకున్నారు. మాకు ఆకలే వేస్తూందో? దాహమే వేస్తూందో? అడిగినవాడు లేడు గాని పశువుల్లాగ మమ్మల్ని తోలుకుంటూ, యేకటాకీగా పాతిక మైళ్లు నడిపించుకుపోయి, కొనప్రాణాలతో వున్న మమ్మల్ని 'లాకప్' చేసేరు. ఆ ఖైదులో మాబోటిగాళ్లు యింకా డజన్లకొద్దీ వున్నారు, అప్పటికే. అందులో మేము చాలాకాలమే వున్నాం. సుహాసినీ లోనే, ఆమె నిర్భాగ్యపుత్రుడు లింత నిర్దయగా చూడబడతా రని నేను కలలోనైనా అనుకోలేదు. మాచేత యేనుగుల్లా పని చేయించుకుని, యెలకల్లా మేపేవాళ్లు, జైల్లో వుంచినన్ని రోజులూ!

శరీరంలోని ప్రాణరసం శోషించిపోతూ తిరిగి పూటుకో శండా వున్నపుడు నిత్యమూ చూస్తూ చేస్తూ, నిస్సహాయు

లంగా జీవించాల్సి రావడం చాల విచారకరం అనుకోండి. వసంత కాలపు సూర్యరశ్మి, ప్రకృతిసౌందర్యము, భూమాత సఫలతా, పాడిపంటల పుష్టి, యివేవీ నీకు గాదనే విషయాన్ని చూస్తూ, గ్రహిస్తూ ఉదాసీనులంగా వుండడం యెంత బాధా కరం!

నాకు పట్టిన యీ దుర్గతినిగూర్చి నా భార్య కేమీ తెలి యదు. నేను తెలుపనూ లేదు. నా గురించి ఆమె కష్టాల్లో జాబు రాయడంలో అర్థ మేమిటి? ఆమెను కంగారు పెట్ట డమూ, యింట్లో యే కాస్తో వున్నదాన్నంతనీ అడుగూ బొడుగూ వూడ్చి తెచ్చి నా కిచ్చేట్లు చేయడమూనా? నా నా కష్టాన్నిగురించి దానికి తెలియకపోడమే మంచిది. జరి గేదీ జరుగనీ! చివరదాకా మనోనిబ్బరం కనేగివుండేటట్లు చేయుమని ప్రార్థన చేసేవాణ్ణి. ధైర్యం కోల్పోకండా, బెం బేలు పడకండా వుండడానికి నిశ్చయించుకున్నా.

ఒకరినొకరు చూడ్డానికే మేము భయపడిపోయీా దశ వచ్చింది. మా స్వరూపాలు అల్లా తయారయేయి. వేళాకో ళాలు, నవ్వులు, స్నేహసంభాషణలు, హెచ్చరికగా వుండ డం,– మాయమైపోయే యనుకోండి, మమ్మ ల్నందరినీ నిర్బం ధించినది ఒకే నేరానికే. యుద్ధం చేయకండా పటాలంలోంచి పరుగెత్తివచ్చేము. ఐనా మాలో ఏకాభిప్రాయం గాని, సౌజన్యతా సౌమనస్యాలు గాని లేందే! మానవులు కష్టాల నెదుర్కోవాల్సివస్తే చాలు, వాళ్ళలోని స్నేహం యిట్టే

విరిగిపోతుంది. ప్రజలకి తిండి పెట్టకండా వుంచండి, కొద్ది దినాలు; అంతే, చాలు! వాళ్ళంతా ఒకళ్ళ నొకళ్ళు తినేసే ట్టు చూస్తారు. ఇదంతా యిప్పుడు తెలిసిందండీ, నాకు.'

కాని యుద్ధం ఆఖరైందీ అనే వార్త మాకు తెలిసిన రోజునమాత్రం మా చూపుల్లోని క్రౌర్యం కాస్త తగ్గిన ట్లని పించింది. ఆ రాత్రంతా మా మా కొయ్యచెక్కలమీదే మేనులు వాల్చి మాట్లాడుకుంటూ పండుకున్నాం.

'ఐతే చివరకి యుద్ధం ఆఖరైం దన్నమాట! కాని, మన మాటేమిటి?'

'మనకీ యుద్ధం ముగిసినట్టే. మన కెందుగ్గాదు ?'

'మన బలంలో మనకే నమ్మకం లేక... పారిపోయేం!'

'సరైన పని చేసేంరా! నమ్మకం ఎల్లా వుంటుంది? నమ్మడా నికి అసలందులో సరుకేమీ లేదని యిప్పుడు ఋజువైందిగా?'

'ఏమీ లేకపోవడ మేమిటోయ్? రష్యా సంధికి అంగీక రించిందా? లేదా? మనలో బలమే లేకపోతే రష్యా మనల్ని నేలని బెట్టి రాసి పారేసేది.'

'రష్యా అసలు యెవర్నీ నేలనిబెట్టి రాసెయ్యదురా-దాని తరహాయే వేరు!'

'సరే గాని, సునామీకి యుద్ధం ఆఖరైం దనుకో, మన సంగతేమిటి?......మనల్ని యింతలో వదలిపెట్ట రంటావా?'

'వదిలేస్తా రనుకుంటాను.'

'అఁహాఁ! వదలరు. మనం దేశద్రోహులం!'

'రష్యాకి అపచారం చేయలేదు గాదుట్రా?'

'ఐతే లాభ మేమిటి?'

'కిటుకు అందులోనే వుంది. రష్యా మహాబలం గలదిలేరా. మన పాలకులమీాద వత్తిడీ చేసి, యుద్ధం వలదన్న వాళ్ళ నందర్నీ ఖైదుల్లోంచి వదిలిపిస్తుంది. సంధి షరతుల్ని చూసేరు గదూ? మనవాళ్లూ వాటి కంగీకరించేరు. వీళ్ళని ఆ షరతులకి ఒప్పింపజేసిందెవ రనుకున్నారు?'

'ఔనులే! రష్యా బలాఢ్యమైనదే.....పెద్దరాజ్యమే లేరా!'

'రష్యా!......అబ్బో! మనకి దాన్నిగురించి యేం తెలుసురా? అసలు.'

'నిజమే! మనకేం తెలియదులేరా.'

'మన పొరుగునేవున్నా, మన కెప్పుడూ యే అపకారం చేయకపోయినా, మనం యిన్నాళ్లనుంచీ రష్యాని గూర్చి యెప్పుడూ దుష్ప్రచారమే చేస్తూవచ్చేం!'

'ఇప్పుడేనా రష్యాని గూర్చిన యదార్థం తెలుసుకోవాలిరా!'

'రష్యాని గురించిన యదార్థం గుర్తించేటట్లు జర్మన్లే చేసేరులే. ఇంకెందుకు గాకున్నా యిందుకేనా వాళ్ళకి మనం చేయెత్తి వందనం చెయ్యొచ్చు!'

'జర్మనీలా!...పిర్కిలీ!...ఆ వెధవల్లో ఒకణ్ణేనా పట్టుకో గలిగితేనా! నేలని బెట్టి రాసెయ్యాలి, లంజాకొడుకుల్ని!'

'అదే పోయిందిలేరా! యుద్ధం ఆఖరై, సంధి అయింది. గాని మన మాటేమిటంటూ? మనల్ని వదలి పెట్టేటట్లు చేయ గల దంటావా, రష్యా?'

'ఓ! దంచి కొట్టి! విడిపిస్తుందని చెప్తున్నా. జ్ఞాపకం వుంచుకో. రష్యాతో యుద్ధం వద్దని మనం అంటూనే వున్నాం గదరా. మన చర్యకే దాన్ని బుజువుచేసినాయి. రష్యా తన మిత్రుల్ని మరిచిపోదు, యెప్పుడూ!'

'మనమా? రష్యాకి మిత్రులం? ఫిన్నులకి రిస్సబోల్షివిక్కులు మిత్రులా? ఇదెప్పటినుంచిరా?'

ఈ కడపటి మాట లన్నది మరెవరూగాదు. నేనే. ఎవరో ఒకరు యీ విషయాన్ని చెప్పొద్దూ, మరి? ఇదే చేయకపోతే మేం యెల్లాంటి అధోగతికి దిగజారతామో ఆ భగవంతుడికే తెలియాలి. ఇంక వూరుకోలేక పోయేను. నన్ను తెలివి తక్కువవాడన్నా సరేగాని, పాతికేళ్లుగా మా సుయోమీ ప్రజలకి నిరంతరం చెవి నిల్లుకట్టుకుని నూరిపోస్తూన్న విషయాలు వున్నట్లుండి ఒక్కమాటుగా తుంగలో వూరదొక్క తలచుకొంటే తప్ప చెప్పకుండా యెల్లా వుండగలమో చెప్పండి? ఎవరో ఒకరు యీ విషయాన్ని చెప్పేతీరాలి. ఆ చెప్పేది నేనుగాకుండా మరొకరైతే వాడి మీదుగానే యీ పీడ వదలిపోను గాని నిమ్మకి నీరెత్తినట్లు అందరూ వూరుకో నేసరికే తెగించి నేనే అనేశాను.

వెంటనే నాకు సమాధానం వచ్చేసింది:

"సీ కెన్నెళ్లున్నాయిరా ? తెలివి తగులడినట్లే వుందిలే. రష్యాతో స్నేహమే మన సుహోమి ప్రజలకి శాంతిసౌఖ్యాల్ని సమకూర్చేది. రష్యాకి వ్యతిరేకంగా మన పాలకవర్గాలు యింతటివ్యతిరేకతను బహిరంగంగా చూపివుండకపోతే యీ పాతికేళ్లనుంచీ నువ్వు సుఖంగానే జీవించివుండేవాడివి! పంథొమ్మిదివందలనలభైలో గాని, యీసారి గాని యింతంతటి హాత్యాకాండలు జరిగేవి గావు. మన సరిహద్దులు యిప్పటికీ రాజాస్ కీ నదీతీరం వెంబడే వుండేవి. రష్యాకి పొరుగువాళ్లతో స్నేహంగా మెలగడం బాగానే తెలుసును, కాని అందుకు యివతలివాళ్లుకూడా అర్హులుగావద్దా ? తెలియనివాడవైతే వూరుకోవాలి గాని యెందుకురా అవాకులూ చెవాకులూను?'

ఇదీ వాళ్ళ వరస! నేను దీని కేజవాబూ యివ్వలేదు. ఎందుకంటారా? నేను నేనే గనక! పిర్కీలీ!......ఇంకోకలాగున ప్రవర్తిస్తానని యెల్లాగ అనుకుంటారు ? చుట్టూ జరిగే సంఘటనలన్నీ మనం చేసినవిగాదు గదండీ! జరిగే దేదో జరగనీండి.

నేనూరకున్నా వాళ్ళూరుకోరంటే.

'మన పాలకులు చేసిన దానికి ప్రతిఫలం చెల్లించిన దెవరు? మనము! అందులోనూ ఆ ప్రతిఫలం దిట్టంగానే చెల్లించేము. ఇప్పుడుకూడా వాళ్ళు తాము బైటపడకుండా యితరులను ముందుకి నెట్టి తాము తప్పుకుంటూనేవున్నారు! నాలి ముచ్చులు!'

మనం కళ్ళు తెరుచుకుని పరిస్థితుల్ని అర్థం చేసుకుంటూ ఉం డాలి. మనం రక్తం వోడ్చి, కన్నీరు గార్చి చెల్లించిన పరిహారాన్ని ఆ మర్యాదస్థుల దగ్గిర్నుంచి గూబలు పిండి వసూలు చెయ్యాలి!'

'ఓహోహో! చెప్పవైతివి! వాళ్ళదగ్గర్నుంచే వసూలు చేస్తావేం? బైలుదేరేవోయ్, మగాళ్ళు! ఇక్కడినుంచి ప్రాణాలతో బైట పడగలిగితే చూద్దాం లేరా!'

'రష్యా అనుకూలంగా వుంటే అన్నీ సాధ్యమే! మనం వాళ్ళతో స్నేహంగా వుంటే కొండలు పిండిగొట్టగలం!'

'ఔనులేరా! యుద్ధం ముగిసింది; సంధిపత్రంమీద సంతకాలైనాయి. ఎంతధర చెల్లించాల్సి వచ్చినా శాంతివల్ల మనకి లభించే సుఖసంతోషాలకేం కొదువరాదు! కాని, మనగతి యేమవుతుందో?'

'ఈతకు మిక్కిలి లోతేమిటి లే? ఇప్పుడనుభవిస్తూన్న దానికంటె అధోగతి యింకేమీరాదు. సంధిషరతులు మనం పాటించి నంతకాలం రష్యా మనకి సాయమే చేస్తుంది. కాని, మన పాలకులు...'

మధ్యలో నేను కలుగజేసుకుని అన్నాను.

గర్భశత్రువైన రిష్యానుంచి సాయాన్నపేక్షించడం మన స్వామీకి సిగ్గుచేటు!'

అనాల్సినమాట అనేశాను. ఈమాత్రం అనుకోకుండా మెల్లాగరా, భగవంతుడా! నోరు మెదపడానికే లేకపోతే మనం ఆఖరిలో లెక్క? మన గతేమవుతుంది!

'వాళ్ళు నన్ను తలబిరుసు' అన్నారు.

నేను పక్కమీదే వెల్లకిలా పడుకుని, కాళ్ళు వ్రేలాడ వైచి కన్ను లరమోడ్చి వూరుకున్నాను. ఏదో ఘనకార్యం చేసి, విశ్రాంతి తీసుకుంటూన్నవాడిలా ధీమాగానే అన్నా.

'పోండిరా! రిస్కా అంటే మీ గుండెల్లో రైళ్ళు పరుగెత్తు తున్నాయి! దద్దమ్మలు!'

కాని, వాళ్ళు వూరుకోలేదు. 'రష్యా, రష్యా, ఎంతసేపూ ఒకటే రష్యా! వాళ్ళ వాగుడు నాకేం లెఖ్ఖా పత్రమా? ఏనుగును చూసి కుక్కలు మొరుగుతే దానికేం?

పాతికేళ్ళుగా కల్యాగతమైపోయిన భావాలని వీళ్ళు యింత సులభంగా యెల్లా త్రోసిపారేశారో నాకు అవగాహన కానే లేదు. ఇదివరదాకా మా తెలివితక్కువ విట్లో ఒక్కడే యిటువంటిభావాల్ని వెలిబుచ్చుతూండేవాడు. అటువంటిది యిప్పుడు వీళ్ళందరి నోటమ్మటా యివే రావడం నాకు విచిత్రంగానే వుంది, చెప్పొద్దూ!

శాంతిసంధి ప్రకటించబడిన మొదటిరాత్రి యీ విధంగా గడిచింది. ఆ హాలులో గోడల దరినే బల్లలు ఒకదానిమీద ఒకటిగా రెండువరసలుగా అమర్చివున్నాయి. ఆ అరపలమీద పండుకునే లోతుగా పీక్కుపోయిన కళ్ళలోంచి మధ్యలో వ్రేలాడుతూన్న గ్రుడ్డిలాంతరువైపే చూస్తున్నాం, అందరం. ఒక్కడి ముఖానా కళాకాంతులూ, చిరునవ్వూ అన్నమాటే లేదు. ఎవడి నోటికి వచ్చింది వాడు మాట్లాడేస్తున్నాడంతే.

ఆ తర్వాత రోజూ యీ సంభాషణలే అంతూపొంతూ లేకండా జరుగుతూండేవి. కొన్ని వార్తలు పత్రికల్లో వచ్చేవి; మాలో కొందరికి భార్యలు చెల్లెళ్లు, తల్లులు యింటర్వ్యూలు చేసేవాళ్ళు. వాళ్ళనుంచి కొన్ని విశేషాలు మాకు అందుతూండేవి. మొత్తంమీద బైటినుంచి వచ్చే వార్తలూ, విశేషాలూకూడా జైళ్లో మాకిచ్చే దేవతాపులుసులాగే అతి ఆప్యాయంగా, ఆతురతగా దిగమింగుతూండేవాళ్ళం.

జర్మనీవాళ్ళింకా మా దేశంలోంచి వెళ్ళిపోలేదు. చేయాల్సిందింకేమీ లేకపోయినా వాళ్లు వెళ్ళదలుచుకోలేదులా వుంది! సహించరాని బాధలకి మమ్మల్ని గురిచేయడానికి వాళ్లు చేయాల్సిం దంతా చేసేరుగదా. ఇంకా యేం కావాలో వాళ్ళకి? శనిగ్రహంలా దాపురించేరు. మా ప్రాణాలికి. ఉత్తర భాగంలో మా దేశంలో కొంతభాగాన్ని వాళ్ళు ఆక్రమించుకూర్చున్నారనీ, వాళ్ళకీ, మా సైన్యాలకీ యుద్ధమే జరుగుతూందనీ ప్రజ లనుకుంటున్నారు. ఇది యెవరికీ విచారకారణంగా లేదు సరిగదా యిది చర్చించేటప్పుడు ప్రతివాడూ నిస్సంకోచంగా సంతోషాన్నే ప్రదర్శిస్తూన్నాడు. నిన్నటివరకూ ఓ ముడ్డినే డేకుతూ, మిత్రుల మనుకొన్నవాళ్ళ మధ్య వ్యవహారాలన్నీ చివర కిట్లా పరిణమించినా యన్నమాట! ఆశ్చర్యమేముంది? ఒకడు మరోడిమీద పెత్తనం చెలాయించుదామనుకొంటే యింకే మవుతుందండీ?

మా వాళ్ళు సంధిషరతుల్ని యెల్లా పాటిస్తున్నారో చూడ డానికి రష్యన్‌లు పంపిన కమిటీ హెల్సింకీ వచ్చింది. రష్యన్ ఖైదీల నందర్నీ విడిపించి వాళ్ళ దేశానికి పంపేస్తారనీ, రష్యా చేతుల్లో ఖైదీలుగావున్న మావాళ్ళీ నందర్నీకూడా వదిలేస్తా రనీ అందరూ అనుకుంటున్నారు. మంచిదే. కానియ్యండి. ఆవార్త వినడంతోనే నాగుండె కొట్టుకులాడింది, ఆనందంతో. మా విల్హోకూడ త్వరలోనే యింటికి వస్తా డన్నమాట! ఖైదీ లందరితో పాటే వాడూను. ఇంకోలా యెందు కవుతుంది? ఒక్కగా నొక్క తమ్ముడు! మా విల్హో! పిచ్చివాడు....

అక్టోబరుతో శీతకాలం ప్రవేశించింది. వానజల్లులు, చలి గాలులు, అంతకంతకి తీవ్రతరం అవుతున్నాయి. కాని, మేమింకా అదే గతిలో వున్నాము. దేశంలోని రాజకీయ ఖైదీలు విడుదలయేరనీ, రష్యన్ ఖైదీలు రైళ్ళకొద్దీ వైపురీ దిశగా పోతున్నారనీ వార్తలు వచ్చేయి.

ఈ వార్త లన్నీ నిజమే. దూరాన్నుంచి ఒక్కప్పుడు ఆ రైళ్ళని మా కళ్ళతోనే చూసేవాళ్ళం కూడాను. ఒకరోజున హాంకనియేమీ స్టేషను దగ్గర సైడింగులో గూడ్సు-పెట్టె ల్లోకి బాధులు యెక్కిస్తున్నాము. ఎదరవచ్చే ట్రెయిన్‌కి దారి వదలడానికి రష్యన్‌లతో నిండిన ట్రెయిన్ కూడా మా కెదురుగానే సైడింగులో ఆగింది. ఆరోజు వర్షం లేదు పైగా మంచి యెండ కాస్తూందికూడాను. రష్యన్‌లు ట్రెయిను లోంచి బిలబిల్లాడుతూ క్రిందికి దిగేరు. అప్పుడు మా కళ్ళతో వాళ్ళని దగ్గరగా చూసేం.

---

# దక్షిణపవనం

ఇరవైనాలుగో ప్రకరణం - బోల్షివిక్ లంటే ?

ఔను! అది చక్కగా యెండ కాస్తూన్న దినం. సైడింగులో ట్రెయిన్ ఆగింది; వాళ్ళంతా నవ్వుకుంటూ, వేళాకోళా లాడుతూ యెండలో గుంపులు గుంపులుగా చేరి కాచుకుంటూ న్నారు. వాళ్ళంతా యిళ్ళకి, రష్యాకి పోతూన్నారు. తమ దేశాన్ని నాశనం చేయాలని ప్రయత్నించిన వాళ్ళందర్నీ తుక్కురేగొట్టి మరీ పోతున్నారు! తామెందుకు నెగ్గేరో తెలుసుకోడానికి వీళ్ళు మళ్ళీ వస్తారా? ఏమో, ఆ విషయం వాళ్ళ కిప్పుడే తెలుసునేమో! మా ఖైదుక్యాంపుల్లో రెండు మూడేళ్ళు తిండిలేక మాడిపోయి నంతమాత్రాన్నే వీళ్ళు రష్యన్‌లు గాకండా పోతారా? ఇతరు లెవరికీ తెలియని సంగతులుకూడా తెలిసినవాళ్ళు వుంటారండీ, యీ ప్రపంచంలో...

ఆ ట్రెయినులో ఆడవాళ్ళు, పిల్లలతో సహా కుటుంబాలకు కుటుంబాలే వున్నాయి. వీళ్ళంతా ఖైదీక్యాంపులో మూడేళ్లు నానాపాట్లూ పడుతూ వున్నవాళ్లే. మేము ఆక్రమించిన ప్రాంతాల్లోని ప్రజలందర్నీ, ముసలీముతకా, ఆడామగా,

చిన్నా పెద్దా అనకండా పట్టుకునివచ్చి క్యాంపుల్లో పారేసేం. వాళ్ళని కోడిపిల్లల్లా మేపుతూ గుర్రాల్లా పనిచేయించేం. చావగా మిగిలినవాళ్లు ప్రాణాలతో మిగిలేరనుకోండి!

వాళ్లే యిప్పుడు ట్రెయినుచుట్టూ గుంపులుగా నిలబడి నవ్వుతూ సందడిగావున్నారు! ఓడలు బళ్ళూ, బళ్ళు ఓడలూ అవుతాయంటారు. యిదేలావుంది! పిల్లలటునిటు పరుగెత్తుతూ, కొత్తవాళ్ళ నందర్నీ కుతూహలదృష్టితో పరికిస్తూన్నారు. ఏమైనా పిల్లలు పిల్లలే గదా. కష్టసుఖాలు తెలియని కసుగందులు దేవుడితో సమానం అంటారు. ఒక రైలు పెట్టెలో అంతా మగాళ్ళే. వాళ్ళల్లో కొందరు ఆలోచిస్తూనూ, మరికొందరు యేవోకూనిరాగాలు తీస్తూనూ, యింకా కొందరు యెండవైపు తిరిగి చల్ది తింటూనూ కూర్చున్నారు. రొట్టె, వెన్న, నాక్కిలీసా తింటూ, ప్లాస్కుల్లోంచి యేదో పానీయాన్ని గ్లాసులో వొంపుకుని త్రాగుతూన్నారు, చాల మంది. వాళ్ళెవరో, ఎల్లా పట్టుబడ్డారో, యెక్కడివాళ్ళో, మన కవసరంలేదు. మొత్తంమీద వాళ్ళంతా రష్యనులు; దాని కర్థం వాళ్లంతా మా క్యాంపుల్లో సుఖంగా కాలక్షేపం చేయలేదన్నమాట!

ట్రెయినులోంచి దిగుతూనే వాళ్ళు మమ్మల్నిచూసేరు. మొదట్లో యే మాటామంతీ లేకండానే క్రీగంట మమ్మల్ని చూస్తున్నారు. ఏమైనా వాళ్ల శత్రువులమే గదండీ, మేము!

యుద్ధరంగంలో వాళ్లతో పోట్లాడిందీ మేమే; క్యాంపుల్లో మాడ్చి చంపినదీ మేమే. అల్లాంటప్పుడు వాళ్ళు మావైపు యెల్లా చూస్తారు ?

మేమూ వాళ్లవైపు దొంగచూపులు చూసేము. మా చూపుల్లోనూ యేమంతగా ఆప్యాయతా, మిత్రత్వమూ లేవులెండి. ఎవడి కడుపేనా ఆకలికి నకనకలాడుతూ, వట్టిది గావడంతో వుండ చుట్టేస్తూంటే, యెదురుగా మనొకడి ముఖబిలంలోకి రొట్టె, వెన్నా మాయమవుతూంటే, ఆనందం, నవ్వూ, మిత్రభావం యెల్లా కలుగుతవో చెప్పండి ? ఆ యా పరిస్థితులకీ, ఘట్టాలకీ అనుగుణ్యాంగానే గాదుటండీ మనలో వివిధరసావేశాలూ, భావాలూ జనిస్తాయి ?

మాకూ రష్యనులకూ మధ్యగా మా (గార్డు) కాపలా సైనికులు నిలబడివున్నారు. ప్లాట్‌ఫారంమీద వున్నాయి మేము మోయాల్సిన బాదులు. ప్రక్కనే నిలబడింది రష్యన్ల ట్రెయిను. అది వెళ్లేదాకా మేం పని నాపి నిలబడాల్సిందే. రష్యన్ల ట్రెయినుకి కూడా ఫిన్నిష్ సిపాయీలూ, సార్జెంట్లూ కాపలాగా వున్నారు. కాని, వాళ్ళు పొగత్రాగుతూ, అటునిటు తిరుగుతున్నారే గాని అంతగా కాపలా కాస్తున్నట్లే లేదు. అంచేతనే లావుంది వాళ్ళెవరూ మమ్మల్ని చూడవద్దని ఆటంకబరచ లేదు.

రష్యను ఒకడు, మాంచి దిట్టంగా వున్నాడులెండి, వాడు రొట్టె- వెన్న తినడం పూర్తిచేసి, కోటుమీదా, మోకాళ్ళ

మీాదా పడిన పిసర్లను మలుపుకుంటూ లేచి నిల్చున్నాడు. చేతిలో చిన్నమూట పట్టుకుని, వాళ్ళు విడుచుకుని తన సమీా పంలో వున్న మావాణ్ణి వుద్దేశించి తృప్తిపూర్ణస్వరంతో పలకరించేడు. ఫిన్నిష్ భాషకూడా అతడికి బాగా వచ్చినట్లే వుంది.

'మిన్స్ సీన్ నురుల్లీనెన్ ఓలెట్ !'

(నువ్వు అంతల్లా చిక్కిపోయి వున్నావేం ?)

అత డడిగింది అట్టో ఉక్కోనెన్ని. కాని వాడు వెంటనే జవా బీయలేదు. కుమ్మించి, దించుకుపోయిన దౌడలు వణకు తూంటే గురగుర లాడేడు:

'నామెత్ యిత్సీ' (నువ్వే చూడు)

ఆ రష్యన్ మావాణ్ణి యింకా పరకాయించి చూస్తూ మళ్ళీ అడిగేడు:

'ఓంకో నాల్కా వై మీాతా ?'

(నీకు ఆకలిగా వుందా యేమిటీ ?)

ఉక్కోనెన్ యీా ప్రశ్నకి సమాధాన మీాయలేదు. వాడి దౌడలుమాత్రం కదులుతూనేవున్నాయి.

ఆ రష్యను వున్నట్టుండి మూట విప్పి గుండ్రని రొట్టిలో సగంముక్క తీసి, మావాడివైపు వెళ్ళి అందించబోతూ వుంటే సార్జంటు అటకాయించేడు. అతగాడి చేతులో టామీా గన్ కూడా సిద్ధంగానే వుంది.

ఐ సా!' (ఇది కూడదు!)

అది చూసి యింకో యిద్దరు రష్యాన్ యువకులు ముందుకు వచ్చేరు. వాళ్ళలో ఒకడు అరిచేడు:

'హే! సువోమిక్ పోఉత్! మిస్కీ ఓలెట్టీ వాంగిట్టా?' (ఓ ఫిన్నిష్ పౌరులారా! మిమ్మల్ని ఎందుకు నిర్బంధించేరు?)

మా గుంపులోంచి యెవడో పలికేడు:

'ఐవన్ లై కా కిసిమిస్.' (వేరే అడగక్కరలేదు.)

ఈ మాటలు విని యింకా కొందరు రష్యనులు గుమిగూడి వచ్చేరు. మా కాపలాదార్లు కాల్చే సిగరెట్లు పారేసి, పూడా వుడిగా వాళ్ళ దారి కడ్డుగా నిలబడ్డారు. ఆఫీసరు వాన్ రీక్కీ కూడా వాళ్ళకి సాయంగా ముందుకు వచ్చి నిలబడ్డాడు. అతగాడు దిట్టంగా వెడల్పుగా నడగొండలా వుంటాడులెండి.

మొదటి రష్యను రొట్టెను మళ్లా జాచేడు. కాని వాన్ రీక్కీ హోల్స్టరు (పిస్తోలునుంచే తోలుసంచి) మీద చేయి వేస్తూ అరిచేడు:

'ఐ సా!' (ఇది కూడదు!)

రష్యన్ రొట్టె నందిస్తూన్న చేయి దించేడు. ఏం జరుగుతుందో నని ఆతురతతో చూస్తూన్నా రందరూ. అంతా నిశ్శబ్దం. పిల్లలుకూడా మాట్లాడడం లేదు. అంతలో యింకో రైలుపెట్టెలోంచి మహాకాయుడైన యింకో రష్యను దిగి ముందుకు వచ్చేడు. అతగాడి చేతులో కాగితం పేకెట్ ఒక

టుంది. వాడి స్వరం ఉరుముతూన్నట్లుంది. మా ఆఫీసరును గదమాయిస్తూ అన్నాడు:

'పొచెమ్యూ నియెట్? పొయిడెమ్ టెపెర్!'

(ఎందుకు కూడదు? దారిలో తప్పకో!)

ఒక్క త్రోపుతో వాడు వాన్ రీక్కేని ప్రక్కకి గెంటేసేడు. ఆ త్రోపుకు క్రిందపడినంత పనై మా ఆఫీసరు మెల్లాగో సంబాళించుకున్నాడు. ఆ రష్యన్ మహాకాయుడు ఏనుగులా నడుస్తూ మా గుంపు దరికి వచ్చేడు. మా వాళ్ళందరిలోకీ అతగాడికి శాస్త్ర అనింది నేనే. అందరికంటె పొడుగు నేనే అవటంవల్ల లెండి. అతడు చేతిలోని పేకెట్‌ను నావైపు జాచుతూ అన్నాడు:

'నీ! ఓతా వినా లా యిస్సెల్తా.'

'ఇదుగో! ఒక రష్యన్‌నుంచి దీన్ని తీసుకో.)

అతడి వెంబడే యితరులుకూడా ముందుకువచ్చి రొట్టెలూ సిగరెట్లూ మా కందరికీ యివ్వ నారంభించేరు. నా కందిచ్చిన పేకెట్‌ను నే నెందుకు వద్దనాలి? అసలే తిండిలేక, చాలక ప్రాణాలు కడంటుతూన్నాయికూడాను. అటువంటప్పుడు మక్ష స్ఫూర్తిగా యిచ్చిందాన్ని పుచ్చుకోకపోవడం తెలివితక్కువ గాదూ? ఆ రష్యన్‌తో నేనేమీ మాట్లాడనేలేదు. ఏం మాట్లాడగలను? కృతజ్ఞతాసూచకంగా తల పంకించాలనుకు న్నాను గాని తీరా అతడి ముఖంలోకి చూసేసరికి ఆ పనీ నావల్లగాక ఊరికే నోరు తెరుచుకుని చూస్తూ నిల్చుండిపో యేను!

అయ్యో! దేవుడా! నే నాతణ్ణి గుర్తుపట్టేను!...అతడే!... కాని, అతణ్ణి యింతకిముందు యెక్కడ చూసేనో నా కంఠంలో ప్రాణంవుండగా యెవరికీ చెప్ప ననుకోండి.

ఔను? వాడే వీడు! బరువైన పెద్దక్రిందిగాడ! నా ముక్కుకి వలెనే యెత్తిపెట్టుకున్న బూటులాంటి ముక్కు! నా ముక్కు కంటె కొంచెం పొట్టి దనుకోండి, కాని వీటిని నే నెక్కడున్నా గుర్తించగలను! చెక్కిళ్లుకొంచెంమాంసలమయివున్నా దౌడల స్వరూప మేమంత మారదుగా? ఇదిగాక నుదుటి పై భాగాన వాలుగా చిన్న గాయపుమచ్చ......

పొట్లాం చేతిలో పట్టుకునే అతనివైపు గుడ్లప్పగించి చూస్తూ మౌనంగా నిల్చున్నాను. మాట్లాడటాని కేముంది, గాకపోతే? అయ్యో! దేవుడా! అతడు నన్ను గుర్తుపట్ట లేదు గదా? ముమ్మాటికీ నేను కోరుకునేది అతడు నన్ను గుర్తించ కుండా వుండాలనే. గుర్తించే డనుకోను గాని వాని పిల్లికళ్ళల్లో యేదో జ్ఞాపకం చేసుకుంటున్నాడా? అన్నట్లు యేదో మెరిసింది. అతని పెదవులు నావైపు స్నేహపూర్వకంగా చిరునవ్వేయి. ఎదరనుంచి వచ్చే ట్రెయిను క్రైంయ్! మంటూ యీల వేసుకుంటూ మమ్మల్ని దాటి దడబడా పోయింది. అతని వైఖరి గంభీరమైంది; వెనుదిరిగి చూసేను.

స్టేషన్ మాస్టరు సిగ్నలు యిచ్చేడు. రష్యన్లంతా వాళ్ల పెట్టెల్లోకి యెక్కేసేరు. మహాకాయుడైన ఆ రష్యనుకూడ

అందరి వెనకా ట్రెయిన్ ఎక్కుతూ, వెనుదిరిగి సస్నేహంగా నావైపు చేయూపుతూ, సరియైన మాటకై తడువుకుంటూ ఫిన్నిష్ భాషలో అన్నాడు.

'నా కి మీన్!' (పునర్దర్శన పర్యంతం!)

---

ఇరవై ఐదో ప్రకరణం. — మా చెలిపి మందా!

రష్యన్‌ల ట్రెయిను వెళ్ళిపోయాక కూడా చాలా సేపు మేమందరం అక్కడే నిల్చున్నాము. ఎవడూ సూటిగా యింకొకడి కళ్ళలోకి చూడలేక అటూయిటూ కళ్ళు త్రిప్పేసుకుంటూన్నాం. మాలో ఒకడు నేలచూపులు చూస్తూనే కటువుగా విషాద స్వరంతో అన్నాడు.

'అదిగో! అదే నీ రిస్సా! చూసేవా?

వాడెంతో లజ్జిస్తూన్నట్లు వైఖరే చెబుతూంది. ఇంకొక బక్కవాడు వంగి, చేతులమీద ఆనుకుని చతికిలబడిపోయి, వెక్కివెక్కి యేడుపు ప్రారంభించేడు. వాడి వంట్లో యెముకలుతప్ప మరేమీ లేదు. వాడు శుష్కించిన మురికి వేళ్ళతో నాలుగు 'చెక్కముక్కలు' * పట్టుకున్నాడన్చని, కళ్ళమ్మట నీరు ధారాప్రవాహంగా కారుతూంటే అన్నాడు.

---

* పల్చని రొట్టెలు యెండి కొయ్యబారిపోతాయి. ఇవే సియాలకి రేషనుగా యిస్తారు. ఫిన్నులు వీటికి వ్యంగ్యంగా పెట్టిన పేరు 'చెక్కముక్కలు'

అయ్యో! నా పాపాలకి నిష్కృతిలేదు. ఓర్కీలీ! వాళ్ళ నిద్దర్ని చంపేను!...టామీగన్‌లు తీసుకుని నామీదికి పరుగెత్తుకుంటూ వచ్చేరు. నేను కొండల్లో దాగివున్నాను, మెషీన్‌గన్ కాలుస్తూ, హుర్రా! అని అరుస్తూ సరాసరిగా నావైపే వస్తూన్న వాళ్ళమీదికి ఒక రౌండు కాల్చేసేను. ఒకడొక్కడే పత్తిలా రాలేదు. రెండోవాడింకా వస్తూనే వున్నాడు. నామీదికి వచ్చిపడాలని వాడి యత్నంలావుంది. దెబ్బతగిలిందేమో వాడప్పటికే అటూయిటూ తూలిపోతూన్నాడు. ముందుకు రావడంకంటె వాడు ప్రక్కలకే తూలుతూన్నాడు. నిలబడ్డానికే శక్తి చాలకండా వున్న వాడిమీదికి మళ్ళీ కొన్ని రౌండ్లు కాల్చేను. చివరికి వాడూ క్రింద పడిపోయేడు......అయ్యో! దేవుడా!......ఈవేళ నాకు రొట్టినిచ్చినవాడు వాడి బంధువే గావచ్చునేమో? నాకు రొట్టినిచ్చినవాని సోదరుణ్ణే హత్య చేసేనా? హా! పాపిష్ఠివాణ్ణి!... నాకేం తెలుసు. అయ్యయ్యో! దౌర్భాగ్యులం, మనం. వొట్టి పశువులంరా!'

నాకిచ్చిన పొట్లంలో గుండ్రటిరొట్టి సగభాగం వుంది. దాని మధ్య సన్నని గాడిచేసి, వెన్న కుక్కేరుకూడాను. ఆ మహాకాయుని రేషన్ అయివుంటుం దిది! కాకపోతే ఎక్కడిదీ రొట్టి, అతడికి? తన రేషనంతా నాకిచ్చేసేడు! ప్రయాణం పూర్తయేదాకా వుంచుకోవాల్సిన రేషనంతా వాళ్లు మా

కిచ్చేసేరు, మే మెవరం? వాళ్ళ శత్రువులం. వాళ్ళని క్యాంపుల్లో పెట్టి, నానాహింసలూ పెడుతూ, తిండిపెట్టక మాడ్చి హింసించిన మాకు తమ తిండిని యిచ్చేసేరు! ఈ ప్రపంచంలో యిటువంటి మానవులుకూడా వున్నారన్నమాట. వాళ్ళని గూర్చి మా కెవరూ చెప్పనేలేదు! మా యిరుగుపొరుగునే యిటువంటి వాళ్ళుంటూంటే గుర్తించనేలేదు, మేము. ఎవరూ చెప్పకపోయిం తర్వాత తెలియదంటే ఆశ్చర్యమేముంది? అయ్యో! మా తెలివి మండా!.

---

## ఇరవై ఏడో ప్రకరణం - ఇంటికి చేరినాడు

ఇంటిదగ్గర నేనూ, విల్హెం టేబిలుముందు భోజనానికి కూర్చున్నప్పుడు నాకిదంతా గుర్తు కొచ్చింది. ఆ రోజున నేనూ, వాడూ కూడా పూర్తిగా త్రాగేము. యుద్ధకాలమంతట్లోనూ మెల్లా కూడబెట్టి వుంచిన ఐదుసీసాల ద్రాక్షసారాయాన్ని మాళిగలోంచి తెప్పించి, యిద్దరం వాటిని ఖాళీ చేసేసేము. ఇల్లాంటి శుభసమయానికై యెన్నిరోజులుగా కాచుకుని వున్నాము! అసలు మే మొకరి నొకరం మళ్ళీ చూసుకుంటామని అనుకోనేలేదు. కాని, భగవంతుడు కరుణామయుడు, అఘటనఘటనాసమర్థుడు. మేం మళ్లా కలుసుకున్నా మంటే అతని దయే కారణ మనుకోండి.

విశ్వోకంలో నేనే ముందుగా మాప్రాణు చేరేను. మా పాలకులు నన్నుల్ని అసలు వదలదలచుకో లేదట. గాని, రష్యన్ కమిటీవాళ్లు వదలితీరాలని పట్టుబట్టి నందున నే మేము విడుదలయినామనీ యెవరో అన్నారు. నిజమేమిటో నాకూ తెలియదు సుమండీ. నాకు యేమీ అర్థమే గావడంలేదు, యీ మధ్య. అయ్యో! దేవుడా! మేము యీ మధ్య విన్నవీ, చూసినవీ, అనుభవించినవీ అపూర్వమైనవి. అందుకనే యెవరేం చెప్పినా నమ్మే స్థితికి వచ్చేము. ఇటీవలిరోజులలో సుమా మీలో యెవణ్ణి చూసినా రష్యానిగూర్చి మాట్లాడేవారే. ఎక్కడ చూసినా బోల్షివిక్కుల్ని గూర్చిన చర్చలే. మా వాళ్ళలో చాలమందే రష్యన్ల నెరిగివున్నట్లు కనిపిస్తుంది. ఇంతకుముందే వాళ్ళతో బాగా పరిచయంవున్న వాళ్లలా మాట్లాడుతున్నారు! రష్యా గుణకీర్తనం యిప్పుడు కార్చిచ్చులా వ్యాపించడానికి కారణం మాత్రం నాకు బోధపడలేదు.

వీళ్లందరకీ యీ విషయాలింతకుముందే తెలిసివున్నట్లైతే యెందుకు మాట్లాడలేదు? యిన్నటివరకూ రిస్సా! రిస్సా! అని వాగిన నోళ్లతోనే యిప్పుడు వినాలైసెత్!* అని మర్యాదగా మాట్లాడుతూన్నా రెందుకని?

విడుదలైనాక నేను యింటికి చేరేసరికి సాయంత్రం ఐంది. అది శిశిరఋతువు. ప్రశాంతమైన చల్లని సాయంసమ

* 'రిస్సా' నిందావాచకమైనట్లే 'వినాలైసెత్' ఆనేదిగౌరవవాచకం. రష్యన్లనుగూర్చి ఫిన్నులు మాట్లాడే సందర్భాన్నిబట్టి యీ మాటల నుపయోగిస్తారు.

ద్యాన మావూరు చేరుకున్నా. ఇంట్లో బెంచీమీద కూర్చుని, వాళ్ల ముగ్గుర్నీ నా మోకాళ్ల మీద కూర్చోబెట్టుకుని, నా చేతులతో గట్టిగా కౌగలించుకుని, వాళ్ళ మెత్తని జుట్టును నా చెంపలతో తాకుతూ చాలసేపు మాట్లాడకుండానే వుండిపోయేను.

ఈ రెండేళ్లలోనూ పిల్లలిద్దరూ బాగా యెదిగేరు. ఇప్పుడిద్దరూ కలిసే బడికి వెడుతూన్నారు.

ఎల్సా కొంచం చిక్కినట్లు కనిపిస్తూంది. ఆమె చెక్కిళ్లలో కొంచం వాడుదనం గానవస్తూంది. ఐనా ఆమె ముఖంలోని గులాబిమెరుగులు, కళ్లలోని కొంటెచూపులు, నిండు పెదవుల్లోని మార్దవంయింకా యథాపూర్వంగానే వున్నాయి. అవి మళ్లీ యెక్కడ పోగొట్టుకుని, వాటికి దూరమవుతానో యన్నట్లు యెల్సా పెదవుల్ని నా పెదవులతోనూ, చెంపలతోనూ మాటిమాటికీ కొసరి కొసరి స్పృశిస్తూన్నాను. ఆమె నాకెంతో సన్నిహితమైనది, ప్రియాతిప్రియమైనదీను. ఎల్సా నాశరీరంలో భాగమేననికూడా చెప్పాలి. శరీరాలు విడిగా కనిపించినా, మాయిద్దరి ఆలోచనలూ, భావాలూ, కష్టసుఖాలూ, అన్నీ ఒకటే.

ఐతే యింతకాలాన్నుంచీ ఆమెకి ఒక్కజాబే నా యెందుకు రాయలేదంటారా? ఆమే యీ ప్రశ్నే అడిగింది కాని, అనవసరంగా ఆమెని నొప్పించడం, కంగారు పెట్టడం దేనికనే గాని మరోటి గాదు. కష్టాలు కలకాలం కాపురముండవంటారు, నిజమే. అదృష్టవశాత్తు మాకు మంచిదినాలు రానే

వచ్చేయి. ఈ సంసారయంసమయాన, యీ లోకంలోనాదీ అనుకోదగినదంతా నా వొడిలోనే, నా కౌగిట్లోనే వుందిగా! నేను జీవించినదీ, కష్టించినదీ, ఆశాసౌధాలు నిర్మించినదీ కూడ నా యీచిన్ని ప్రపంచం కోసమే, మరి, నా ఆనందం అంతా యిందులోనే వుంది!

నా వొడిలో కూర్చునే వెల్సా కృశించిపోయిన నా చెక్కిళ్ళని నిమురుతూ, నే నూరలేనప్పుడు జరిగినవిశేషాలన్నీ ఒక్కొక్కటే పూసగ్రుచ్చినట్లు చెప్పింది.

మా కామందుల మిల్లు భవనం కట్టుబడి పూర్తిగా వచ్చింది. వారిదొక పెద్దవ్యాపారం గాబోతూంది. దానికి కావాల్సిన ఎలెక్ట్రిక్ సప్లై అంతా కూడా స్వంతప్లాంటులోనే వుత్పత్తి చేస్తారట. ఈయన క్రీమరీ నొకదాన్ని కూడా స్థాపిస్తారు. అది పోస్హాజన్ పా క్రీమరీ కంటె చాలపెద్దది గాబోతూంది. అందులో సెపరేటరును యిప్పటికీ గుర్రంతోనే త్రిప్పుతూన్నాడు ఇప్పుడుకూడా కర్కమాకీ గోశాలలోని పాలన్నీ పోహాజన్ పా క్రీమరీకే పోతున్నాయి. ఎలియాస్ మునపటి లాగే పాలు తీసుకుపోడానికి మా కమతానికి వాళ్ల ట్రక్కు మీదే వస్తూన్నాడు. వాడందరికంటే ముందే యింటికి వచ్చేడుట, పట్నాలలోంచి. వచ్చి, తాను అడవుల్లనూ చిత్తడి నేలల్లోనూ, కొండల్లోనూ సిపాయిల్ని యెల్లా తరిమి తరిమి వేటాడేవాడో చెప్పుతూంటే విన్నవాళ్ళకి ఒళ్ళు జల్లుమనేదిట! వాడు యిప్పుడు బంగారపు పన్ను చేయించుకున్నాట్టకూడాను,

ఎలియాస్ నవ్వూతూంటే ఆడవాళ్లిప్పుడు మరీ యిదై పోతున్నారంటే ఆశ్చర్యమేముంది?

నేను మెల్లా నడిగేను:

'మిల్లు కట్టడాన్ని గురించి యేదో చెపుతున్నావు?'

ఆమె అందుకుని పూర్తిచేసింది:

'ఔను! కుర్కిమాకీ మిల్లు చాలపెద్దది కాబోతూంది. క్రీమరీకూడ 'విల్‌స్ట్రోమ్స్' లాగే పెద్దకంపెనీ అవుతుంది. కామందు అనడం, సుకోకిలా గ్రామం పాలన్నీను, ఆంత్తీ కొసోలా గోశాల పాలూకూడా మన క్రీమరీకే వస్తాయని. అంతేగాక మన కామందుకే యిప్పుడు పెద్ద ఆలమంద వుంది. ఈమధ్య మళ్ళా ఓ గోడిగనీ, నాలుగుపందుల్నీ, పన్నెండు గొర్రెల్నికూడా కొన్నారు. కోళ్ళగూళ్ళు పెద్దవి యేర్పాటు చేసేరు. రష్యన్ ఖైదీలు యీమధ్యనే గాదూ వెళ్ళిపోయేరు. తెలుసును కాదూ, ముందటేడు పొడుగునా రష్యా ఖైదీలే మన కామందుల మిల్లు కట్టుబడి, దుక్కులు, చల్లికలు, కలుపు తీతలు కోతలు నూర్పిళ్ళు,- ఒకటేమిటి? అన్ని పనులూ చేసేరు. మన పొలాల్లోంచి పోయిన కొండకాలువలు రెండూ కలపడానికికొండలోంచి గాడి కొట్టి, కాలవ దొలిచేరుకూడాను. రెంటినీ కలపడానికి యింకో కాస్త ముక్కమాత్రం తరవాయి వుండిపోయింది. రెండూ కలిస్తే ఆ ప్రవాహంనుంచి మిల్లు లన్నిటినీ త్రిప్పగల శక్తి పుడుతుందట! హెల్సింకీనుంచి విహాటోరీ వెంటబెట్టుకొచ్చిన యింజనీరూ యీ మాటే చెప్పేడుటలే.

ఆ రష్యన్ ఖైదీలకోసం యజమానికి యెంతో ఖర్చు కానే లేదు. ఒక్కొక్కడికి దినానికి నాలుగు నాక్కిలీపాలు, అర లిట్టరు (అర్ధశేరు సుమారు) మీగడతీసిన పాలూ యిచ్చేవారు. కోడిపిల్లలకి కూడా యీ తిండి చాలదు? పాపం! వాళ్ళు రేకు, కొయ్య, నారతోనూ రకరకాల పెట్టెలు, సజ్జలు, బరిణెలు, అలంకారవస్తువులు, పిల్లల ఆటవస్తువులు తయారు చేసి మన రైతుల కిచ్చి, ఉర్లగడ్డలు, రొట్టె, చేపలూ కొనుక్కొనేవాళ్ళు. లేకపోతే యెప్పుడో మాడిచావాల్సినవాళ్ళే. వాళ్ళు వెళ్ళిపోయేక యిప్పుడింక యింగ్రియర్ లున్నారులే. నాలుగు యింగ్రియన్ కుటుంబాల్ని విహ్టటోరీ తెచ్చేడు. వాళ్ళంతా పావోతోబాటు బారకీమ్లోనే వుంటున్నారు. కెర్తూ పెళ్ళిచేసుకుని వెళ్ళిపోయేక అందులో పావో ఒక్కడే వుంటున్నాడు. కెర్తూ వెళ్ళేముందు పని మరీ హెచ్చుగా వుండేది. మేము చెరి పదిహేనేసి ఆవుల్ని చూడాల్సివచ్చేది. తరువాత యింగ్రియన్లు వచ్చేరు. నాకు పని శాస్త్ర సులువైంది. ఇద్దరు ప్రౌఢలూ, ముగ్గురు పడుచులూ నాతోకూడా యిప్పుడు గోశాలలో పని చేస్తున్నారు. వాళ్ళ మగాళ్ళు పావోతో పనులు చేస్తారు. పావో చిత్రమైనవాడు! వాడికి చేతగాని పనే లేదు! అన్నిట్లోనూ వాడే. వాడి కిన్ని పనులు చేసేందుకు ఓపి కెక్కడిదో! కమ్మరం, వడ్రం, గొడారిపని, తాపీపని, గుర్రాలు చూడ్డం, పొలంపని,–ఒక టేమిటి? అన్నిట్లోనూ వుంటాడు. ఆదివారం మాత్రం యిప్పటికీ త్రాగు

తాడు. దగ్గుతూనే వున్నాడు, రోజు రోజుకీ కుంగిపోతూ న్నాడు, పాపం. పెద్దవాడైపోగానే ఘటే ఇప్పుడు పావోయే మేస్త్రీ. కాని, యింకెంత కాలం? ఈ గ్రీకులుకూడా వెళ్ళి పోతారట. హెల్సింకీనుంచి యెవరో రష్యన్ ప్రతినిధి వచ్చి వాళ్ళందర్నీ అడిగేడు. 'మీకు స్వదేశానికి, యిళ్ళకి పోవా లనుందా?' అని. వాళ్ళంతా యేకకంఠంతో 'మేం పోతాం!' 'మేం పోతాం!' అన్నారట. నిజమేలే. వాళ్ళందరికీ తమ యిళ్ళకి, గ్రామాలికి పోవాలని మహాతృప్తిగా వుంటే. నేనడుగుతును. ఆడాళ్లు నాతో అంటూండేవాళ్ళు, అస్తమానం. తమ గ్రామా లకి జోనిస్తారని విన్నప్పటినుంచీ వాళ్లు యెంతో సంతోషంగా వున్నారు. పాపం, కాదు మరి? అసలు వాళ్ళందరూ పీఠారీ ప్రాంతంలో యెక్కడో వుండేవాళ్ళట. వాళ్ళకి సొంత పొలా లుండేవిట. ఇక్కడ భూమి లిస్తామని తీసుకొచ్చేరు. మనకే లేవు గాని భూములు వాళ్ళ కెవడిస్తాడు? అంతా దగాయే. వాళ్ళ సంతోషం పట్టపగ్గాల్లేవనుకో, వెళ్ళిపోతున్నందుకు. అది చూసి నాక్కూడా యెంతో యిదిగా వుంది. వాళ్ళు రేపు ప్రొద్దుటే బైలుదేరతారు. ఎవరూ సాయంలేకండా గోశాల పనంతా నే నొకత్తెనే యింక యెల్లా సర్దుకుపోగలనో తెలియదు......'

'రేపు ప్రొద్దుటే?'

'ఔను! వాళ్లు వుదయమే బైలుదేర్తారు.'

మెల్లిగా వాళ్ళందర్నీ నా తొడలమీంచి క్రిందికి దించేను.

'ఇవాళ కింక పడుకుందాం. లేకపోతే తెల్లారగట్ల వెళ్ళి వాళ్ళని చూడ్డం పడదేమో?'

ఎల్సా ఆశ్చర్యంగా అంది.

'నాలుగురోజులు దాకా యెక్కడికీ వెళ్ళ ననవ్వూ! మరి యిప్పుడే అయిందీ!'

'ఊరికేనే, ఒక్కమాటల్లాపోయి వాళ్ళని చూసి వస్తా. అంతేలే.'

---

## ఇరవైయేడో ప్రకరణము - ఇంగ్రియన్‌లూ పోయేరు !

ఇంగ్రియన్‌లు ఆనాడు ప్రొద్దుటే నిజంగానే బైలుదేరి పోతూన్నారు. వాళ్ళ సామానంతా మూటలు గట్టి బండి మీద వేసి, నల్లటి బక్కగుర్రాన్ని పూన్చేరు. ప్రక్కనే రీసీసులు పట్టుకుని పావో నిలబడ్డాడు. పావో యెంతో చిక్కిపోయి, చిన్నవాడైనట్లు కనిపిస్తూన్నాడు. వాడి ముఖం మరీ చిన్నదైపోయింది. ప్రాతఃకాలపు చలికి వాడి ముఖం తెల్లనై వెలవెలబోతూన్నట్లుందికూడాను. శిశిరఋతువు ఆఖరు గా వచ్చింది. చివరి పండుటాకుల్ని దుళ్ళగొడుతూ సన్నటిగాలి వీస్తూంది. ఎటుచూసినా ప్రకృతి మోడువారి శూన్యంగా కనిపిస్తూంది. మంచుజడులు కురవడాని కింకా చాలరోజులు వ్యవధి వుంది. పావో కిప్పుడే చలిగా వున్నట్లుంది, ఘాఘ్టుగ్గాట్

చలికోటు తొడుక్కున్నాడు. ఆ మాత్రపు చలికే వాడి కళ్ళు నీరు గ్రమ్ముతూన్నాయి. పాపం! వాడిలో ప్రాణ మేదండీ?

నేను కనబడగానే వాడి కళ్లు సంతోషంతో మెరిసేయి. కళ్లచుట్టూ ముడుతలు మరింత ప్రోగుబడ్డాయి. పావో కోటుచేతిని పట్టుకుని వూపుతూ అన్నాను:

'ఎల్లా వున్నావురా, పావో?'

'బాగానే వున్నా' నంటూ వాడు నావైపు చూస్తూనే చిరునవ్వేడు. నేనూ చిరునవ్వుతూ ఒక్కమాటుండి అడిగేను:

'ఎక్కడికి బైలుదేరేవు?'

సామానుతో నిండిన బండిచుట్టూ యింగ్రియనులు కూడా వుడిగా సందడిగా తిరుగుతూన్నారు. వాళ్ళవైపు తల యెగ రేస్తూ పావో,-

'స్టేషన్‌కి' అన్నాడు.

వాళ్లలో ఒకళ్ళూ మంచి దుస్తుల్లో వున్నారని చెప్పలేము. చివరకి ఆడాళ్ళూ, పిల్లలూ ఐనా వంటినిండా బట్టలు వేసుకో లేదు. ఇంతకీ యీ రోజుల్లో మంచిబట్టలు కట్టుకోడం మా సువోమీలాంటి బీద దేశంలో యేపాటివాళ్ళకీ సాధ్యం గాదు లెండి. కాని, వాళ్ళు తమ దుస్తుల్నిగూర్చి అంతగా పట్టించు కున్నట్లే తోచదు. వాళ్లదృష్టి యెక్కడుందో గాని నన్ను చూడనుగూడా లేదు! నా జీవితంలో యింతవరకూ అనుభ వించని, ఆశించని ఆకర్షణీయజీవితపరిస్థితుల్ని వాళ్ళు వూహిం చుకుంటూండి వుండాలి.

ఇద్దరు పిల్లగాళ్లు అటునిటు పరుగెడుతూ, నా సమీపంలో చటుక్కున ఆగేరు. వాళ్లలో ఒకడు నన్ను చూసి—,

'ఎంత పెద్దాడో!' అన్నాడు.

ఈ మాటలు విని తిరిగి చూసేడు, నన్నని వయోధికుడొకడు. అతడు పొట్టి కోటు, రబ్బరు బూట్లు తొడుక్కొని వున్నాడు. నోట్లోంచి పైపు (పొగ పీల్చే గొట్టం) తీసి పట్టుకుని న న్నుద్దేశించి అన్నాడు:

'ఆ పెద్దమనిషి. కాస్త సాయం చేసినట్లైతే యీ మూట, బండిమీద...'

నేనూ సంతోషంగా ఆ పిండిబస్తాను అతని సాయంతో బండిమీదికి యెక్కించేను. ఏదో పలకరించాలిగదా అని—,

'రష్యాకు వెడుతున్నారా?' అన్నాను.

'ఔను! ఇళ్ళకి పోతున్నాం' జవా బిచ్చేడు, అతగాడు.

అంతట్లోకే వాని కళ్లు మళ్ళీ అంతకిపూర్వం మాదిరిగానే అన్యథాదృష్టితో యింకో లోకంలోకి చూస్తూన్నట్లు కనిపించేయి. నా మనస్సు చివుక్కుమంది. ఎల్లా వూరుకోగలనో చెప్పండి? అందుకని ప్రశ్నించేను:

'ఏం? ఇక్కడ మీకు బాగుండలేదా?'

అతడు మన పెక్కడో వుంచుకునే భుజాలు కుంచించుకుని వూరుకున్నాడు, యే జవాబూ యివ్వకండానే.

నేను అంతటితో వూరుకోలేదు.

'నేనైతే చచ్చినా వెళ్ళననుకో! అక్కడేముంది, బావు కోడానికి? అన్నీ సమిష్టి పొలాలే గాదూ? మా సమోవిూలో ఐతే నువ్వు సొంతానికి యిల్లూ వాకిలీ కొనుక్కోవచ్చు, పొలం బుట్రా సంపాదించుకోవచ్చు, యెంచక్కా...'

నా వెనకవైపు చీమతూన్న చప్పుడైంది. వెనకదిరిగి చూస్తే యెవరూ లేరు, పావోయే. వాడి కెందుకో నవ్వొచ్చి, పలకమారి వగ్గులోకి దిగి ఊరిశే చీదిపోస్తూన్నాడు. ఐనా వాడి కళ్ళలో సంతోషం ఛాయగాకూడా లేదేం?

ఆ యింగ్రియన్‌తో యింకా కొంచెంసేపు మాట్లాడినా, వాళ్ళ రష్యాలోకంటె మా సమోవిూలో పరిస్థితు లెంతో మెరుగని అతగాడిచేత ఒప్పించాలనే అంతసేపూ నా తాప త్రయం. ఇం తెందుకండీ? మా సమోవిూవంటి దేశం యిం కోటి యీ ప్రపంచంలోనే లేదు, ఆ మాటకొస్తే! అల్లాంటి దేశాన్ని వదలి పోతున్నారంటే వీళ్ళకి బుర్ర లేదని అర్థం. కాక, ఒకవేళ వాళ్ళు రష్యాయే బాగావుంటుం దని భావిం చడం లేదుగదా! కొంపదీసి. అల్లాగనక అనుకుంటూంటే వాళ్ళది తప్పేగాదు, తప్పున్నర! సందేహ మేమిటి? సమో విూనిగూర్చి వాళ్ళకి బాగా తెలియ దన్నమాట! మా పేప ర్లూ, మేగజైనులూ, పుస్తకాలూ యేవిూ వాళ్ళు చదవ లేదన్న మాట; మా రేడియో వినలేదన్న మాట; మా బడుల్లో పంతుళ్ళు, చెర్చిల్లో మతబోధకులూ నూరిపోసే వేవిూ వంటబట్టించుకో లేదన్నమాటే! సమోవిూ యెల్లా

టిదో గ్రహించాలంటే అవన్నీ చదివి, విని, జీర్ణం చేసుకోవా లండీ, మరి. కాని, ఏమో, అతగానికి మా దేశాన్నిగూర్చి అంతగా తెలుసుకోవాలనే లేదేమో? దీని తాతల్లాంటి దేశాలు యీ ప్రపంచంలో యెన్నో వున్నాయనుకుంటు న్నాడో? యేమో! ఐతే, యింక చాలు, మరి నన్ను చెప్ప నీండి. వాళ్ళు శుభ్రంగా పొరబాటు బడుతూన్నారనీ, టోకరా తినేసేరనీ ఢంకా బజాయించి చెప్పగలను! ఏమనుకున్నారో?

కాని, యెంతసేపూ నేను మాట్లాడ్డమే గాని వాళ్ళెవళ్లూ నాతో వాదన పెట్టుకోనే లేదు. ఆ పెద్దమనిషి వూరికే తల వూపుతూ, ఓ కంటితో నావైపు ఆశ్చర్యంగా చూస్తూ వుండి, సమయంచూసి నానుంచి తప్పించుకుపోయేడు! బండిమోకు బిగించాలట! ఏదో కారణమే దొరకదుటండీ. పగ్గం బిగించా లంటూ తప్పుకుని వెళ్ళిపోయేడు, ఆ పెద్దమనిషి!

అంతతో వదలిపెడితే నా యెక్కువేముంది? మా సంభా షణ ముగిసిందని నేను భావించలేదు సుమండీ. ఏర్పాట్లన్నీ పూర్తి గావించుకొని, వాళ్లు బైలుదేరబోతూంటే నేను మళ్లా అతని దగ్గిరికి వెళ్ళి పలకరించేను.

'మిత్రమా! సుఖప్రయాణం కలుగుగాక! నీ పేరేమిటి?' సెలవు తీసుకోబోతూన్నట్టు అన్నాను, యీ మాటలు.

అతడు నావైపు ఆశ్చర్యంగా చూస్తూ, జవా బిచ్చేడు:

'స్టెపాన్ కోటిలైనెన్. నీ పేరు?'

'ఐనారీ పీత్కానియేమీ. మీకు యీ ప్రయాణం శుభ ప్రాయకం అగుగాత యని ప్రార్థిస్తున్నా.'

'వందనాలు. సుఖంగానే చేరుకోగలమని ఆశిస్తా.'

ఇంగ్రియన్ లందరూ గుమిగూడి సామానుబండీ వెనకాలే నడుస్తూ, స్టేషన్‌కి వెళ్ళిపోయేరు. నా కెందుకనో ఆనందం కలిగింది, ఓ తమాషా ఆలోచన తట్టి!

'నా చేయి సంతోషంగా చాలన చేసినవాడొకడు యిప్పుడున్నాడు, రష్యాలో! అతడికి నా పేరూ, యింటిపేరూ కూడా తెలుసు. అతగాడు ఒకప్పుడు గాకపోతే మరో అప్పుడేనా నా పేరు తలచుకోకండా వుండడు!'

ఆ సంతోషంతో నా ముఖం విప్పారింది. నోట్లో నాలుక తృప్తిగా చకులించింది. ఏమిటో, నా అమాయకత్వం గాని రష్యాలో యెవడో నాగురించి తలుచుకుంటే నాకు ఒరిగిం దేమిటి? నా వొళ్లో యేమేనా పడుతుందా? ఏమేనేనా? ఏదో పిచ్చి. అల్లా అనిపిస్తుం దంతే......తమాషాగా వుంది. వయసు మళ్ళిన కొద్దీ నా మతి పోతూన్నట్లుంది!......ఆఁ! పోనిద్దూ. అందులో యేముంది కాని,......నాకు పరిచితుడైన వ్యక్తి ఒకడు రష్యాలోనూ వుంటాడు. అందులో నష్ట మేముంది? హ్హా! హ్హా! హ్హా! మునిగిపోయిందేమీ లేదుగా? రోడ్డు మలుపులో యింగ్రియనులు, గుర్రం–బండీ, రీనీనులు పట్టుకుని పక్కనే నడుస్తూన్న పావో, కనుమరుగై పోయే దాకా చూస్తూ అక్కడే నిల్చున్నా.

ఆ సమయాన్నే నాకు సమీపంలోనే యెవరో నడుస్తూన్నట్లై అటుచూద్దునుగదా, మరెవరూ లేరు. ప్రియదర్శిని

నియాతీ హిల్డా! కపిలవర్ణపు ఉన్నికోటు తొడుక్కుని సన్నని నడుముకు బిగుతైన పటకా పెట్టుకుంది. కోటుక్రింది పూల గౌను చెంగులు చిరుగాలి కటునిటు కొట్టుకొంటున్నాయి. భవంతి ముందున్న మంటపంలోంచి గబగబా నడిచి నావైపే వస్తోంది. ఎత్తైన బాట కిరుప్రక్కలా సరుగుడుచెట్లు వరుసలుగా సిపాయీల్లా నిలబడి గాలిలో తల లూపుతూన్నాయి. ఆమె తొందర కేదో కారణం వుండేవుంటుంది. కాని, నే నటు తిరిగి లేను. అటువంటప్పుడామె నంత పరీక్షగా చూచేటందుకవకాశ మెక్కడిది? నా దృష్టి అంతా యింగ్రియన్లమీదే వుంది. వాళ్ళవైపు టోపీ వూగిస్తూనే, వెనుదిరిగి చూడకండా మా యింటికేసి అంగలేస్తూ పోయేను.

గోశాల దాటి మలుపు తిరిగేక యెవరో పిలుస్తూన్నట్లు వినిపించింది.

'ఐనారీ! ఓ ఐనారీ!'

నన్ను పిలిచేది యేదో మగగొంతే. పరిచితమైనదిలాగే వుంది. రెండు మూడు సార్లు పిలిచేక తిరిగి చూద్దునుగదా, హెంగ్రా కుర్కిమాకీ! గోశాల వాకిలిదగ్గర నిల్చుని నన్ను రమ్మని చేయూవుతూన్నా డాయన. వెళ్ళాలా? వద్దా? అనే మీమాంసలో పడి ఒక్కక్షణం అల్లాగే నిలబడిపోయేను. ఆ రోజున పనిలోకి పోకూడ దనుకున్నానుగా? కాని, ఆయనగారే స్వయంగా నావైపు వస్తూండడం చూసి, నేనూ అటు నాలుగడుగులు వేసేను. ఎంతైనా ఆయన నా యజమాని!

ఆయనపట్ల నువ్వొక నతిక్రమించడం పెద్దనువిమిత్తరహా గాదు కదా? హెర్రా కుర్కి మాకీ యెంతో ప్రేమగా నా చేతిని పట్టుకుని, చాలన చేస్తూ అన్నారు.

'ఐతే ఆఖరికి నువ్వు తిరిగి వచ్చేవన్నమాట! నీకు నా స్వాగతం! సుఖంగా రాగలిగినందుకు ఆ భగవంతుడికి వెయ్యి దండాలు. కులాసాగా వున్నావుగదా? గాయాలేం తగల్లేదుగా?'

'లేదండి; మీ దయవల్ల కులాసాగానే వున్నా.'

'బాగుంది! చాలా భేషుగ్గా వుంది, సరే గాని పని యెప్పుడు ప్రారంభిస్తావు?'

ఆయనకేం జవాబివ్వాలో నాకే తెలియదు! బరువైమాతబడుతూన్న ఆయనగారి కనురెప్పలు, పొంగరించిన బుగ్గలూ చూస్తూ, యేమాటా మంతీ తోచక మౌనంగా నిల్చున్నా. ఈ రెండేళ్ళలోనూ ఆయన చెక్కిళ్ళు మరింత పుష్టి నొందింది, నునుపెక్కి, యెర్రబారినాయి! ఆయన శరీరం కూడా కొంచెం బలుపుదేరింది. ఒంటిమీద కొవ్వుపొర యేర్పడి, స్నిగ్ధమై బురఖా దిగేసినట్లు కనిపిస్తూంది, ఆయనగారిని చూస్తే! ఏం జవాబివ్వాలో తోచక నేలచూపులు చూస్తూ నిల్చున్న నన్ను ఆయనే అడిగేరు.

'ఏం, ఐవార్గీ! నువ్వు రేపు పనిలోకి రాగలవా? అల్లా చెయ్యి, చాలు, ఆ వెధవ రష్యన్లు వచ్చి యింగ్రియన్లని మన పనిలోంచి తీసుకుపోయేరు. ఆఁ! ఏమిటో, మహా! సన్నకల్లు దాస్తే పెళ్లి ఆగుతుందిట! నేనూ, నా భార్యా, హిల్డా,-

మేమే అన్ని పనులూ చేసుకుంటున్నాము. నీ పెళ్ళానికి సాయంగా యింకో యిద్దరు పనికత్తెలు వస్తున్నారులే. కాని, బోలెడంత పనాయె. ఈ పుంజీడు జనంతో యేమవుంది? ఐతే నువ్వు రేపు వస్తావుకదూ? ఓ రోజు విశ్రాంతి తీసుకుంటావా?'

అప్పటికీ నే నేం మాట్లాడలేదు. పదిమాటలకి ఒకమాటా జవాబీయక పోవడం మర్యాదకాదు, గాని యేం చెయ్యను? హెర్రా కుర్క్వినాకీ స్వరంలో అంత అనునయాన్నీ, మర్యాదనూ నాతో మాట్లాడే టప్పుడు యింతవర కెన్నడూ విన లేందే! అంచేత ఆశ్చర్యంతో నానోట మాటరాలే దంటే నమ్మండి!

అదీగాక నా మనసులో చాల బాధ కలిగింది. కనీసం నాలుగురోజులైనా విశ్రాంతి తీసుకోవా లనుకుంటినాయె. ఆదివారంలోగా యీ నాలుగురోజులూ యింటిదగ్గరే వుండి, ఆ పనీ యీ పనీ చక్కబెట్టుకుందా మనుకుంటూంటే యీాయనగారు జిడ్డులా పట్టుకున్నా రేమిటి? 'రేపు పనిలోకి వస్తావుగాదూ?' అని తగులుకుంటే యేం చేసే దంటా? సరే, మరి. అంతగా వస్తే రేపటి కూడుకుని యెల్లుండి వెడతాను, పనిలోకి.

నాలో నేను నిశ్చయించుకున్న దది. కాని, ఆ విషయం ఆయనతో చెప్పడం మరిచేపోయేను! దిక్కుమాలిన మతి మరుపు! ఏమాటా ఆడకండానే యింటివైపు బైలుదేరి, వడదు

గులు వేసేక గుర్తొచ్చి, చటుక్కున ఆగి వెనక్కి తిరిగి చూస్తే కామందు పాతేసినట్లు అక్కడే నిల్చుని, నావైపు మిడు మిడుతూ చూస్తూన్నాడు!

నా మొరటుదనానికి ఆయన యెంతో ఆశ్చర్యపడివుంటా కాని, యేం చెయ్యను? ఇంతదూరం వచ్చి, యిప్పుడు కే 'యెల్లుండి పనిలోకి వస్తా' ననడం మరీ అఘోరించి నట్ టుంది. అంచేత కిమ్మనకండా, బూటుకాళ్ళీడ్చుకుంటె ముందుకే సాగేను. నే నప్పుడింకా యెంతో బలహీనం వున్నాను. అంతలో అలుపు వచ్చేస్తూంది, ఎప్పుడూ ఆకలి కడుపులో యేదో వెలితిగా వుంటూంది. తిన్నావా? వున్నా అనేవాడు లేడుగాని...ఎందుకులెండి, కడుపు చించుకుం కాళ్ళమీద పడుతుంది...

---

ఇరవై యెనిమిదో ప్రకరణం – యుద్ధరక్మ

నా వొంట్లో యెంత నీరసంగా వున్నా లెక్కచెయ్యక రెండో నాడు పనిలోకి వెళ్ళేను, అనుకొన్నట్లే. అప్పు యజమాని నావైపు అత్యాశ్చర్యంగా చూసేడు. కాని, మారు ఆయన నావద్దకి రానూలేదు. కరచాలనం చేయ లేదు. నేను టోపీ తీసి 'తిర్వో'* అన్నప్పుడుమాత్రం ఆయ కూడ 'తిర్వో' అని ప్రత్యభివాదనం చేస్తూ అన్నారు:

---

*మనం 'దండాలు' అనో, 'నమస్తే' అనో అన్నట్లు.

'ఐతే చివరకి నువ్వు వచ్చే వన్నమాట! మంచిది! చాల మంచిది. పని ప్రారంభిద్దాం.'

కాని, అప్పుడుకూడా ఆయన కళ్లల్లో అనుమానం పూర్తిగా పోనేలేదు.

పటాలంలోంచి వచ్చేక పనిచేయడాని కదే మొదటిరోజు. ఆ దినం అంతగా పని సాగనేలేదు. ఏదో కొద్దిగా జరిగింది. మాళిగ శుభ్రపరచి, లోనంతా గడ్డి పరిచేను. అందులో ఉర్లగడ్డలు జాగ్రత్త బెడతారు. వచ్చే శీతకాలంలో మంచు నిలవచేయడానికని మంచుకొట్టునుకూడా బాగుచేసేను. అందులో కుళ్ళునీరు చేరి పాడుకంపు కొడుతూంది. ఆ నీరంతా తోడేసి, కడిగి ఆరబెట్టేను, మంచుకొట్టును. గోశాలలో పేడంతా ప్రోగులుబడివుంది. అదంతా పారతో కొట్టి, బైటికి మోసేసేను. ఆవులన్నీ పడుకోనేందుకు కొత్తగడ్డి పరవడం పూర్తిచేసి, పాతబండి మరామతు చేసేను. ఈయేడు వుర్లగడ్డలు వేసే పొలాలకి యీ బండితోనే పేడా పెంటా తోలాల్సివుంది లెండి. ఈ పొలాల్నే పెంట తోలేక దున్నాలి. అంతా బులికిపోయి పాడై వున్న పాతబండే అది. వెనకటిలాగే దాని కక్కడక్కడ చెక్కలు దగగొట్టి, మేకులు బిగించి మరామ్మతు చేసి సిద్ధపరచేను.

గుర్రాలసాలలోని చెత్తనంతనీ తీసేసి, మంచిగడ్డి వేసేను. గుర్రాల్నికూడా తోమి శుభ్రం చేసేను. పిల్లలుగాక పెద్దవే యేడు గుర్రాలున్నాయి, మా కామందుల కిప్పుడు. ఇంగ్రి

యుక్ లని స్టేషన్ కి తీసికెళ్ళిందే ఆ నల్లగుర్రం పేరు 'ముస్త లైనేక్.' 'జయంట్' వుండేదే అది చింతపిక్కలా బలిసి ముద్దొస్తూంటుంది. అది యెప్పుడూ ఒకచోట నిలబడకండా అటు యిటు సందడిగా గెంతుతూంటుంది! 'ఫ్రిస్కీ' కాలు నేలని మోపనే మోపదు! అదీ బాగాక్రొవ్వెక్కి, ఈగ వాలితే జారిపోయేట్లా వుండనుకోండి. దాన్ని బాగా దిగతోమిన తర్వాత బలిష్ఠమైన పృష్ఠంమీద తట్టుతూ చాలసేపక్కడే నిలబడిపోయేను. ముఖమల్ లా మెరిసే దాని వెచ్చని చర్మాన్ని స్పృశిస్తూంటే నాకెంతో సంతోషంగావుంది.

మనకీ ఓ గుర్రం స్వంతంగా వుంటే బాగానే వుంటుంది! కాని అదెంత బాగుంటుందో అందరికీ యెల్లా తెలుస్తుంది? ఆకలి యెరగని వాడికి అన్నం విలువ తెలియనట్లుగానే! ఇప్పుడు పాగలనిండా గుర్రాలున్న వాడికి విలువగాని, అవసరం గాని బోధపడదులెండి.

అబ్బే! ఆ రోజున యెంతో పని జరగనే లేదు. దుక్కిలో వున్న పావోకి కొంచెం ఖాళీ దొరికి నప్పుడు, యిద్దరం రెండు బళ్లు 'రై'* పనల్ని పాకలోకి తోలి, వాటిని అరపలమీద పరిచి, అడుగున కుంపట్లు పెట్టేం. వీటిని తెల్లవారగట్ల నాలు గింటికి వచ్చి దులపాలి. వాళ్లు తొందర బంగారంగానూ, యింగ్రియన్ లు నూర్పిళ్ళు పూర్తిచేయకండానే వెళ్ళిపోయేరు! అదంతా యిప్పుడు మేం పూర్తి చేసుకోవద్దూ? ఇంకా ఒకటి

* ఇదొకరకం ధాన్యం. గోధుమలు, బార్లీ జాతికి చెందిందే.

న్నర 'రై' కుప్పలు, గోధుమ రెండూ, ఓట్లు నాలుగూ కుప్పలు నూర్చాలిసివున్నాయి.

పొలాల్లో యింకా బోలెడు వుర్లగడ్డ వుండిపోయింది. కుర్కిమాకి అమ్మగారు, నియాతీ హిల్డా, మరో యిద్దరు పనికత్తెలతో కలిసి ఉర్లగడ్డ యేరుతూన్నారు, యిప్పుడు. ఈ పనికత్తెలే ప్రొద్దుటా, సాయంత్రం ఆవుల పాలుతీయడంలో మా యెల్సాకీ సాయపడుతూన్నారు.

మధ్యాహ్నం భోజనానికి యింటికి బోదాంరమ్మని యెల్సా పిలిచింది. కాని నేనే రానన్నాను. సాయంత్రం పెందరాళే యింటికి బోదామని నావుద్దేశం. అంచేతనే భోజనానికి రానన్నాను. నాలుగు నాక్కిలీపాలు, కక్కారం ముక్కలు (వేపిన మాంసం) పొద్దున్నే యెల్సా తెచ్చి, నా జేబులో కుక్కింది. వాటినే శాస్త్ర కాళీ దొరికి నప్పుడల్లా నములు తూన్నా. కానీ సాయంత్రం అయేసరికి నాకు మా చెడ్డ ఆకలి వేసింది. నీరసం అనిపించింది.

ఆ సాయంత్రం పావో, నేనూ వెళ్ళి కొత్తభవనాలన్నీ చూసేము. ఎంత పనిచేసేరు, రష్యన్ ఖైదీలు! పొడుగాటి రెండతస్థుల మేడ పూర్తయింది. ఇంకో దానికి సరిపడా యిటుకా, రాయీ, దూలాలూ నెట్లుపెట్టి సిద్ధంగావుంది. దీని కెదురుగానే ఓ పెద్దగోదాము, పెంకుటిదికూడా కట్టే సేరు. ఇంతపని యెప్పుడు, యెల్లా పూర్తిచేసేరు చెప్మా?

ఆ రెండుకొండకాలవలూ యెక్కడ కలుస్తాయోకూడా పావో నాకు చూపించేడు. డాము, రిజర్వాయరు యెక్కడ

కట్టాలో అదీ కనబరచేడు. కొత్తభవనాల్లోకి తీసుకెళ్ళి రెం డంతస్థులమీదా అన్ని సెక్షనులూ చూపించి, మిల్లుకూ, క్రీమరీకీ యే యే యంత్రా లెక్కడ బిగిస్తారో చెప్పేడు. యంత్రాలుమాత్రం యింకా యెదుటి గోదాం గదుల్లోనే వున్నాయి. వాటి కన్నిటికీ తాళాలు వేసి, చెవులన్నీ హెత్రా కుర్కీమాకీ దగ్గరనే వుంచుకుంటూంటారు. అందుచే యం త్రాల్ని కళ్ళారా చూసే అవకాశం నాకు లేకపోయింది.

ఐనా నేను చూసిందే వుంది జోలెడు! రాయి పరచిన నేల, గోడలు, సరంబీ, పైకప్పు,- యెంతపని జరిగింది! అక్కడక్కడ కొంచెం కొంచెం పై పూతలు, గిలాబా, సున్నపు పూతామాత్రం తరవాయి వుంది. క్రీమరీ పెట్టాల్సిన చోట మూడుగదుల్లో నేలంతా పాలగచ్చు చేయాలి; మీగడ చల్ల బరచడానికి రెండు పెద్ద మంచుతొట్లు కట్టాలి. ఛెర్న్, సెప రేటరులకి కాంక్రీటు పునాదులు వేసి, వాటిని బిగించాలి. ఎలక్ట్రిసిటీ ఛేంబరులో డైనమోకీ, మోటారుకీ వేరువేరుగా కాంక్రీటుతో పునాదులు నిర్మించాలికూడాను. సున్నపుపని బాపతు యిదే మిగిలివుంది.

కర్రపనికూడా కొంత తరువాయే. కిటికీలకి చట్రాలూ తలుపులూ కట్టాలి. ద్వారాల తలుపులూ, గడియలూ, గుబ్బలూకూడ పూర్తి చెయ్యాలి. పావో తీరుబడి సమయాల్లో అప్పుడే యీ పనులు చేస్తూనేవున్నాడుట! భవనానికి ఆఖరి అలంకారాలు పూర్తిచేసి, యంత్రాలు బిగించడాన్ని వచ్చే

వసంతంవరకూ హెన్రా కుర్కి మాకీ నిలిపివుంచేరుట. ఎందు కంటే అప్పటిదాకా స్పెషలిస్టులు (ప్రత్యేకపు నిపుణులు) దొరకటం అసంభవమని హెల్సింకీనుంచి ఆయన కొడుకు రాసేడట లెండి.

పని చాలవరకు అవనే ఐంది. దమ్మిడీ ఖర్చు లేకండా రష్యన్ యుద్ధఖైదీలచేత యిదంతా పూర్తి చేయించేసేరు. అంతా ఉచితార్థమే అనుకోండి. పోనీండి, మనకెందుకు? ఇంక యింటికి పోదా మనుకున్నాక పావోతో అన్నాను:

'ఇంక యింటికి బోతానురా, పావో! ఈవేళ కిది చాల్లే. ఇంకా మొదటిరోజే గదూ. లేకపోతే తెల్లారగట్ల మూడింటికి లేవలేనేమో.'

కాళ్ళీడ్చుకుంటూ, ఆకలితోనే యింటిదారి బట్టేను. మా యిల్లు అక్కడే, ఆ కొండమీదే, అల్లాగే, యే మార్పూ లేకండావుంది. కాదంటే కప్పూ, గోడలూ, బులికిపోయి, మరామతు కోరుతున్నాయి! యుద్ధాలు జరగనీండి, సంధులు జరగనీండి, మాబోటి సన్నకారునికి పోయేదే గాని కలిసివచ్చే దేముంది? మట్టిగడ్డ!

---

ఇరవై తొమ్మిదో ప్రకరణం. - ఇల్లాలి పొదుపరితనం.

ఏదో పేరుకి యిల్లుగాని మాదీ ఓ కొంపేనా? ఏదో నిల బెట్టేను కాని దానిలో సరు కేదండీ? దానికీ చెడ్డరోజులు వచ్చి పడ్డాయి, మరి. చెక్కగోడలమీది మెరుపురంగు బాగా

మాసిపోయింది. కట్టిన కొత్తలో వేసినరంగు. జడివానలకీ, మంచుముసుళ్ళకీ యెన్నిసార్లు తడిసిందో, గ్రీష్మకాలపు యెండల కెన్నిసార్లు యెండి, బీటలువారిందో, మళ్ళీ వర్ష ధారలూ, మంచూ యెన్నిమార్లు దాన్ని నాన్చిందో చెప్ప లేము. ఏయేటి కాయేడు మరామతు చేయడం మాటలా, నాబోటి వాడికి?

ఔను! ఇప్పుడు యెవరూ అనుకోరు, యీ నా కొండమీది కొంప యేదో దివ్యలోకంలోని సుందరకుటీరంలా వుండే దని! నల్లని బోడికొండమీద, పీడకలలాంటి యీ శిశిరఋతువులో, దిస్సపోయినట్లున్న యీ పాతకొంప యిప్పుడెవరికీ సంతో షాన్ని యిస్తుందని నేను నమ్మలేను.

ఆఁ! ఎందుకులెండి, యీమాత్రమూ తలదాచుకోడానికి లేనివా ళ్లెందరు లేరు? ఎక్కడి కక్కడికే సంతృప్తిపడాలి. ఆ సాయంత్రం భారంగా కాళ్ళీడ్చుకుంటూ కొండెక్కి యిల్లు చేరుకున్నా. యుద్ధానంతరం మొదటిరోజున ఆమాత్రం పనికే నేనెంతో అలసిపోయేను. లవ్రరీ, మార్థాలు టేబిలు దగ్గర కూర్చుని 'హోం వర్కు' (బడిపిల్లలు యింటివద్ద చేయాల్సిన అభ్యాసం) చేసుకుంటున్నారు. వాళ్ళప్రక్కనే బెంచిమీద కూర్చుని వాళ్ళ చిన్నిచేతులు చిన్ని నోటుబుక్కుల్లో అక్ష రాలూ, అంకెలూ రాయడం గమనిస్తూ వుండిపోయేను. నెగడి వెచ్చదనానికి కొంచెంసేపట్లో అల్లా కూర్చునివుండగానే కునుకు బట్టేసింది.

ఎల్సా నన్ను లేపిందాకా నేను లేవనేలేదు!

కిరోసిన్ దీపపు వత్తి హెచ్చిస్తూ పొయ్యి మంటబెట్టింది, ఎల్సా. నేనూ చేతులు వ్రేలాడేసుకుని కదలకండా కూర్చుని ఆమె కదలికల్ని పరికిస్తూన్నాను. నా పెళ్ళాం వుందే అది మా గట్టిపిల్లలెండి. ఎంత చాకిరీ చేయించినా, యెన్ని యిబ్బందులలోనైనా వంగి మెత్తబడిపోయే రకం గాదు. ఇంటి భారాన్ని, కుర్కుమాకీ గోశాలలోని చాకిరీనీ యీ మూడేళ్లు గానూ ఆమె ఒక్కర్తే మోసింది. పొయ్యివేడి ముఖానికి సగులగానే ఆమె చెక్కిళ్ళకి గులాబిరంగు ముసురుకుంటూ వచ్చేసింది. ఈ మూడేళ్ళలోనూ పిల్లల్నికూడా బాగానే సాకింది. పాలనురుగులాంటి తెల్లటి తలగడల్లో వాళ్ళ గులాబి ముఖాలు పండబారిన ఆపిలుపళ్ళలా వున్నాయి.

కేవలం నేనేమీ చేయలే దనుకోకండి. పటాలంలో నా జీతం రోజుకి పదహారు మార్కులేగదూ. నెల తిరిగేసరికి నాలుగువందల మార్కులూ యింటికి పంపేసేవాణ్ణి. యుద్ధకాలపు ధరవరల్లో యీ మొత్తం యేమంత పెద్దదికాదు గాని పెద్దమ్మని మా యింటి ఛాయలనుంచి దూరంగా వుంచడానికిది యెంతో సాయపడింది.

తననే వెంటాడిస్తూన్న నా చూపుల్ని కనిపెట్టి యెల్సా నవ్వింది. కొంటెగా చూస్తూ అందిగదా

'అల్లా నీరసంగా వున్నావేం? నిన్ను నిముషంలో హుషార్ చేయగలను. ఏం? చెయ్యమంటావా?'

పొయ్యిమీద బాణలి పెట్టి, మాంసంముక్కలు దాంట్లో పడేసి, నన్ను సమీపించిం దామె. నేనామెను నా మోకాళ్ళ మీద కూర్చోబెట్టుకుని, ఏమి చెబుతుందోనని ఆమెవైపే చూస్తున్నాను. కృశించిన నా రెండుచెక్కిళ్ళనూ రెండుచేతులా నిమురుతూ యెల్సా నా చెవిలో రహస్యం చెప్పింది.

'మన పని అంత దివాలాగా వుందనుకోకు. ఎనిమిదిన్నర వేల మార్కులు దాచివుంచేను! తెలిసిందా?'

'ఎల్సా! ఆఁ!'

ఆశ్చర్యంతో ఆమెవంక తెల్లబోయి చూస్తూ వుండి పోయేను. ఆమె యింకా చెప్పింది:

'ఏడువేలకి ఆవును కొందాము. అప్పుడే ఓ మంచి ఆవుని చూసి వుంచేనులే!'

'ఐతే, ఎల్సా! యింత డబ్బెక్కడిది?'

ఆమె యింకాదగ్గిరిగా సర్దుకుని కూర్చుంటూ అంది:

'పిచ్చి! నీకేం తెలియదు! మూడేళ్ళనించీ నీ జీతం రాలేదూ? అదంతా మిగల్చలేకపోయేను గాని లేకపోతేనా!'

ఇదన్నమాట వ్యవహారం! ఇల్లాంటి యిల్లాలి నేమి చేయాలో చెప్పండి! ఆ దఫామాత్రం నేనామెని యింటి అటుక నంటుకునేలా యెగరేయలేక పోయేను. ఏం చేస్తాను? ఆ రోజున నేను బాగా అలిసిపోయేను. అదీగాక నా నీరసం

ఇంకా వదలనేలేదు. చేతుల్లో దాన్ని ఎత్తుకుని, గట్టిగా కౌగలించుకుని ఇంట్లోనే అటునిటు త్రిప్పుతూ, ఆమె పెదవులమీద ముద్దులవర్షం కురిపించి ఉక్కిరిబిక్కిరి చేసేసేను. పొయిమీది మాంసం మాడిపోనారంభించేక గాని ఆమెని నేను వదలనే లేదనుకోండి.

ఆడదీ అంటే గృహదీపం అనుకోండి! ఏ పేదకొంపకైనా ఆడదే ఆనందాన్ని తేగలదు. సందేహ మేమిటుంటా? గాఢాంధకారమయమై, గడగడ లాడించే చలికాలపు దినాల్ని కూడా స్త్రీ తలచుకొంటే వెలుతురుతోనూ, వెచ్చదనంతోనూ నింపగలదు. నారీజాతి నీశ్వరు డాశీర్వదించుగాక!

నా జీతపుడబ్బును ముట్టకుండా దాచడానికి ఆమె యెంత కష్టపడింది! ఆ తెల్లవారగట్ల కొట్టుడుయంత్రాన్ని త్రిప్పేటప్పుడే నేనామె కష్టాన్ని సరిగ్గా గ్రహించగలేను! మోసేవాడికే తెలుస్తుంది కాదుటండీ, కావడి బరువు.

---

## ముప్ఫయ్యో ప్రకరణం. — మా ఆవు.

చివరికి ఆవుని కొన్నాం, నా చిరకాలవాంఛితం నెరవేరింది. ఇక ముందు కుర్కిమాకీ అమ్మగారిదగ్గర కాతామీద పాలూ, వెన్న తీసుకోవాల్సిన అవసరం తప్పిం దన్నమాట. మా సొంత ఆవే వుంది అన్నిటికీ, యిప్పుడు! ఎటొచ్చీ యింక షాకా, షేతా అమర్చాలనుకోండి. షెడ్ గోడలకి చెక్కలు,

కప్పడానికి రేకు కొనడానికి మా దగ్గరున్న సొమ్ము సరిపడ వచ్చు. పనిచేసి తీరుమానం చేసుకునే పద్ధతిమీద మా కామందులదగ్గరే గడ్డి తెస్తాను. పోతే షెడ్ దిగ్గొట్టడానికి మేకులుకూడా ఆయనదగ్గరే కాతాలో తెస్తాను.

ఇంకా కొన్నివస్తువు లత్యవసరంగా తెచ్చుకొనే తీరాలి. వాటికిమాత్రం డబ్బెక్కడకూర్చుంది గనక? అంచేత అవి కూడా పనిచేసి తీర్చుకునే షరతుమీద హెంర్రా కుర్కిమాకీ గారి దగ్గరే తెచ్చుకోవాలి. ఎల్సా చలికోటు బాగా పాతదై పోయింది. అసలు మా యెల్సా యీ ప్రపంచంలోకంతకీ మంచికోటు ధరించాల్సిన మనిషి! కాని యేం చేస్తాం? కొత్త కోటుకు సరిపడా అమ్మగారిదగ్గరే కొంతగుడ్డ తీసుకున్నా. అది ప్రపంచంలో కల్లా మంచిగుడ్డ అనను గాని యేదో బాగానే వుంది లెండి.

పిల్లలిద్దరి కోట్లుకూడ చిరిగేపోయేయి. కాని యిప్పటి మటుకు వాళ్ల పాతకోట్లే చించి మళ్ళీ కుట్టించవచ్చును. ఇంక యెటొచ్చీ బూట్లకి తోలు ఆయనగారి దగ్గరే తీసుకోవాలి. శీతకాలపు వాడకానికి మొకాసిన్‌లు * కూడా యజమానిదగ్గరే తీసుకున్నా. ఇందులో నేంది తప్పేకుందో చెప్పండి?

* శీతలదేశాల్లో మంచుకి బూట్లు చెడకండా వాటిమీద ధరించే పైబూట్లు. వీటిని మెత్తని చర్మంతో తయారుచేస్తారు.

కుర్కీ_మాకీల యింటవున్న వస్తువు లెన్నని చెప్పనుః నీకేది కావాలన్నా వాళ్ళింట సిద్ధంగా వుంటుంది. ఎటొచ్చీ ధరలు మాత్రం రోజుల్నిబట్టి హెచ్చుగావున్నాయి. నా కూలికూడా వస్తువుల ధరలనుబట్టి పెరిగితే యిబ్బంది లేకపోవును. కాని అది జరగలేదు. అందుచేత నేను తీసుకున్న యీ కొద్దిపాటి వస్తువులకైన బాకీతీర్చడానికే పంధొమ్మిదివందల నలభై ఐదు మధ్యభాగంవరకూ వారింట పని చేయాల్సివస్తుంది!

అంతేగాదు. ఇంటిబాకీ కోసం యేటా చేయాల్సిన పని గతమూడేళ్లనుంచీ చెయ్యనేలేదు. లెక్కలు కడితే మూడేళ్ళకీ మూణ్ణెల్లూ, యీ యేటి కొకనెలా వెరశి నాలుగు నెలలూ పనిచెయాలి. ఉర్లగడ్డలు, కట్టెలు, ఆవుగడ్డి, గృహోపకరణాలు, యితర చిల్లరమల్లరలు,- అన్నీ ఆయన దగ్గరే తీసుకోవాలి. వీటి కన్నింటికీ చూస్తే పందొమ్మిది వందల నలభై ఐదంతాను, నలభై ఆరు ప్రారంభంలోనూకూడా ఊరిఖేసే పనిచేయాలి. 1946కి మళ్ళీ యిరవై దినాలు యింటి బాకీకి పని చేయాల్సిందేగదా. ఇవీ పరిస్థితులు.

దీనికితోడు నేనిప్పుడు యిట్టే అలిసిపోతున్నా. నన్ను మళ్ళీ యథాపూర్వంగా తయారుచేయాలని యెల్సా మహా తంటాలు పడుతూంది. కాని, యింట్లోవున్న మాంసం కాస్తా అయిపోయాదాకా నాకే పెడతానని ఆమె అంటే ఒప్పుకునే వాణ్ణి గాదు! పాలుంటే చాలు. నా బలం తిరిగి వస్తుంది. మెల్లిగా నా మొముకలమీద కాస్త కండా బట్టింది; నా

బలమూ దానితో బాటే కోలుకుంటూవచ్చేను, కొద్దిరోజులలోనే.

ఆవుకి షెడ్ వేయడం నాకో విషమసమస్య ఐపోయిందనుకోండి. ఉన్న బల్లచెక్కల్లోంచి యేవో పాతికదాకా మిగిల్చి మరుగుదొడ్డి కట్టాలనుకుంటూ. అంచేత షెడ్ గోడల్ని రాళ్ళతోనే కట్టాలి, మరి. అంతదాకా కొండ నానుకునే నాలుగు రాటలు పాతి చిన్నగూడు వేసి, దానిక్రింద ఆవును కట్టేస్తున్నాను. రాళ్లు యిక్కడ చౌకగా దొరుకుతాయి. తలక్రింద కొండ పెట్టుకుని రాళ్ళకోసం వెతుక్కోవాలా? దమ్మిడీ ఖర్చులేకండా కావలసినన్ని రాళ్ళు! చుట్టూ గుట్టగుట్టలు! పోతే యిక అడుసుమట్టికికూడా చిల్లిగవ్వ చెల్లించ నవసరంలేదు.

పనిమాత్రం ఆదివారాల్లోనే చేసుకోవాలి. ఒంటరిగాణ్ణి. గోడలు పైకిలేస్తూన్నకొద్దీ రాళ్ళు యెత్తడం మరింత కష్టం అవుతూంది. అన్నిటికీ పైవరస మరీ కష్టసమస్యగా పరిణమించింది. ఆ దినం వర్షం కురుస్తూంది. బట్టలన్నీ తడిసి, వళ్ళంతా బురదతో, రాళ్ళని వాలుచెక్కమీంచి గోడమీదికి దొర్లిస్తూన్నా. ఓ పెద్దరాయి, ఆరేడుమణుగుల బరువుది పైనుంచి జారిపడబోయింది. చెక్క జారిపోయిందేమో రాయంతా నా చేతులమీదే అనుకుంది. రాయి ఒకప్రక్కమాత్రం గోడచివర మోసింది. అదృష్టవశాత్తూ ఆ స్థలంలో అడుసు దట్టంగా పోసివుంచేను గనక సరిపోయిం దనుకోండి, నా

యావచ్ఛక్తినీ వుపయోగించి నెట్టేను, రాయి వెళ్ళి దాని చోట అది పడింది. లేకపోతే యేమయేదో చెప్పలేను!

గండం గడిచింది కాని నా పని ఐపోయింది. నిలుచోడాని కేనా త్రాణలేక అక్కడే రాళ్ళగుట్టమీద చతికిలబడిపోయేను. చేతులు వణకుతున్నాయి. ఒక్క చేతులే యేమిటి? వళ్ళంతా కంపిస్తూంది. నోరు తెరిచిపెట్టుకుని, నోటితోనే గట్టిగా ఊపిరి పీలుస్తూన్నా. జడివాన నన్ను మోదుతూనే వుంది. అనాచ్ఛాదితమైన నా చేతులమీదినుంచి వర్షపునీరు ధారలుకట్టి కారుతూంది. ఉత్తరపు దిశనుంచి చలిగాలి నా ముఖాన్ని తిమ్మిరెక్కిస్తూ కొడుతూంది.

నిరంతరం కష్టం చెయ్యడంచేత వుక్కుతీగల్లా తయారైన నా కండరాలు చేతులమీద పెనవైచుకుని స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఇరవై యేళ్ళక్రిందట నా కండరాలింత స్పష్టంగా పైకి కనిపించేవిగాదు. యౌవనదశలో చర్మంక్రింద పల్చని కొవ్వుపొర యేర్పడి, కండరాల్ని గానరాకండా చేసి, స్నిగ్ధత్వాన్నిస్తుంది. పడుచువాళ్ళలో దాన్నే లావణ్యం అంటారు. ఇప్పటికి పాతికముప్ఫై యేళ్ళుగా నా బాహువుల్లోంచి యెంతో బలం బైటికి ప్రవహించిపోతూనే వుందాయె. అల్లాంటప్పుడు నా కండలు పైకి కానవచ్చేయంటే ఆశ్చర్యపడాల్సిందేముంది?

గాలీ, వానా నా ముఖాన చపేటాలిస్తున్నాయని చెప్పేను గదూ: ఎదురుగా క్రిందికిచూస్తే కనుచూపుమేర లోయ

వ్యాపించివుంది. లోయని చీల్చుకుని యెన్నో కొండకాలువలు ప్రవహించివచ్చి మధ్యలో పెద్ద సెలయేరుగా యేర్పడుతూ న్నాయి. సానువులమీద సెలయేటి కిరుప్రక్కలా పచ్చని పొలాలు కనులపండువు గావిస్తూన్నాయి. ఈ పొలాలమధ్య తిన్నని బోదెలు తీసేరు. ఎక్కువగా వున్న నీరంతా యీ బోదెల్లోంచి కొండకాలువల్లోకీ, వాటిలోంచి సెలయేటిలోకీ పోతుంది. ఏటిదరి నిరుప్రక్కలా ముంపుబీళ్ళు సస్యలక్ష్మి చీర కుచ్చిళ్ళలా వున్నాయి. సుమారంగా యీ దృశ్యం వ్యాపించి, అరణ్యాచ్ఛాదితపర్వతపంక్తుల మధ్య అదృశ్యమైపోతూంది.

ముప్ఫైయేళ్ళ క్రితం మాట! చిన్నపిల్లడుగా వుండగానే హెంర్రా కుర్కిమాకీ కమతంలో పనికి కుదిరేను. అప్పటి కీప్రాంతమంతా అడవులూ, చిత్తడినేలలూను. వాటిల్లోనే యిప్పుడు రైధాన్యమూ, ఉర్లగడ్డలూ పైరవుతూన్నాయి. అడవులూ, చిత్తడినేలలూ పంటపొలాలుగా మారాలంటే మాటలా? తండ్రిగారినుంచే యీ అడవులన్నీ యీాయనకి సంక్రమించేయట. ఆయనకి దీన్ని సాగులోకి తెచ్చే వ్యవధే లేకపోయింది. కాని దొరికినంతా చౌకధరల్లో కొనేసీ, గదిమి కలుపుకునీ తన కుమారుని కిచ్చి చనిపోయేడుట. ఈయన క్రమక్రమంగా పోడుకొట్టి సాగులోకి తెచ్చేరు, యీ భూము లన్నిటినీ. ఆయన యెంత చాకచక్యం గలవాడో దీన్నిబట్టే గ్రహించవచ్చునుగాదూ?

నీలిగా పొంగరించిన రక్తనాళాలు నా బాహువులమీద విస్పష్టంగా కనిపిస్తూన్నాయి. నా కిప్పుడు నలభై రెండేళ్ళు

వచ్చినాయి. ఇల్లాంటి బలిష్ఠమైన బాహువులు కలిగివుండీ నేనీ కాలం అంతలోనూ సాధించగలిగిం దేమిటి? ఇద్దరు ఒకే సారి స్నానం చేయగల స్నానగృహాన్ని కట్టేయి, యీ చేతులు! అదైనా రోడ్డుమీద దొరికిన చెక్కలు వుండబట్టి అనుకోండి! ఇదిగో! ఆవును కట్టేందుకు యీ షెడ్‌ను కడు తూన్నాయి. ఇంకా బోలెడు పని తరవాయే. ఇంకేం సంపా దించినాయి చెప్మా? ఈ కూరమళ్ళూ, యిల్లూనా? అబ్బే! అవి నావి గావు. నేను చనిపోయింతర్వాతే అవి నావౌతాయి! ఎటొచ్చీ ఆవుఒకటి వుంది. కాని అది నా సంపాదనా? కాదు, ఎల్సా, పిల్లలు పస్తుపడి, రక్తమాంసాలు కరిగించుకుని సం పాదించేరు, దాన్ని. నాకు దానితో ప్రమేయమే లేదు. పటాలంలో వుండి యింటికి పంపిన డబ్బు వాళ్ళ తిండితిప్పలకి గాని పెట్టిలో పెట్టి దాచుకోమ్మని కాదుగా?

సరే! ఎల్లాగో యీ షెడ్ పూర్తిచేసి, దాంట్లో ఆవుని ట్టేస్తానే అనండి. ఆ తరవాత యేమిటి? నాకు సొంతపొలం వారెడుకూడా లేదుగదా? ఈ చేతులలో దార్ఢ్యమంతా యింకొక్కరి పొలాలలో, అడవులలో, రాళ్ళల్లో చాకిరీ చెయ్యా సంలో కరిగి తరిగిపోతూంది.

నెత్తిమీదికి నలభై రెండేళ్ళు వచ్చినా యింకా మాకిత్తూ పలైనెన్* గానే వున్నాను. అదృష్టం లేకపోతే యేవరేం

* పాలేరు అని అర్థం. స్వంత పొలంలేక ఒకకామందుదగ్గర రోటిపాడు కునా జీతానికి కుదిరినవాడని యర్థం.

చేయగలరో చెప్పండి! పోనీ చివరికి యిప్పుడు కొంచెంభూమి యిచ్చినా దాన్ని బాగుచేయడం యేమంత సులభమైన పని గాదుకదా. నాకు ముసలితనం వచ్చే టప్పటికైనా దాంట్లో గిద్దెడుగింజలు పండవు! కొత్తగడ్డను వంగదీయాల్సింది యిరవై యేళ్ళ వయసులోగాని నలభై రెండో యేట గాదు. ప్రయత్నిద్దామన్నా అసలు నాకు భూమి యిచ్చేవా రెవరంటా? దాన్ని గురించిన బెంగే అనవసరం. ఎవరూ నాకేమీ యివ్వనక్కర్లేదు. దేవుని దయవల్ల నాకూ సొంతయిల్లూ, భూమీ వుండనే వుందిలెండి. అదిగో అదే! దానిమీద నడిచి చూడండి. ఒక్క అంగకేనా చాలదంటూరా? అబ్బే! కాదండి అయ్యా? ఒకటి, రెండు, మూడు! అంటేనే గాని ఒక కొన నుంచి మరొక కొనకి వెళ్ళనేలేము లెండి!

చల్లటి వాననీరు శక్తిమీరాంచి వెన్నువెంబడే జారుతూ స్నట్లుగ్రహించినా శరీరం అవిసిపోయి స్వాధీనం తప్పి వుండడం వల్ల సర్దుకోడానికేనా ప్రయత్నించలేకపోయేను. పొంగిన నాళాలు, గట్టిబడిన కండరాలు తేలిన రెండుచేతులూ తడిసి నీళ్ళు కారుతున్నాయి. అప్పుడే నాకు నలభైరెండు! ఇక నా బలం దిగనారుతుంది. తిరిగి రావడం మాట అబద్ధం. అయ్యయ్యో! ఏమనుకుంటే లాభ మేమిటి? నలభైరెండేళ్ళకేనా స్వంత కాళ్ళమీద నిలబడలేని నాడు నీ గతి కుక్కలకేనా పట్టదురా, బాబూ!

యుద్ధం ముగిసింది. శాంతిసంధులమీద సంతకాలైనాయి. ఎందరి రక్తమో ప్రవహించింది. కాని, జరిగిం దేమిటి?

ఎవరు బాగుపడినట్లు? నాకే మార్పూ కనిపించదు! పాలవాగులు, తేనెసోనలు ప్రవహించే మా సువోమీ స్వర్గసీమ ఐతే నేమాయె! నా కందులోగల స్థానం యేమిటి? అదే బోడికొండమీద శిథిల కుటీరంలో కాపరం. ఎండ, వెలుతురులకైనా నోచుకోని బ్రతుకు! ఎటుచూసినాబండలూ, రాళ్లూను. ఇతర దేశాల్లోకూడా యింతేనా? యుద్ధాల్లోంచి ప్రాణాలతో తిరిగివచ్చిన సిపాయీల కిటువంటి బోడికొండరాళ్ళేనా గతి? వాళ్ళ బ్రతుకు బండలు గావాల్సిందే? కాదు, కాదు! ఈ లోకంలో వుంది, యెక్కడో ఒకచోటు! అక్కడ దేశం కోసం పోరాడి మగిడివచ్చిన సిపాయీలు, సూర్యరశ్మినా తగులని కొండరాళ్ళల్లో తల పగులకొట్టుకో నక్కర్లేదు! స్నేహా వాత్సల్యమధురమైన స్వాగతం వాళ్ళ కక్కడ లభించి తీరుతుంది! కాని, అటువంటి దేశం యెక్కడుంది చెప్మా! ఏమో? ఎక్కడుందో నీ కెవడూ చెప్పడురా, బాబూ!......యుద్ధం ముగిసేకకూడా మనుష్యుల్ని డిటెయిన్ చేస్తారా, అక్కడ? అడగనూ మరి, తెలుసుకోవాలని వుందిలెండి.........

తమ పాలకులయందు విశ్వాసం నశించినవాళ్ళు యేమేమిటో చెపుతున్నారు. కాని, వాళ్ళని అట్లు మాట్లాడే స్థితికి దెచ్చిం దెవరంటా? ఏ దేశంలోనైనా ప్రజలు తమ పాలకుల్ని గాదని మరొక దెసకి చూస్తున్నారంటే అదేమీ పాలకులకు కీర్తిదాయకమూ గాదు, క్షేమకరమూ గాదు.

ఆఁ! అల్లాంటి ప్రజలకేం లేద్దురూ, వాళ్ళెప్పుడూ వుంటారు. వాళ్ళకి పెద్దపెద్ద ఆశ లుండవచ్చు. నేను అందు కోసమని వాళ్ళని వెక్కిరించను. ఆశలేని మానవుడు జీవిం చడం యెల్లాగ? ఎవడి యిష్టం వాడిది. ఒకరిని నిందించడం, పరిహాసించడం నా పని గాదుసుమీ. ఏమిటో యీ వేళ బాగా అలిసిపోయేను. అందుకని నా చేతులు చూసుకోడం తోనే యేవేవో పిచ్చిభావాలు నా మెదడులో పుట్టుకొచ్చేయి. అంతేగాని మరో గొడవ జోలి నా కెందుకు?

తడిసి బురదగా వున్న నా చేతులు దులిపి, పిడికిలి బిగిం చేను, అప్రయత్నంగానే. ఆహా! అది పిడుగులాటి పిడికిలి! దానిలో యింకా కొంచెం బలం మిగిలివుంది. వీటితో రెండు విసురులు విసిరితే యెవరికేనా ప్రమాదం తెచ్చిపెట్టగలవు! కాని, యీ బలమైన - పిడికిళ్లు నా కిచ్చినది ఒకరికి అపకారం చెయ్యడానికా?

నే నింకా అక్కడ కూర్చుని వానలో తడుస్తూండగానే యెల్లా ప్రొద్దుటి పని పూర్తిచేసుకుని తిరిగివచ్చేసింది.

'అదేమిటి? వానలో కూర్చున్నా వెందుకు? ఐనాది! ఇంట్లోకి నడు!'

పిచ్చి యెల్లా! నాకేం వూరికే కూర్చోవాలనీ, వృథా కాలక్షేపం చెయ్యాలని వుందా? నేనా? ఆదివారం వూరికే కూర్చోవడమే? ఏదో అలిసిపోయి చతికిలబడ్డా నంతే. ఆ పిడ్డ రాయి నన్ను చిత్తు చేసేసింది. అంతే. నేను మాట్లాడ

కండానే లేచి నిల్చుని, ఆమె వెనక్కాలే యింట్లోకి వెళ్ళి పోయేను.

నిరంతరం కష్టపడ్డంవల్ల ఆమెకూడా అలిసిపోయింది. కాని, యెంత అలిసినా ఆడదానికి కూర్చోడానికి అవకాశం వుండదు. పిల్లల చేతిలో యేదో తిండానికి పెట్టి, పొయ్యి వెలిగించి వంటలో పడింది. పాలేరువాడి పెళ్ళానికి అంతకంటె యెక్కువ సుఖం రమ్మంటే యెల్లా వస్తుంది? తన తిండి తానై సంపాదించుకోడానికి బైట చాకిరీ చేయడం, యింట్లో మళ్ళీ యింటెడు పనీ చేయడం. ఎప్పుడూ యింతే గదా. పిల్లలుంటే మరీ అనుకోండి.

ఒళ్లు ఆరబెట్టుకోడానికై నెగడి దగ్గరకి చేరేను. నా దగ్గరంతా మట్టివాసన వేస్తూంది. నా బట్టలు బాగా బురదకొట్టుకుని అసహ్యం వేస్తున్నాయి. అవి చూసి యెల్సా అంది:

'శుభ్రమైన బట్టలు వేసుకోకూడదూ? తడిసిముద్దైయిల్లాగే కూర్చుంటావా యేమిటి?......'

నేను జవాబియ్యలేదు. ఇప్పుడు బట్టలు మార్చడం యెందుకు? ఇక పెట్టెలో వున్న దొక్కజత. అదికూడా కట్టుకుని మాపేస్తే సెలవుల్లోనూ, పండుగ దినాల్లోనూ యేం కట్టుకోవాలి?

ఎల్సాకికూడా యీ విషయం తెలుసు. నా అభిప్రాయాన్ని గ్రహించే వుంటుంది. అంచేతనే ఆమె వెంటనే అంటుకుని బిగ్గరగా పైకే ఆలోచిస్తూన్నట్లు అంది:

'నీకు కొత్త బట్టలు వుండాలి, తప్పకండా.'

ఒక్కమాటు ఆగి, మరింత బిగ్గరగా,-

'ఎలియాస్ కొత్తసూటు కుట్టించుకున్నాడు. చూసేవా! ముదురునీలం. అతడికి ఆరంగు యెంతో బాగుంది! నువ్వు చూడకపోడం యెంత దురదృష్ట మనుకొన్నావు!'

వాడి కొత్తసూటు చూడనందుకు నాకేం విచారం లేదు గాని పైకి నేనేం మాటాడలేదు. నా చేతులు చూసుకున్నా, ఇప్పుడు నా విచారమంతా వాటిని గురించే. ఇప్పుడు, నా నలభై రెండో యేటకూడా తగినంత ప్రతిఫలం ముట్టకండానే నా రెక్కలు ముక్కలు చేసుకోడం సరియైనదేనా? అనే ప్రశ్నే నన్ను వేధిస్తూంది. అదేదో తేల్చుకోవాల్సిందే.

ఎల్సా మాట్లాడుతూనే వుంది:

'ఎలియాస్ నిన్నింకా చూడనే లేదుగదూ? పటాలం లోంచి వచ్చేక. అత డెంతో ఆశ్చర్యంగా అడుగుతూంటాడు: 'నేను వచ్చినప్పు డెప్పుడూ కనబడడు, ఐనార్. ఏం చేస్తున్నా డేమిటి? యుద్ధవిషయా లెన్నో వాడితో మాట్లాడా లనుకుంటూ. మనవాళ్ళ శౌర్యాన్నిగూర్చి, పోరాటాల్నిగూర్చి, అడుగుదామంటే కనబడకండా వున్నాడు. వాడికికూడా బోల్షివిక్ భావాలు సోకలేదుగదా, కొంపదీసి! కొందరు వాటి వల్ల శుభ్రంగా పాడైపోయి, దేశద్రోహు లైపోయేరుట. తల్లికే మోసగు బెట్టే రకం తయారైంది! వా డింతకాలం రిస్సావాళ్ళకి దగ్గర్లోనే వున్నాడుగదూ? నువ్వేదగవ్?'......

నా కెందుకో నవ్వొచ్చింది. ఎలియాస్‌కి రష్యా అంటే ఏమర్థ మవుతుంది? అదిగాక వాడెందుకు అర్థం చేసుకుంటాడు?

ఎల్సా నా మౌనాన్ని చూసి, యింకా చెప్పుకుపోయింది.

'ఎలియాస్ యెంచక్కటి కొత్త బూట్లుకూడా కొనుక్కున్నాడు. జర్మనీవట! ఎర్రగా మెరిసిపోతున్నాయి. నువ్వు వాటిని చూసివుండాల్సింది. అసలే ఎలియాస్ బాగుంటాడు. మన చుట్టుపట్ల మగవాళ్ళలోకి విల్హో తర్వాత ఎలియాసే అందానికి. కదూ? కొత్తసూటు, బూటు వేసుకుని, నల్లటి మీసం క్రింద తెల్లగా మెరిసే చిరునవ్వుతో యెలియాస్ ఆడాళ్ళదగ్గిర బాతాఖానీ వేస్తూంటే! హ్హా! చూడనివి కళ్లు గాదనుకో!......'

నేను మళ్ళీ బైటికి వెళ్ళిపోయేను. ఇంకా వాన కురుస్తూనేవుంది. కాని పని పూర్తిచేసుకోవద్దూ? ఆదివారం ఐతే మాత్రం? మనిషీ అన్నవాడు సోమరిగా యెల్లా కూర్చోగలడంటా? ఆవుకిమాత్రం చలిగాదూ? అదీ పాకలో వెచ్చగా వుందామని కాచుకుని వుందామె! అంచేత కూర్చుంటే యెల్లాగ?......

---

ముప్పైఒకటో ప్రకరణం - దుష్టుడికి దేహశుద్ధి.

**ఆ** మరునాడే నేను యెలియాస్‌ను కలవడం తటస్థించింది. నేనా సమయంలో గుర్రాలసాలకి పోతున్నా. క్రీమరీ ట్రక్కు గోశాలకి వచ్చింది. ఎలియాస్ టోపీ వూగిస్తూ నన్ను పిలిచేడు.

ఆ వేళ కప్పుడే ఆరుత్రోవలు మట్టి తోలేను, నేను. మిల్లు కట్టుబడికోసం మట్టి కావాల్సివచ్చింది. గదుల్లోపోసి కుమ్మి దిగడ్చి, పైన రాయి పరిచి, సిమెంటు చెయ్యాలిలెండి. ఆరో త్రోవ వేస్తూంటే హఠాత్తుగా గుర్రం కుంటడం మొదలెట్టింది. పావోతో చెప్పేను. గుర్రం కాలు చూడాలనుకున్నాము. అది బెణుకునొప్పి కాదుగదాయని నాకు అదుర్దాగావుంది. బండిలో మట్టిని నేను క్రిందకి దిగబోస్తూంటే, పావో గుర్రాన్ని మెల్లిగా పాకలోకి నడిపించి తీసుకుబోయేడు. సరీగా ఆ సమయంలోనే నన్ను చూసి యెలియాస్ కేకేసేడు.

నేనేం మాట్లాడకండానే వాడివైపు నడిచేను. వాడి వందనానికేనా ప్రతివందనం చేయడానికి నా చేయి లేవలేదు. చచ్చేలా అలిసిపోయే ననుకోండి. ఆరుబళ్ళ మట్టి తవ్వడం,- బండిలో కెత్తడం, పాతబొళ్ళ బండిని దారిలో మూడుచోట్ల మరామ్మతు చెయ్యడం,- అప్పటికింకా కడుపులో యేమీ పడనేలేదు,- ఒక్కచేతిమీద యింతపని చెయ్యడం వేళాకోళమా ఏమిటి? బాగా షాపక్ లో వున్నవాడికైతే అదో లెక్కగాదు కాని నేనింకా బలహీనంగానే వున్నాను. ఎప్పుడూ ఆకలిగానే వుంటూంది. ఎవరేనా పలకరిస్తేనే చిరాకుగా వుంటూంది. ఎలియాస్ కి జవాబీయఖంది అందుకనే అనుకుంటూ.

నేను పాక చుట్టుతిరిగి వచ్చేసరికే వాడు ట్రక్కు దిగి, పళ్ళికిలిస్తూ నాకేసి గబగబా వచ్చేస్తూన్నాడు.

వాడి పళ్ళలో మధ్యది బంగారపుది. అసలు ఎలియాస్ దగ్గర పూర్తి పళ్ళసెట్టుకే సరిపడా బంగారం వుందని పావో చెప్పేడు. కాని అది నిజమో కాదో నాకేం తెలియదు. ఒక సెట్టుకే ఏమిటి? చాలసెట్లకి సరిపడిన బంగారమే ఎలియాస్ సంపాదించేడని పావో అన్నాడు. అసలువిషయం యేమిటంటే సంపాదించే అవకాశం వస్తే వాడు విడిచిపెట్టలేదు! పటాలం లోకి బోకండా తప్పించుకోవాలనుకొనేవాళ్ళూ, పారిపోయి వచ్చినవాళ్ళూ, వాళ్ళ తోడుదొంగలూ చేతికి దొరికినప్పుడు, ఆ అవకాశాన్ని పూర్తిగా వుపయోగించుకోవాలి. ఎలియాస్ తెలివైనవాడు గనక అల్లాంటి అవకాశాల్ని పూర్తిగా వినియోగించుకున్నాడంటారు, అందరూ. కాని అదేమీ నాకు తెలియదు.

ఎలియాస్ సరాసరి నా దగ్గరికే వచ్చేడు. కాని నేను వాడికోసం ఆగకండానే గుర్రపుసాలలోకి వెళ్ళిపోయేను. ఎందుకో నాకూ తెలియదు! పావో అప్పటికే గుర్రం కాలు పరిశీలించేడు. నన్ను చూసి వాడు గుర్రంకాలు వదలేసి, మాట్లాడకండా పైపు కాలుస్తూ కూర్చున్నాడు. నేనే వాణ్ణి అడిగేను:

'అదేమిటో చూసేవుట్రా?'

ఇంతలో ఎలియాస్ దడబడ లాడుతూ లోపలికి వచ్చేసేడు. అందుచేత పావో యేమన్నదీ నాకు వినబడలేదు. ఉన్న

ట్లుండి గుఱ్ఱాలసాల సంతగా మారిపోయిన ట్లయిం దను కోండి. ఒక్క ఎలిసూన్ వందమంది పెట్టుగా సందడీ, గోలా, వాగుడూ చేయగలడు! వాడు ప్రారంభించేడు:

'హల్లో! ఐనారీ! నేస్తం! నిన్నుచూసి యుగాలైనట్లుం దిరా! పిర్కిలీ! ఇదేమిటి, యింత చిక్కిపోయేవు? ముసలివాడి లైనట్లు కనిపిస్తూన్నావురా! నే చెప్పేది, మనిషన్నవాడు లొంగిపోగూడ దనేనోయ్! అబ్బాయ్! అంతట్లోకే లొంగి పోతే యెల్లాగోయ్? పడుచుతనంలో? ఈ మాత్రానికే? మమ్మల్ని చూడరా, వుదాహరణకి! పిర్కిలీ! ఎన్ని తుపానుల్ని యెదుర్కొని, నెగ్గుకు వచ్చేమోయ్! చూడు, యింకా యెంత దిట్టంగా వున్నానో? నీలోవచ్చినంతమార్పు యెల్నాలో రాలేదు. ఆమె అద్భుతంగా వుందనుకో, ఎన్ని కష్టాలు వచ్చి మీదబడ్డా చెక్కుచెదర నే లేదామె! కాని, ఆమె మరీ అంత వంగనాచితనంగా వుంటుందేముటోయ్? అల్లా వుండడం ఆమెకి తగదురా! తనెవర్తో, మన మెవరమో ఆమెకి కాస్త జ్ఞాపకం చెయ్యాలనుకుంటూ. ఆమెతో యిల్లా అన్నానని చెప్పు. దానికేం గాని నిన్ను చూడ్డానికి నాకెంతో ఆనందంగా వుందిరా!'

మాట్లాడుతూనే నావైపు చేయి జాచేడు, వాడు. కాని సరిగా ఆ సమయంలోనే గోడని జేర బెట్టివున్న గుఱ్ఱపుసామాను తీసేను, నేను. గుఱ్ఱాన్ని విప్పి, సామానును పాకో అక్కడ బెట్టేడు. గోడనున్న చిలకకొయ్యకి యీ సామాను

తగిలించాల్సి వుంది. అందుకని నేను వాడి చేతిని వెంటనే చాలన చేయలేదు.

సామాను పైకెత్తడంలో నా కోటుచేతులు జబ్బలమీదికి జారినాయేమో సరాలు వుబికిన నా చేతులు కనిపించేయి. అప్పుడు నాకు గుర్తొచ్చింది, ఆ క్రితంరోజు ఆదివారం ఐనా నేను పనిచేయడం, యింకా యితరవిషయాలూ—అవీ......

జీనూ, రీసీసులూ కూడా తీసి మేకుకి తగిలించేక తిరిగి చూసేను. ఎలియాస్ యింకా చెయ్యి జాచేవుంచేడు. అప్పుడింక వాడి చేతిని చాలనం చేయకపోతే యేం బావుంటుంది? పాగ వాడిగోలతో సంతమార్కెటు ఐపోయిందంటే నమ్మండి. నన్ను చూడగలిగినందుకు వాడంత సంతోషంగా వున్నాడన్న మాట!

'కాని, ఒరేయ్! నీ పెడసరితనం మాత్రం పోలేదురా! అంత పెడసరితనమా? పిర్కోలీ! యుద్ధం కూడా నీ పెడసరితనాన్ని పెల్లగించలేకపోయిందన్నమాట! అంత టెక్కు కూడదుసుమీ, నన్నడిగితే. దానివల్ల నువ్వేంతమాత్రం అభివృద్ధి జెందలేవు. నీ బ్రతుకే చెడిపోవచ్చునోయ్, యీ గుణం మూలంగా, పిర్కోలీ! మమ్మల్ని చూడరా, ఉదాహరణకి! నాకుమల్లే నడిచే వంటేనా! నీపని మూడుపువ్వులూ ఆరుకాయలుగా వుంటుందనుకో! అదే పోయింది గాని, పాగ త్రాగుతావు గాదుటా?'

అంటూ 'క్లాబీ నంబరు 7.' సిగరెట్ పేకెట్ నావైపు చాపేడు. యుద్ధనికి పూర్వమే దాని ఖరీదు నాలుగు మార్కులుండేది. కాని, నాకెందుకు వాడి సిగరెట్టు? ఎంత మంచిదైతే మాత్రం. వాడేనా సిగరెట్టు కాల్చే ధోరణిలో పడి నోరు ఓ క్షణమేనా మూసుకుంటే బాగుంటుం దనుకున్నా. ఆ అవకాశంలో పావో నడిగి గుర్రం కేమైందో తెలుసుకోవచ్చు. కాని వాడూ సిగరెట్టు ముట్టించలేదు! ఒకే వరసన వాగుతూ నా వీపు తట్టుతూ అన్నాడు.

'మమ్మల్ని చూడరా! మాతో స్నేహితంగా వుండు. నీ కేసాయం గావాల్సినా చేస్తాం, మరి. ఇన్ని మాటలెందుగ్గాని మేము మాత్రం వెళ్ళలేదుటోయ్, యుద్ధానికి! పిర్కీలీ! ఐతే నేం? నన్ను చూడు. నేను కాస్తేనా చెక్కుచెదిరేనటోయ్? కులాసాగా, దార్ఢ్యంగా, సంపూర్ణంగా లేనూ? పిర్కీలీ! పైపెచ్చు బోలెడన్ని గౌరవబిరుదాలూ, పతకాలూ కూడ సంపాదించేను! యుద్ధరంగంలో పోరాటమునలో లేనే అనుకో. కాని, 'అక్కడికి నన్ను పంపండని నెత్తీ నోరూ కొట్టుకొన్నా లాభం లేకపోయింది. వాళ్ళు నన్ను పంపందే యేంచేసేది? నాకు తెలుసు, నేనే గనక రంగంలో దూకితే రిస్సా కొత్తేం మాడిపోతుం దని! వెధవల్ని వరసబెట్టి నరికి పారేసేవాణ్ణి. శవాలు బళ్ళమీద తోలాల్సిందే. నాకే గనక నిజంగా కోపం వచ్చి సంహార కాండ ప్రారంభించేనంటే యిక నన్నాపగలవాళ్ళు లేరనుకో. పిర్కీలీ! ప్రజలు నా సంగతి బాగా

తెలుసుకోవాలంటూ! ఐనా, మించిపోయిందేం లేదులే మున్ను నికి యెందుకు బోలేదో తెలుసా? ఇంకో ముఖ్యమైనచోట నావంటి వాళ్ళ అవసరం వచ్చిందిలే. ఎవళ్ళంమాత్రం యేం చేయగలం? అందరం అధికారుల ఆజ్ఞలను శిరసావహించా ల్సిన వాళ్ళమేగదా ? నేను ఆ పని చేసితీరా లన్నారు, పై వాళ్ళు. సరే, కానీ మన్నాను. ఆజ్ఞలకి తల ఒగ్గాల్సిందే కదా? ఏమంటావు? నువ్వూ సిపాయివే ఆయెను! నీకు తెలి యని దేముందిలే, నే నన్నది నిజమే నంటావా?'

వాడు నన్నింకా గట్టిగా భుజంమీద తట్టడం, డొక్కలో పొడవడం ఆరంభించేడు:

'కందకాల్లోకి వెళ్ళగలిగినందుకు నువ్వు గర్వపడాలిరా, పిర్కీ! నిన్ను చూస్తే నాకే అసూయగా వుందనుకో. డామిట్! నువ్వు గ్రహించలేవుట్రా? ఆఖరికి నిన్ను చూసి నేనే అసూయ పడుతున్నానంటే! రిస్సావాళ్లని మనవాళ్లు చావగొట్టడం నువ్వు కళ్ళారా చూసేవు! పిర్కీ! అదెల్లాంటి అదృష్టంరా? మన వీరుల శక్తిసామర్థ్యాల్ని నీ కళ్ళతో చూడ్డమేగాదు. నువ్వే మన దెబ్బ రిస్సావాళ్ళకి రుచి చూపించేవు! ఏమంటావు?'

వాగడం, ప్రశ్నించడం, నాకళ్లలోకి గ్రుచ్చిచూడ్డం,–వాడి కేమని జవాబీయాలో తెలియక నేను గ్రుడ్లప్పగించి చూస్తూ నిలబడ్డం, వాడే నా జవాబుని కూడా చెప్పే సేయడం,–యిదీ తంతు! నల్లటి మీసంక్రింద వాడి యెఱ్ఱటి

పెదవుల కదలికా, బంగారపుపంటి తళతళా చూస్తూ గమ్మున వుండిపోయాను.

'నువ్వా రిస్నా వెధవల్ని చాలమందినే పడమటికి * పంపించి వుంటావు. పందెం వొడ్డుతా! నే నెరగనుట్రా, నిన్ను? పిర్కీలీ! నీలాటివాళ్ళు యుద్ధానికి దిగితే అత్యద్భుతకృత్యాలు చేస్తారంటాను! నేను చూడలేకపోవడం యెంత విచారకరం! ఎందుకు? ఏమనుకుంటే యేం లాభం? పీతారీ మన చేయి దాటిపోయిందని తెలిసినందుకేనా రిస్నావాళ్లని పుఱుగుల్లా యేరేసే వాణ్ణనుకో. ఆ వెధవల్ని నే నెప్పటికీ క్షమించేది లేదనుకో. నెవెస్కీ వీథిలోని ఆ యింటివిషయంలో మాత్రం వాళ్ళని నేను క్షమించలేను. నేనూ, నాన్నా యెన్ని ప్లానులు వేసుకున్నామని! పిర్కీలీ! అవన్నీ చెడిపోయినాయ్! నా కంఠంలో ప్రాణం వుండగా యీ విషయం మరుస్తానా? మళ్లా యింకో మారణహోమం ప్రారంభించే అవకాశం కోసం కనిపెట్టుకునివుంటా! ఆ వెధవ జాతాన్నంతనీ యీ ప్రపంచం లోంచి తుడిచిపెట్టెయ్యాలి. వాళ్ళే యీ లోకంలోని పాపాల కన్నిటికీ మూలకందం! పిర్కీలీ! వాళ్ళ నెంతమందిని చంపితే అంతమేలు, ప్రపంచానికి! వాళ్ళని నిర్దాక్షిణ్యంగా చంపిన నువ్వు ధన్యుడవైనావురా! ఐతే యెంతమందిని పడమటికి పంపేవురా, నువ్వు?'

* మనం దక్షిణానికి అంటే యమునిదిక్కుకి పంపడంలాగే ఉత్తర జాతులు పడమటికి, వాళ్ళ నరకానికి పంపడం అర్థంలో వాడతారు. చంపడమన్నమాట.

'ఒక్కణ్ణీ పంపలేదు.'

'ఆఁ! ఏమిటి! వేళాకోళమే, సమయాసమయాలు చూడ కండా? నేనా యీ మాట నమ్మేది? పిర్కీలీ! ఎందుకనో నువ్వు దాస్తూన్నావురా. నిన్ను బ్రతిమాలుకోవాల్లా వుందిరా, దేవుడా! చచ్చి స్వర్గానవున్న మీ తమ్ముడులాగే నువ్వూ వట్టి పెడసరి ఘటానివిరా. నువ్వు ఆ గుణం మానుకోవాలిరా. పరిహాసాలు కట్టిపెట్టి, నిజంగా చెప్పరా, కానీ. చెప్పితే నీ ముల్లె యేమైనా పోతుందా? నువ్వెందరు రిస్సాల్ని చంపేవురా, చెప్పు!'

నేను యెందుకో తెలియకండానే పావో వైపు చూసేను. వాడు పైపు కాల్చడం పూర్తిచేసి, గోడని జేరబడి కూర్చున్నాడు. గుర్రం సంగతి వాణ్ణడిగి తెలుసుకుని, చల్దికి పోవాలి. ఊరిఖే బాతాఖానీకి అవకాశం యెక్కు డుంటుంది, నా బోటి వాడికి? నా పొట్ట వెన్ను కంటుకుపోయి, ఆకలిపోట్లు కూడా వస్తున్నాయి. ఆరుబళ్ల మట్టి తోలే సరికి యింత ఆకలిగా వుంది! కాని, ఎలియాన్ యూదరగోల యింతలో మానేటట్లు కనబడదు. నా భుజంమీద చరుస్తూ, డొక్కలో పొడుస్తూ, గొంతు చించుకుని అరుస్తూనేవున్నాడు, వాడు:

'దాపరికం యెందుకురా? చెప్పు, యెందరు రిస్సావాళ్ళని చంపేవో? డజనుకి తగ్గదని ఢంకామీద దెబ్బకొట్టి చెప్ప గలను. ఒక్క ఫిన్నుకి డజను రిస్సాలని దేవుడే రాసేడురా! నువ్వైతే యింకా జాస్తీయే చంపివుంటావు. ఎందుకంటే,

నామటుకు నేనే ఓ పాతికమందిని చంపా లనుకున్నానురా. కాని అక్కడికి వెళ్ళడమే పడందే. నన్ను వెళ్ళనిండయ్యా! అంటే ససేమిరా! పనికిరా దన్నారు, మనవాళ్లు. పిర్కీలీ! నువ్వురా అదృష్టవంతుడివి. నడిబొడ్డున పడ్డా వోయ్. ఔనా? ఏం?'

'నడిబొడ్డునే వున్నా ననుకుంటూ......'

'అదీ సంగతి! నే నెరుగుదునోయ్! చూసేవూ? నే చెప్ప డంలేదూ? నువ్వు అక్కడున్నా వని నాకు తెలుసునురా, పిర్కీలీ!......'

ఈ ఘట్టానికి వచ్చేసరికి వాడు నన్నింకా గట్టిగా పొదుస్తూ మరింత బిగ్గరగా అరవనారంభించేడు:

'అదిరా విషయం! నువ్వు మంచి ఆటపట్టులో వున్నావన్న మాట! ఫైపైన వాడవురా, ఐనారీ! బాహాబాహీ, ముష్టా ముష్టీ పోరాటమా? లేక......'

'బాహా బాహీయే!'

'వహ్వా! బలేరా, బాబా! అదీ మగతనం! పిర్కీలీ! నువ్వు ఆ వెధవల్ని పచ్చడి చేసేసి వుంటావు! నే నప్పుడే అనుకున్నా నోయ్! పందెం వేస్తా! వాళ్ళని నల్లుల్లా నేలని బెట్టి రాసేసి వుంటావ్! దాన్ని తగలేసిరిలే! ఖర్మ! నాకు చూసే యోగ్య తేనా లేకపోయింది! నేను యుద్ధరంగానికి రాలేక నే పోయేను......నా కళ్ళకి కట్టినట్లుంటుం దిప్పటికీ. మనం యుద్ధరం......నా పళ్ళతోటే వాళ్ళని ముక్కలు ముక్కలు

చేసేసే వాణ్ణనుకో. పిర్కిలీ! ఐతే వాళ్ళ నందర్నీ పూర్తి చేసేవురా, నువ్వు?'

'ఎబ్బే!...ఊరుకోరా, యింక. తప్పుకో. ఇంకా చలిది కూడా తినందే. పోవా లింటికి.'

'ఎబ్బే ఏమిటిరా? వాళ్ళతో బాహాబాహీ పోట్లాడే నని యిప్పుడే గాదటరా, చెప్పేవు?'

'వాళ్ళెవరు? ఒకడితోనే?'

'ఒకడే? ఒక్కడితో పోట్లాడేవా?'

'ఔనురా! జిడ్డులా పట్టుకున్నా వేమిటోయ్. తప్పుకో, దారి విడు, పోవాలి.'

'ఒక్కడితోనా? ఒక్కణ్ణేనా పురుగునా కేసేవా?'

'వాడే నన్ను తుప్పు దుళ్ళగొట్టేడు!'

'ఏమిటి? రిస్సావాడా?...నిన్నా?'

'ఔనోయ్! వాడే నన్ను పురుగునా కేసేవాడు, యింకొంచెం వుంటే!'

'రిస్సావాడా? నిన్నా? నిన్నని? ఒక్క రిస్సా నిన్ను డేకించేయడమే?'

'ఔనురా! ఔను! ఎందుక్కాదు?'

'అదేమిట్రా. దాన్ని తగలెయ్యా! ఎల్లాగ...'

'ఎల్లా గేమిటి? నీ బొంద! ఇదుగో, యిల్లాగ. గుంపల్లో చెయ్యేసి పట్టుకుని, గోడకి నొక్కిపట్టి, మొహం చితకబాది చేడు. ఇల్లాగ, ఇల్లా!...'

అంటూనే యిదంతా ప్రత్యక్షంగా మెలియాస్ మీదే చేసి చూపించేను. నల్లటికళ్ళతో నన్ను మిడుతూ మిడుతూ చూస్తూ, నాపట్టు విడిపించుకోడానికి వాడు మహా గింజుకున్నాడు. కాని, నాపట్టు అంతతో విడుతుందా? గుండెల్లో చెయ్యేసి పట్టుకుని, పిడికిలితో వాడి మొహం చితకబాడిచేను. వాడి పళ్ళుకూడా కదిలిపోయేయి. ఒక్కొక్కసారి తలవెనక్కి విసిరి, నా పోటు తప్పించుకునేవాడు. నా పిడికిలి వెళ్ళి గోడకి కొట్టుకునేది. కాని ఆ తరువాతి పోటు సరాసరిగా, మరింత గట్టిగా మూతిమీదే తగిలేలాగు జాగ్రత్త తీసుకునేవాణ్ణి. కొంచెంసేపట్లోనే వాడి ముక్కూ మొహం పగిలి, రక్త ప్రవాహం అయిపోయింది. హిట్లర్ మీసంలాంటి వాడి నీటైన మీసం అంతా చెదరి, రక్తం కారుతూంది. అప్పుడు గాని వాణ్ణి నేను వదలందే.

కాని, వాడు అంతతో పోనిచ్చేడా? బాకుదూసి నామీదికి వచ్చేడు. చట్టున వాడి చెయ్యి పట్టుకుని, వీపున గోడని బెట్టి నొక్కేసేను. వాడు నా వీపంతా బరికి, కరిచినా నేనుమాత్రం పట్టు వదల్లేదు. బాకు లాగేసి, వాణ్ణి వదిలేసేను. అప్పుడేనా పూరుకుంటే వాడి యిదేముంది? లాఘవంగా వురికి, మంచి తెలివిగా ఓ బాక్సింగు ట్రిక్కు చూపుతూ నా దౌడమీద పిడికిలితో పొడిచేడు. ఆ క్షణాన వాణ్ణి గుండెలలో చెయ్యేసి, పట్టుకుని గోడకి తాపటం చేసి, స్మృతి తప్పేలా కొట్టి వది లేసేను.

కాని వా డెంతసేపో అక్కడ పడిలేడు. కాస్సేపట్లో నే లేచి, జేబులోంచి రుమాలూ, అద్దం తీసి, గోడని జేరబడి ముఖం తుడుచుకుంటూ చాలసేపుండి, చివరకి బైటపోయేడు.

ఇంతసేపూ పావో యేమీ యెరగనట్టుగా పైపు కాలుస్తూ కూర్చున్నాడు. నేను వాడికేసి తిరిగే టప్పటికి పైపుతీసి, టక్కున గోడని కొట్టి దులిపి, ముస్తతైనెన్ కాలు పట్టి పరిశీలనగా చూస్తూ అన్నాడు:

'బెణకడం కాదురా. నాడం విరిగింది. మేకు మాంసంలో గుచ్చుకుంటూంది. అంతే.'

ఆ మాత్రానికే నాకు దమ్ము వచ్చేసింది. చేతులు వణుకుతున్నాయి. అయ్యో దేవుడా! ఇంతలోకే! నా చేతుల్లో బలం లేకపోలేదు గాని అవి మనుషుల్ని కొట్టడానికి అలవాటు పడ్డవి గావు. ఏదో కష్టించడానికీ, పనిచేసుకోడానికీ,- యెంత కఠినమైన పనైనా సరే ప్రశాంతంగా, కట్టుదిట్టంగా చేసుకుపోవడానికే గాని వెధవ దెబ్బలాటల్లోని వాళ్ళు తెలియని ఆవేశాలకి అలవాటు పడ్డవిగావు, నా చేతులు. అందుచేతనే అవి వొణుకుతున్నాయి. అసలు వాటికీ, దెబ్బలాటలకీ పొత్తు కుదరనే కుదరదు. అదీగాక నా కడుపులోకూడా అంతా అస్తవ్యస్తంగా వుంది.

పావో నావైపు చూడ్డమే లేదు. నా చేతులు వణకడం వాడి కళ్ళ బడివుండదు. పోనీ అదీ మంచిదే అయింది. వాడు

దృష్టినంతమూ గుర్రవు కాలిమీదే లగ్నం చేసేడు. తర్వాత్త కండానే నాతో మాట్లాడుతూన్నాడు:

'ముస్తాలై నెన్‌కి నాడాలు వేయించుకొస్తా గాని జాత్తిలై నెఁకాని బండికి కట్టు. ఏం?'

'అల్లాగేలే. ఇంటికి వెళ్ళి చల్ది తిని వస్తా.'

'అల్లా చేయి. వెళ్ళిరా' అన్నాడు, పావో.

వాడు మళ్ళీ గుర్రం కాలు పట్టుకుని చేత్తో తడువుతూ గమనిస్తూన్నాడు, ఏమిటో. కాని వాడావరకే చూసేననీ, తెలిసిందనీ అన్నాడుకదూ?

నే నింటికి బైలుదేరేను. ఏదో అశుద్ధపదార్థాన్ని ముట్టుకుని మైలపడ్డట్లు చేతులు దూరంగా పెట్టి నడుస్తున్నా. ఏ గుంటలోనో చేతులు కడుక్కోవాలి, అంతే.

నా బూట్లు బురదలో దించుకుబోతున్నాయి. మెల్లిగా నడుస్తూ, పావోని గూర్చే అనుకుంటున్నా. మనిషి చూస్తే పిట్టలా వుంటాడే గాని, అబ్బో! అసాధ్యుడు. పొట్టివాడికి పుట్టెడు బుద్ధు లంటారు గదండీ. పావో మా చిత్రమైన వ్యక్తి లెండి!



# దక్షిణపవనం

## ముప్పైరెండో ప్రకరణం - విల్సో వచ్చేడు!

నాకు తెలియకుండానే దినాలు గడిచిపోతున్నాయ్. ఒకనాడు పాపో నాదగ్గిరికి వచ్చి, అటూఇటూ పరికించి చూస్తూ మెల్లిగా అన్నాడు:

'మీ విల్సో వచ్చేడు.'

నాకు యెంతో ఆశ్చర్యం వేసింది. కాని నే నేమీ మాటాడలేదు. అదీ గాక చెప్పడానికి మాత్రం యే ముం దంటా? ఒక్కమాటుండి మళ్ళీ వాడే అన్నాడు:

'ఆదివారంనాడు మిమ్మల్ని చూడా లనుకున్నాడు, వాడు'

'అల్లాగని నిన్ను చెప్పమన్నాడా?'

'అబ్బే! లేదురా. నాతో మాట్లాడుతూ, యాదాలాపంగా 'ఆదివారం అన్నని చూడాలి!' అన్నాడు. అంతే.'

నేను తలూపి, గుర్రాన్ని తోలుకొని పొలం వెళ్ళిపోయేను.

ఆ దినం యెండ బాగా కాస్తూంది. ఉర్లగడ్డ తవ్వుతూన్నారు, మా కామందు పొలాల్లో. ఇంటిల్లిపాదీ, పనివాళ్ళూ కూడా దుంప యేరుతూన్నారు. పాలకత్తె లిద్దరూ, ఎల్సా, నియాతీ కుర్కిమాకీ, అమ్మగారూ కూడా పనిచేస్తూన్నారు, ఆ భోజన. అమ్మగారు తన స్థూలశరీరంతో. అంతగా పని

చేయలేరు గాని యేదో పరిశ్రమ యివ్వడం మంచిదని పనిలో దిగినట్లు కనిపిస్తుంది!

గుఱ్ఱాన్ని పూన్చి నాగలితో చాలు దోలుతూన్నా, నేను. మట్టి తిరగబడి నాగేటి చాలు వెనక వుర్లగడ్డలు బైట పడుతూన్నాయి. నియ్యాతీ దుంప లేరే చోటికి నాగలి వెళ్లే సరికి ఆమె హఠాత్తుగా నన్ను పలకరించింది:

'ఐనారీ!'

నేను గుఱ్ఱా న్నాపేను. హిల్డా నన్ను సమీపించి, అతి మృదువుగా, యేదో రహస్యం మాట్లాడుతూన్న ట్లడిగింది.

'విల్హో వచ్చేట్ట! నిజమేనా?'

ఏమని జవా బీయాలో తెలియలేదు, నాకు. ఒక్కొక్క ప్పుడు కొన్ని ప్రశ్నలకి సమాధానం ఆలోచిస్తే తేలదు! నేను వొట్టి మొరకులాగ గ్రుడ్లప్పగించి ఆమెని చూస్తూ వుండి పోయేను. ఆమె బూడిదరంగు క్రొజరు తొడుక్కొని వుంది. అది చీలమండలదగ్గర బిగుతుగా వున్నా పైన బాగా కుచ్చిళ్లు పోసివుంది. తెల్లటి స్వెట్టరూ, దట్టమైన జుట్టు ముడివేసి పైన రంగురంగుల సిల్కుఁరుమాలూ ఆమె అలంకారాన్ని పూర్తి చేస్తున్నాయి. మునపటికిలాగే ఆమె సన్నగావున్నా స్తన ప్రాంతంమాత్రం బాగా పుష్టినొంది స్వెట్టరును త్రోసుకుని పైపై కుబుకుతూన్నాయి. రంగువేయక పోయినా ఆమె అధరం దొండపండులా రక్తిమ గలిగి, నిండుదేరినట్లుంది. పొడవైన నల్లని కనుబొమలక్రిందనుంచి విశాలనేత్రాలతో

నన్ను చూస్తూ గంభీరంగా నిల్చున్న నియీూతీని చూచి నేను భుజాలు కుంచించుకున్నాను. ఏదో చెప్పక తీరదుగదా అని:

'ఎవరు చెప్పేరు, నియీూతీ ?'

'ఎలియాస్ !'

'ఐతే నిజమే గావచ్చు.'

'ఆదివారం మీూ యింటికి వస్తా డనుకుంటూ'

ఆమె అడిగిన యీ ప్రశ్నకి యేమని సమాధానమీూయాలి ? ఆలోచించడానికేనా వ్యవధి యేదీ ? కాని, వెంటనే తల వూపుతూ చెప్పేసేను:

'లేదు, రాడు. వాడు రావడం లేదు.'

'అయ్యో ! అల్లాగా ! నే ననుకున్నానే...'

'అబ్బే ! లేదు.'

ఆమె యింకేమీూ మాటాడకండా చాలుమీూద వంగుని దుంప తీరడం ప్రారంభించింది. చిన్న, పెద్ద దుంపలు వేరు వేరు గంపల్లో పడేస్తూ, నియీూతీ గబగబా పని చేస్తూంది.

పార్శ్వభాగాన్నుంచి ఆమె వైపు చూసేను. శంఖంలాంటి ఆమె కంఠంక్రింద స్వెట్టరు పిటపిటలాడుతూంది. ఔను ! నియీూతీ స్త్రీత్వం పరిణతమైంది ! ఈ తల్లి బిడ్డలు మాతృస్తన్యానికి మొగంవాచ నక్కర్లేదు !

# దక్షిణపవనం

## ముప్ఫైమూడో ప్రకరణం - విల్హో కథనం

విల్హో మా యింటికి ఆదివారంసాయంత్రం వచ్చేడు. ఆరోజున బాగా యెండ కాస్తూంది. శిశిరఋతువులో అట్లుండే దినాలు అరుదే. కవోష్ణవాయువు సుఖంగా దక్షిణాన్నుంచి వీస్తూంది.

వాడు చూస్తూండగా యిల్లే వచ్చేసేడు, కొండెక్కి. అం చేత వాడి నెట్లా పలకరించాలో ఆలోచించుకోనిందుకు నాకు వ్యవధే లేకపోయింది. ఇద్దరం నోట మాటలేకండా ఒకరి నొకరం చూసుకుంటూ నిల్చునిబోయేం, శిలావిగ్రహాల్లా.

నేనే ముందుగా తెప్పిరిల్లి, గ్రుక్క తిప్పుకుని అన్నా:

'ఐతే, విల్హో! చివరకి నువ్వు తిరిగి వచ్చే వన్నమాట!'

విల్హో కొంచెం చిక్కినట్లున్నాడు. కొద్దిగా పల్చబడ్డాడు. అంతే. కాని వాడి కళ్ళల్లోనూ, పెదవులమీదా యథాపూ ర్వంగానే అస్పష్టమైన చిరునవ్వు తురగలిస్తూనే వుంది. వాడు సంతోషంగా అన్నాడు:

'ఔను! అన్నా! వచ్చే నన్నమాటే! నిజంగానే!' అంటూ రెండు చేతులా నా భుజాలు పట్టుకుని నొక్కుతూ కుదిపే సేడు. నేనూ వాడి భుజాలు పట్టుకుని నొక్కి, గ్రుచ్చి కౌగ లించుకున్నాను. వాడు నా తమ్ముడు, సజీవిడై, క్షేమంగా

చాలరోజులికి తిరిగి వచ్చేడు. వీడొక్కడే నాకు తమ్ముడు, నాకు. భగవంతుడే వాణ్ణి నా కోసం భద్రంగా రక్షించి తీసుకొచ్చేడు!

ఆపళంగానే వాణ్ణి యింట్లోకి లాక్కుపోయేను. ఎల్సా చెవిలో వూదేసేను:

'ఇంట్లో వున్నవన్నీ టేబిలుమీద వుంచు. దేనికీ లోభించవద్దు!'

మేము దీపం ముట్టించి, గోడవత్తుగా బెంచిమీద కూర్చున్నాము. ఎల్సా పొయిదగ్గర పనిలో వుంది. మా సంభాషణ ఓ పట్టాన దారిన బడలేదు. బిడ్డలిద్దరికీ భోజనం పెట్టి, టేబిలు వెనక తెరచాటున పందుకో బెట్టేసింది ఎల్సా. మేము యింకా మౌనంగానే కూర్చునివున్నాం. ఉన్నట్టుండి విల్హో ప్రశ్నించేడు:

'నా వుత్తరం అందిందా?'

'ఆ! అందింది!' నేను తలూపేను.

మళ్లా కొంచెంసేపు అంతా నిశ్శబ్దం.

ఆ భయంకర హత్యాకాండ తర్వాత నా తమ్ముడు క్షేమంగా తిరిగి రాగలిగేడని నే నెంత సంతోషించాలి! కాని, నేను పొందవలసినంత ఆనందాన్ని పొందలే దనిపించి, నా హృదయంలో కలుక్కు మన్నట్లైంది.

నా మనసునుంచి దౌర్భాగ్యపుటూహల్ని దూరంగా వుంచడానికి యత్నిస్తూ, యేదో మాట్లాడబోయేను:

'నువ్వెళ్ళి యెన్నాళ్ళో అయింది!'

'ఔను! మనవాళ్ళు ఆటంకపరచకపోతే యింకా ముందే వచ్చివుండేవాళ్ళం. మేము బోల్షివిక్కులలో చేరిపోయేమేమో నని పరిశీలించడానికి మన పాలకులు ఒక ప్రత్యేక కమిటీని వేసేరు. నన్నడగ్గానే కమ్యూనిస్టునని వాళ్ళ మొహంమీాదే చెప్పేసేను. నా మాట వినగానే వాళ్ళు నన్ను ఒదిలేసేరు. అల్లా చెప్పివుండకపోతే యింకా అక్కడే పడివుండాల్సి వచ్చేదో? యేమో?'

నాకు చాలా ఆశ్చర్యం కలిగింది.

'చెప్పవైతివి! నిజంగా అల్లాగేఅన్నావా?'

'ఓ! అన్నాను. కాని, వాళ్లు మొదట నన్నేమని ప్రశ్న వేసేరో తెలుసా! 'హెంర్రా పీతొక్కానియేమీా! నీవే భావాలు ప్రచారం చేయా లనుకుంటున్నావు?' నా జవాబు స్పష్టంగా చెప్పేసేను: 'ఏం చిత్రమైన ప్రశ్న! కమ్యూనిస్టు భావాలు గాక మరేం చేస్తా ననుకున్నారు?' వాళ్ళు మొగ మొగాలు చూసుకున్నారు! గుసగుసలాడేరు, ఆలోచించేరు. చివరికి.–'హెంర్రా షీతొక్కానియేమీా! నువ్వు వెళ్లచ్చు. వందనాలు!' అంటూ తలుపులు బార్లా తెరిచేసేరు. కానినేను అంతతో వదలందే: 'తొందర పడకండి. ఆలోచించి మరీ విడిచిపెట్టచ్చు, నన్ను. చాలా ప్రమాదకరమైనవాడి నవుతానుసుమా! జ్ఞాపకం పెట్టుకోండి, చెవుతున్నా. ఈ కసాయియుద్ధానికి కారకులైనవాళ్లని విచారణకి పెట్టాలని యీా రోజునుంచే

నేను బహిరంగంగా ప్రచారం చేస్తాను!' వాళ్లు తాపీగా అన్నారు: 'బాగానే వుంది. చెయ్! నువ్వింక వెళ్ళు.' వాళ్ళని చూడ్డానికి అదే మొదలూ, తుదీని!'

ఆశ్చర్యచకితుణ్ణై విల్సోనే చూస్తూ వుండిపోయేను. వాడి మాటలు నమ్మాలా? అక్కర్లేదా? ఎవరు చెప్పగలరు? ఈ రోజుల్లో మా సుమోమీలో యేం జరుగుతున్నారో, మరేం జరుగుతారో భగవంతుడికే తెలియదు! వాడూ నా భావాన్ని కనిపెట్టి నట్లున్నాడు. వాడి కళ్ళలో చిలిపినవ్వు అంతకంతకు విస్పష్టం అవుతూంది. చివరికి వాడన్నాడు:

'ఈ కొండమీదే వుండిపోయేవు గాని నువ్వంతగా మారి నట్లే లేదు!'

వాడి అభిప్రాయం నేను గ్రహించనే లేదు. వాడికే జవాబూ యివ్వకండానే యింకో ప్రశ్న వేసేను:

'ఇప్పుడు నువ్వు నిజంగా కమ్యూనిస్టువే?'

వాడు చిరునవ్వేడు.

'అబ్బే! కాదనుకో, కాని, అప్పుడు నాకు పిచ్చికోపం వచ్చింది. అంతే. వాళ్ళు నా మాటలు నమ్మేరు!'

'విచారణకి పెట్టా లంటున్నావే, ఎవరిని?'

'ఎవ ర్నేమిటి? మరెవర్నీ గాదు. మన పాలకుల్నే!'

'మన పాలకులనే?'

'ఏం? ఎందుకు కాకూడదు? వాళ్ళనే! మన తల్లులకి పుత్ర శోకాన్ని, భార్యలకి భర్తృవిహీనత్వం కలిగించడమే గాక

మన మాతృదేశం జర్మన్ హంతకుల మలినహస్తాల్లో భంగ పాటు నొందునట్లు చేసినదీ వాళ్లే గదా? తమ చర్యలకీ, విధానాలకీ జవాబుదారీ తమరే వహించాలి.'

నేనేం మాట్లాడలేదు. అల్లాంటి విషయాలు ఆలోచించ డమే లేదు, నేనింకా. అదీగాక యేమి ఆలోచించడానికీ నాకు తీరుబాటు వుంటేనా? ఊపిరి తీయడానికేనా వ్యవధి లేందే? ఆ కొండరాళ్ళమీద, యెండకీ వెలుతురికీకూడ మొహంవాచిపోయి, తెల్లవారింది లగాయితు చీకటి పడే దాకా వెన్ను విరిగేలా చాకిరీ చేసుకుంటూ పడివుండాల్సిన నేను దేన్ని గూర్చి ఆలోచించ గలనో చెప్పండి? నా దౌర్భాగ్యం! ఏం చేస్తాను?

వేగిన మాంసంవాసనా, కాలిన రొట్టివాసనా యింట్లో దట్టంగా వ్యాపించినాయి. పొయ్యిదగ్గర పనిచేస్తూన్న నా యిల్లాలి చెక్కిళ్ళకంద, మంకెనపూలు పూస్తున్నాయి. విల్హో దృష్టి ఒక్కక్షణం యెల్సామీద పడింది. వాడికేం జ్ఞాపకం వచ్చిందో యేమిటో నాకేసి చూడకండానే అడిగేడు:

'నా గురించి నిన్నెవరూ అడగలేదూ?'

నా కాశ్చర్యం కలిగింది.

'నిన్నుగూర్చి యెవరికి కావాలిరా, యిక్కడ?'

'ఆఁ! ఎవరూ లేదు...ఎవరేనా...నా పరిచితు లెవరైనా అడిగేరేమో నని లే.'

'అబ్బే! లేదురా...లేదనుకుంటా,'

ఎల్సా టేబిల్ మీద యేవేవో సర్దుతూంది. ప్లేట్లు చప్పుడైనాయి. ఆమె వసారాలోకి పోయి బట్టలు మార్చుకుని, మందారపూరంగు ఫ్రాకు తొడుక్కుని లోనికి వచ్చింది, మళ్ళీ ఫ్రాకు చేతులు మోచేతులపైకి మడిచి, పైన తెల్లని అప్రాను (పని చేసేటపుడు దుస్తులు మాయకండా పైన ధరించే మాపు గుడ్డ) వేసుకుని వుందామె. పరిపుష్టములైన ఆమె మోచేతులక్రింది గుంటలు యెంతో అందంగా వున్నాయి. ఎల్సా హెచ్చరించింది:

'ఇంకెందుకు కనిపెట్టు క్కూర్చోడం?'

టేబిలుమీద అన్నీ సిద్ధంగా వున్నాయి. తెల్లని టేబిలు గుడ్డమీద ప్లేట్లలో చల్లటి పందిమాంసం, జున్నూ వున్నాయి. గిన్నెల్లో వేగిన వుర్లగడ్డముక్కలు, మాంసం మూతబెట్టి వున్నాయి. టేబిలుమీదే దళసరి అట్ట పెట్టి దానిమీద వేడి బాణలి వుంచింది. బాణలిలో చేపముక్కలు దోరగా వేగి చుంయ్ మంటున్నాయి యింకా.

నేను సాభిప్రాయంగా యెల్సా వైపు చూసేను. ఆమె కళ్ళతోనే గదిమూలలను సూచించింది. ఆ మూల్లో ఐదు సీసాలనిండా ద్రాక్షమధు వుంది! యుద్ధకాలంలో ఆమె నిలువ చేయగలిగినదంతా యింతే.

'అంతా సిద్ధంగా వుందికాదూ?' అన్నా నేను.

'కనబడ్డం లేదూ?' అందామె.

నేను మళ్ళీ ఒక్కసారి గదంతా కలయచూసేను, ఇల్లంతా పండుగకివలె అలంకరించి వుందని అంతవరకూ నేను గమ

నించనే లేదు. ఎల్లా యిదంతా యెప్పుడు చేసిం దబ్బా! ఇంటికి యిల్లాలే దీపం అంటారు యిదే లావుంది! ఆడదిక్క లేని యిల్లు యిల్లుటండీ, వల్లకాడు గాని? కిటికీలకి చలువ తెరలు కట్టింది; టేబిలుమీద తెల్లటి గుడ్డ పరిచి, పూల దాను వుంచింది. శిశిరఋతువులో పువ్వు లేం వుంటాయిలెండి. కాని, మా మార్తా పాతిన పూలమొక్క లున్నాయిగా. వాటిని అపురూపంగా నాలుగుపూలుంటే అవే పూల దానులో వుంచింది.

నెగడి బాగా మండుతూ, గది నంతనీ వెచ్చదనంతో నింపుతూంది. పొయిమీద దాకలో పులుసు మరుగుతూ, సువాసనలతో మమ్మల్ని పూరిస్తూంది. పులుసుదాక, కాఫీ గిన్నె కూడ ధగధగ మెరుస్తున్నాయి, వెండివాటిలాగ. షెల్ఫుమీది పాత్రసామగ్రి అంతా ఒబ్బిడిగా, పరిశుభ్రంగా వుంది. పొయిలోంచీ, నెగడిలోంచీ వచ్చే మంటలు ఆగిన్నెల్లో ప్రతిఫలించి, రంగురంగులుగా మెరుస్తూన్నాయి. ఇంట్లో అన్నిటికిమల్లేనే యిల్లాలుకూడా మాంఛి యిదిగా వెలిగి పోతూంది. ఎల్గా మూలాన్నే యింట్లో అన్నీ అంత ఆకర్షణీ యంగా వున్నా యన్నసంగతి విల్హోకూడ గుర్తించినట్లుంది, అన్నాడు:

'నువ్వు అదృష్టవంతుడివిరా, ఐనార్!'

విల్హో యేదో ఆలోచనలో పడ్డాడు. నేను మూలనున్న సీసా తెచ్చి, బిరడా తీసి మూడు గ్లాసుల్లో నింపేను బ్రాందీ

మధువును. ఎల్సాకూడా వచ్చి కూర్చుంది. ముగ్గురం గ్లాసు లెత్తేం త్రాగటానికి. విల్హో అన్నాడు:

'ఒదిన ఎల్సా ఆరోగ్యానికై!'

ఎల్సా నవ్వుతూ అంది:

'కాదు! నేనా కోరికకై త్రాగను.' అంటూ విల్హో వైపు కొంటెగా చూసింది. 'ఇదిగో! జీవితభాగస్వామిగా తనకీ ఒక ఎల్సాని చూసుకుంటూన్న వాళ్ళకోసం!'

పెద్దగుటకల్లో మేం మా గ్లాసులు ఖాళీ చేసేము. ఎల్సా లేచి పొయిమీద కాలుతూన్న రొట్టెలు చూడ్డానికి వెళ్ళింది. నేను గ్లాసులు మళ్ళా నింపేను. విల్హో గ్లాసుదూరంగా త్రోసేసి ఫోర్కుతో చేపముక్క తీస్తూ అన్నాడు:

'తను దూర సందు లేదు మెడకో డోలుట! నాకు తల దాచుకొనే చోటు వుంటేకదా, భార్యను గూర్చి ఆలోచించడానికి!'

వాడనేది నాకు తెలియక నోరు వెళ్ళబెట్టడం చూసి, తన అభిప్రాయాన్ని విస్పష్టం చేసేడు:

'ఇప్పుడు నేను క్రీమరీలో పని మానుకున్నానుగా, అన్నయ్యా!'

'ఏం? ఎందుకురా?'

'ఆc! ఏముంది?...భరించలేక.' వాడు భుజాలు కుంచించుకున్నాడు.

'ఐతే మరేం చేస్తావు?'

'దాం దేముందిలే. నా చేతులు చల్లగా వుండాలే గాని పనే దొరక్కపోతుందా?'

నేను గ్లాసులు నింపుతూనే వున్నా. ఎల్సా మా ప్లేట్లు ఖాళీగా వుండకండా భర్తీ చేస్తూనే వుంది. ఐదో గ్లాసు పుచ్చుకున్నాక విల్హో అన్నాడు:

'తెగబలిసి నున్నని జిడ్డోడుతూండే కల్లీ పాడుమొహం చూసి చూసి అసహ్యం వేసింది. ఈ మాట వాడి మొహం మీదే చెప్పేసేను. అక్కడే యింకావుంటే యెప్పుడో నాలుగుపోట్లు యిచ్చేస్తానేమో! అనికూడ చెప్పేను! 'ఎందు కంత కోపం?' అనడిగే డాయన. 'యుద్ధం మూలంగా తెగ బలిసిన వాళ్ళని చూస్తే నా కమిత అసహ్యం' అని జవా బిచ్చేను. 'అందుకే ముందుగా చెప్పడం మంచిదిగదా?' అంటే యజమాని అంగీకరించి, వెంటనే నా జీతం లెక్కచూసి యిచ్చేసేడు.'

ఎల్సా మా ప్లేట్లలో మాంసం వేపుడూ, పుర్లగడ్డలూ మళ్ళీ వడ్డించింది. నేను గ్లాసులు మధువుతో నింపి, మూల నించి మూడో సీసాకూడా తెచ్చేను. ఇద్దరంసమంగానే పుచ్చు కుంటున్నా అప్పుడే నా తల తిరిగిపోతూంది. కాని విల్హో చెప్పేదంతా బహుయత్నంమీద వింటూ, అర్థం చేసుకుం టూన్నా: యజమాని మొగం యెంత పాడుదైతేమాత్రం పని మానుకుని పోడానికి యెల్లా సాధ్యమో. అర్థం కాలేదు, నాకు! ఈ లోకంలోని యజమానులలోని పాడుమొగాల కేం వెతుక్కో నక్కర్లేదుగా?.....

అబ్బే! పాడుమొగాల్ని గూర్చి విల్హో చెప్పిందంతా వట్టి చెత్త! నన్ను మాటలతో బోల్తా కొట్టించలేడండీ, ఎవడూ! పైకి అంతగా మాట్లాడనే గాని నాకన్నీ అర్థ మవుతాయి. మా విల్హో మొహం కంది ఎర్రబడింది; కళ్లు జ్యోతుల్లా వెలుగుతున్నాయి. వాడిలో యేదో ఆవేశం పెల్లుబుకుతూంది. నా బుర్ర తిరిగిపోతూ, తలలో యేవో శబ్దాలు బైలుదేరినాయి. కిటికీల తెరలు, పక్కమీది తలగడలు, టేబిలు, వంటగిన్నెలు, ఎర్రని ప్రాకుమీద తెల్లటి ఆప్రాన్లతో వస్తూపోతూ, వడ్డిస్తూ తిరిగే యెల్సా,- ప్రతీదీ నాట్యం చేస్తూన్నట్లూ, మినుకు మినుకు మంటూన్నట్లూ తోచి, నాకెంతో వుల్లాసం కలిగింది. చేతు లెగరెయ్యాలనీ, బిగ్గరగా నవ్వాలనీ అనిపించింది. గాని అంతలో మళ్ళీ విల్హో యేదో చెపుతూంటే వింటూ తలూపుతూ కూర్చునిపోయేను.

'వాళ్ళ గుసగుసలతో విసిగిపోయే ననుకో. ఎప్పుడే సందర్భం వచ్చినా యుద్ధంగొడవ తెచ్చి, వెధవ వెకవెకలు ప్రారంభిస్తారు! అదింక సాగనీయకూడ దనుకున్నా. ఒకరోజున ఎలియాస్ పిట్టూనెన్ తో అంటూంటే విన్నా; 'నువ్వింకా కుర్రాడివురా. ఓ చెంప కొడితే పాలు గారుతాయి, అల్లాంటిది యుద్ధం సంగతి నీకేం తెలుస్తుందిరా? పిర్కీలీ! అనుభవం వున్నవాళ్ళదగ్గర నేర్చుకోరా. వాళ్లురా భలే తెలివైన రకం! యుద్ధప్రారంభంలోనే రిస్సావైపు పారిపోయి, అంతా

పూర్తయేదాకా అక్కడే అణిగిమణిగి వుండిపోయి, యిప్పుడు పైకొచ్చి 'నేనూ యుద్ధం చేసే, నంటూ బాకా వూత్తూ తిరుగుతూన్నారు! అసలైన వీరులు వాళ్ళురా! వాళ్ళదగ్గర నేర్చుకోవాలిరా! హ్హా! హ్హా! హ్హా! పిర్కిలీ!' అంటూ ఒకటే వెకవెకలు పకపకలు. పిట్టూనెక్, ఆ తే లిద్దరూ వెడవెడ నవ్వులు ప్రారంభించేరు, నాకేసి చూస్తూ. నే నూరుకో లేకపోయేను. వాళ్ళదరికి పోయి, నిర్మొగమాటంగా చెప్పేశాను. 'మీ పళ్ళు విరగ్గొట్టకండా న న్నవడపగలడురా? మీలాంటి వెధవల్ని కొట్టి నా చేతులు పంకిలం చేసుకో దలచడం లేదు. ఎలియాస్! నీ అదృష్టం బాగుండిపోయిందిరా! నువ్వు యిదివరకే చావచితక దెబ్బలు తిని, పళ్ళూడగొట్టించుకో బట్టి బ్రతికిపోయేవురా! బ్రతికిపోయేవు! నన్ను యెల్లా పట్టుకున్నారో వివరాలుగల కాగితాలు మన ప్రభుత్వానికి వచ్చేయిరా. నా మంచిచెడ్డలు అవే చెబుతాయి.' ఆ తే వికటంగా అన్నాడు: 'ఆఁ! పోరా! అసలు సంగతి దాచిపుచ్చడానికి యేం చెయ్యాలో రిస్సా వాళ్ళెరుగుదురు లేవోయ్!' పిట్టూనెన్ శ్రుతి కలిపేడు? 'నిన్ను ప్రచారకుడుగా వేసినట్లున్నారు! అందుకనే అసలు సంగతి కప్పిపుచ్చేరు!' ఇది విని ఎలియాస్ విరగబడి పోయేడనుకో, నవ్వుతో. 'రైట్! పిర్కిలీ! నిజం చెప్పేవ్రా!' ఆ పళంగా నే నక్కడినుంచి వెళ్ళిపోయేను. ఆ నరకంలో నే నొక్క నిముషం వుండలేనురా. వాళ్ళ మాటలు వినేసరికి నా చేతులు దురద పెడతాయి. లంజా

కొడుకులు! చావనీ!......వదినా! ఇల్లా మాట్లాడినందుకు క్షమించు. అన్నయ్యా! నా కింకో గ్లాసు పొయ్యరా. నువ్వూ తాగు! ఒదినా! ఎందుకు వూరికే అటునిటు తిరుగుతావు? ఒక్క క్షణం కూర్చోరాదూ? ఈ బిస్కట్లు యెంత బాగున్నాయి! ఇవెల్లా చేసేవమ్మా, ఒదినా?'

వాడి గ్లాసు నింపుతూనే వున్నా, వాడు ఖాళీ చేస్తూనే వున్నాడు. కాని నాలో పుట్టుకొచ్చినట్టు కులాసా వాడిలో పుట్టుకురాందే! తాగుతూన్నకొద్దీ వాడి సీలికళ్ళు మరింతగా విషాదావృతమైపోతూన్నాయి. వాడి విశాలఫాలభాగంమీద ముడుదలు పోగుపడుతూనేవున్నాయి. అలిగిన పిల్లవాడిలాగ మూతిమూరెడు ముందుకి పెట్టుకూర్చున్నాడు. ఔనండీ! వాడేం ఆరిందా యేమిటి? వాడెన్ని కష్టాల ననుభవించిన వాడైనా యింకా కుర్రాడే గాదుటండీ.

ద్రాక్షమధువు నా హృదయాన్ని తేలిక పరచింది. నా కేదో పాడాలనీ, అరవాలనీ, చేతులు విసరాలనీ మహా యిదిగా వుంది. నాతమ్ముడుకూడా నాకుమల్లేనే సంతోషంగా వుండాలని నా వాంఛ. అందుకనే వాణ్ణి హెచ్చరించకండా వుండలేకపోయేను.

'హుషారుగా వుండరా, విల్లో! వెధవ వెంగళాయలు యేదో కూస్తే వ్యగ్రతపడడం యెందుకురా? వాళ్లకేం తెలుసు! వాళ్లేం చూసేరు? అనుభవించేరు? తెగబలిసిన యజమానికి ముడ్డి వెనక తాళం వెయ్యడమే వాళ్ళకి తెలిసినదల్లా. తాగరా! ఇంకోగ్లాసు!

ఇంకో గ్లాసు పుచ్చుకున్నా వాడిలో హుషారు కలగ లేదు. ముఖం ముడుచుకుని మూల్లోకి అదేపనిగా చూస్తూ అలిగిన పిల్లాడిలా అల్లాగే కూర్చున్నాడు, వాడు.

'రష్యన్‌లవైపు పారిపోయేనట! వెధవలు! ఒక్కమాటు అది యీ వెధవలకి రుచి చూపించాలి, తెలుస్తుంది! మళ్ళీ కలికంలోకి ఒక్క పిసరుకూడా దొరకదు! పిర్కీలీ!...... క్షమించు, ఒదినా! నా బుర్రలో పిశాచాలు పరుగెడుతున్నాయి. ఆడవాళ్ళ యెదుట పరుషాలు మాట్లాడుతున్నా, నా తెలివిమండా! ఇదంతా అన్నయ్య తప్పే. ఇంకో గ్లాసు పొయ్యరా, ఐనారీ!...నీకు కోపం వచ్చిందా? ఒదినా! రాలేదుగదూ? ఆఁ! అదీ!...అన్నయ్యా! ఇంకో గ్లాసు పుచ్చుకుందాము, పట్టు! నాలుగేళ్ళయింది. ఫర్వాలేదులే, యెప్పుడేనా తాగితే. తర్వాత మళ్ళీ వుపవాసం చేస్తాం. నీకేం లేరా, నువ్వు మానసక్కర్లేదు. నేను వుండాలిలేరా పస్తు! ఆ మాటకొస్తే నువ్వు రోజూ చెయ్యొచ్చు, మజా. నీకేంరా, సంతోషంగా వుండేందుకు నీకు కొన్నేనా కారణాలున్నాయి. ఇల్లూ వాకిలీ వుంది, ఎల్సా వుంది! అన్నిటికంటె ముఖ్యకారణం అదే చాలురా!'

కాని, యిదొక సంతోషకారణమని ఎల్సాకు అంగీకారం కాలేదు. అంచేత వాడిమాట కడ్డొచ్చి అంది:

'కొండమీద కోళ్ళగుడిసెలో కాపురానికే అంత సంతోషించాలా?'

వాడు ఆమె ననునయించేడు:

'కొండమాట నిజమే అనుకో, ఒదినా! కొండరాళ్ళు మానవుణ్ణి బంధించి, క్రుంగదీసే మాట నిజమే. కాని ఆ బంధనాలు తెగిపోయే కాలం దగ్గరలోనే వుంది. ఇంకెన్నో రోజులు మీరీ కొండమీద వుండ నక్కర్లేదులే. తుపాను షైలుదేరింది. మన సువోమీ నంతనీ మూలమట్టుగా కదిలించేస్తాం దిప్పుడు.'

తొందరగా వాడి గ్లాసు నింపేను. ఆఖరి సీసా ఇమత్రన్ కువోహూ* టేబిలుమీద వుంచింది, ఎల్సా. విల్హో యేదో చెప్పా లనుకుంటున్నాడని తెలుసు, నాకు. అది నేను ముఖ్యంగా వినాల్సిందే ఐవుంటుంది, బహుశా. అదేమిటో నాకేమీ అంచనా లేదు. కాకపోయినా, నాబోటి మూఢుడికి, కొండవాడికి అంత తెలివెక్కడుంటుంది? నా దృష్టంతా వాడి ముఖంమీదే వుంది. ఇప్పుడింక నాకు నవ్వాలనీ, చేతులు త్రిప్పాలనీ లేదు. విచారం నా హృదయకుహరంలోకి ప్రవేశించి పీఠం వేసుకుని. కూర్చుంది. గ్లాసులో మళ్ళీ నింపుతూ, విల్హో యేమి చెపుతాడో అని ఆదుర్దాగా కనిపెట్టుకుని వున్నాను:

'మా ఓబర్ లెప్పినెం టున్నాడే వాడు పట్టి బడాయికోరు, పూటిగోరింక! ఆరోజున మమ్మల్ని సమావేశపరచి, 'కుర్రా

* ద్రాక్షమధువు. ఇమాత్రా అంటే నురుగు. పులిసి నురుగులు జేరు ద్రాక్షరస మని అర్థం.

ళ్ళు! ఇంకొక్క త్రోవ. అంతే. ఒక్క వూపు చాలు. లడోగా సరస్సీరానికి పోయే రహదారులన్నీ బందీ! రష్యన్లని చక్రబంధంలో నొక్కేస్తాం. ఇదొక పరీక్ష అనుకోండి. ఈ చిన్న స్థానికపరీక్షలో జయం సంపాదించేమంటే యిక మనల్ని అడ్డగలశక్తి లేదనుకోండి! లడోగా సరస్సుమీదుగా బోల్షివిక్ల మార్గాలన్నీ బంధించేస్తాం. అంతే! పీటార్ మన చేతుల్లో పడిపోతుంది. తెలిసిందా!' అని వాగేడు. పాడు పీనుగ! జర్మన్ శానిస! పన్నీరులో మునిగిన పంది! ఏడీ, వాడిప్పుడెక్కడున్నాడు? పులుసులోకేనా ఒక్క ముక్క దొరికివుండదు! వాడు కోరుకొన్నదే లభించిందిలే! మా కంపెనీ తప్పే ముందంటావు? ఏం చక్కని కుర్రాళ్ళురా! తోయివో కోస్కినెన్, కల్లీ అహోలా, జాల్మరీ కివిమాకీ, జూహో పెల్టోనెన్...అందరూ నూనూగుమీసాల యువకులు! అర్థం శుభం తెలియని అమాయకులు! కలలో కూడా యుద్ధం కోరనివాళ్ళు! 'స్థానికపరీక్ష' లో ఆహుతిగా పంపింది, వీళ్ళని! మన కెదురుగా నిలబడింది ఒక అజేయ శక్తి అని మరిచిపోయేం. దొంగచాటుగా ఓ దెబ్బ కొట్టి, ఓడించేసే మని చంకలు గుద్దుకొన్నాం. ఆ దెబ్బ కొట్టేసరికే మనకి తలప్రాణం తోకకి వచ్చింది. కాని శత్రువు పడనేలేదు. ఊతం చూసుకోడానికి ఒక్క అడుగు వెనక్కి వేసేడు. బల పరీక్షట! వాడి పిండాకూడు! ఇదంతా మనం ఆలోచించనే లేదు. మా బెటాలియన్లోని మొగతా కంపెనీలేమైనాయో

నాకు తెలియదు. కాని, మా కంపెనీకి యేమైనదీ తెలుసు. మేము యెంతోదూరం ముందుకి పోనేలేదు. రష్యన్‌లు మమ్మల్ని కనిపెట్టి చూస్తూ, కాచిపెట్టుకునే వున్నారు. కొంత ముందుకి రానిచ్చి దరువు ఆరంభించేరు !'

ఒక్కమాటు ఆగి, కనుబొమలు చిట్లించుతూ మళ్లీ సాగించేడు:

'అల్లాంటిది నువ్వెప్పుడూ చూసి వుండవురా, ఐనారీ! చూడకపోడమే మంచిదిలే. అదృష్టవంతుడివి! బ్రతికిపోయేవు. మిన్నులు బద్దల్తె అనుకో. భూమ్యాకాశాలు దద్దరిల్లి పోయేయి. క్షణంలో ఆ మూలనుంచి యీ మూలకి భగ్గుమని అంటుకుం దనుకో. క్రమ్మిన పొగంతా గాలికి తొలగి పోయేక చూద్దునుగదా, నేలంతా దున్నినట్లు నల్లగా వుంది! మంచు కప్పిన ఆ నేలంతా రెప్పపాటులో దున్నేసి, తిరగ తీసినట్లు దుమ్ముదుమ్మైపోయింది! ఆ దుమ్ములో మావాళ్ళ కోసం కన్ను పొడుచుకు చూసినా లాభమేమిటి? నేను యేదో నక్కబొరియలో పడిపోయేను. అందుచేతనే బ్రతికిపోయేను! స్పృహ వచ్చేటప్పుడు ఆగి, పొగ తొలగేక సమాధిలోంచి పైకొచ్చినట్లు వచ్చి చూద్దును గదా, గుండె లాగిపోయేయి. రష్యన్‌లు కొందరు నావైపు పరుగెత్తి వస్తున్నారు. చుట్టూ అంతా శూన్యం. నా కంపెనీ యేదీ? ఫిర్కా లీ! తోయ్‌వో కోస్కినెన్, కల్లీ అహోలా?......ఎవరూ లేం దే! రష్యన్‌లు పరుగెత్తు కుంటూ వచ్చి నా చేతుల్లోంచి టామీ గన్ లాక్కున్నారు,

గ్రెనేడ్లూ, బాకూ కూడా లాగేసేరు. తమ వెనకే నడిచి రమ్మని సంజ్ఞ చేసేరు. అప్పుడు హఠాత్తుగా గుర్తొచ్చింది, నేను సిమ్మనసీ వాళ్ళు రష్యన్లనీ! వాళ్ళని చంపాలనీ, పోరాడాలనీ ఆజ్ఞ లున్నాయి! ఆయుధాలు లేవు. కాని నా పిడికిళ్ళే మైనాయి? అంతే. ఆ పళంగా వాళ్ళలో ఒకణ్ణి గూబ కద లేసేను. వాడు ధూళిలో సాష్టాంగంగా పడిపోయేడు. మరోడు తుపాకి మడమతో నా నెత్తిమీద మోదేడు. నిస్సహాయంగా మోకరిల్లి పడిపోయేను. మొదటివాడు లేచి టామీగన్ గురిపెట్టే సరికి నా పని అయిపోయిం దనుకున్నా. వాడి కళ్ళల్లోని కసినిబట్టి ఆ గుళ్ళన్నీ నా గుండెల్లో దూరుతాయని నాకు తెలిసి పోయింది. కాని నన్ను కొట్టినవాడు చట్టుక్కున ఆ తుపాకిమడమతోనే టామీగన్ను ప్రక్కకి నెట్టేసేడు. క్షణంలో గుళ్ళు నా చెంపల్ని దూసుకుని ఝుంయ్ మని పోయేయి. వాళ్ళిద్దరూ ఒకరి నొకరు కేక లేసుకున్నారు, కాస్సేపు. అంతలో శాంతించి మొదటివాడు ఓ తీగముక్కతో నా రెండుచేతుల్నీ వీపువెనక కట్టేసేడు. తన వెనక్కాలే నడిచిరమ్మని శిరఃకంపంపూర్వకంగా సంజ్ఞ చేసి అతడు ముందుకు సాగేడు. నే నొక్కసారి ఆ శ్మశానభూమిని వెను దిరిగి చూసి, పరిస్థితిని అవగాహన చేసుకున్నా. నా కళ్ళ ముందునుంచి తెర తొలగినట్లైంది. లోపలినుంచి యేడుపు ముంచుకొచ్చింది. ఎంత ఆపుకుందామన్నా ఆగందే! ఎంత భయంకరదృశ్యం. అయ్యో! ఎంత చక్కని కుర్రాళ్ళు! ఎంతటి

అమాయికులు, నిర్దోషులు!......వాళ్ళందరూ చిరకాలం జీవించాలని కోరుకున్నవాళ్ళే. జీవించడానికి హక్కుంది, వాళ్ళకి. కాని, ఎవడో దుర్మార్గుడు, పాపి,- మా అందర్నీ చిన్న? స్థానిక బలపరీక్ష'కి పంపించేడు. ఫలితం స్పష్టమే!... తీగ చేతులకి నరదలు కోస్తున్నా నాకు నొప్పి తెలియడమే లేదు. పొడుగునా తూలుతూ, కాళ్ళీడ్చుకుంటూ, యేడుస్తూనే నడుస్తూన్నా. ఆపుకుందామని యెంత ప్రయత్నించినా నావల్ల కాలేదు. ఆ దృశ్యం అంత భీభత్సంగావుంది.........'

గ్లాసులోని ద్రాక్షరసాన్ని ఒక్క గుక్కలో వొంపుకుని త్రాగేసి, దూరంగా తోసేసేడు. టేబిలుమీది ప్లేట్లన్నీ దేన్నో తీసుకుందా మనేమో తాకేకేడే గాని ఒక్కటీ తీసు కోనేలేదు. వాడి మాటలు వింటూన్న నాకూ దుఃఖమే కలి గింది. ఏనా అతిథిని విచారంలో వుంచకుండదు. వాణ్ణి సంతోష పెట్టడం నా విధి. నా సందేహాల కేం వచ్చిందిలెండి? అంతగా వస్తే సెనే ఆలోచించుకుని, నా సందేహాలకి సమాధానాలు పొందగలను. నాయింట అతిథిగా వున్నప్పుడు నా తమ్ముడు విచారంగా వుండకూడదు. అంతే మరి. ఇంకేమైనా చేయ నీండి. నన్నే తిట్టినా, పరిహాసం చేసినా,-చెయ్యనీండి. వాడు విచారంగా వుండకపోడమే నా క్కావాల్సింది.

నేను వాడి భుజం తట్టుతూ అన్నాను:

'సరేరా, విష్ణో! అదే పోయిందిలెద్దూ, దాన్ని గురించి ఆలోచించకు. దాన్ని తగులబెట్టేరిలే,గు జరిగిపోయిం దాన్ని

గూర్చి విచారించడం దేనికిరా? లాభ మేమిటి? హుషార్‌గా వుండు. ఏదీ ఒక్కమాటు నవ్వవు? లేకపోతే యేదో కథ చెప్పరా. నామీద చెప్పినా సరేరా, చిరాకు పడనులే. నిజంగా. ఎల్లా! వాడి గ్లాసులో యింకొంచెం కాఫీ పొయ్యి.'

నన్నూ మెల్లానీ చూసి చివరికి వీళ్లో నవ్వేడు – కాఫీ తాగుతూ అన్నాడుగదా:

'నీకో కథ చెప్పనురా?'

'ఊఁ! కానీ. కథైతే చెప్పు.'

నా కళ్ళ ముందరి మబ్బు విడిపోడానికీ, చురుకు కలగ డానికీ ఒక్కసారి తల విదిలించేను. తల దిమ్ము తీరి, కొంచెం తేలికైంది. కథైతే మంచిదే. కానీ, చెప్పనీండి, మరి.

'అనగనగా యిరుగూపొరుగున యిద్దరు ఫిన్నులుండే వాళ్ళు. ఒకడు సత్‌స్వభావం గలవాడు, వుల్లాసి, మహా కాయుడు, బలిష్ఠి. రెండోవాడు నిస్సంతోషి, నిరంతరం రుస రుస లాడుతూంటాడు. ఉల్లాసి ప్రతిదినం నిస్సంతోషిని సమీ పించి స్నేహపూర్వకంగా చిరునవ్వుతూ చేతులు జాచేవాడు. కాని నిస్సంతోషి యే మాటామంతీ లేకండా కరవొచ్చినట్లు పళ్ళికిలించేవాడు. ఐనా వాడేమీ అనుకోకండా మళ్ళా మర్నాడుకూడా చిరునవ్వుతూ వెళ్ళి, సస్నేహంగా చేయి జాచేవాడు. నిస్సంతోషి మాత్రం తన్ను గానట్లు, విరసంగా ముఖం చిట్లించి వూరుకునేవాడు. స్నేహశీలి మాత్రం మన సులో కక్ష పెట్టుకోకండా మర్నాడూ అల్లాగే స్నేహభావం

చూపేవాడు గాని మళ్ళా అపజయమే పొందేవాడు. చివరికి వాడి ఓరిమి ఆఖరై పోయింది. ఇల్లాగ ఒక యేడాదంతా రోజూ జరిగితే యెవరికి రాదు, కోపం? వాడు ఓ కఱ్ఱ పుచ్చుకుని చలపాది బుఱ్ఱమీద రెండు తగిలించేడు, ఓ రోజున. దెబ్బ తగలడంతోనే చలపాది భళ్లున పగిలిపోడం చూసి, స్నేహశీలికి యెంతో ఆశ్చర్యం వేసింది. తీరా చూస్తే పగిలింది చలపాది బుఱ్ఱ కాదు! వాణ్ణి ఆపాదమస్తకం ఆవరించి గడ్డకట్టుకు పోయిన మంచుపొర పగిలింది! ఎవరో వాణ్ణి మంచులా ఘనీభవింపజేసి, కొయ్యబారించి అల్లా చేసేరట! అందుకనే వాడు యింత కాలాన్నుంచీ చిఱునవ్వడం గాని చెయ్యి జాపడం, తలూపడం గాని చేయలేదు. పొర తపీలుమని విచ్చిపోగానే అసలు మనిషి బైటబడి తలూపి, చిఱునవ్వుతూ, చెయి జాచేడు! స్నేహశీలి వాడి చేతిని స్నేహపూర్వకంగానే చాలన చేసేడనుకో. చివరకి వాళ్ళిద్దరూ అసలు యే తేడాపాడాలూ లేని సజాతీయులూ, సుస్వభావులూ అని తేలింది, చివరికి. ఇద్దరూ బలిష్ఠులే; కన్నుముక్కు తీరు, తలకట్టు అంతా ఒకటే వాళ్ళిద్దరికీ, రక్తసంబంధీకుల్లాగే కనిపించేరు. తామెందుకు గాఢాలింగనం చేసుకోరాదు? ఇద్దరూ స్నేహితులై పోయేరు, ఆ దెబ్బతో! మొదటివాడు దెబ్బ కొట్టడం మంచిదే అయింది కదూ? ఏం, అన్నయ్యా?...'

మోచేతులు టేబిలుమీద పెట్టి, గడ్డం క్రింద చేతులానించి, మాటాడకండా శ్రద్ధగా వింటున్నా, వాడు చెప్పేది.

నా కళ్ళు బాగా తెరుచుకునేవున్నాయి. మబ్బుతెర తొలగి నట్లుంది. నే నింతకాలంనుంచీ వినా లనుకుంటూన్న దేదో చెవుతూన్నట్లుంది, విన్లో. ఒక్కమాటా జారిపోకండా వాడి వైపే చూస్తూ పళ్ళూ - గుప్పిళ్ళూ బిగించుకుని వింటూ కూర్చున్నా, నేను.

విన్లో కథ పూర్తిచేసి చిరునవ్వుతూ నన్ను చూసేడు. వాడి కళ్ళలోంచి వుబికే కొంటెచూపులు నవ్వుకుంటూన్నట్లు తోచింది, నాకు. వాడు మళ్ళీ అన్నాడు:

'కొండమీద వుండికూడా నువ్వు దేనినీ ఆశలేకపోవడం విచారకరం. ఐనారీ! నిన్ని రాతిబండలే క్రుంగదీసి నట్లుంది! నువ్వు నీ పొరుగువాణ్ణికూడా తెలుసుకోలేని అవ్యక్తస్థితిలోనే వుండిపోయేవు. అన్నయ్యా! నువ్వింతమాత్రమైనా తెలిసికొని వుండాల్సిందిరా.'

ఉన్నట్లుండి నేను లేచేను. ఇంకొక్క క్షణమైనా వింటూ కూర్చోలేను. ఇప్పటికి విన్నదీ, కన్నదీ చాలు. ఇకచాలు నంటూ, ధిక్! ఇక వూరుకోను. లేచి నిల్చుని బెంచి వెనక్కి గెంటేసేను. పిడికిలితో టేబిలుమీద గబగబా గుద్దేస్తూంటే, దానిమీది వస్తా అదిరి గంతులేస్తున్నాయి. నా వుద్రేకం చూసి యెల్సా మందలింపుగా అరిచింది:

'ఇదేమిటి? నీ కేమైనా పిచ్చెత్తిందా?'

లేదు! నాకు పిచ్చెత్తలేదు. నాలో యింతదాకా భావాల న్నిటినీ అణచుకుంటూవచ్చేను. వాటిని బైటికి వెలిబుచ్చక

తప్ప దింక. ఒక్క క్షణమైనా యింక నుంచోలేకపోయేను. బిగ్గరగా అరవాలని వుంది. కాని యింట్లో పిల్లలు నిద్రబోతూన్నారని జ్ఞాపకం వచ్చి, రివ్వున వాకిట్లోకి పరుగెత్తేను. ఎల్లా చప్పున తప్పుకుని నాకు దారి యిచ్చింది.

అక్కడ, ఆ గాఢాంధకారంలో, యెముకలు కొరికే శిశిర ఋతు కాళరాత్రిలోకి నాగొంతు వురిమింది, పిడుగులు వర్షించింది. నాలో యేదో ప్రచండశక్తి పెల్లుబికి రా ప్రయత్నిస్తూంది. దాన్నేం చేయాలో తెలియక కొట్టుమిట్టాడుతూ, మా కొండమీదంతా వెతుకుళ్ళాడేను. అసంపూర్తిగా వున్న షెడ్ దగ్గర పడున్న రాళ్ళగుట్ట కళ్ళబడీ బడ్డంతోనే వాటిని యెత్తి, కొండదిగువకి విసరడం ఆరంభించేను. నలభై రెండేళ్లు నోరెత్తకండా పడి వున్నాను! ఇంత వయస్సువచ్చి ప్రయోజన మేమిటి? కనీసం నోరెత్తి యేదో ఒకటి ఒక్కసారైనా అసమ్మతిసూచకంగా అరవొద్దూ? చింతకాయలకి అందెంగాని గుటకలకి అందె మేమిటండీ? అదీగాక నేనేం చేస్తూన్నానో నాకే తెలియని స్థితిలో వున్నానుకూడాను. బిగ్గరగా అఱపులూ, బొబ్బలూ పెడుతూ, పెద్దరాళ్ళని దూరంగా విసిరేస్తూన్నానులావుంది! ఏమిటో లెండి. నేనా రాత్రి కాస్త యెక్కువగా పుచ్చుకున్నట్టున్నా. మే మిద్దరం త్రాగేం. అంత యెక్కువగా త్రాగివుండాల్సింది గాదు, మరి.....

# దక్షిణపవనం

## ముప్పైనాలుగో ప్రకరణం - విల్లో. హిల్డాల సమావేశం

పొద్దుట చల్దిభోజనం దగ్గర గతరాత్రి మిగిలిపోయిన సీసా కూడా ఖాళీ చేసేసేము. త్వరగా పనిలోకి బోవాల్సివుంది నేను. అప్పటికే వేళకుమించి నిద్రబోయేను. భోజనం చేస్తూ న్నంతసేపూ విల్లో క్రీగంట నావైపే చూస్తూ కనిపెడుతూ న్నాడు. ఉన్నట్లుండి వాడి కళ్ళలోకి ఒక్కోసారి కొంచెనవ్వు గానవస్తూన్నా, మొత్తంమీద వాటిలో ఆశ్చర్యమే యెక్కు వగా కనిపిస్తూంది. నిన్నను గాక యీ రోజే నన్ను కలిసి నట్లూ, నా గురించి యిప్పుడే తెలుసుకో నారంభించినట్లూ, నా భోగట్టా తన నాశ్చర్యచకితుణ్ణి చేస్తూన్నట్లూ వాడి వైఖరే వెల్లడిచేస్తూంది. కొంచెంసేపైన తర్వాత కొంచెం తేరుకుని అన్నాడు:

'అన్నయ్యా! తా నన్న మాటలకి పశ్చాత్తాప పడకూడ దురా, మనిషన్నవాడు. తర్వాత వెనక్కి తీసుకొనే మాట లెప్పుడూ యెవడూ వుచ్చరించనే కూడదు. వ్యథితహృద యంలోంచి వచ్చిన మాట లెప్పుడూ సత్యానికి దగ్గరగానే వుంటాయి. మన ప్రభుత్వం యీ మాటల్ని తన ఖాతాలో ఖర్చుపద్దులో రాసి వుంచనీ! అటువంటి మాటలు వెలువ డేందుకు కారణం మన పాలకులే గాని మరొకరు కానేకాదు'

ఒక్కక్షణం ఆలోచించినా అర్థంకాక అన్నాను:

'ఏ మాటల్నిగూర్చిరా నువ్వనేది? శీతకాల యుద్ధానంతరం మన యింట కూర్చుని నియాతీ చెప్పిన మాటలా?'

వాడు చిరునవ్వి, జవా బిచ్చేడు:

'అబ్బే! అవికా వన్నయ్యా! ఎవడేనా అలిసి, చిరాకుగా వున్నప్పు డన్న మాటలు ముక్కకిముక్కగా సాగదీసి అర్థం చెప్పరాదు. గతరాత్రి వినవచ్చిన వురుములుకికూడా యిదే సూత్రం వర్తిస్తుంది. ఎవడికేనా కోపంవచ్చి వురుములూ, పిడుగులూ పడ్డాయంటే కారణం ఆలోచించాలి. మన పాలకుల మూర్ఖవైఖరే దీనికంతకూ ప్రధానకారణం! వాళ్ళనే మనం దుయ్యబట్టాలి. అల్లాంటి మాటలు యెవరి నోటా రాకుండేటట్లు ప్రజాజీవితాన్ని సుష్ఠుగా, చక్కని పద్ధతుల మీాద పునస్థాపన చేస్తుందనే ఆశించుదాం. అల్లాచెయ్యడం పాలకులకే శ్రేయస్కరం అంటా!'

నేనేం జవా బివ్వలేదు. గతరాత్రి వురుములూ, పిడుగులూ విన్నాడట! కన్నాడట! అవేమిటి చెప్మా? వాడొకవేళ కలగన్నాడేమో? ఊఁహూఁ! నిజమే అయివుంటుంది. ఎల్సాకూడా రహస్యంగా నాతో అంది, రాత్రి భయంకరమైన కేకల్నిగురించి యేమేమిటో! కాని, వాళ్ళ మాటల్ని అంతగా పాటించను, నేను. ఎందుకంటే మా యెల్సాకూడ అప్పుడప్పుడు యెవరినేనా పిలకపట్టి ఆడించడం కద్దులెండి. ఎవరేనా అనే ప్రతీమాటా మనం నమ్ముతామా?

చల్ది గుడిచేక విల్సో పైకోటు వేసుకున్నాడు. నేను వేస్టు మాత్రం తొడుక్కున్నా. ఇంటినుంచి యిద్దరం కలిసే బైలుదేరేం. అప్పటికే తెల్లవారి చాలసేపైంది. క్రితం రోజులాగే యివాళకూడా తెరిపిగా వుంది. ఎండకాస్తూంది. పనికి బోయే వేళ మించిపోయింది. నేను నిద్ర లేవడమే ఆలస్యమైంది, అసలా రోజున. మేము చల్ది తినే సరికే యెల్సా గోశాలకి వెళ్ళి ఆవులపాలు పిండి వచ్చేసింది.

కుర్కుమాకీల పాగదగ్గర విల్సో నన్ను వదలిపెట్టేడు. కళ్ళలోని కొంటెతనాన్ని కప్పిపుచ్చుతూ, వెళ్ళేటపుడు నాతో అన్నాడు:

'ఐనారీ! నీ గురించిన నా అంచనా పొరబాటని గ్రహించేనురా. నా అంచనా పొరబాటైనందుకు చాలసంతోషంగా వుంది. నువ్వా యెన్నో కష్టాలు అనుభవించేవు, అనుభవాన్ని పెంపొందించుకున్నావు. ఇకముందు నువ్వు తలయెత్తుకుని తిరగదలచినట్లు స్పష్టమైంది. ఇప్పుడు నువ్వే నా కంటె యెన్నో రెట్లు బలవంతుడవు, అన్నివిధాలా. నా వ్యక్తిత్వం యింకా పరిణతంకాలేదు, పక్వస్థితికీ రాలేదు. నా జీవితపథం యింకా యిదమిద్ధమని తేలలేదు. ఆదర్శాలూ, ఉద్దేశ్యాలూ విస్పష్టం కావాల్సేవుందింకా, నాకు, అనుభవజ్ఞుల సలహాలూ, సాయమూ యిప్పుడు నా కెంతో అవసరం. మన పని మనం చేసుకుంటూ, తింటూ త్రాగుతూ, సంసారయాత్ర వెళ్ళబుచ్చుతూ వుండడంతోనే మానవుని విధులూ, కర్తవ్యాలూ

పూర్తి అయినట్లు గాదని గ్రహించేను. దేశహీనుడు, సంఘ దూరుడు చేయాల్సిన పని అది! ఈ విషయంలో నాకంటె నీదే ముందడుగు, అన్నయ్యా! పుస్తకాలు చదివీ, విజ్ఞానుల నుంచీ యెన్నో సంవత్సరాల్లో నేను నేర్చుకున్న దంతా నువ్వు యీ కొండమీదుండే కేవలం స్వానుభవంద్వారా నేర్చు కున్నావు! లేకుంటే నువ్వు మరెక్కడ నేర్చుకున్నావు? అబ్బే! కొండమీది కాపురం యెవరికేనా కన్ను తెరిపించగల శక్తి గలదిగానే కనిపిస్తూంది. జీవితమే ఒక పాఠశాల అని తెలు స్తూందిరా. నీలో బైలుదేరిన యీ నూతనభావాలు నీ జీవి తాన్ని యెల్లా మారుస్తాయో అనేది నా బుద్ధికి అందని విష యమే అనుకో. ఐనా, యెక్కడేనా యే విషయంలోనైనా నువ్వేమాటైనా చెప్పాల్సివస్తేమాత్రం, అది అమూల్యమైనదై వుంటుందనడంలో నాకే సందేహమూ లేదు. నువ్వుండే కొండమీది బండల్లాగే నీ మాటలుకూడా మంచి గురుత్వం గలవి. దేశంలోని ప్రజలందరూ మేల్కొని, చైతన్యవంతులై ఒకటే కట్టుబాటుమీద నిలచేలోగా మన మాతృభూమి యెన్నో కష్టనిష్టురాల్ని గడపవలసివుంది. కాని ఆ దినంయెంతో దూరంలో లేదు. అట్టి సాహసులు ఒక్కసారి బైలుదేరారూ అంటే చాలు. విముక్తిదినం త్వరలోనే వచ్చితీరుతుంది.'

వాడి కళ్ళలో కొంటెచూపు ఒక్కక్షణం పాటు మెరి సింది. అంతలోనే ఆత్మసంయమనం చేసుకుని గంభీరంగా అన్నాడు:

'ఇక వెళ్ళొస్తా, నన్నయ్యా! ఇంతట్లో నిన్ను కలుసుకో గల ననుకోను. మనం యేకోదరులం మాత్రమే గాదనీ యేకాభిప్రాయులంకూడా ననీ యెప్పుడూ గుర్తుంచుకుంటాను. నా కిప్పుడెంతో ఆనందంగా వుంది......'

అంటూ నా చేయి పట్టుకుని గట్టిగా ఒత్తేడు. అంత గాఢంగా ఒత్తగల శక్తి మా విల్ఫ్రోకి గాక మరెవరికీ లేదు. వాడట్లా మాట్లాడడానికి కారణమేమిటో నాబోటివాడి కెల్లా తెలుస్తుంది? వాడింకా పగటికలలు కంటూనే వున్నాడేమో!

విల్ఫ్రో పెద్దరోడ్డు వైపు తిరిగేడు. అప్పుడే పొలంనుంచి బంగాళాదుంపల మూట వేసుకుని బండి వాకిట్లోకి వచ్చింది. అప్పుడే పొలంలో కొంతపని జరిగిం దన్నమాట.

బండిలో బస్తాలపైన పావో, హిల్డాలు కూర్చుని వున్నారు. విల్ఫ్రోని చూస్తూనే హిల్డా కేకేసింది. 'విల్ఫ్రో! ఓ విల్ఫ్రో!' గభుక్కున బండిమీంచి వురకడంలో ఆమె భుజంమీది కోటు కిందపడిపోయింది. ఒక చేత కోటును తీస్తూ, రెండో చేయి ముందుకు జాచి ఒక్క పరుగున ఆమె విల్ఫ్రో దగ్గిరికి పోయింది.

ముందుకు జాచిన రెండో చేత్తో ఆమె యేమి చేయదల చిందో! విల్ఫ్రోని స్పృశించాలనో, లేక ఆలింగనం చేసుకోవా లనో ఐవుండచ్చు. ఆమె వాణ్ణి తాకేటంత దగ్గరికి పోయింది. కాని, విల్ఫ్రో యే మర్యాదగా ఒక్కడుగు వెనక్కి వేస్తూ, తల కొంచెం ముందుకి వంచి, ఆమె చాచిన చేతిని చాలన చేసేడు. వాడు తన దారిని పోదా మనుకుంటూంటే హిల్డా

మళ్ళీ 'విల్హా!' అంది. ఆమె చెప్పేదంతా వినడానికి సిద్ధపడి వా డాగిపోయేడు, యింక. అప్పుడు వాడి ముఖం యెంతో ప్రశాంతంగా వుంది. వాడిలో అంత ప్రశాంతత నే నెప్పుడూ చూడలేదు! ఔను, మరి! విల్హా యిప్పుడు చిన్నపిల్లగాడేం కాదు, పరిణతవయస్కు డైనాడు!

మర్యాదాద్యోతకమైన వాడి ప్రశాంతవైఖరి ఆమెని కూడా కదిలించిందేమో, హిల్డా నోటవెంటనే మాటరాలేదు.

'మూడేళ్ళలో ఒక్క ఉత్తరం లేదు. మొహం యెల్లా చెల్లింది?'

'ఉత్తరాల అవసరం యేముంది?' వాడు తిరిగి ప్రశ్నించేడు.

'విల్హా!' నియోతీ కంఠస్వరంలో కాకుధ్వనిస్తూంది. వాడి వైఖరి చూస్తే వెళ్ళిపో దలచినట్లు లేదు. ఆమె చెప్పేదంతా విన దలచి సిద్ధంగా వున్నట్లున్నా, హిల్డా నోట మాట రావడంలేదు.

ఇద్దరూ మాట లేకండా ఒక్క నిముషంసేపల్లాగే నిలబడి పోయేరు. చీలమండలదగ్గర బిగించిన వెడద ట్రౌజరు, తల మీాది రంగురుమాలు, చెమటతో తడిసిన మొగం, చేతుల నిండా మట్టీ,-పనిలోంచి సరాసరిగా వచ్చిన నియోతీ యిప్పుడు విశిష్టంగా వుంది. నిండుగావున్న ఆమె పెదవుల కిప్పుడు రంగు లేదు. చిక్కని చక్కని తలకట్టు అణగదువ్వి పైన రుమాలు బిగించి కట్టేసింది. ఇప్పు డామె చెక్కిళ్లూ, స్తనాలూ సంపూర్ణంగా వున్నాయి. ఆమె యెంతో బలంగానూ, దృఢంగానూ

వుండి, కూలీకన్నెలను దలపిస్తూంది. యుద్ధకాలపునిర్బంధకృషి. ధనికస్త్రీల నందర్నీ కూడా పొలంపనిలోని కీడ్చిం దిప్పుడు.

యథాపూర్వంగా వున్నవల్లా సుదీర్ఘములైన ఆమె కను బొమలు మాత్రమే; నల్లకలువరేకుల్లాంటి ఆమె కళ్ళమీద ఆశ్చర్యంతో చలిస్తూ, నటిస్తూన్నా యామె కనుబొమలు.

విల్హో ముఖంమీద ప్రశాంతత, గంభీరభావమే గాక యింకేదో మార్దవభావంకూడా పొడగట్టింది, నాకు! కాని, యేమో? నేను పొరబడీ వుండచ్చు. అప్పుడే వాడు తల ముందుకి వంచి, టోపీ తీసి, ముక్తసరుగా అన్నాడు:

'నియాతీ నన్ను క్షమిస్తుం దనుకుంటా. ఇప్పుడు కొంచెం తొందరపనిమీద వెడుతున్నా.'

అంటూనే వాడు వెనుదిరిగేడు. కాని ఆమె కెవ్వుమన్నట్లు అరిచింది:

'విల్హో!'

వాడు వెనుదిరిగి చూచేడు. నియాతీ గబగబ మాట్లాడేసింది:

'అబద్ధం, విల్హో! నటించడం నీకు చేతగాదు. అతిగా నటించి దొరికిపోయేవు! కాని, యెందుకీ నటన, విల్హో? ఎందుకో చెప్పవు? నీ మాట ఒకటీ నేను నమ్మడంలేదు. నువెందు కిట్లా అంటావు? విల్హో! చెప్పవు?'

విల్హో చేయి మళ్ళీ టోపీ దగ్గరికి వెళ్ళింది. అంతే. నియాతీకి అభివాదనం చేసి, వాడు ముందుకి సాగేడు. ఆమె రిచ్చపడి, బిగ్గరగా కేకేసింది,

'విల్హో!'

కాని వాడింక ఔనుదిరగలేదు. నియీాతీ పదఘట్టన చేసి, గిరుక్కున తిరిగి యింటివైపు పెద్ద అంగలతో నడిచి వచ్చేసింది.

---

## ముప్పై ఐదో ప్రకరణం. - విల్హోకై ఆహ్వానం.

ఉర్లగడ్డమూటలు మాళిగ దగ్గర పడేసి బండీని పాగదగ్గిరికి పావో తోలుకుపోయేడు. అక్కడ మే మిద్దరం గుర్రాలకి దాణా కలిపి పెట్టి, పచ్చరొట్ట పడేసేం. పావో యెందుకనో నాకేసి విచిత్రంగా చూస్తూన్నా డని గ్రహించడానికి నా కాట్టేసేపు పట్టలేదు. వాడు కళ్లు చిగిలించి, నామీాదికి దొంగ చూపులు విసురుతూండడం గమనించి అడిగేసేను:

'ఎందుకురా నాకేసి అల్లా చూస్తున్నావు?'

వాడు యెదురు ప్రశ్న వేసేడు:

'రాత్రి మీా యింటిదగ్గర యేం జరిగిందిరా?'

'ఏం? ఎందుకు?'

'ఎందు కంటావా? ప్రతీమాటా యిక్కడికి స్పష్టంగా విని పించింది గనక! నీ గొంతు చిన్నది గనకనా? బాకా పట్టినట్లే కామటోయ్!'

నేను బుజాలు కుంచించుకున్నాను. వాడు బుస్సలు కొట్టి నట్లు నవ్వి, దగ్గ నారంభించేడు. కొంచెంసేపుండి నీరుగ్రమ్మిన కళ్లు తుడుచుకుంటూ అన్నాడు:

'ఒరేయ్ ! నువ్వా సమయంలో యజమానిని చూసి వుండాల్సిందిరా ! ఆ సమయంలో ఆయనగారిక్కడే వున్నారు. తెలిసిందీ ? మొదటినుంచి చివరవరకూ అంతా విన్నారనుకో !'

ఆ తర్వాత పావో చల్లి తినబోయేడు. నేను గుర్రాల దగ్గర లద్దెంతా యెత్తి బైట పారేసి, వాటి పక్కగడ్డి మార్చి కొత్తగడ్డి వేసేను. అక్కడినుంచి రాగోల తీసుకుని గోశాల వైపు బైలుదేరేను. గోశాలదగ్గరే యజమాని నాకు కనిపించేరు.

ఆయన అప్పుడే లోనుంచి వెలికి వస్తూన్నారు. దారి యివ్వాలని నేను ఆగి ప్రక్కకి తప్పుకున్నా. కాని ఆయన కూడా గమనవేగాన్ని తగ్గించి నావైపు చిత్రంగా చూసేరు, మూతలు బడే బరువు రెప్పల క్రిందినుంచి.

ఇదివర కెప్పుడూ యజమాని కనిపించినపుడు నేనే ముందు అభివందనం చేసేవాణ్ణి. కాని, యీసారి నే నేమీ మాటాడ లేదు. ఆయనగారే ముందుగా మాటాడదలచుకొన్నా డేమో ? నాకెల్లా తెలుస్తుంది చెప్పండి ? వందనం చేద్దామనుకుంటూండగానే హఠాత్తుగా యేదో వాళ్ళే మాట్లాడే వాళ్ళని మనం చూస్తూండడం లేదూ ? అందుచేతనే నే నూరుకొన్నది! ఆయన ముఖంమీద వదులుగావున్న కండల్నీ లోతుగావున్న ముడుదల్నీ చూస్తూ అల్లాగే నిలుచున్నా. ఆయనగారే మాంసలములైన చెక్కిళ్ళు వూగిసలాడేలా శిరఃకంపం చేస్తూ నన్ను పలకరించేడు;

'సుదినం ఐనారీ !'

నేనూ తల వూపేను. నిజంగా చెపుతున్నా, అసలు నా వుద్దేశ్యం తలూపి వూరుకోందా మని కాదు. 'సుదినం !' అని నేనూ అందామనుకున్నా. కాని, సమయం మించిపోయింది. నేను తలూపడంకూడా ఆలస్యమే అయిపోయింది. దాన్ని ఆయన అందుకో లేకపోయేరు. ఆయన యింకేం మాట్లాడకండా బరువుగా, భూమిమీద ఆన్చి ఆన్చి అడుగు లేస్తూ యింటివైపు వెళ్లిపోయేరు.

గోశాలంతా శుభ్రం చేయడానికి పక్కా గంట పట్టింది. నా జీవితంలో యికెంతమాత్రం తొందర పడనక్కరలేని ఘట్టానికి చేరుకున్నా ! ఏ పనిచేసినా తాపీగా, వొళ్లు అలియ కండా చేయవచ్చు నింక ! భవిష్యత్తంతా అయోమయంగా వుంది, దట్టమైన పొగమంచు గ్రమ్మినట్లు. నే నెంత కంగారు పడినా పరిస్థితు లింతకంటె బాగుపడే దేమీలేదు. చెడిన కాపరానికి ముప్పేమిటి ?

ఆవులదగ్గిర శుభ్రం చేసేక కొత్తగడ్డితో పడక లమర్చి, తొట్టిలోకి మంచినీరు తోడిపోసేను. గోశాలదగ్గర పని పూర్తి చేసుకుని పొలానికి వుర్లగడ్డ త్రవ్వలోకి పోయేను.

పొలంలో పావో చాళ్ళు దున్నుతూన్నాడు. మిగిలిన వాళ్ళంతా దుంపలు త్రవ్వుతూన్నారు. నేనూ ఓ త్రవ్వ గోలా, రెండు గంపలూ పట్టుకుని, కొత్తచాలులో పని మొదలెట్టేను.

ఈ పొలంలోనే గాక మరో రెండు పొలాల్లోకూడ దుంప తవ్వాల్సివుంది. ఏ క్షణాంలోనైనా వాతావరణం అధ్వాన్నం కావచ్చు. వర్షం రావచ్చు, మంచు పట్టవచ్చు. దీపం వుండగానే యిల్లు చక్కబెట్టుకోవాలిగదా. అందుకని అవకాశ మున్నంతవరకు అందర్నీ యీ పనిలోనే వుంచేరు, యజమాని. ఆయనమాత్రం యింటిదగ్గరే వుండి మొత్తం కమతం చూసుకుంటూ, భార్యనీ కుమార్తెనీకూడా దుంప యేరడానికి పంపేరు. అంతాకూడా శక్తికొలదీ గబగబా దుంప యేరుతూన్నారు. ఎటొచ్చీ నేనే తాపీగా పనిచేస్తూ న్నది. తొందరేమిటి? నా జీవితమే అంధకారకూపంలో పడిపోయింది. ఇప్పుడు తొందరపడు, పడకపో, యికముందు దారిమాత్రం లేదు.

అంతా యెంత రెక్కలు ముక్కలు చేసుకున్నా పని పూర్తిగాకనే పోను, విక్టోరీ గనక లేకపోతే. అతగాడు హెల్సింకీలో వ్యవసాయమంత్రివర్గంలో పని చేస్తూన్నాడు. ఒక నెల సెలవు తీసుకుని యింటికి వస్తూ తనతో మరో ముగ్గురు కూలీల్ని తీసుకొచ్చేడు. ఒక యుద్ధవిధవరాలూ, ఆమె కూతురూ, మనుమడూ, వీళ్లు ముగ్గురూకూడా దుంప త్రవ్వులోనే పనిచేస్తూన్నారు. పాపం. వాళ్లు స్థలభ్రష్టులై యిల్లూ వాకిలీ లేక, స్థిరమైన పనిపాటుల్లేక అల్లాడుతూం టే, విక్టోరీ వాళ్ళమీద దయదలచి ఒక నెలపాటు పని చూపి వుపకారం చేసేడు. వాళ్లు ముగ్గురూ మంచి చురుగ్గానే పని చేస్తున్నారు.

విహ్టాటోరీ కూడా ఆ రోజున పనిలో పాంగున్నాడు. పనికి అడ్డురాకుండా కళ్ళజోడు తీసేసేడు. హా! విహ్టాటోరీ కుర్కి—మాకీ కళ్ళజోడు తీసినప్పుడు చూసి తీరాల్సిందే లెండి! కపిలరంగు స్వ్కా లుబనియను చేతులు పైకిమడిచి, కసిగా పనికి పూనుకున్నాడు. ఓ చేతిలో త్రవ్వగోల గబగబా ఆడుతూంది, రెండో చేతిలోంచి పుర్లగడ్డలు యేకటాకీని ప్రవాహంగా వెళ్ళి గంపలోకీ, బకెటులోకీ పడుతూన్నాయి.

రెండుగంటలు ఒకే బిగిని పనిచేసేక విహ్టాటోరీ యింటికి వెళ్ళిపోయేడు. అక్కడ యింటితోట చుట్టూ పరుగెత్తుతూ, త్రాటిమీాంచి దూకుతూ శరీరపరిశ్రమ చేస్తూంటాడు, ప్రతి దినం. లేదా ఆపిలుచెట్టుకి యిసకబస్తా వ్రేలాడగట్టి దాని మీాద తోలుగ్లోవులు తొడిగిన చేతులతో పిడికిటి పోట్లు పొడుస్తూ బాక్సింగ్ ప్రాక్టీసు చేస్తూంటాడు. అత డిప్పుడు కూడా యథాప్రకారంగానే కివీనూ కార్మిక క్లబ్‌లో బాక్సింగ్ పందేల కొరకై తరిఫీదు తీసుకుంటూనేవున్నాడు. బంగాళాదుంపల త్రవ్వు విహ్టాటోరీకి పని గాదు. కేవలం శారీరకపరిశ్రమా, పనిమార్పూ, నేర్పూ మాత్రమే.

కాని యీా శిశిరఋతువులో అతడి గ్రహచారం అంత బాగున్నట్టు లేదు. కార్మికుల్లో చాలమంది యుద్ధరంగంలోకి పోయివచ్చేరు. వాళ్ళకి బాక్సింగు తరిఫీదుకి అవకాశాల్లేవు గాని క్రోధద్వేషాలు పెంపొందించుకోడానికి ఎన్నో అవకా

శాలూ, అవసరాలూ యేర్పడ్డాయి. విహ్హాటోరీ వాళ్ళ మన స్సుల్లో యుద్ధం తెచ్చిన మార్పుల్ని గుర్తించకపోతే తప్పేవ రిది? పై పెచ్చు విహ్హాటోరీ యుద్ధాన్ని మూచూడనైనా లేదనీ, ప్రభుత్వకార్యాలయాల్లో వెచ్చగా కూర్చుని పొందా ల్సిన లాభాలన్నీ పొందుతూనే వున్నాడనీకుండ తెలిసినప్పుడు కార్మికుల మనోభావా లెల్లా వుంటాయో వేరే చెప్పాలా?

యుద్ధాల్లోకి పోవాల్సింది వట్టి కూలిముండాకొడుకులు గాని పెట్టిపుట్టిన శ్రీమంతుల బిడ్డలకేం ఖర్మ? విహ్హాటోరీ పటాలం లోకి పోవడమనే సమస్యే లేదు, అసలు! ఆ విషయం మావా ళ్ళకి తల బద్దలుకొట్టుకున్నా అర్థం గాదండీ. ఏం చేస్తాం, అం దరికీ సమానమైన తెలివి తేట లుంటాయా? విహ్హాటోరీ యుద్ధంలోకి వస్తా నన్నా తీసుకోరండీ, బాబూ! ఎలియాస్ విషయం చూసేరుగా? అల్లాగే అనుకోండి. అదీగాక వచ్చిన చిక్కేమంటే విహ్హాటోరీ లేకపోతే వ్యవసాయశాఖలో పనే జరగదు! ఆ పని యేమిటో చెప్పడానికి వీలే లేదు! తూర్పు కరేలియా ప్రాంతమంతా బోల్షివిక్కులనుంచి లాక్కున్న వ్పాకు, అందులో శుభ్రమైన అడివిప్లాటును చేజిక్కించుకోడం యెల్లాగా? అనే దానిమీదే విహ్హాటోరీ దృష్టంతా వుంది. కాని ఆ ఈశ్వరుడు లేడుటండీ అన్నిటికీ సాక్షిభూతుడుగా!

రష్యావాళ్ళనుంచి మేము లాక్కునే లక్షల యెకరాల పొలాల్నీ, అడవుల్నీ జాగ్రతగా చూసే బాధ్యతా, భారమూ యెవరో ఒకరు వహించాల్సిందేకదా. ఇప్పటిదాకా తమ

స్వంతభూముల్ని వందల్నూ వేలు యెకరాల స్లాటులుగా లెక్క చూసుకుంటూ, ఖంజాయింపు చేసుకోడాని కలవాటుపడ్డ ఆసాములు గాకపోతే యీ పని కింకెవరు తగినవాళ్లో చెప్పండి? కాని, యిక్కడే వచ్చింది, చిక్కు. కివీమా కార్మిక క్లబ్బులోని బాక్సర్లు యీ సబబుని అర్థం చేసుకుంటేనా? ధర్మ శాస్త్రాలు అందరికీ తెలుస్తాయిటండీ, బాబూ?

విహాటోరీని బాగా అర్థం చేసుకోలేనప్పుడు వాళ్లాతడం కే విరుద్ధంగా వుండడంలో ఆశ్చర్య మేముంది? కార్మిక క్లబ్‌లో మొదటి పోట్లాట సమం ఐంది. ఆ తర్వాత ఒక్కొక్కడే విహాటోరీని ఓడించ నారంభించేరు. మొట్టమొదట అతణ్ణి చిత్తుచేసినవాడు జూస్సీ వాహానెన్; తర్వాత రీకూ కీవీ; పిమ్మట కవ్రూకో సర్కోలా; వీళ్ళంతా ఒక యెత్తూ గొడ్డలి కొట్టే వ్రజో లెహ్‌తోనెన్ ఒక యెత్తూ! వ్రజో వజ్రముష్టి రుచి చూసేక విహాటోరీ మళ్ళీ క్లబ్‌కి వెళ్ళనే లేదు! ఇంటిదగ్గిరే వుండిపోయి దెబ్బలు మాన్పుకుంటున్నాడు, పాపం.

ఈలోగా యింకో చిత్రమైన సంఘటన జరిగింది. విల్హో మళ్ళీ కార్మిక క్లబ్‌లో కనిపించేడుట. విహాటోరీతో పోట్లాడి ఓడించిన వాళ్ళనందర్నీ సవాలు చేసి, ఒక్కొక్కణ్ణే నేల కరిపించేడు. ఉక్కుమనిషి వ్రజో కూడా వాడితో నాలుగు రౌండ్లకంటె నిలబడలేకపోయేడు. ఐదో రౌండులో బోర్లా పడిపోయిన వ్రజో పది హేను లెక్కబెట్టేవరకూ లేవనేలేదు.

'విల్హో ప్రవర్తనకి అర్థం యేమిటి?' అని మళ్లీ చాల మంది అనుకుంటున్నారు. కాని యిప్పుడా ప్రశ్న యెవరూ పైకి వేయడం లేదులెండి. ఎందుకంటే ఆ సందర్భం అంతా తమకూ అవగతమేనని చాలమంది అభిప్రాయం.

తుఖోల్మా (స్వీడన్ ముఖ్యపట్టణం స్టాక్‌హోమ్‌కి ఫిన్నిష్ పేరు) లో జరుగబోయే అంతర్జాతీయ బాక్సింగ్ పోటీల్లో పాల్గొనటానికని విహ్టోరీ తయారవుతున్నాడు. అందుకనే కివీమాలోని కార్మిక క్లబ్‌లోని కార్మిక బాక్సర్లమీద నేర్చుకోవా లనుకున్నాడు. కాని వాళ్లు యీ వ్యూహాని విహ్టోరీ బుర్రలోంచి యెగరగొట్టేసేరు ఇక విల్హో తిన్న విల్హో వచ్చి విహ్టోరీని ఓడించిన వాళ్ళనందర్నీ చిత్తు చేసేసేడు. ప్రజ లంతా బుర్రలు చెడేలా ఆలోచించేందు కిందులో విచిత్ర మేముంది? కివీమా క్లబ్ సభ్యుల కిదంతా సహజంగానే, స్పష్టంగానే కనిపించింది. 'దీని భావ మేమి?' అని చాలన చేయాల్సిన అవసరం వాళ్ళకేమీ కనబడలేదు. వాళ్ళు విల్హోని తప్పుకుని తిరిగేవాళ్ళంతే.

ఈ భోగట్టా యావత్తూ నాకు తెలియడాని కాస్తే కాలం పట్టలేదు.

ఒకరోజున విహ్టోరీ కుర్కిమాకీ నా దగ్గిరికి వచ్చేడు. అతడూ నావైపే వస్తూన్నా డని నేనేం కలగన్నానా? నా దగ్గిరికి రావాల్సిన అవసరం అతడికేం వుంటుంది? అంచేత నే నాతనివైపు చూడనేనా చూడలేదు. క్రీగంట చూచి అతడు

సరాసరి నావైపే వస్తూండడం గమనించి, నేను కనిపెట్టుకుని వున్నాను.

తన మనస్సులోని భారాన్ని దేన్నో తొలగించుకో దలచి నట్లు కనిపించేడు, విహారీ. ఇదంతా చాలరోజులుగా సాగు తూనే వుంది గనక తండ్రిగారితో ఆలోచించి, చివరకో నిర్ణయానికి వచ్చివుంటా డనుకుంటా. సరే, మరి. వాళ్ళ అభి ప్రాయ మేమిటో వినడానికి నేనూ సిద్ధంగానే వున్నాను. రాండీ, అయ్యా! హెన్రా విహారీ కుర్ర్మాకీ! మీ మన సులోని మాట బైటబెట్టండీ! నేనూ తయారుగానే వున్నాను.

కళ్ళద్దాల్లోంచి నన్ను చాలనగా చూస్తూ అత డాగేడు. అతడి ముఖం దోసగింజలా సన్నగా వుంది. గడ్డం కొనదేరి సూదిగా వుంది. దానిమీద ఓ జత పల్చని పెదవులు చాల సేపటినుంచి బిగబట్టుకుని వుండడంవల్ల తెల్లనై వున్నాయి. విహారీ ముక్కు, దౌడలు, గడ్డం,- వీటిమీద యింకా ప్లాస్టరు పట్టీలు అంటించివున్నాయి. అవిగాక మిగతా దెబ్బ లన్నీ మానుపట్టేయి. వరుసగా నాలుగుసార్లు తుక్కురేగేలా దెబ్బలు తిని, ఓడిపోయి, ఖిన్నుడైనట్లు కనిపించడం లేదా తడు! పైపెచ్చు ధీమాగా తలవిసిరి నడుస్తూ, యెవడినైనా సరే చాపచుట్టగా పడగొడతా నన్నట్లు వుంది ఆతని వైఖరి. బాక్సింగ్ అంటే విహారీ చెవి కోసుకుంటా డనుకోండి. ఎక్కడ బాక్సింగ్ పందేలు జరుగుతూన్నా, యెంత దూర మైనా సరే వెళ్ళి వాలుతాడు, విహారీ,

విన్స్టోరీ నాదగ్గిరికి వస్తున్నాడూ అంటే యిందులో యేదో వుండన్నమాటే! శిశిరం యింకా వెళ్ళలేదు. ఇంకా చలిగానే వుంది. ఐనా విన్స్టోరీ కోటూ, హాటూ, (టోపీ) లేకండానే, వట్టి చొక్కాతోనే వస్తున్నాడు. నాతో జరప దలచుకున్న వ్యవహారంలో కోటు, హాటులు ఆటంకంగా వుండవచ్చు ననుకొన్నాడో? యేమో? నాకు నచ్చచెప్పగల ఘట్టివాదనలు కొన్ని ఆలోచించుకునే వచ్చే డనుకుంటా. సరే. కానీండి, నేనూ యిల్లాంటి సమావేశం కోసం చాలదినాలుగా యెదురుచూస్తూనే వున్నా. అతగాడికి తగ్గ సమాధానం ఆలోచించి సిద్ధంగా వుంచేవున్నానులెండి. ఏదైనా అవసరం వస్తేనే అనుకోండి, నా పిడికిళ్లుకూడా సిద్ధంగానే వున్నాయి.

అతన్ని చూస్తూ మాటాడకండా నిలుచునే వున్నా. నన్ను సమీపించేక విన్స్టోరీ జేబులోంచి తెల్లని కవరు తీసి నావైపు జాచుతూ అడిగేడు:

'ఐనారీ! ఈకవరు మీ తమ్ముడికి ఆదివారంలోగా అందించే యేర్పాటు చేయగలవా?'

నే నే జవాబూ యివ్వలేదు. ఒక విషయాన్నిగూర్చి మాట్లాడుతా డనుకుంటే అనుకోని మరో విషయాన్నిగూర్చి యెత్తుకుంటే వెంటనే సరాసరిగా జవా బివ్వడ మెంతకష్టమో ఆలోచించండి? నే నూరుకోడం చూసి అతడే మళ్ళీ అన్నాడు:

'ఆదివారం సాయంత్రం మా యింట్లో చిన్న విందు యేర్పాటుచేసేం. ఏదో కుటుంబసమావేశమేలే. నాన్న విల్లోని

చూడాలని కోరుతున్నారు. వ్యక్తిగతకార్యంమీద అతనితో మాట్లాడా లనుకుంటున్నారు. నేనుకూడా అతనితో నాలుగు మాటలు చెప్పాల్సివుంది.'

కవరు పుచ్చుకునికూడా నేనేమీ మాట్లాడలేదు. ఒక్క నిముషం ఆగి అతడే మళ్ళీ అన్నాడు:

'అతనికోసం గుర్రాన్ని ఆదివారం పంపుతాము.'

అప్పటికీ విహ్వాటోరీకి జవా బీయడానికి తగిన మాటలు నాకు తోచనేలేదు. అందుచే అతడే అడిగేడు:

'ఏమంటావు, ఐనారీ? అతని కిది అందిస్తావా?'

నేను భుజాలు కుంచించుకున్నాను:

'ఎందు కీయను? తప్పకండా అందిస్తా.'

అంతే. ఎవరి దారిన వాళ్ళం పోయేం. ఆ సాయంకాలం యింటికి వెళ్ళేక యెల్సాతో అన్నా:

'రేపు ప్రొద్దున్నే పాలట్రక్కులో క్రీమరీకి వెళ్ళినప్పుడు యిది విల్హో కిచ్చేసెయ్యి. ఉత్తరిఖే జాబు అందియ్యి. నా అభివందనాలుమాత్రం చెప్పద్దు. తెలిసిందా?'

ఆదివారం సాయంత్రం ఆవుపాలు తీయడం పూర్తయేక గోశాలనుంచి యింటికి వచ్చినప్పుడు నాతో అంది యెల్సా:

'విల్హో అక్కడికి వచ్చేడు. వాళ్ళాతణ్ణి కొంతదాకా బండి మీాద సాగనంపేరు.'

నేను కటువుగా అన్నాను:

'ఐతే నాకేం? దాంట్లో నాకు సంబంధ మేమిటి?'

ఎల్సా అంతతో వూరుకోలేదు:

'యజమాని అతన్ని క్రీమరీలో ఫోర్‌మన్‌గా వుండ మన్నారుట! అంతా అనుకుంటున్నారు.'

నేను కసిరేసేను:

'ఇదంతా నిన్నవ డడిగేడు? ఊరికే నిలుచుని వాగకపోతే వెళ్ళి పిల్లలకి తిండిపెట్టరాదూ? వెళ్ళు ఊఁ!'

---

## ముప్ఫై ఆరో ప్రకరణం. - ఏంటు విశేషాలు.

సోమవారం ఉదయం నేను పనిలోకి వెళ్లినప్పుడు పావో మళ్ళీ నావైపు క్రీగంట విచిత్రంగా చూడ నారంభించేడు. అది చూడ్డంతోనే కనిపెట్టేను వాడేదో విశేషం నాకు చెప్పాలను కుంటున్నాడని. కాని యీదఫా నేనై వాణ్ణి ప్రశ్నించదలచుకో లేదు. ఎందుకంటే యేమాట వినాల్సివస్తుందో యేం చెప్ప గలం? అయిష్టమైన వార్తను వినడాని కంతగా అడిగి చెప్పించు కోడంకూడా యెందుకు? చివరకి వాడంతట వాడే క్రితం సాయంత్రం జరిగినదంతా వెళ్ళగ్రక్కేసేడులెండి! ముందుగా నన్నడిగేడు:

'విల్హో నిన్న మీయింటికి వచ్చేడురా?'

'లేదు.' ముక్తసరుగానే అన్నాను.

'చాలరోజులదాకా తిరిగి రాడనుకుంటాను.'

'ఏం? ఎక్కడికి కెళ్లేడు?'

'తాంపిరీకి వెళ్ళేడు.'

'తాంపిరీకా?'

'ఔను. తాంపిరీకే.'

కొంచెంసేపు వూరుకుని, మళ్ళీ అడిగేడు:

'ఐతే నిన్న వాడు చేసిం దేమీ నీకు తెలియ దన్నమాట?'

'అఁహఁ! ఏం చేసే డేమిటి?'

వెంటనే చెపితే వాడి యెక్కువేముంది? తాపీగా పైపు తీసి, నింపి, గోడకి జేరి చతికిలబడ్డాడు, పావో. నేనూ వాడి దగ్గరే కొంచెం పొగాకు తీసుకుని, ఓ చుట్ట చుట్టుకున్నాను. చాలరోజులైంది నేను చుట్ట మానేసి. యుద్ధానికిముందే ఖర్చు తగ్గించుకోడానికని చుట్ట మానేసినా, కందకాల్లో ఒంటరితనాన్ని భరించలేక మళ్ళీ అలవాటు చేసుకున్నాను. ఇంటికి వచ్చేక మొదట కొన్నాళ్ళదాకా పొగాకును దరికి రానీలేదు. పూర్తిగా మానేసి వుండేవాణ్ణే గాని యెందుకు? ఏం లాభం? నా జీవితంలో ముందుదారి కనిపించడమే లేదు. ఇక యే దెట్లాగైనా ఒకటే. చెడ్డ కాపురానికి ముప్పేమిటి? అందుచేత మళ్ళీ ప్రారంభం చేసేను. ఇద్దరం అగ్గి ముట్టించేము.

మొదటిగ్రుక్క పీల్చేటప్పటికే పావోకి మామూలు దగ్గు తెర వచ్చేసింది. దగ్గూ, పిల్లికూతలూ తగ్గిపోయేదాకా పక్కా అరగంట వరకూ వేచియుండాల్సి వచ్చింది, నేను.

కళ్ళలో గ్రమ్మిననీరు తుడుచుకుంటూ పావో కథ ప్రారంభించేడు:

'వాడు విన్‌స్టారీని కొట్టినంత పని చేసేడు.'

నేను నమ్మలేదు.

'నీకెల్లా తెలిసిందిరా?'

'వంటింట్లో యజమానురాలికి పనిసాయం చేస్తూ గొల్లభామ లక్కడే వున్నారు. అంతా వచ్చి టేబిల్ ముందు కుర్చీల్లో కూర్చున్నారుట. విందు ప్రారంభంలో మొదటి గ్లాసు ఎత్తి టింగ్‌మని ఒకటి కొకటి తాకించే సమయం చూసి విల్సో లేచేడు. టకటకమని విన్‌స్టారీ దగ్గిరికి పోయి కుర్చీ లోంచి అతడి రెక్క పట్టుకుని పైకి లేపేసేడు. 'ఐదేళ్ళ క్రిందట జరిగిన సంఘటనని నీకు జ్ఞాపకం చేయాల్సిన సమయం వచ్చిందనుకుంటా. ఆ రోజున కొందరు ఘరానా పెద్దమనుష్యులకి విందు చేయడంకోసం మా క్లబ్ మీరు అద్దెకి తీసుకున్నారు. ఆ సందర్భంలో నువ్వు నన్నవమానించిన విషయాన్ని గుర్తుకు దెచ్చుకుని, యీ తగుపెద్దమనుష్యుల సమక్షంలో క్షమార్పణ చెప్పుకో. అదేమంత పెద్దసమస్య గాదనుకో. దాన్ని అప్పుడే మరిచిపోయినా పోయిందేమీ లేదు. గాని, దానిలో ఒక ధర్మసూత్రం యిమిడివుంది. అందుచేత......దయచేసి, త్వరగా...యేమంటావ్?' అంటూంటే విన్‌స్టారీ అప్పుడే తన జీవితంలో ప్రథమపర్యాయమే విల్సోని చూస్తూన్నట్లు మొహం పెట్టి, గ్రుడ్లప్పగించి చూస్తూ నిలబడిపోయేడుట!

విల్హో వదలండే: 'త్వరగా తేమల్చాలి. లేకపోతే తగు పోస్తుంది. ముఖవైఖరి చూసి సంతృప్తిపడి వూరుకోడం యింక నావల్ల గాదుసుమీ!' అతిథులంతా విస్తుబోయి చూస్తున్నారు. కళ్ళద్దాల్లోంచి చూస్తూ విన్సాటోరీ అన్నాడు: 'నీకేం పిచ్చెత్తిందా? పరాయి పెద్దమనుషుల యింటికి అతిథిగా వచ్చి అల్లరిప్రారంభిస్తావా?' విల్హో వ్యంగ్యధోరణిలో 'అయ్య గారు త్వరబడాలి. కాలం వృథా చెయ్యొద్దు. విందు చెడ గొట్టనూ వద్దు. బాక్సింగ్‌లో నిన్నోడించిన వాళ్ళకేం జరిగిందో నీకు తెలిసిందే గదూ? అది గుర్తుంచుకో. నాకు క్షమార్పణ యివ్వకపోతే ఆ తరువాయే నీకూ జరుగుతుం దన్నమాట! మన యిద్దరి బలాబలాలూ సరిపోల్చుకోడాని కవన్నీ అన్ని అవకాశా లన్నమాట!' అన్నాడు. సరిగ్గా యీ మాటలే అన్నాడుటవాడు! విన్సాటోరీకి దగ్గరగా చిరునవ్వుముఖంతో నిల్చుని, అతడి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ 'కనిపెట్టుకుని వున్నా. త్వరగా కానీ!' అన్నాట్ట! గొల్లభామలు చెప్పేరులే, తర్వాత యిదంతా. విన్సాటోరీ కొంచెం తటపటాయించి అన్నాడుట: 'ఔను! నేనా సందర్భంలో కొంచెం నీచంగానే ప్రవర్తించేను.' 'ఏమిటీ?' అని విల్హో మొదటి ప్రశ్న. 'నీచం గానేనా? చెప్పు, అంతా వింటాను.' విన్సాటోరీ యింకొంచెం బిగ్గరగా 'నీచంగానే' అన్నాడు. తర్వాత విల్హో మళ్ళీ ప్రశ్నిం చేడు: 'అది నీచం యెల్లాగో చెప్పాలి. నువ్వేం చేసేవు?' అతడు జవా బిచ్చేడు: 'తప్పే చేసేను...మా విందుదగ్గరకు

రావద్దు పొమ్మనడం నాది తప్పే. అన్నివిధాలా సమానగౌరవ మర్యాదల కర్హుడవైన నిన్ను...' 'ఇంకా బిగ్గరగా! అందరికీ వినబడాలి!' అంటూ విల్హో యీ క్షమార్పణావచనాన్నే చాలసార్లు తిరిగి తిరిగి చెప్పించేడుట. అప్పుడు విన్సాంటోరీవైపు వీపుత్రిప్పి యజమానిని సంబోధించేడు: 'ఐతే మీ క్రీమరీలో ఫోర్‌మన్ పని నా కిస్తానంటారా? లేక యిప్పుడు మీ మాటను వుపసంహరించుకుంటూ నంటారా?' ఆయనఅన్నారు: 'అబ్బే! నే నెందుకు వెనుదీస్తాను? ఎప్పుడూ నామాటకి తిరుగు లేదే. పరిహాసాలు పరిహాసాలే. వాటిని నే నంతగా పాటించను. వ్యాపారం దారి వ్యాపారానిది! నీ అంగీకారానికై వేచి యున్నా.' 'మిమ్ము ఆశాభంగం చేయడానికి విచారిస్తున్నా. తాంపిరీలోని ప్రభుత్వఫాక్టరీకి నన్ను పిలిచేరు. ఇక నే నిక్కడ వుండడం అనవసర మనుకుంటూ, మీకు అసంతోషకారియైన అతిథిగా యిక్కడ వుండబోను. రేపు వుదయం నేనీ ప్రాంతాలనే వదలిపోతున్నా,' నంటూ యెవరివైపూ చూడకుండా నే విల్హో బైటికి నడిచి, హాలులో విడిచిన కోటు నందుకుని, గుమ్మాలు గబగబా దిగి, విసవిస నడిచి పోయేడుట! కొంత సేపటివరకూ యెవరికీ నోటమ్మట మాట పెగిలి రానేలేదు. అప్పుడే హఠాత్తుగా హిల్డా కుర్చీమీంచి లేచి ఒక్క పరుగున పోయిందిట, గుమ్మందాటి. యజమాని పిడికిలితో బల్ల గుద్దుతూ 'హిల్డా!' అని అరిచేడట! కాని ఆమె మాట్లాడకుండా ఆయనవైపు ఒకసారి మాత్రం చూసి బైటికి వెళ్ళి

పోయింది. ఆ సమయానికి నేను పొలంలోనే వున్నాను. రియాపన్ కోనేరునుంచి పరుగెత్తి, కట్టుతప్పిపోయింది. దాని వెనకే నేనూ పొలాలమ్మట పడ్డాను. అప్పుడే హిల్డా విల్హోను కలుసుకొంది. విల్హోతో సమంగా నడవడానికి హిల్డా గబగబా అడుగు లేస్తూంది. రోడ్డుమీద విల్హో సీలిపంట్లాం, ప్రక్కనే హిల్డా కపిలవర్ణపు స్టాకింగులు చకచకా పోతున్నాయి. ఎదర గాలికి వాళ్ళ కోట్లకొనలు వెనక యెగురుతూన్నాయి. కొంత సేపులోనే హిల్డా చేతిని విల్హో తన చేతులోకి తీసుకున్నాడు. ఆ తర్వాత వాళ్ళిద్దరూ మెల్లిగా నడుస్తూ రోడ్డుమలుపులో కనుమరుగైపోయేరు. రియాపన్‌ను పట్టుకోడానికి పొలాల్లో పరుగెడుతూండడంవల్ల వాళ్ళని నేను చూసేననుకో. దూరం కండా తప్పించుకుంటూ పరుగెత్తినా చివరకి దాన్ని అడివి దగ్గర పట్టుకుని తీసుకొచ్చేనులే.'

కాలుస్తూన్న చుట్టను క్రింద పడేసి మట్టుతూ అన్నా:

'విల్హో యింకా పసివాడేరా. ఏదో కుర్రతనం!'

పావో స్వరంలో మందలింపు స్పష్టంగా వుంది:

'నువ్వనే దేమిట్రా? పసివాడైతే యెదగడానికి వలసినంత అవకాశం వుందిలే. చెపుతా విను. విల్హో పెద్దవాడైతే అసలైన మనిషిగా తయారవుతాడు. వాడు తన కర్తవ్యాన్ని యథావిధిగా నెరవేరుస్తాడు, చూసుకోరా...'

పావ్ గడ్డంక్రింద చెయ్యి పెట్టుకుని సాలోచనగా కూర్చున్నాడు. కళ్ళచుట్టూనే గాకండా వాడి చెంపల మీదకూడా ముడుతలు దట్టంగా క్రమ్ముకునివున్నాయి.

నేనూ ఆలోచనలో పడి, తల పంకిస్తూ,-

'ఔనురా! అది నిజమే!' అన్నాను.

---

## ముప్పైయేడో ప్రకరణం - బ్రతుకుమీద రోత

జా త్రితైనా ఎక్కి పావ్ పొలానికి బైలుదేరేడు. ఉర్లగడ్డ వేసిన పొలం యినుమూరు దున్నాల్సివుంది. మొదటి త్రవ్వలో మిగిలిపోయిన దుంప యేరడానికి గొల్లభామలిద్దరూ కూడా వెళ్ళేరు. కుర్కిమాకీల కమతంలో పనులన్నీ అంత ఖంజాయింపుగా జరుగుతా యనుకోండి. ఒక్క దుంపగాని, ఒక్కగోధుమ వెన్ను గాని పారుపోనీయరు. అన్నీ పోగుచేసి, శుభ్రపరచి కొట్లలో పోసి, వెయ్యి కళ్ళతో చూస్తూంటారు, యజమాని. అంత ఒబ్బిడిగా వుంటుంది ప్రతి పనీ.

ఇప్పు డింక నేనా విధంగా పనిచేయలేను. దారీ డొంకా లేని కారడవిలో పడిపోతూంది, నా జీవితం. నిర్భాగ్యత్వం నా హృదయాన్ని దొలిచేస్తూంది. నా చేతులు యింక కష్టపడ నంటున్నాయి. దేన్నైనా మరామ్మతు చేయడానికి

నిరాకరిస్తున్నాయి. కాని ఏ పనీ చేయనిదే కుటుంబపోషణ యెల్లాగ? అయ్యో దేవుడా! నే నేం చెయ్యను? ఎక్కడికి బోను? ఇతరుల పొలాల్లో ఆజన్మాంతం కూలిపని చేసుకుని బ్రతకమనే విధించేవా? నాకు? నా హృదయంలో నిరాశా, కడుపులో శూన్యత్వం తిష్ఠవేసుకుని వున్నా నేను గోశాల దరికి వెళ్ళగానే నాచేతులు వాటంతట అవే రాగోల పట్టుకుని పనికి దొరకొంటున్నాయి! నేనేం చేయను?

గోశాల వెనక అప్పుడే పర్వతంలా పెరిగి ప్రోగుపడింది, పేడకుప్ప. ముప్పైన్ని ఆవులూ వాటి వ్యాపారాల్ని అవి చేసుకుపోతూంటాయి. పాక శుభ్రపరచి, పేడా పెంటా యెత్తి బైటపోసేక కిటికీ వెలుపలి ప్రక్కనున్న పెంటనంతనీ పారతో దూరంగా కొడుతూంటాను, మళ్ళీ పడే చెత్తకి చోటుచేయడానికి. ఈ ప్రోగు క్రమంగా పెరిగి అప్పుడే గోశాల వెనకున్న పెద్ద రాతిబండదాకా వెళ్ళింది. దారిలోకంటా వ్యాపించి బళ్ళకీ, నడిచేవాళ్ళకీకూడా అడ్డుగా తయారైం దిప్పుడు. వచ్చేయేడు వుర్లగడ్డ నాటే పొలాలకి పెంట తోలాలి. మళ్ళీ యథాపూర్వంగా పెంటకుప్ప పెరుగుతూనే వుంటుంది. దీని కొక తుదా మొదలూ అనేదే లేదు!

పెంటబండిని పాకలోనుంచి బైటికి లాగి, పెంటపోగు ప్రక్క నిలబెట్టేను. బండి నింపిన తర్వాత గుర్రాన్ని కట్టవచ్చు. పూర్వం కొన్ని వందలసార్లు మరామ్మతు చేసిన బండే అది! నాముందు పావోకూడ అన్నిమూర్లూ దాన్ని

బాగుచేసేడట. పని చేసేముందు ప్రతిదఫా దాన్ని సరిచూడా ల్సిందే. ఎందు కంటారా? అదంతా అతుకుల బొంత! బరువు త్రోలేటప్పుడు రింగులకి రింగులూ బొత్తాములకి బొత్తాములూ విడిపోయి, చతికిలబడచ్చు. బులికిపోయినకొయ్యకీకొత్తకొయ్యకీ అసలు అతకనే అతకదు. ఒకవేళ తంటాలుపడి అతికించినా నిలబడదు. మేకులు, బోల్టులు పట్టిస్తేకాదూ? ఈ బండిని యెప్పుడో పెంటకుప్పమీాద పారేసి, కొత్తదాన్ని కొనివుండా ల్సింది. కాని, కొత్తబండి కొంటే మా కామందు మూట తరిగిపోదూ? ఆయనగారిచేత కొత్తబండీ కొనిపించా లంటే నల్లమేకని బలి యివ్వాల్సిందే!

ఎప్పుడూ పనిలో పెట్టే ముందే బండిని పరీక్షించి చూసే వాణ్ణని చెప్పేనుకదూ? కాని యిప్పు డింక నేనంత శ్రద్ధగా పని చెయ్యలేను. బండి నిలబెట్టి పేడ పారతోకొట్టి సరాసరి నింపుతూన్నా. బండి వుంటుందా? వూడుతుందా? అని మీాన మేషాలు లెక్కపెడుతూ కూర్చోడానికి యెవడికి పట్టిం దంటా? నా బ్రతుకు అధ్వాన్నపు అడివిలో బడిపోయింది, పోనీండి.

బండి మంచిపూటుగా నింపేను. ఈమధ్య వర్షాలకి దారంతా బురదగా ఐపోయింది. కానీండి. నాకేమి? బరువువిషయం గుర్రమే చూసుకుంటుంది. వాటిని తెగబలిసేట్లా మేపుతూ న్నది పనీపాటూ లేకండా కూర్చోబెట్టడానికా? ఇక చాలించా లనుకుంటూనే ఆఖరిపార కొట్టి వేసేసరికి హఠాత్తుగా బండి

పెళపెళమని విరిగిపోయి చతికిలపడిపోయింది. ఇరుసు విరిగి బురదలో కూరుకుపోయింది. చక్రాలు రెండూ గాలిలో లేచి ఒకదాన్నొకటి ముద్దెట్టుకున్నాయి!

నిలువుపార నేలలో గుచ్చి, బండి పోలుకర్ర క్రింద భుజం మోపి యెత్తి తిరగద్రోసేసేను. ఇరుసు చూస్తే నే ననుకున్నట్లే అయింది! అంతా తుక్కు తుక్కే అనుకోండి. బోల్టులు బులికిపోయిన కొయ్యలోంచి జారి, చెక్కల్ని పగలదీసి, యిరుసుతో సహా విరగ్గొట్టేసేయి. ఇరుసుకి ప్రక్కలా, పైనా కొట్టిన కమ్ములుకూడా దానితో బాటు విరిగిపోయేయి.

దాన్ని తగలేసిరిలే! వెధవ బండి! రెండు యిరుసుల్నీ కలిపే దళసరి కమ్ముల్ని పట్టుకుని బండి నెత్తి, బోర్లా పడ ద్రోసేను. నాకు మా చెడ్డ కోపం వచ్చింది, మరి. ఆపళంగానే దాన్ని రెండుచేతులా గాలిలో కెత్తి రాతిబండమీద విసిరి కొట్టేసేను. చెదరిపోయిన ముక్కలుమినహా బండి బాపతు మరేమీ కనబడలేదు, ఆ దెబ్బకి! ఓ చక్రం యిరుసునుంచి దూసుకుని దొర్లుకుంటూ పోయి, భవంతి ముందరి పూల తోటలో పడిపోయింది.

ఆ పని పూర్తై తలెత్తి చూద్దునుగదా గోశాల మలుపులో కుర్కమాకీ దిష్టిబొమ్మలా నిలబడివున్నారు! నేను నిశ్చేష్టుడి నైపోయేననుకోండి. ఆయనగారు నావైపే గ్రుడ్లప్పగించి సూటిగా చూస్తూన్నారుకూడాను. ఈయన మెప్పు

వొచ్చేడురా, బాబూ! నేలలోంచి మొక్క మొలిచి నట్లుందే! నా కొంప మునిగిందండీ. ఏమైనా యీ దఫా ఆయనగారు నాతో ఘాటుగానే ముచ్చటిస్తారు. సరే, నిండా మునిగిన నాకు చలి యేమిటి? కానీండి, పిర్కీలీ! విరుచుకుపడే దాన్ని ఊరికే వాయిదా వేస్తూండడంవల్ల లాభం లేదు. ఆయన గార్కి ఆ శ్రమకూడా అక్కర్లేకండా నేనే ఆయనదగ్గిరికి వెడతా. కాని, ఆయన అక్కడ ఆగితేనా? నేను వెళ్ళేవ రకూ ఆయన వుండనేలేదు, మొహాం ప్రక్కకి త్రిప్పేసుకుని, ఆకాశంలోకి చూస్తూ, మళ్ళీ తిరిగి చూడకండా గోశాలవెనక నుంచి యింట్లోకి వెళ్ళిపోయేరు!

అక్కడే నిలబడి, చుట్టూ కలయజూచే సరికి నాదృష్టి ఆ సమీపాన్నే నేల్లో దించబడివున్న దంతికర్ర మీాద పడింది. దాన్ని వూడలాగి చక్రం వెనకే యజమాని పూదోటలోకి విసిరేసి యింటికి వెళ్ళిపోయేను.

నా జీవితనౌక బురదలో కూరుకుపోయింది. ఆ దేవుడే వచ్చినా దాన్నింక ఉద్ధరించడం సాధ్యంకాదు. ఏ దెల్లా పోతుందో పోనీండి.

---

•

# దక్షిణపవనం

ముప్పైఏయెనిమిదో ప్రకరణం-దయాధర్మభిక్షం నాకెందుకు?

ఆమరుసటినాడు నేను పనిలోకి పోలేదు. మొదట మెల్కా నన్నెన్నో ప్రశ్నలు వేసింది, కాని నే నే జవాబూ యివ్వ కండా మొద్దులా వూరుకోడం చూసి ఆమే వూరుకుంది. నా మనసులోని మాట విప్పిచెప్పడం నాకు చేతకానూ కాదు. అదీగాక చెప్పుకుంటే వినేవాళ్లూ లేరు. ఇంతే నా గతి. నా అభిప్రాయం యెవరికీ తెలియకండా నాలోనే అణగారి పోవా ల్సిందే.

పొద్దుటి పని పూర్తి చేసుకుని మెల్కా గోశాలనుంచి తిరిగి వచ్చేక వంట చేసి పిల్లలకి పెట్టి, బడికి పంపించింది. పిల్లలు భోజనాలు చేసిన టేబిలు శుభ్రపరిచి పరధ్యాన్నంగా కిటికీ లోంచి చూస్తూ హఠాత్తుగా అంది:

'కామందులు వస్తున్నారు!'

నేనూ కిటికీలోంచి చూసేను. హెర్రా కుర్కిమూకి సరా సరి మా యింటివైపే వస్తున్నారు. నిజంగానే! అప్పుడే వాగుమీది చెక్కవంతెన దాటి, యేనుగుకాళ్ళతో కొండ బలం పరీక్షిస్తున్నట్లు గట్టిగా నొక్కి నొక్కి అడుగులు వేస్తూ వొగరుస్తూ కొండెక్కి వస్తున్నా రాయన!

ఆయనగారిని కలుసుకోడానికని టేబిల్ ముందునుంచి లేచి వాకిట్లోకి వచ్చేను. ఆయన మా యింట్లోకి రావండ మెందుకు? బైటే నీలుగా వుంటుంది, అసలు కొన్నికొన్ని సందర్భాలు మాట్లాడి తేల్చుకోడానికి!

కొండనెత్తంమీదికి వచ్చి, వొగరుస్తూ నా కతిదగ్గరగా నిలబడ్డా రాయన. ఆయన చెంపలమీదా, బుర్రముక్కు కొనమీదా రక్తనాళాలన్నీ లెక్కగా కనిపిస్తూన్నాయి, నాకు. ముఖంమీది ముడుతలూ, గాళ్ళ్యా ప్రోగులు పడి చిరునవ్వ పోలికగా తయారయ్యాయి. నావైపు చేతి నందిస్తూ మా కామందు సంబోధించేరు:

'ఏం, ఐనారీ! ఎల్లా వున్నా వేమిటి?'

ఆయన చేతిని చాలన చేద్దా మనుకున్నా వీల్లేకండా నా చేతులు రెండూ పంట్లాం జేబులలో వుండిపోయినాయి. అప్పుడు నేను యింకోవైపు చూస్తూ, పరధ్యానంగాకూడా వున్నట్లుంది. సరిగా జ్ఞాపకం లేదు, నే నాసమయంలో ఆకాశం వైపే చూస్తూన్నానో, కొండల్నే చూస్తున్నానో! అంచేతనే వెంటనే మా కామందులు చేయి అందివ్వడం నేను గమనించి వుండను. యజమాని స్నేహపూర్వకంగా చేతిని అందిస్తూంటే గమనం లేకండా వుండడం మర్యాద కాదనుకోండి. కాని, యింకో ధ్యాసలో పడివుండి, ఆయనను గమనించకపోతే తప్పా? యజమాని చేతిని పట్టుకొని ముద్దెట్టుకోవాలని నా కెంతకాలంబట్టో మహావుండేది, చెప్పొద్దూ! స్త్రీలైనంత తర్ఫ

చుగా యజమాని చేతిని చాలన చెయ్యా లనేది నా జీవితం లోని నిష్ఫలస్వప్నాల్లో ఒకటైపోయిం దనుకోండి!

శ్రీగంట నావైపు చూస్తూ తలుపు త్రోసుకుని వసారాలోనికి వచ్చే రాయన. లోనికి ప్రవేశించి నాకేసి మళ్ళీ పరకాయించి చూచేరు. వెనకనుంచి యెవరో కొడుతున్నా రనుకున్నపుడు చూసే చూపు. అది! కాని, ఆయన్ని వెనకనించి కొట్టేందు కెవరున్నా రబ్బా? ఆ చుట్టూ కలియచూసేను గాని నేనుతక్క మరొక రెవరూ కానరాలేదు! ఎల్సా దూరంగా నెగడి దగ్గరుంది. ఇదీ చిత్రంగానే వుందే! ఆయ నంతగా భయపడడానికి మా యింట యెవరున్నారు చెప్మా?

ఇద్దరం వెళ్ళి టేబిలుదగ్గర కూర్చున్నాక ఆయన జేబు లోంచి యేదో కాగితాన్ని తీసి, మడతవిప్పి నావైపు నెట్టుతూ చదవ మన్నట్లు సంజ్ఞ చేసేరు. చేతులు రెండూ జేబుల్లోంచి తీయకుండానే ఆ కాగితం చదివేను. అది భూమిని గురించిన దస్తావేజు! జేబుల్లోంచి చేతులు తీసి కాకితాన్ని కళ్ళ కింకా దగ్గరగా బెట్టుకుని మళ్ళీ చదివేను. హెంగ్రా హ్యూగో కుర్కి మాకీ స్వంత భూముల్లోంచి పన్నెండెకరాల పంటపొలాన్నీ, పన్నెండెకరాల బీడుభూమినీ, అంతే అడివినీ నాకు క్రయ దస్తావేజు రాసేసేరు. సర్వహక్కులతోటి! దాని బాపతు క్రయధనం అంతా ఒకే దఫా గాని, వాయిదాలమీద గాని, లేదా పనిచేసి గాని, నా యిష్టప్రకారంగా తీర్చుకోవచ్చు!

నాభుజంమీదుగా వెనకవైపున వున్న యెల్సాని చూసేను. ఆమె కంచాలు కడుగుతూంది, బేసిన్‌లో. చప్పుడైతే మా

సంభాషణ కెక్కడ ఆటంకమో నని కూరదాక జాగ్రతగా పాతగుడ్డతో తుడుస్తూ, మావైపే చూస్తూంది. బేసిన్‌లోని వేడినీటినుంచి ఆవిరి లేచి మెల్సా ముఖాన్ని ఆవరించివున్నందున ఆమె ముఖభావా లేమీ అంతు బట్టలేకపోయేను, నేను. కాకపోయినా ఆమె యే మాలోచించగలదు ? నా చేతిలోని కాకితంలో యేముందో తెలిస్తేగాదూ ? అసలు !

కామందు పెన్ను తీసి, నా యెదుట టేబిలుమీద పెట్టి దర్జాగా అన్నారు:

'ఐనారీ! సంతకం చెయ్యి!'

నేను మెల్సావైపు మళ్ళీ చూసేను. కాని ఆమె నావైపు చూడనే లేదు. మా వ్యవహారంలో పాల్గొనా లనే భావం మెల్సాకి ఈషణ్మాత్రమేనా వుంటేకదూ? నేను భుజాలు కుంచించుకుని పెన్ పుచ్చుకున్నా. అల్లాటి కాగితంమీద నే నెందుకు సంతకం చెయ్యకూడదు? నా జీవిత మంతా దీనికోసమే గాదూ ఆశించిందీ, కలవరించిందీను? ఈశ్వరా! నాకు సద్బుద్ధిని ప్రసాదించు! సిరి రా మోకా లడ్డుపెట్టేనేమో? అనుగ్రహించవూ?

హెర్రా కుర్క్మాకీ చిరునవ్వుతూ చిలకలా కూర్చుని, నా ముఖవైఖరిని పరికిస్తూన్నారు.

'ఏం? ఐనారీ! ఇల్లాంటి మంచిని నానుంచి ఆశించ లేదు గదూ? పోనీలే! నన్ను యెప్పుడూ జ్ఞాపకం వుంచుకోనేందుకు గట్టికారణం యిప్పుడేనా వుందంటావా? ఏమోయ్?'

అంటూ ఆత్మసంతృప్తితో వెనక గోడకి జేరబడి సిగరెట్టు ముట్టించేరు, ఆయన. కొంచెంసే పాలోచించి పౌంటెన్ పెన్ను టేబిలుమీద పెట్టేసేను, నే నింక యెల్నావైపు చూడకండానే. ఇంతకాలంగా ఆయనగారు నామీద చూపుతూవచ్చిన దయ హఠాత్తుగా నా మనసులో మెదిలింది. ఆయన వెనకాల్లే ముష్టివాడిలాగ అడుక్కుంటూ, చేతులు నలుపుకుంటూ యెల్లా నడిచేవాణ్ణో, ఆ కమ్మని సిగరెట్ పొగ వాసన నాకు జ్ఞాపకానికి దెచ్చింది. ఎంత ప్రాధేయపడినా లభించనిది యిప్పుడు దానంతట అదే నా కళ్ళదగ్గిరికి వచ్చింది! ఇందులో పదోవంతు చాలు,—అప్పుడే లభించుతే యెంత సంతోషించేవాణ్ణి! అప్పుడు నేను పడుచుతనంలో వున్నా. ఆ రోజుల్లోనే అయితే యిల్లాంటి దస్తావేజుని పెన్నిధిలా భావించి ఆరాధించి వుండేవాణ్ణి! కాని, యిప్పుడు,—జీవితంలో విలువలు తెలిసినాయి. నా చుట్టూవున్నవాటి నిజమైన విలువలు అనుభవంద్వారా గ్రహించేను. ఇప్పుడింక నన్ను యిల్లాంటి కాగితాలతో కొనలేరు, యెవ్వరూ!

పెన్ దూరంగా పెట్టి, కంట్రాక్టు దస్తావేజుని ఆయనవైపు త్రోసేసేను.

'మీా భూమి నా కక్కర్లేదు!'

బరువైన కనురెప్పలు ఆశ్చర్యంతో యెత్తి నా వైపే చూస్తూన్నా రాయన. కొంచెంసేపుండి మెల్లిగా లేచి నిల్చుని, అన్నారు:

'నీ అభిప్రాయం యేమిటి? ఐనారీ! మతిపోతూందా?'

'చెప్పేనుగా, నా అభిప్రాయం. సమయం వచ్చినపుడు నేనే తీసుకుంటాను లెండి, నాకక్కర్లేని భూమి.'

అంటూ రెండు చేతులూ మళ్ళీ పంట్లాం జేబుల్లో పెట్టేసుకుంటూ, 'బైటికి దారి యిదే, వెళ్ళండి!' అని చూపడానికి లేచి, వెనక్కి అడుగేసి నిలబడ్డాను.

ఆయన కాగితం, కలం తీసుకుని మెల్లిగా గుమ్మందాకా వెళ్ళి తిరిగి చూసేరు.

'ఐనారీ! బాగా ఆలోచించుకున్నావా?'

నేను వెంటనే సమాధాన మిచ్చేను:

'ఆ విషయంలో మీరేమీ బాధ పడకండి. నాకూ కొంచెం కొంచెం తెలుస్తూంది'

ఆయన యేమీ మాట్లాడలేదు. తలుపుగుబ్బ ఓ చేత బట్టుకుని వెనకదిరిగి నావైపు చూస్తూ, లేని ఆప్యాయత ప్రదర్శిస్తూ అన్నారు:

'పనిలోకి మామూలుగా వస్తుంటావుకదూ? ఎల్సాకూడా రావాలి. ఏం? దానికేం?'

ఆయన నన్నూ, యెల్సానీ మింగేసేటట్లు చూసి, మా జవాబుకోసం నిరీక్షించకండానే తలుపు మూసి, వెళ్ళిపోయేరు! ఆయన బరువుకి వసారా నేలచెక్కలు కిరకిర మంటూన్నాయి. కొండ దిగి వెడుతూంటే ఆయన దాని బలాన్ని పరీక్షిస్తూన్నాడా? అన్నట్లుంది నడక!

టేబిలుదగ్గర అక్కడే చేతులు జేబుల్లోంచి తీయకుండానే, ఆయన ఊగుతూ బరువుగా నడవడం, వంతెన దాటడం చూస్తూ నిల్చున్నాను. పరిశీలించి చూడగా చూడగా నాకు తోచిం దేమిటో తెలుసా? అంత క్రిందిబరువున్న మనిషిని, వైశాల్య మంతా క్రిందిభాగాన ప్రతిష్ఠితమైవున్న మనిషిని తిరగద్రోయడం అంటే మాటలుగాదు! ఇల్లాటివాళ్ళు దేవ దారువృక్షాల్లాగ పాతాళలోకానికంటా వ్రేళ్లూనివుంటారు!

ఐతే నాకేం లెక్ఖ?...ఈ సందర్భంలో నా అభిప్రాయం చెప్పాల్సి వస్తే మాత్రం నిర్మొగమాటంగా చెప్పేస్తా. ఆయన యెంత లోతుగా వ్రేళ్లూనుకున్నా సరే పడగొట్టి తీరుతా. ఘట్టి దెబ్బలు కొడితేనే గాని యిల్లాంటివాళ్ళు పడరనుకోండి. కాని, నేనేం సత్తువ లేని వాణ్ణేం కాదుగా? ముప్ఫై యేళ్ళ నుంచీ ఆయనగారి పొలాలన్నీ చెమటోడ్చి ఫలప్రదం చేసినవి యీ చేతులేగాదూ? ఇంతవరకూ పాడిపంటల కృషిలో ప్రశాంతంగా కాలక్షేపం చేసిన యీ చేతులు యిప్పుడిప్పుడే పిడుగుల్లాంటి యినుపపిడికిళ్ళు బిగించడం నేర్చుకుంటున్నాయి! నేను వెనకటి మనిషిని గాను! ప్రపంచంలో దేనికీ భయ పడడం లేదు, నే నిప్పుడు. నా మనస్సు వజ్రసన్నిభమైంది, నవచైతన్యంతో!

ఎల్సావైపు తిరిగి చూస్తే, ప్లేట్లూ, కప్పులూ తువాలుతో తుడుస్తూ కనిపించింది. ఆమెని సమీపించి, భద్రంగా ఆమె చేతులోంచి కప్పూ, తువ్వాలూ తీసుకుని నెగడి అరుగుమీద

వుంచేను. తర్వాత అంత భద్రంగానే ఆమెను నా రెండు చేతులా యెత్తుకుని, గది మధ్యకి అడుగేసి యెల్సాని పైకెగరేసేను. అటక యెంతో క్రిందుగా వుందనిపించింది, యీ సారి! అబ్బే, యింట్లో లాభం లేదు. ఆమె నన్లే చేతుల్లో బిగియబట్టుకుని, ముంగిట్లోకి నడిచేను.

అక్కడ కావాల్సినంత ఖాళీ. మా శిరస్సుమీద మేఘ మండలానికంటా బోలెడంత యెత్తుంది. ఎంత యెత్తు కెగరేసినా ఫర్వాలేదిక్కడ. శిశిరాకాశంలో భారమైన మేఘాలు ముసురుకుంటున్నాయి. కాటుకకొండల్లా క్రమ్ముకుంటూన్న మేఘాల్ని దక్షిణపవనం తరిమి కొడుతూంది. కాకపోయినా మా యెల్సాని మేఘమండలంలోకి యెగరేస్తానా యేమిటి? పాపం శమించుగాక! నా కోరిక అదేమీ గాదులెండి. ఎల్సా బంగరుజుట్టు, రంగుల గౌను, కపిలరంగు కాలిజోడూ కొండ కొనతో సమంగా యెగిరితే చాలు. అక్కడ కెగిరినపుడల్లా కొండవెనుకనుంచి సూర్యకిరణాలు ఒక్కుమ్మడిగా ఆమెని ముంచెత్తి, దివ్యకాంతిపుంజంగా చేస్తూంటే చూడ్డానికి యీ కళ్ళు చాల వనిపించింది!

మా యెల్సా అంత తేలికైనది గాదులెండి. నా చిన్న గువ్వ పెంటి ఎల్సా వుండే చింతపిక్కలాంటిది! కిలకిల నవ్వులూ, తళతళ కిరణాలూ కలిపి కట్టలు కట్టి తయారుచేసి వుంటారామెని! అల్లాంటి పిల్ల పెళ్ళాంగా దొరికే అదృష్టం మగాళ్ళందరికీ పట్టుగాక! నా అదృష్టంలో, సంతోషంలో యెవరేనా పాలు పంచుకుంటే యేడ్చేవాణ్ణి గాదు. నేను!

# దక్షిణపవనం

ముప్పై తొమ్మిదో ప్రకరణం. - నూతనలోకం.

పీడాకరమైన శీతకాలం గడిచిపోయింది. చుట్టూ రాళ్ళూ, బండలూ, చెట్లూ, పొదలూ అన్నిటిమీదా పేరుకుపోయి వున్న మంచు కరిగిపోయింది. హిమముక్తమైన ప్రకృతి యిప్పుడెంతో ఆహ్లాదకరంగా వుంది. లోయమధ్య ప్రవహించే సెలయేరుకూడా వసంతాగమంతో సజీవమై మర్మరధ్వనులతో సాగిపోతూంది. నిన్నటివరకూ సోకితే కరచినట్లున్న గాలి నేడు కవోష్ణంగా, మధురవాసనావాసితమై వుంది. సూర్యభగవానుని కరస్పర్శతో జగత్తంతా నవనవోన్మిషితమైపోయింది!

ఎవరి జీవితంలోనూ యెప్పుడూ చీకట్లు కాపురం వుండవు. చీకటి పోయి వెన్నెలలు కాచే దినాలు రాకమానవు. సుఖకరమైన వసంతదినాలు శీతకాలాన్ని వెన్నాడే వుంటాయి. అటువంటి సమయాల్లో గొంతెత్తి పాడాలనీ, బిగ్గరగా మాట్లాడాలనీ, నవ్వాలనీ అనిపిస్తుంది. యెందుకో! కాని, ఆలోచించి చూస్తే యిదంతా వట్టి బడాయి అనీ తేలిపోతుంది. ఉత్తినే యెందుకు యీ గోలా, హడావుడీ? దక్షిణాన్నుంచి చక్కని గాలి వీస్తూంది. పీడాకరమైన మంచుతెర

తొలగిపోయి ప్రకృతి నూతనశోభతో వెలుగొందుతూంది. వాతావరణమంతా శ్రావ్యసంగీతంతో నిండివుంది. ఇదంతా చూస్తూ, వింటూండక అనవసరంగా గోల చేసుకోడం దేనికంటా? కొండలమీదనుంచీ, చెట్లమీంచీ మంచు కరిగి జారిపోయింది; భూమిమీది మంచుపొర తొలగి, పులుగడిగిన ముత్యంలా తయారైంది. వసంతపవనాలను ఆఘ్రాణిస్తూ, ఆస్వాదిస్తూ నూతనోత్సాహాన్ని పొందుతూంది. మా సుహోమీ!

మా కొండమీదే పట్టువదలక వ్రేళ్లూని పెరుగుతూన్న భూర్జవృక్షాన్ని చూసేరుగదూ. ఆ భూర్జవృక్షం మాదిరిగా వుంది మా సుహోమీ యిప్పుడు! ఇంకా బాగా చిగురు తొడగలేదనుకోండి. శిశిరఋతువు యిప్పుడే గాదూ ఆఖరైంది. మంచు యిప్పుడే కరిగిపోయింది. జీవచిహ్నాలింకా విస్పష్టంగా కనబడడం లేదు. గాని అప్పుడే జీవరసం పొంగులు వారుతూండడం, చెట్లు చిగురు తొడగడం, నేల పచ్చబడ్డం చూడగలం.

ఈ వేళ చర్చికి పోయీ రోజు. ఎల్సా కొత్తకోటు తొడుక్కుని వసంతలక్ష్మిలా బైలుదేరింది. చెర్చికి వెళ్ళు ఎల్సా! నాకోసం, బిడ్డలకోసం, మనందరికోసం ఈశ్వరుని ప్రార్థించు. మన నూతనజీవితం త్వరగా ప్రారంభం గావాలని ఆశీర్వదించమని క్రీస్తు దేవుని ప్రార్థించు, ఎల్సా! ఎల్లాగా మనకి కొత్త జీవితం ప్రారంభం గాబోతూనే వుందిలే. మనం ప్రార్థ

క్షేముగా, దానికోసం తీవ్రయత్నం చేస్తాం గాని. ఐనా ప్రార్థిస్తే పోయిూ దేమీలేదులే!

పీచుజుట్టూ, చప్పిడి ముక్కూ వాపూ, నూ లవ్వురీ ఒక్క పరుగున వాకిట్లోకి వచ్చేడు. చొక్కా తొడుక్కుని, టోపీ పట్టుకుని వస్తూ వా డన్నాడు:

'నాన్నా! నే నెంత పైకెక్కుతానో చూసేవా?'

'లేదురా! ఏదీ? యెక్కు మరిచూస్తా!'

ఇంకా తేమగా, జారుడుగా వున్న కొండ యెక్కడానికి వాడు తయారు! నెరల్లోనూ, పట్టుదొరికే రాళ్ళమీదా బూటుకాళ్ళు గ్రుచ్చి, చేతులతో పట్టుకుని తంటాలు పడు తున్నాడు; వాడు!

'లవ్వురీ! పడతావురా!' అన్నాను.

'అంహుం! పడను, నాన్నా! ఇంకా యిప్పుడూ పడతానా? మంచు కరిగిపోయిందిగా. చూడు! నాన్నా! చూడు! నే నెంత యెత్తెక్కానో?'

వాడప్పుడే యింటికంటెయెత్తుగా యెగబ్రాకి, కొండ మీంచి వ్రేలాడుతూ, నీళ్ళోడుతూన్న చెట్టువ్రేళ్ళు పట్టు కున్నాడు! వాడి చేతులు దృఢమైన వేలెండి. చేతులమీద శరీరాన్ని పైకి లాక్కుని, మోకాలు సమతలంమీద ఆని, ఒక్కవూపున యెక్కేసి, భూర్జవృక్షం ప్రక్కనే నిల్చున్నాడు! వాడికంత శక్తి వుందని నే ననుకోందే! వాడి పాటలు చూడండి! ఏమిట్లో వెర్రి సంతోషం! నన్ను కేకేసి, బిగ్గరగా అరుస్తూన్నాడు:

'చూడు! నాన్నా! ఎక్కేసేను! పడతా నన్నావు గాదూ? నీకేం తెలీదు, నాన్నా! అస్తమానం యెక్కగల నింక! పడనులే. అదుగో! సూర్యుడు కనిపిస్తున్నా డిక్కడికి! మబ్బులు క్రమ్ముకునే వున్నాయి, గాని సూర్యుడు చిన్న వెలుతురు బంతిలా వున్నాడు! కనిపించేడా, నీకు?'

నేను వాడి సంతోషంలో పాలు పంచుకుంటున్నాను:

'ఫర్వా లేదురా, లవ్రీ. మబ్బులు యెగిరిపోతాయిలే. ఎంత దట్టమైన మబ్బులైనా చెదరగొట్టే గాలి వీస్తూందిలే. అప్పుడింక వేడీ, వెలుతురూ బాగా అనుభవించగలం. మనకి అడ్డుగావున్న యీ కొండని మనం పగలగొట్టి పారేస్తాం. అప్పుడింక మనకి అడ్డేమీ వుండదు. ఇంకో కొత్తయిల్లు కట్టుకుంటాం, విశాలంగా! దక్షిణపు చరియమీద పండ్లచెట్లూ కూరపాదులూ, పూలమొక్కలూ కావాల్సి నన్ని వేసుకో వచ్చునుకూడాను!'

అదే కొండగుట్ట! కాని యిప్పుడు నాలుగువైపులా పార చూస్తే లోకం యెంతో విశాలంగా వున్నట్లనిపించింది! అదంతా నా స్వంతమే అయినట్లూ, నన్నక్కడినుంచి యెవడూ కదపలేడనీ తోచింది. చుట్టూ కనుచూపుమేరలో విశాలమైన పొలాలు, మధ్యలో నల్లని సెలయేరూ, పచ్చని లోయా వ్యాపించివున్నాయి. అందులో నాకేమీ లేదనే విచారం నాకిప్పుడింక లేదు. నా శరీరశ్రమతోనే యీ భూము లన్నీ సుక్షేత్రాలైనాయి. నా కష్టానికి తగిన ప్రతిఫలం

పొందే సమయం యేతెంచిన దని నాకు తెలుసు. ఆ దినం దగ్గరలోనే వుంది. దేనికోసం, యెవరినీ ప్రాధేయపడ నక్కర లేదు. నా భుజబలంమీదే ఆధారపడగల నింక.

బహుశా ఆ ధైర్యంవల్లనే అనుకుంటా, నాకిప్పుడింత సుఖంగా వున్నట్లనిపిస్తూంది. మామూలుపనులు గాక యేదేనా ఘనకార్యం, విశిష్టమైనది చేయాలని వుత్సాహంగా వుంది! పాడాలనీ, బిగ్గరగా వుపన్యసించాలనీ, యెవరికేనా మంచి మాటో, సలహాయో యివ్వాలనీ, యెవరినో ఉద్ధరించాలనీ,- యిల్లాంటి కుతూహలం జనిస్తూంది, నా హృదయంలోంచీ!

విల్లోకిమల్లే ఘనమైన మాటలు నేను చెప్పలేను. కాని, నాకు వచ్చిన మాటలతోనే చెప్పి, కొందరినైనా నూతనజీవితంవైపు మళ్ళించగల ననే ధైర్యం వుందిలెండి. నా మాటలు వినేవాళ్ళూ వున్నారు, యీ ప్రపంచంలో కొందరైనా. తమది నిరుపేదకొంప గావున కుర్కిమాకీ గోశాలలో చాకిరీకి కుదిరిన ఆ యిద్దరు గొల్లభామలు; తలదాచుకోనేందుకు గుడిసేనా లేని ఆ వృద్ధ, కుమార్తె, మనుమడూ; చిరకాలం పడిగాపులు పడి వుండి వుండి, ఆఖరికి కాళ్ళూచేతులూ వున్న మగాణ్ణేనా భర్తగా పొందజాలని అభాగ్యురాలు కెర్తూ; జీవితంలో యే ఆశా లేక వరద్దై పోతూన్న త్రాగుబోతుటంగణా పావో, వీళ్ళందరూ లేరూ? నా మాటలు వినేందుకు ? ఎవరికి తగిన శ్రోతలు వారికి!

పావో వున్నాడే వాడు,– మాట వచ్చింది గనక చెపుతా, వాడికి కాస్త పొలం వుంటేనా? ఐదెకరాలు, పోసీ రెండెకరాలు చాలు! చచ్చురకం భూమైనా సరే. పూతికలు మొలచేదే యిమ్మనండి. దానితోనే తంటాలు పడగలడు, వాడు! వాడికున్న ఓపిక యెవరి కుందంటా? దానిలోనే అన్నీ పండిస్తాడు. పండ్ల చెట్లు, కూరపాదులు, బంగాళాదుంపలు,– అన్నీ పెంచగలడు. చచ్చే ముందు యిప్పుడేనా వాడికి యింతకంటె కావాల్సిం దేముంటుంది?

వాడింక నరమానవుడితో సంబంధం పెట్టుకోడు! తన పొలంచుట్టూ దట్టంగా ముళ్ళకంచె కట్టి, అందులోనే కాపరాని కో చిన్నకుటీరం వేసుకుంటాడు. నరపురుగునికూడా అక్కడికి అడుగుపెట్ట నియ్యడు, పావో. ఔను, మరి! ఎందుకు రానిస్తాడు? ఇప్పటిదాకా తోడిమానవులనుంచి వాడనుభవించింది చాలదూ? అబ్బబ్బా! ఏమి కుళ్ళుపోట్లు! అవమానాలు! కష్టపరంపరలు! చాలు చాలు. మానవులతో యీా అనుభవించింది చాలు! వాళ్ళ మొగాలు చూడాలనేం లేదు వాడి కింక.

పావో యిదే అనేవాడు, నాతో. గుప్పిటిమీద చెక్కిలి ఆన్చి కూర్చుని, సాలోచనగా మళ్ళీ అనేవాడు:

'నా తోటదరికి యెవడేనా రష్యావాడు వస్తాడంటావు్రటా? అల్లాంటి వాడెవడేనా ఐతే రానిస్తానులే!'

అంటూనే మళ్ళా నిరీహుడై గోడకి జేరగిలబడిపోయావాడు. తల పండిపోయినా యింకా యిప్పటికీ తానొక మనిషినని చెప్పుకోదగిన స్థితిలో లేనందుకో, లేక యెవ రవమానించినా సహించి పడివుండాల్సిందే గాని కనీసం కరవడానికేనా పళ్లు లేకపోయినందుకో సణుక్కుంటూ కూర్చునిబోయేవాడు. ఎలియాస్‌లాంటి పనికిమాలిన వెధవకూడా తనని ఆడాళ్ళ యెదుట వుడికించి యేడిపిస్తాడు!

'ఒరేయ్! కాబోయె కమ్యూనిస్టూ! నిన్నేరా! కమ్యూనిస్టువు కాకపోతే పోనీ. ఎవడివైతే వాడివే. మీరంతా చేరి యిప్పుడారిస్సా చవటలు వుత్తమోత్తములని డబ్బా కొడుతున్నారు గాదుట్రా? దొరికేఱులే యెల్లాగైతేనేం మా గొప్ప స్నేహితులు! ఐతే సరేగాని ఒక్క ప్రశ్నకి జవాబు చెప్పరా, వింటాము. పంథొమ్మిదివందల ముప్పైతొమ్మిదిలో మన దేశం మీదికి వాళ్లు దండెత్తాల్సిన పనేం వచ్చిందో చెప్పు?'

కాని పాపో యేం చెప్పగలడు? ఆడాళ్ళంతా వాడేం చెవుతాడో నని వాడివైపే చూస్తూంటే యే మాటా తోణక్క గుడ్లు మిటకరించి చూస్తూ పాపో ఆవలికి తొలగిపోయేవాడు! పాపం! వాడు దురదృష్టవంతుడు! వాడిక్కూడా నాకుమల్లేనే గట్టిపళ్లో, వజ్రంలాంటి పిడికిలో వుంటే బాగుండీది! అప్పుడు మాటలు దొర్లుకుంటూ అవే వస్తాయి! నోటమ్మట.

అసలు సిగ్గూ బిడియం లేని దొంగవెధవలకి సమాధానం చెప్పడం యెందుకు? అనవసరశ్రమ గాని. నోరు నెప్పి గాని అందువల్ల యెవరికీ యే ప్రయోజనం వుండదు. కొంచెమేనా బుద్ధిగలవాళ్ళ కందరికీ ఆ రోజులలోనే పరిస్థితులన్నీ విశదంగా, విస్పష్టంగా తెలుసు! మొదట్లో రష్యన్‌లు యెంతో సుహృద్భావంతో మనతో ప్రదేశాలు మార్పులు చేసుకుందా మని రాయబారాలు ప్రారంభించేరు. మన పాలకులు దుర్మార్గపు ఉద్దేశ్యాలతో అవి త్రోసివుచ్చేరు. గొఱ్ఱె క్రొవ్వి కొండతో ఢీకొందిట! అల్లా చేసేరు, మన పాలకులు. వాళ్ళకి తాళం వేసేవాళ్ళకి యివన్నీ యెందుకు? వెధవప్రశ్నలు వేసి తెలియనివాళ్ళ నేడ్పించడమే వాళ్ళకి గావాల్సింది! అన్నీ అయిన ఐదేళ్ళకి యిప్పుడుకూడా యిల్లాంది కుంటిప్రశ్న వేసే దంటే వా డెల్లాంటివాడో ఆలోచించుకోండి. తెలుసుకో దలచిన వాళ్ళకి అప్పుడూ యిప్పుడూ స్పష్టమే, రష్యన్‌లు నీ జమీ అంతా లాగేసుకుంటా రని భయమా? నీ లోడ్డూ లోసుగూ లాక్కుని, నిన్ను శాశ్వతంగా కూలీగానే వుంచేస్తా రని భయమా? ఓరి పిచ్చివాడా! నీ కెందుకురా, కంగారు? నీ నిధి నిక్షేపా లెవరూ ముట్టబోడం లేదురా? బట్టతలవాడికి పేను కొరుకుతుం దని భయం వేసిందిట!

పావో నాకేసి చూస్తూ, కళ్ళార్పుతూ కూర్చుంటే, నేను యీ విషయాలే వాడికి చెప్పేవాణ్ణి. ఆ త్రాగుబోతు నోట్లోంచి పైపు తీసి పట్టుకుని చాలసేపు ఉక్కిరిబిక్కిరయ్యాలా

నవ్వుతాడు. ఆ మట్టున దగ్గు తెర వచ్చేది. పిల్లికూతలూ, ఒగర్పూతో సతమతమైపోయి, నీరు గ్రమ్మిన కళ్లు తుడుచుకుంటూ కూర్చునేవాడు, చాలసేపు.

*            *            *

తమ్ముడూ, విల్లో! నాకు బాగా మాట్లాడ్డం తెలీదురా. నేను ఘట్టివాణ్ణని నువ్వు ఆనాడు అన్నావు గాని నేను ఆ మాటలు ఒప్పుకోనురా. ఆమధ్య 'వపా సన' పత్రికలో విల్లో పీశాచ్చనియేమిా రాసినది చదివేనులే. ఆటువంటి మాటల పొందిక, వాదనాబలం నాకు రాదులేరా. మన సుహోమిాలో వ్యావసాయికసంస్కరణగూర్చి నువ్వు రాసినది చాలబాగుంది. నాకు కలిసివస్తుం దని మెచ్చుకోవడంలేదు, నేను. నాకు ఆ పంక్తుల్లో కొంటెచూపుల విల్లో, యుక్తాయుక్తవివేకంగల విల్లోయే తొంగిచూస్తూ కనిపించేడు! వాడు హిల్డా కుర్కి మాకీని పెళ్ళాడినందుకు యిప్పుడు నేనేం కంగారుపడ్డం లేదు. అబ్బే! అనవసరంగా కంగా రెందుకూ?

ఒరేయ్! నువ్వూ, హిల్డా మా యింటికి వచ్చే వేసవిలో ఒకసారి రావాలనుకుంటే సంతోషమే. మీకోసం నా తలుపు లెప్పుడూ తెరిచేవుంటాయి. ఓహో! మా యింట్లోనేగా, మీరు మొదట సమావేశమై మాట్లాడుకున్నారు? దానికి జ్ఞాపకంగా, కులాసాగా ఆ దినాన్ని గడుపుదాం, రారా. మీ జంటకి మేమంతా స్వాగతం యివ్వాలని కాచుకున్నాం. నేనూ సంతోషంగా పండుగ చేసుకోవాల్సిన దినం ఒకటుంది,

అదికూడా అప్పుడే. దానికి మీరూ వుండాలి. ఎందు కంటావా? మనం యిద్దరం కేవలం అన్నదమ్ములమేగాదుగా, మరి?.....

నాలో యేదో నూతనబలం ప్రవేశించింది. వసంతఋతు పరిమళాలు నన్ను పరవశునిగా చేస్తున్నాయి. నే నిపుడు యీ లోయను దాటి, యీ రాళ్ళ కొండలూ దాటి యెంతో దూరం చూడగలుగుతూన్నా. ఏదో నూతనలోకం లోకి, స్వర్గసీమలోకి అడుగిడుతూన్నట్లుంది, నాకు. నా బాహు వుల్లో యేదో కొత్తశక్తి పొంగిపొర్లుతూంది. ఏమిటో తెలియదు గాని, యెల్లు తెలియని వుత్సాహానందాల్ని అనుభ విస్తున్నా. ఇంతకీ యిప్పుడు నేను తెలుసుకున్న ముఖ్య విషయం యేమిటో తెలుసా? నాలో యీ నూతనానుభూతి యెందుకు, యెక్కడినుంచి వచ్చిందా? అనేది! అదే చాలా అద్భుతమైన దనుకో.

ఎవరినీ ఆనందోద్రిక్తుల్ని చేసే ప్రత్యేకసంఘటన లేమీ యీ మధ్య జరగలేదు. కాని, ఆశాచైతన్యా లున్నాయే, వాటి ప్రభావం అందరికీ ప్రసరించింది. అందుమూలంగా యీ భూమిమీద జీవితం మరికొంచెం ఆశాజనకం, ఆనంద దాయకం అయిందంతే!

స మా ప్తం

---

# విశ్వసాహిత్యమాల - రాజమండ్రి.

[స్థాపితము - 1935]

| | | |
|---|---|---|
| విప్లవ సందేశం (4 కూర్పు) | రూ. 0 | 8 |
| లెనిన్ ఉపదేశాలు (2 కూర్పు. పామీదత్తు) | 1 | 0 |
| ప్రపంచ కార్మికోద్యమ చరిత్ర (2 కూర్పు ఒకే సంపుటి) | 1 | 4 |
| బలిదాన్ (సోవియట్ నాటకం) | 1 | 0 |
| సోవియట్ ప్రజాస్వామ్యం (రెండో కూర్పు) | 0 | 12 |
| నాద్యా (వివిధదేశాల కథలసంపుటి) | 1 | 0 |
| లెనిన్ జీవితకథలు (15 బొమ్మలతో - పిల్లలకు - 2 కూర్పు) | 1 | 0 |
| టాల్‌స్టాయ్ కథలు (పది కథలు, 2 కూర్పు) | 1 | 8 |
| గోర్కీ కథలు (ఆరు కథలు) | 1 | 8 |
| యక్షప్రశ్నలు (చిక్కుప్రశ్నలు-శాస్త్రీయ సమాధానాలు) | 1 | 8 |
| డిప్యూటీ చైర్మన్ (చీనా విప్లవ కథలు) | 1 | 0 |
| ప్రతీకార జ్వాలలు (నవల-2 కూర్పు) | 1 | 0 |
| రాజ్యాంగ యంత్రం (లెనిన్ రచన, 2 కూర్పు) | 0 | 4 |
| ఇండియా (మార్క్సు, ఏంజిల్సు) | 1 | 0 |
| చీనా కథలు (ఆస్వాల్డ్ ఎర్డ్‌బర్గ్) | 1 | 0 |
| గోర్కీ జీవితం (బొమ్మలతో) | 1 | 8 |
| విజ్ఞాని పాలోవ్ (జీవితము-నాటకము) | 2 | 8 |
| వానరుడు-నరుడు : పరిణామక్రమంలో కర్మపాత్ర (ఏంజిల్సు) | 0 | 4 |
| వామపక్ష కమ్యూనిజం : బాల్యారిష్టం (లెనిన్) | 2 | 0 |
| దక్షిణ పవనం (స్టాలిన్ ప్రైజ్ నవల) | 4 | 8 |

---

# త్వరలో రాబోవు గ్రంథాలు.

## నాబాల్యం-మాగ్జింగోర్కీ

మహాకవి గోర్కీ ఆత్మస్మృతి. చిన్ననాటి జ్ఞాపకాలనూ, కుటుంబ పరిసరాలనూ, తన లేతమనస్సుమీద చెరుగని ముద్రలను వైచిన చిన్న చిన్న సంఘటనల్నీ అతిసహజంగా వ్రాసి పొందుపరచేడు, గోర్కీ

400 పుటలు క్రౌన్ 1/8 వెల రు 4.

**మన వంశవృక్షం - జగన్మోహన్.** జీవపరిణామచరిత్రను చిన్నపిల్లలకూ, ఆధునికవిజ్ఞాన పరిచితిలేని పెద్దలకూ కూడ సులభంగా తెలిసేటట్లు వ్రాయబడినది. విశ్వసాహిత్యమాల వారి 'యక్షప్రశ్నలు' అనే శాస్త్రీయగ్రంథాన్ని చూసిన వారికి, దీని ప్రాశస్త్యం తెలియగలదు.

150 పుటలు - బొమ్మలతో వెల రు. 2.

**పంచభూతాలు - జగన్మోహన్.** రసాయనశాస్త్ర కథ. చిన్నబిడ్డల, పెద్దల మనస్సులకు నచ్చునట్లుగా రసాయన శాస్త్రవిషయాల్నీ, పదార్థవివేకాన్నీ గృహవాతావరణంలో, పిల్లల సంభాషణలో పొందుపరచి తయారుచేసిన చక్కని గాథవంటి రచన.

300 పుటలు బొమ్మలతో వెల రు. 3.

## రాజ్యాంగయంత్రం - విప్లవం లెనిన్ రచన.

లెనిన్ మహాశయుని ప్రధాన గ్రంథాల్లో యిదొకటి. చక్కని అనువాదం.

200 పుటలు వెల రు. 2.

పునర్ముద్రణలోనున్న గ్రంథాలు

| | |
|---|---|
| కారల్ మార్క్సు ఉపదేశాలు | రు. 1-0 |
| పారిస్ కమ్యూన్ | ,, 1-8 |
| రష్యా విప్లవం-1905 | ,, 1-8 |

పై మూడూ లెనిన్ రచనలే. మార్క్సిస్టు సిద్ధాంతము నందు ఆసక్తి గలవారందరికీ అవశ్యపఠనీయములైనవి.

మావద్ద ఆధునిక ఆంధ్రగ్రంథములు యెన్నో దొరకును. రాజకీయ, వైజ్ఞానిక గ్రంథాలు అన్నీకూడ లభించును. రాజమండ్రిలో వివిధ ప్రచురణకర్తలు, గ్రంథకర్తలు ప్రచురించిన పుస్తకాలు వలయుచో మాకు వ్రాయండి.

గ్రంథాలయములకు వలయు ఆర్డర్లు సప్లై చేయగలము.

ఆంధ్ర మహాజనులు మాకు అన్నివిధములా చేయూతనొసగ ప్రార్థన.

ఇట్లు,

మహీధర జగన్మోహన్‌రావు

సంపాదకుడు,

విశ్వసాహిత్యమాల,

రాజమండ్రి.
12-3-1952